

*This book is Published with the Financial assistance of Tirumala Tirupati Devastanams under their Scheme Aid to Publish Religious Books.*

శ్రీః Acc. NO. 291

# శ్రీ గురు చరిత్రామృతము

మరాఠీ (ప్రాకృత) మూలము

శ్రీ గంగాధర పుత్రుడు 'సరస్వతి'

## ప్రథమ సంపుటము

(1 నుండి 18 అధ్యాయముల వరకు)

అనువాదకులు

శ్రీ పాతూరి సీతారామాంజనేయులు

ప్రకాశనము

జొన్నలగడ్డ కామేశ్వర శర్మ

2-2-1123/9/J, న్యూ నల్లకుంట్సు

హైదరాబాదు - 500 044

ప్రథమ ముద్రణము : రెండువేలు

సర్వస్వామ్యములు : ప్రకాశకులు



1989 అక్టోబరు, వసంత నవరాత్రములు



మూల్యం : ముప్పది రూప్యములు

ముద్రణ : కల్యాణీ ప్రెస్ : తెనాలి :

---

ప్రతులకు :

జొన్నలగడ్డ కామేశ్వర శర్మ

2-3-1123/9/J, న్యూ నల్లకుంట,

హైదరాబాదు - 500 044

# సంకటనాశన గణపతిస్తోత్రమ్

నారద ఉవాచ :-

ప్రణమ్య శిరసా దేవం గౌరీపుత్రం వినాయకం ।
భక్త్యా వ్యాస స్స్మరే న్నిత్యం ఆయుష్కామార్థ సిద్ధయే ॥
ప్రథమం వక్రతుండం చ ఏకదంతం ద్వితీయకం ।
తృతీయం కృష్ణపింగాక్షం గజవక్త్రం చతుర్థకమ్ ॥
లంబోదరం పంచమం చ షష్ఠం వికటమేవ చ ।
సప్తమం విఘ్నరాజం చ ధూమ్రవర్ణం తథాష్టకమ్ ॥
నవమం బాలచంద్రం చ దశమంతు వినాయకం ।
ఏకాదశం గణపతిం ద్వాదశం తు గజాననమ్ ॥
ద్వాదశైతాని నామాని త్రిసంధ్యం యః పఠే న్నరః ।
న చ విఘ్నభయం తస్య సర్వసిద్ధికరం పరమ్ ॥
విద్యార్థీ లభతే విద్యాం ధనార్థీ లభతే ధనం ।
పుత్రార్థీ లభతే పుత్రాన్ మోక్షార్థీ లభతే గతిమ్ ॥
జపే ద్గణపతి స్తోత్రం షడ్భి ర్మాసైః ఫలం లభేత్ ।
సంవత్సరేణ సిద్ధిం చ లభతే నాత్ర సంశయః ॥
అష్టానాం బ్రాహ్మణానాం చ లిఖిత్వా య స్సమర్పయేత్ ।
తస్యవిద్యా భవే త్సర్వా గణేశస్య ప్రసాదతః ॥

ఇతి శ్రీ నారదపురాణే సంకటనాశనం నామ
గణేశ ద్వాదశ నామ స్తోత్రం సంపూర్ణం.

# శ్రీమద్వాసుదేవానంద సరస్వతీ రచితం
# జయలాభాదికరా స్తోత్రమ్

శ్లో ॥ బ్రహ్మానందం పరమసుఖదం ।
కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగనసదృశం ।
తత్త్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమల మమలం ।
సర్వధీసాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం ।
సద్గురుం తం నమామి ॥

శ్లో ॥ కాషాయవస్త్రం కరదండధారిణం ।
కమండలం పద్మకరేణ శంఖం ।
చక్రం గదాభూషితభూషణాఢ్యం ।
శ్రీపాదరాజం శరణం ప్రపద్యే ॥

శ్లో ॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ ।
త్వమేవ భ్రాతా చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ ।
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

ఓం శ్రీ గురుదేవ దత్త!

# గ్రంథ ప్రవేశిక

# గ్రంథ ప్రాశస్త్యము

ఈ గ్రంథ నామము 'శ్రీ గురు చరిత్రామృతము;' ఇది శ్రీ సద్గురు తత్త్వమును శ్రీ సద్గురు స్వరూపమును వేరు వేరుగ శ్రీ దత్తాత్రేయ-శ్రీపాద శ్రీవల్లభ-శ్రీనరసింహ సరస్వతీ స్వాముల జీవితముల తత్త్వమును ఏకైక తత్త్వముగ త్రిమూర్త్యాత్మక పరమేశ్వరా భిన్న శ్రీదత్తాత్రేయ సద్గురువులయందు ప్రతిష్ఠితమయి పరినిష్ఠిత రూపమున నింపారియున్న సకల మంత్ర తంత్ర యంత్ర యోగాచార్య త్వమును సమగ్రముగ ప్రతిపాదించుచున్నది. ఇహపర సాధనమునకి సరళతమ మార్గము. అమృతత్వప్రాప్తికి ఈ గ్రంథము సాధన సముదాయ సారసంగ్రహము. ప్రవృత్తి నివృత్తి మార్గములను రెంటిని స్పష్టాతి స్పష్టముగ ప్రకాశిత మొనర్చు దీపిక ఇది.

## శ్రీ గురు చరిత్రామృతకథా పురుషులు - కాలము

ఇందలి కథా పురుషుడు తాత్త్వికరూపమున శ్రీ దత్తాత్రేయ మహాయోగి, వైయక్తికరూపమున శ్రీ దత్తాత్రేయ - శ్రీపాద శ్రీ వల్లభ - శ్రీ నరసింహ సరస్వతీ స్వాములు.

ఈ మూవురలోను శ్రీ దత్తాత్రేయ మహాయోగి అనసూయా దేవికిని అత్రి మహామునికిని జనించిన త్రిమూర్త్యాత్మక తత్త్వము. అత్యంతము పురాణ పురుషుడు. శ్రీపాద శ్రీవల్లభులు ఆంధ్రదేశము నందలి పీఠాపురమున సుమతి - అప్పలరాజు - అను పుణ్యదంపతులకు జనించి బాల్యముననే మహాయోగియై కేదారాది మహాక్షేత్రముల యందు సంచరించి గోకర్ణక్షేత్రమున కొంతకాలము తప మొనరించి

అటనుండి కృష్ణానదీ ప్రవాహ మధ్యగత కురవపురీ ద్వీపమున అవధూతగా చాలకాలము తపమొనర్చి తుదకు తమ భౌతిక కాయమును పంచభూతములయందు లయమొనర్చిన మహాతత్త్వము. శ్రీ నరసింహ సరస్వతీ స్వామి మహారాష్ట్రమునందలి 'కారంజ' గ్రామమున జన్మించి బాల్యముననే గృహము వదలి వారణాసియందు శ్రీకృష్ణసరస్వతీ స్వామి నుండి తురీయాశ్రమమును గ్రహించి భిల్లవాడి అమరపురాది ప్రదేశములయందు కొంతకాలము గడపి గాణగాపురమున మఠమున చాల కాలముండి భక్తుల ననుగ్రహించుచుండి తుదకు శ్రీశైలయాత్రామిషమున కృష్ణానదీ ప్రవాహములో తమ భౌతిక కాయమును వదలినట్లు బాహ్యజగత్తునకు చూపియు వాస్తవమున అద్దానిని క్షణములో పంచభూతములయందు లయమొనర్చిన శ్రీమద్దత్తాత్రేయతత్త్వము.

శ్రీపాద శ్రీవల్లభుల కాలము శాలివాహనశకపు తొమ్మిదవ - పదియవ శతాబ్దులలో ఎప్పుడో ఐయుండుననని కొందరయూహ, శ్రీ నరసింహసరస్వతీస్వామి జననము శాలివాహన శకమున 1320 ప్రాంతమనియు వారి నిజానంద ప్రాప్తికాలము 1380 శాలివాహన శకముననియు నిజానందప్రాప్తికాలము శా. శ. 1440 అనియు మరి కొందరయభిప్రాయము. బీదరుసుల్తానును శ్రీస్వామి యనుగ్రహించిన వృత్తాంతమును దృష్టియందుంచుకొని యాలోచించగా ఈ రెండవయభిప్రాయమే సరియైనదని తోచును. ఏమయినను శ్రీగురూపాసనమున అది బొత్తుగా అప్రధానమగు నంశము.

## శ్రీ నృసింహ సరస్వతీ స్వామి - శిష్యులు - సిద్ధయోగి

శ్రీ నరసింహసరస్వతీస్వామికి గృహస్థులలోను యతులలోను గూడ శిష్యులు ఎందరో కలరు. వీరియొద్ద సంన్యాసమును గ్రహించిన శిష్యులలో ప్రధానుల నామములు ఇవి:- 1. బాలసరస్వతి; 2. కృష్ణ సరస్వతి; 3. ఉపేంద్ర సరస్వతి; 4. మాధవ సరస్వతి; 5. సదానంద

సరస్వతి; 6. జ్ఞానజ్యోతిః సరస్వతి; 7. సిద్ధయోగి;. వేదాంతసార రచయితయగు శ్రీ సదానంద సరస్వతియు తద్వ్యాఖ్యాతయగు శ్రీనృసింహ సరస్వతియు ఈ గురుశిష్యులే అయియుండవచ్చును.

## శ్రీగురుచరిత్రామృతోపదేశము-సిద్ధయోగి-నామధారకుడు

ఈ 'శ్రీగురుచరిత్రామృతము' సిద్ధయోగికిని నామధారకునకును జరిగిన సంవాదముగా నున్నది. సిద్ధుడు వక్త; నామధారకుడు ప్రశ్న కర్తయు - శ్రోతయును; ఈ సిద్ధుడు శ్రీనృసింహ సరస్వతీస్వాముల శిష్యులేడుగురిలో నొకడు; సర్వకాలమును శ్రీస్వామివారిని విడువక వెంటనుండి సేవించిన మహనీయు డీసిద్ధయోగి; ఈతడు ఆనాటినుండియు ఈ గ్రంథరచయితృకాలమువరకును తన యోగవిద్యాబలమున జీవించి యుండి నామధారకుని తరింపజేసి లోకమునే తరింపజేయగలిగినవాడు.

## గ్రంథరచయిత

'శ్రీ గురుచరిత్రామృతము'ను రచించిన మహనీయుడు గంగాధరుని కుమారుడగు 'సరస్వతి;' శ్రీగురువుల నామము 'శ్రీనరసింహ సరస్వతి' కావున ఈ గ్రంథకర్తృ నామము శ్రీగురునామమునందలి ఏకదేశమే యగుచున్నది. ఇట్లీతడు శ్రీగురునామమును ధరించినవాడు కావున 'నామధారకుడు' అని ఈగ్రంథమున వ్యవహరింపబడెను. ఈసరస్వతికి వంశపూర్వుడును శ్రీ నరసింహ సరస్వతీ స్వాములకు సాక్షాచ్ఛిష్యుడును (కడగంచిగ్రామాధికారియు) అగు సాయందేవుడు శ్రీ సరస్వతికి ముందటి ఐదవ తరపువాడు. సాయందేవుని కుమారులలో జ్యేష్ఠుడగు నాగనాథునియందు శ్రీగురువులు విశిష్టానుగ్రహముచూపి ఆశీర్వదించిరి. ఈతని వంశమున జనించు వ్యక్తియే నాచరిత్రమును లోకమున ప్రకాశిత మొనర్చుననిరి.

# శ్రీగురుచరిత్రామృతమూలరచన - ఛందము

ఈ గంగాధరపుత్రుడగు సరస్వతికి మాతృభాష కన్నడము. అతడు తాని శ్రీగురుచరిత్రామృతమును ప్రజాసామాన్యమునకు అందు బాటులో నుండు మరాఠీ (ప్రాకృత)భాషలో రచించెను; ఈ రచయిత కృష్ణయజుఃశాఖాధ్యాయి; సంస్కృతభాషయందితనికి విశేషముగా పాండితికలదు; ఈతడు గొప్ప నిత్యకర్మానుష్ఠాత; వేదాంత తత్త్వమును అగస్త్యుడు అంబుధినివలె ఆపోశనము పట్టినవాడు; అయినను తనకే విషయమునను ఏపాండితియులేనివాడుగానే రచనను సాగించెను.

ఈగ్రంథపు మరాఠీ (ప్రాకృత) మూలము 'ఓఁ వీ' అను సరళ ఛందమునందున్నది; ఇది ఊర్మి 'ఊర్మికా' శబ్ద తద్భవము అయిఉండును.

# ఇందు నిక్షిప్తములయిన ముఖ్య రహస్య పదములు

ఈమూలగ్రంథమున రచయితే మూడుపదములను ప్రచురముగ ప్రయోగించెను. వానిని ఆతడట్లు ప్రయోగించుట ఉపాసనముకొరకే యనుట నిస్సంశయము. వీనిని శ్రీవాసుదేవానందసరస్వతీస్వామి వారు తమ సంస్కృతానువాదమున ఎక్కడికక్కడ పొందుపరచినారు. వీనిని గ్రహించి పారాయణము చేయుట ఉపాసకులకు ఫలసిద్ధి ప్రయోజక మగును కావున ఇట తెలుపబడుచున్నవి; తాంత్రికవిద్యా (శ్రీవిద్యా) సంప్రదాయమున పరమాత్ముని 'ప్రకాశ' నామమున వ్యవహరింతురు; శక్తిని 'విమర్శ' మందురు; అనగా 'విస్తరణము' అని అర్థము. ఈతత్త్వమును తెలిపి తరింపజేయువాడు సద్గురువు కావున ఆతడు తారకుడు; పరతత్త్వ వాచకమగు ప్రణవమును 'తారము' అందురు; ఈ 'తార' ప్రాతిపదికముపై స్వార్థమున (ప్రాతిపదికార్థమునే తెలుపును) 'క' ప్రత్యయమురాగా 'తారక' శబ్దమగును; యోగవిశేష మునకును 'తారక' మని వ్యవహారము; ఇట్టి ప్రకాశ - విస్తార - తారక - పదములు ఈగ్రంథమున విశేషముగా ప్రయోగింపబడినవి; ప్రకాశ

పర్యాయపదములే యగు దీప - జ్యోతి - మొదలగు పదములును కొన్ని చోట్ల గ్రహింపబడినవి; ఈ అనువాదములో తారక - విస్తార - పదములు మాత్రము క్రియా పదములుగా తరించు విస్తరించు అను రూపమున కూడ వాడుట జరిగినది ఉపాసకులు (సాధకులు) గ్రహింతురుగాక :

## ఇందలి అధ్యాయముల సంఖ్య

శ్రీ గురుచరిత్రామృతమునందలి అధ్యాయములు ఏబదియొకటి; అనుక్రమణికాధ్యాయము దానినామమును బట్టియే ప్రధానగ్రంథమునకు శేషముమాత్రమే ఈ 51 సంఖ్య మాతృకాసంఖ్యయే :

## మూలగ్రంథము - శుద్ధపాఠము

ఈ అనువాదములో 'శ్రీరామచంద్రకృష్ణకామత్' గారు పరిష్కరించి ప్రచురించిన 'శ్రీగురుచరిత్రామృత' పాఠము అనుసరింపడినది. వీరు ఏతద్గ్రంథమునకు సరియగు పాఠములను నిర్ణయించుటకై ఇరువది సంవత్సరములు నిర్విరామముగా పరిశ్రమమొనర్చిరి. వీరు తామీ విషయమున చేసిన పరిశ్రమమును ఎదురయిన సమస్యలను గ్రంథమందలి విశిష్టాంశములను తెలుపుచు 'పరిశిష్టము' అను చిన్న గ్రంథమునే ప్రకటించిరి. అదియు ఈ అనువాదమున ఎంతగానో తోడ్పడినది.

## సప్తాహపారాయణక్రమము

వీరి పాఠమునననుసరించి సప్తాహపారాయణమునకై గ్రహింపవలసిన అధ్యాయముల విభాగము ఇట్లుండును :

1. ప్రథమ దినమున - 1-7 అధ్యాయములు పూర్తిగా
2. ద్వితీయ దినమున - 8-18 అధ్యాయములు పూర్తిగా

3. తృతీయ దినమున - 19-28 అధ్యాయములు పూర్తిగా
4. చతుర్థ దినమున - 29-34 అధ్యాయములు పూర్తిగా
5. పంచమ దినమున - 35-37 అధ్యాయములు పూర్తిగా
6. షష్ఠ దినమున - 38-43 అధ్యాయములు పూర్తిగా
7. సప్తమ దినమున - 44-51 అధ్యాయములు పూర్తిగా

## శ్రీ గురుచరిత్రానువాదములు

ఈ మహాగ్రంథమును 'టెంబేమహారాజ్' అను ప్రసిద్ధనామము గల శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వామి సంస్కృతభాషయందు సమశ్లోకిగా అనువదించిరి. మూలశ్రీగురుచరిత్రామృతమునకు కన్నడమున పద్య - గద్య - భావానువాదములు కలవు. పద్యాత్మక కన్నడానువాదములు 'భామినీషట్పదీ' ఛందమున నున్నవి. అవియన్నియును మరాఠీ మూలమునకు సాక్షాదనువాదములు. ఈప్రకృతానువాదకునకు తెలిసినంతవరకును తెనుగులోనున్న అనువాదములు శ్రీ వాసుదేవానంద సరస్వతీస్వామివారి సంస్కృతరచన కనువాదములు; శ్రీ ఇసుకపల్లి సంజీవరాయశర్మగారు తమశైలిలో దీనిని 'శ్రీగురులీలామృతము' అను పేర రచించిరి; కాని ఈనామము 'స్వామి సమర్థ' అని ప్రసిద్ధులగు అక్కలకోటస్వామివారి చరిత్రపు 'మరాఠీ' రచనముల విషయమున ప్రసిద్ధము. శ్రీస్వామివారి సంస్కృతరచనము మహోత్తమ కవితా ప్రవాహము; కాని మూలమునందలి శైలీసారళ్యమును విషయ ప్రతిపాదనమార్గమును కొన్నిచోట్ల విషయమునుకూడ మూలమునందలి ఉపలక్షణములకంటె కొంత భిన్నముగానున్నవి. ప్రకృతమున ఈ అనువాదమును మరాఠీమూలమునుండి సూటిగా తెనుగునకు అనువదించుట జరిగినది.

## మూలగ్రంథకర్తృవంశము

శ్రీ గంగాధరపుత్రుడగు సరస్వతి (నామధారకుని) వంశక్రమము ఈగ్రంథమునందిట్లు చెప్పబడినది; సాయందేవుడు; తత్పుత్రుడు నాగనాథుడు; తత్పుత్రుడు దేవరావు; తత్పుత్రుడు గంగాధరుడు; తత్పుత్రుడు సరస్వతి. (ప్రకృతగ్రంథకర్త - నామధారకుడు - ఈతడే.) వీరది కౌండిన్యగోత్రము.

## అనువాదకుని వంశము

ధూళిపూడియందలి రాజగోపాలస్వామివారిసన్నిధిలో స్వస్తివాచకులుగా వచ్చి అట నివాసమేర్పరచుకొనిన వేదపండితులు; 1. మూర్తిభొట్లు; కాగా అటనుండి తరములక్రమమున 2. గంగుభొట్లు; 3. రఘునాయకులు; 4. సుబ్బంభొట్లు; 5. వెంకయ్య; 6. కోటయ్య; 7. వేంకటనారాయణ; 8. సీతారామాంజనేయులు; వీరిది ఆత్రేయగోత్రము - ఆపస్తంబసూత్రము - కృష్ణయజుశ్శాఖ:

## అనువాదకుని మాతాపితృ - గురు - స్మృతి

నిరంతర శంకరస్మరణార్చనా తత్పరులగు పితృపాదులగు వేంకటనారాయణ - సతతమును తత్త్వానుశీలన శీలయగు మాతృమూర్తి వేంకటసుబ్బమ్మ - ఈదంపతులకును అగ్రజులు శ్రీ సుబ్బరాయశాస్త్రి వదినెగారు ల. నా. శారదమ్మగారు - ఈదంపతులకును అనువాదకుని నమోవాకములు.

సాహిత్యద్విష్ణుస్వరూపులగు శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వేంకటరంగాచార్య మహాత్ముల శిష్యులును శిష్యక్షేమంకరజీవనులు నగు శ్రీమత్సముద్రాల లక్ష్మణాచార్య స్వాములును వ్యాకరణ - వేదాంతశాస్త్ర పరమార్థమూర్తులును శిష్యవత్సలులు నగు శ్రీ జనస్వామి వేంకటేశ్వర శాస్త్రి పాదులును న్యాయవేదాంతోభయమీమాంసా శాస్త్ర

సాంకేతికమానదండభూతులగు శ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రి పాదులును తచ్ఛిష్యపరంపరలోని పండితవరులును శ్రీ శంకర భగవత్పాద ప్రతిష్ఠాపిత శృంగేరీ జగద్గురుపీఠ పరంపరాగత శ్రీమత్సురేశ్వర నిత్యబోధాచార్య (సర్వజ్ఞాత్మముని) ప్రభృతి పరంపరయందలి జగద్గురువరేణ్యులును చూపిన అనుగ్రహలేశమే ఈ అనువాదక శిశువు వేయు తప్పటడుగుల నడకకు ప్రతిపదాలంబము.

## శ్రీ గురుచరిత్రామృత మూలరచన - భాష

ఈ గ్రంథపు మూలరచయిత - తనకు సంస్కృతభాషయందు మిగుల పాండితియుండియు అది ఏమియు రానివాడేమో యనునట్లు రచన సాగించుటయటుంచి ఇందీతడెచ్చటను - అప్పటికే మరాఠీలో ప్రచురముగా వ్యవహారమునందు ఉన్నవే యైనను - ఒక్క మ్లేచ్ఛ (ఉర్దూ) భాషా పదమునుకూడ ప్రయోగింపక పూర్తిగా భాషా శౌచమును పాటించెను.

## మూలగ్రంథశైలి - అనువాదము

శ్రీగురుచరిత్రామృతమున మూలగ్రంథకారుడు పాటించిన శైలి మిగుల విలక్షణమయినది. ఇది సరళతా స్పష్టతలకు ఆలవాలము. ఇందు పునరుక్తులును అనావశ్యకపదములును ఉన్నట్లు తోచవచ్చును. వినుము - చూడుము - వంటి పదములును చాల అధికముగా ఆవృత్తమగుచుండును. ఇవి సరళతకుగల లక్షణముగనే గ్రహింపదగును.

అనువాదకుడును ఈవాక్య విన్యాస పదవిన్యాసములను యథాతథముగనే గ్రహించి అనువదించెను. ఇట్టివానిని మార్చి సొగసులు దిద్దుటకు యత్నించలేదు. దీని భాషయందెందును 'కామా' విరామ చిహ్నముకాని ప్రధానరచనలో అన్యదేశజ పదములు కాని సాధ్యమయినంత వరకు 'యొక్క' ప్రత్యయముకాని యుండదని గ్రహింతురుగాక !

# అనువాదప్రవృత్తి

ఈ అనువాదకుడీయనువాదమును తన నిత్యానుష్ఠానములోని అంశముగా నెమ్మదిగా జరుపదలచి ఆపోని వాస్తవ్యులును వ్యాపారి అయ్యు రెండవతుకారాం అనదగు వార్కారీ సంప్రదాయోపాసక శ్రేష్ఠులును నిరంతర భగవన్నామ గానామృతాస్వాదమున తాము తరించి మిత్రుల తరింపజేయు సజ్జనుడును బహుసార క్షత్రియ పుంగవుడును అనువాదకుని ఉపాసక మిత్రులలో అన్యతముడును అగు శ్రీ మొహితే వేంకటరావుగారు ఇచ్చియుండిన మరాఠీమూలము నాధారముగా గొని ది. 19-3-1986 నాడారంభించెను. సంసారపు ఒడుదుడుకుల మిడిమేలపు నడకలో పలువిఘ్నములతో నెమ్మదిగా రచన సాగుచు దాదాపు ఇరువది అధ్యాయములవరకు రచనసాగినది. ఇంతలో పెద్దలును సంప్రదాయానుసారి విద్యలయందును లౌకిక విద్యలందును నిష్ణాతులును పురాతత్త్వపరిశోధన నిష్ణాతులును అనువాదకునియందు వాత్సలము కలవారును అగు శ్రీ పుచ్చా పరబ్రహ్మ శాస్త్రిగారు ఇచ్చిన సూచన ననుసరించి శ్రీ జొన్నలగడ్డ కామేశ్వర శర్మగారు తాము దీనిని ముద్రింపించి ప్రకటింతురని కోరుటతో అనువాదముత్వరగాసాగి ది. 18-6-1989తో ముగిసినది.

# ఆశీస్సు

దీనిమూలమున కలుగు జగచ్ఛ్రేయమే తమ పరమార్థమను భావనతో ఈ కార్యమును నిర్వహించుచు మహాభారమును వహించుచుండిన శ్రీ జొన్నలగడ్డ కామేశ్వరశర్మగారికి సకుటుంబముగ అభ్యుదయ సః శ్రేయసములను శ్రీభగవాను డనుగ్రహించుగాక !

హైదరాబాదు అనువాదకుడు

ది. 18-6-1989

# శ్రీగురుచరిత్ర పారాయణ నియమములు

శ్రీగురుచరిత్రామృతమును ఏదైన కోరిక సిద్ధించుటను సంకల్పమునందుంచుకొని పారాయణము చేయువారు ఈ క్రింది నియమములను పాటించవలయును :

1. పఠనము ప్రతినిత్యమును ఒకే లయతోను శాంతముగను సుస్పష్టముగను ఉండవలయును. త్వరగా ముగియవలయునను దృష్టితో ఉచ్చారణభ్రంశము జరుగరాదు. అక్షరములను అన్నిటిని స్పష్టముగ ఉచ్చరించుచు చిత్తము సదా అర్థగ్రహణవిషయమున నిలుపవలయును.
2. పఠనార్థము తూర్పునకో ఉత్తరమునకో మాత్రము తిరిగి కూర్చుండవలెను.
3. పఠనమునకై సమయము - స్థానము - కూర్చుండుదిశ - అన్ని దినము లందును ఒకటిగానే ఉండవలెను. ఏకారణముచేతను (ఈపారాయణపు గడువు నకులోగా) మార్చరాదు.
4. శ్రీ దత్తాత్రేయమూర్తికాని ప్రతిమకాని పటముకాని లభించని పక్షమున పీటపై నూతనవస్త్రము పరచి దానిపై బియ్యముపోసి దానిపై వక్కయందుకాని టెంకాయయందుకాని శ్రీదత్తాత్రేయుని ఆవాహనచేసి తనముం దుంచుకొన వలయును.
5. పారాయణావధికాలములో బ్రహ్మచర్యమును పాటించవలెను; స్నానాదికము చేసి శుచియై మడుగువస్త్రమును (అనుష్ఠానమునకుమాత్రమే ఉపయోగించు పట్టుగుడ్డనైన) ధరించవలయును. ఈగడువులో హవిష్యాన్నమునుమాత్రము భుజించవలయును.
6. రాత్రులందు దేవునిసన్నిధియందు చాపమీదనో తెల్లని ధావళిమీదనో పండు కొనవలెను. ఎడమప్రక్కకుతిరిగి పండుకొనవలెను, భగవంతుని సందేశము స్వప్నమున అందుటకు ఇది చాల అనుకూలము అని పెద్దల అనుభవము.
7. పఠనము ఆరంభించినతరువాత అది ముగియులోగా తన ఆసనమునుండి లేవ రాదు ఎవరితోను మాటాడరాదు.
8. సప్తాహపారాయణము చేయువారు శనివారమునా డారంభించి శుక్రవారముతో ముగించుట మంచిది. ఏలయన శుక్రవారము శ్రీనృసింహసరస్వతీస్వామి నిజానంద ప్రాప్తిదినము.
9. పారాయణానంతరము శ్రీదత్తాత్రేయునకు పూజజరిపి నైవేద్యము ఆరతిచేసిన తరువాత విసర్జనము జరిపి బ్రాహ్మణభోజనము జరుపవలెను.

## హవిష్యాన్నము - లక్షణము

హవిష్యాన్నలక్షణము అగ్నిపురాణమునందు ఇట్లు చెప్పబడినది :

శ్లో ॥ వ్రీహిషష్టికముద్గాశ్చ । కలాయాః సతిలం పయః ।
శ్యామాకాశ్చైవనీవారాః । గోధూమాద్యావ్రతేహితాః ॥

శ్లో ॥ కూష్మాండాలాబువార్తాక - పాలంకీ జ్యోత్స్నికా స్త్యజేత్ ।
చరుభైక్షం సక్తుకణాః । శాకం దధి ఘృతం మధు ॥

శ్లో ॥ శ్యామాకాః శాలినీవారాః । యావకం మూలతండులం ।
హవిష్యవ్రతనక్తాదౌ । అగ్నికార్యాదికే హితమ్ ॥

తా॥ వ్రీహి (ఒకవిధమగు వరిబియ్యము) షష్టికము :(60 దినములలోనే పండు ఒకవిధమగు వరి) పెసలు - బఠాణీ - నూవులు - పాలు - చామబియ్యము - నివ్వరి బియ్యము - గోధుమ (రవ్వకాని - పిండికాని) వ్రతసమయములందు హితకరములు; గుమ్మడి - సొర - వంకాయ - పాలంకి అనబడు ఆకుకూర - (జీవన్తీ - స్వర్ణక్షీరీ అనబడు పాలకూర నిషిద్ధముకాదు.) జ్యోత్స్నిక అనబడు ఆకుకూర - చరువు - భైక్షాన్నము - సక్తుకణములు - శాకములు - పెరుగు - నేయి - తేనె - ఎదలవలయును; ముఖ్యముగా చామవరి - మెట్టభూములందు పండు ఎఱ్ఱవరిబియ్యము - నివ్వరిబియ్యము - గోధుమరవ్వను పాలతో వండిన వంటకము (యావకము) బియ్యపునూక - ఇట్టివి కామ్యవ్రత - నక్త వ్రతాగ్నివ్రతాదులయందు గ్రహింపదగిన హవిష్యాహారములు.

## శ్రీదత్తాత్రేయ క్షేత్రములు

1 మాహూర్ - మహారాష్ట్రమున నాందేడుజిల్లా - కిన్వట్ తాలూకాయందున్నది.

2. గిర్‌నార్ - ఇదియే కరవీరక్షేత్రము; 'అరణ్య' శబ్దతద్భవము - గుజరాతీ - మరాఠీ భాషలలో "రాన్" అని యగును. గిర్+రాన్ = గిర్‌నార్ - అని అయినది. దీనినే ఆంగ్లమున "గిర్ ఫారెస్ట్" అనుచున్నారు; ఇది గుజరాతు రాష్ట్రమున జునాగఢ్ దగ్గర నున్నది. ఇచ్చటనే శక్తిపీఠములలో నొకటిగా మహాలక్ష్మి స్థానమును కలదు; "కరవీరేమహాలక్ష్మి" నాథసంప్రదాయానుసారి దత్తోపాసనకిది కేంద్రమందురు.

3. కారంజే - ఇది మహారాష్ట్రమునందు కలదు; కాశీవాసులగు బ్రహ్మానంద సరస్వతీస్వామివారిచ్చట దత్తదేవాలయమును నిర్మించిరట.

4 ఔదుంబరము - ఇది శ్రీనరసింహసరస్వతీస్వామి చాతుర్మాస్యము జరిపిన స్థానము; భిల్వాడీ స్టేషన్‌నుండి నాలుగుమైళ్ళలో కృష్ణాతీరమందు కలదు.

5. నరసోబావాడీ - మిరజ్ - కొల్హాపూర్ రైలుమార్గమున జయసింగపూర్‌నుండి బస్సుపై 8 మైళ్ళుపోగా కృష్ణానదీ పంచనదీ సంగమస్థానమున ఇదియున్నది. ఇచ్చట శ్రీనృసింహసరస్వతీస్వామి పన్నెండేండ్లు ఉండిరి. ఇచ్చటనే అమరపూర్ - ఔరవాడ కలదు

6. గాణగాపురం - రాయచూర్ - పూనా రైలుమార్గములో గుల్బర్గాస్టేషన్ దిగి బస్సుమీద పోవలయును. ఈగ్రామములో స్వామివారి మఠమున్నది. గ్రామము ప్రక్కగా భీమానది (కృష్ణానదికి ఉపనది) ప్రవహించుచుండును. ఈగ్రామము నకు సమీపముననే భీమానదితో - అమరజానది సంగమించు పవిత్రమనోహరస్థానము కలదు. శ్రీనరసింహసరస్వతీస్వామివారి నిత్యానుష్ఠానస్థానము ఇదియే. గాణగాపురమఠమునుండి భీమానదీతీరమువెంట సంగమమునకు కాలినడకతో పోవునపుడు కలుగు దివ్యానుభూతి అనుభవైక గమ్యము.

7. కురవపురము (కురవగడ్డ) రాయచూరునుండి ఇటకు చేరుటకు నాలుగు మార్గములు కలవు; రాయచూరునుండి "బూడిదపాడు" నకుపోవు బస్సులో "యాపలదిన్నె" దగ్గరదిగి కాని 2 ఇదేబస్సులో "అతుకూరు" దగ్గరదిగికాని 3. రాయచూరునుండి "దొంగరాంపూరు" వరకు బస్సులో పోయికాని, 4. రాయచూరునుండి "మఖల్" వరకు పోయి అక్కడినుండి వేరొకబస్సుపై "పంచదేవపాడు" పోయి కాని - ఏమార్గముననైనను రెండు మూడు కృష్ణానదీప్రవాహములు దాటిపోగా ప్రశాంతమగు ఈచిన్నద్వీపము చేరవచ్చును. ఎల్లాకాలములో నదీప్రవాహములు దాటుటకు ఇచటి పల్లెజనులు సాయపడుదురు. వారు యాత్రికులను సొరకాయబుర్రలపై యాత్రికులను ఈదించుకొని పోవుటయో - నులక మంచములకు సొరకాయబుర్రలుకట్టి వానిని పడవలుగాతేల్చి వానిపై యాత్రికులను కూర్చుండబెట్టుకొనియో ఆలయమును చేర్చెదరు. పడవలుకాని తెప్పలుకాని పుట్లు (అరిగోలులు) కాని లేవు. ఇన్ని శ్రమలకోర్చియైన మహారాష్ట్రమునుండి ఉపాసకులు నిరంతరమును వచ్చుచునేయుందురు.

శ్రీపాదశ్రీవల్లభుల తపః ప్రదేశము ఇది. ఇచ్చట ఆనాడు వారి ఉపాసనా తపఃప్రదేశపు గుర్తులు అట్లేయున్నవి. శ్రీపాదశ్రీవల్లభుల ఆదేశముతో అనువాదకుడు 1981 ఏప్రిల్ మాసమున 13వ తేదీనాడు అటకుపోయి శ్రీవారి అనుగ్రహమునకు పాత్రుడయ్యేను. శ్రీవాసుదేవానందసరస్వతీస్వామి వారును ఇక్కడ కొన్నిమాసములుండి తపమొనర్చినారు.

8. వారాణసీ - నారదఘాటు దగ్గర దత్తాత్రేయ మఠమున్నది. ఈనాడును శ్రీ నృసింహసరస్వతీస్వామి వంశజులక్కడ నున్నారు. వారి ఇంటి పేరు "కాళే" వారు దీని అపభ్రంశరూపమగు "కాలియా" అను పేర అక్కడ నొకవీధికలదు.

9 భట్టగాంవ్ - ఇది నేపాలులో ఖాట్మండునుండి 18 - లేదా 20 మైళ్లలో కలదు.

10 పిఠాపురము ఆంధ్రప్రదేశమునకలదు. ఇది శ్రీపాదశ్రీవల్లభుల జన్మస్థానము.

11. శ్రీశైలము - ఇందే శ్రీనృసింహ సరస్వతీస్వామి నిజానందప్రాప్తులయిరి.

ఇందు గాణగాపురమును కురవగడ్డలోను ప్రతిసంవత్సరమునను శ్రావణ శుక్ల చతుర్థినుండి భాద్రపదశుక్లచతుర్థీవరకును విశేషముగా పూజలును అభిషేకములును జరుగును. అనుదినమును అర్చనాదికము జరుగుచునేయుండును. ఈ అర్చనాదికము జరిపించగోరువారు ఈ అడ్రసులకు వ్రాయవచ్చును.

1. శ్్రీవాసుదేవభట్ట - (K) పూజారి
శ్రీక్షేత్రకురవపుర - (వయా) ముకరంగంజ్
రాయచూరుజిల్లా - కర్ణాటక - పిన్ - 584 102

2. వే. మూ. శ్రీ శేషభట్ట - శ్రీధరభట్టపూజారి
శ్రీక్షేత్రగాణగాపుర
గుల్బర్గాజిల్లా - కర్ణాటక - పిన్ - 585 212.

# విషయసూచిక



శ్రీ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధిష్ఠాత్రీ
శ్రీ ప్రతాప భారతీ శ్రీ రాజ రాజేశ్వరీ పరాభట్టారికా

**శ్రీ లలితా పరదేవతా**

శ్రీ సదనమ్, గుంటూరు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

# శ్రీ గురు చరిత్రామృతము

## ప్రథమాధ్యాయము

### మంగళాచరణాధ్యాయము

ఓమ్. శ్రీ గణేశాయ నమః, శ్రీ సరస్వత్యై నమః, శ్రీ గురుభ్యో నమః, శ్రీ కులదేవతాయై నమః, శ్రీ పాద శ్రీవల్లభ శ్రీనృసింహ సరస్వతీ - దత్తాత్రేయ సద్గురుభ్యో నమః.

### శ్రీ దత్తాత్రేయ ధ్యానము.

బాలసూర్యుని కాంతినిపోలిన కాంతికలవాడును, ఇంద్రనీల మణినిపోలి ప్రకాశించు జటలు కలవాడును, భస్మమును అంగరాగము (మెయిపూత) గా పూసికొని దానిచే మిగుల వెలుగొందువాడును శాంతుడును నాద (సంగీత) మునందు మిక్కిలిగా లయమునందిన చిత్త సంబంధి వాయుప్రసరణముకలవాడును, పెద్దపులితోలును వస్త్రముగా ధరించినవాడును, బ్రహ్మతత్త్వమును ఎరిగిన సనకాది సిద్ధులచే పరివృతుడయి వారిచే సముచిత విధానమున ఆరాధింప (ఆ గూా పూజాదికము లగు ఆదరములచే మెప్పింప) బడువాడును యోగిజనులచే సదా తమ హృదయములందు ధ్యానింపబడు (ధ్యానింపబడదగిన, వాడును అగు) దత్తాత్రేయుని మాహృదయములందు సదా ఉపాసింతుము.

### విఘ్నేశ్వర స్తుతి

1. ప్రణవరూపుడవును, ప్రణవమునకు అర్థమవును అగు విఘ్నహరా ! గజాననా ! గిరిజాకుమారా ! (నీకు) నమస్కారమయ్యా ! లంబోదరా ! ఏకదంతా ! శూర్పకర్ణా ! (చేటలనుపోలు చెవులు కల వాడా !) జయ-జయ. నిన్నుమించువారు లేరు, నిన్నుమించువారు లేరు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

౨. నీవు చెవులనూటను చలింపజేయుదువు. ఆ కదలికనుండి వచ్చుగాలి [illegible] లే మిగుల శీఘ్రముగా విఘ్నములు పారిపోవును. [illegible] 'విఘ్నాంతకుడు' 'విఘ్నములను అంతమొందించు [illegible].

౩. [illegible] ముఖము కాచినబంగారము ఎట్లో - [illegible] ఉదయించిన సూర్యుడు ఎట్లో - అట్లు తేజమును [illegible].

౪ - ౫. విఘ్నములు అను అరణ్యములను ఛేదించుటకునే నీవు [illegible] ధరించి యున్నావు. కటియందు నాగకటిబంధ [illegible] చతుర్భుజములను కలిగి చూడ ముచ్చట [illegible] కనిపించుచున్నావు. విశాల నేత్రుడవగు వినాయకా ! [illegible] (సకల) లోకములను నిర్విఘ్నములనుగా (సకలలోక [illegible] పనులయందు విఘ్నములు లేకుండఁచేసి [illegible].

౬. [illegible] ధ్యానముచేతురో వారిని విఘ్నములు బాధించవు. [illegible] (ఏమియుతడవులేకుండ - అతి శీఘ్రముగా) [illegible]కలాభీష్టములను లభించును.

౭. సకల మంగళకార్యములందున మొదటగా (ఆరంభమందే) [illegible] పూజింపబడుదువు. లంబోదరా ! చతుర్దశ విద్యలకును నీవే [illegible].

౮. వేదములందును శాస్త్రములయందును పురాణముల [illegible] - నీకు సంబంధించిన లేఖనమే కలదు; (నీవిషయమే చెప్పబడి యున్నది. [illegible] యన్నియు నీవు గీచినగీతలే - నీవు శాసించిన శాసన [illegible] - అయియున్నవి.) ఈకారణముననే బ్రహ్మాదులగు సుర [illegible] (దేవతా శ్రేష్ఠులు) నిన్ను స్తుతించి యుండిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

9. త్రిపురముల సాధనమును (లొంగదీసికొనుటను) జయపుటకు (ముందు)ను ఈశ్వరుడు నిన్ను అర్చించెను. దైత్యులను సంహరించుటకు మురిపుడు నిన్ను స్తుతించెను.

10. గణపతీ! విష్ణువు, బ్రహ్మ మొదలగువారును కార్యారంభము లందు నిన్ను నమస్కరించి నీయనుగ్రహముచేతనే సకలాభీష్టములను సాధించుకొనుచున్నారు.

11. కృపానిధీ! గణనాథా! ఓంకారరూపా! విఘ్నహర్తా! వినాయకా! అభయదాతా! నాకు మతిప్రకాశము కలిగించుము.

12. సమస్త (ప్రమథ) గణములకును నాయకుడవును సమస్త విఘ్నములకును అంతకుడ (అంతమొందించువాడ) వును నీవే; ఏలోకములు నిన్ను నమస్కరించునో (ఏజనులు నిన్ను నమస్కరింతురో - ఏప్రాణులు నిన్ను నమస్కరించునో) వారి (ని) కి కార్యములు సాధితములు (సిద్ధించినవి) అగును.

13. సకల కార్యములకు (కార్యములు నెరవేరుటకు) ఆధార (ఆశ్రయ - అవలంబ) భూతుడవును (ప్రపంచమంతయు మాయామా కార్యము అనియు మాయాపరిణామమగు ఈ కార్యాత్మక ప్రపంచమునకు అధిష్ఠాన తత్త్వము పరమాత్మయనియు గౌడపాదాచార్యుల సిద్ధాంతము. అట్టి మాయాకార్యాత్మకమగు ప్రపంచమునకు అధిష్ఠానమగు పరమాత్మ తత్త్వము) నీవే; కరుణానిధీ! గౌరీకుమారా! నాకు మతిప్రకాశము కలిగించుము.

14. గజాననా! నా మనమునందుకల వాసనలు (అభిలాషములు) అన్నియును నీవు పూరించవలసినదిగా ప్రార్థించుచున్నాను. సాష్టాంగ నమనము (నమస్కారము) చేయుచున్నాను. నాకు ఇప్పుడు విద్యను ఇమ్ము.

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

15. నేను ఏమియు తెలియనివాడను మతిహీనుడను అయి యున్నాను; అందువలననే నీచరణములను పట్టుకొనుచున్నాను. *చతుర్దశవిద్యలకును నిధియును శరణాగతులకు (వారుకోరిన) వరములను ఇచ్చువాడవును అయి యున్నావు.

16. నీవు నా అంతఃకరణమునందు, నిలువవలయును; (నేనుచేయ దలచిన) గురుచరిత్రకథనము (చెప్పుట) ను జరిపించవలయును; (సకలాభీష్ట) దాతా నీవు నన్ను పూర్ణదృష్టితో చూడవలయును; (నేను) గ్రంథ (రచనా) సిద్ధి పొందవలయును. అని నిన్ను మరిమరి వేడు చున్నాను.

## శ్రీ సరస్వతీ ప్రార్థనము

17, 18. నేను ఇపుడు ♦బ్రహ్మకుమారి (యగుసరస్వతి)ని నమస్కరించుచున్నాను. ఎవరి నామము వాగీశ్వరియో ఎవరి కరములయందు పుస్తకమును వీణయు కలవో ఎవరు హంసవాహనగా దర్శనమునిచ్చు చుండునో మిగుల చతురురాలగు ఏ శారదకు విద్యా వేద శాస్త్రముల విషయమునందును అధికారముకలదో అట్టి యామెయగు సరస్వతిని విశ్వాసపూర్వకముగ నమస్కరించినపుడు విశ్వమునందలి ఎల్లరకును నిశ్చయముగ జ్ఞానము కలిగి తీరును.

19. అందువలననే నీచరణములను నమస్కరించుచున్నాను. నా స్వామినీ ! (నీవు నాయందు) ప్రసన్నురాలవు కావలయును. (అని వేడు చున్నాను.) నీవు నా జిహ్వాగ్రమునందు నిలిచియుండి ఇపుడు గ్రంథము నందు నిండుదనము కలిగించుము.

20. నామనవి వినుము. ఇపు డికమీదట అతిసహజముగా (విషయములను సుకరముగా భాసించునట్లు) బుద్ధి (శక్తి)ని ఇమ్మని

---

* చతుర్దశవిద్యలు ♦ బ్రహ్మకుమారి

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

వేడుచున్నాను. శ్రీ గురుచరిత్రమును విస్తారమొనరింపఁజేసి దాని రచన చేయుటకు అనువగు మతి ప్రకాశము నాకు కలిగించుము.

21. షగాజ్యురాలవగు జగన్మాతా! విశ్వ (సర్వ) వాక్కులకును అధిష్ఠాత్రివగు వాగ్దేవతా! నీవే సర్వదేవతా తత్త్వములందును ఉత్కృష్టురాలవై ప్రకాశించుము. వేదశాస్త్రములు నీవు వ్రాసినవే (గీచిన గీతలే - ఆజ్ఞలే); ఈవిధముగా నీవు శబ్దసృష్టి కర్త్రివై ఆనందరూపురాలవయి నెలకొనియున్నావు.

22. తల్లీ! నీ నోటినుండి వెలువడిన మాటలయందుండియే వేదములును పురాణములును షడ్దర్శనములును ఉత్పత్తిని అందినవి (వాస్తవస్థితిని చెప్పెదను) వినుము; నీతత్త్వమును చెప్పవలయును అన్నచో - వానికిని అది శక్యముకాదు.

23. మా గురువుల నామము నందే నీఉనికి కలదు. (ఏలయన) వారిని ఎల్లరును 'నృసింహసరస్వతీ' అందురు: ఈకారణమువలననే - ఇతనిదికూడ నాపేరేకదా యను హేతువువలన నీకు నాయందును ప్రీతి కలదు. (ఈగ్రంథకర్తనామము సరస్వతీ)

24. జంత్రముపై ఆడించబడు బొమ్మ ఏవిధముగా జంత్రగాడు ఆడించినట్లుగానే ఆడునో దానికి తాను ఆడుట విషయమున స్వతంత్రమగు ఆలోచనము ఉండదో - ఇతరులదే యగు ఆలోచనకులోబడి నడచుకొనునో -

25. అదేవిధముగా - తల్లీ! వాగ్దేవతా! నీ అభిమతమును అనుసరించి నా నాలుకను ప్రేరించుము. అని నిన్ను బాలుడను (అవివేకి- అసమర్థుడు) అగు నేను నిన్ను ప్రార్థించుచున్నాను. నీవు దయానిధివి.

---

* షడ్దర్శనములు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

26. అందువలననే నీచరణములకు నమస్కరించుచున్నాను. నాస్వామిని (అగునీవు) నాయందు ప్రసన్నురాలు కావలయును అని నా ప్రార్థన. నాకు ఆమె (నీవు) విద్యాదానముచేయవలయును అని వేడుచున్నాను. నేను ఇపుడు ఇక గ్రంథమందు ప్రవేశించుదును.

త్రి మూ ర్తి ప్రా ర్థ న ము

27. ఇపుడు నేను ఇక త్రిమూర్తులగు బ్రహ్మను విష్ణుని శివుని నమస్కరించుచున్నాను; నాకు విద్య ఇమ్మని నేను వారిని (మొదట బ్రహ్మను - తరువాత విష్ణుని - తరువాత శివుని) ఇదే అనుక్రమముగ ప్రార్థించుచున్నాను.

28. ఎవనికి చతుర్ముఖములుకలవో - ఎవడు సృష్టికి కర్తయో - ఎవని ముఖములయందుండి వేదములు ఉత్పన్నములయినవో అతని చరణములయందు ఇదే నా నమస్కారము.

29 - 30 - 31. ఇపుడు హృషీకేశుని నేత్రములు మొదలగు విషయేంద్రియ - జ్ఞానేంద్రియములకు అధిష్ఠాత - ఈశుడు - అగు విష్ణుని నమస్కరింతును. ఎవడు విశ్వమునకు నాయకుడో - వేయింబవళ్లును లక్ష్మీ సహితుడయి యుండునో సదా క్షీరసాగరమునందు ఉండునో - ఇంకను చెప్పెదను తెలిసికొనుము. - ఎవడు చతుర్బాహుడో - నరహరి రూపుడో - ఎవని కరములయందు శంఖమును, చక్రమును, గదయును కలవో - ఎవడు పద్మహస్తుడో, మురాసురునకు శత్రువో, లోకసృష్టికర్త యగు బ్రహ్మకు జన్మస్థానమును ఆధారస్థానమును నగు పద్మము నాభి యందు కలవాడో ఇంకను చెప్పెదను వినుము. ఎవడు పీతాంబరము ధరించునో ఎవని కంఠమునందు వైజయంతీమాల కలదో ఏ కృపాళుడు శరణాగతులకు సకములగు అభీష్టములను ఇచ్చుచుండునో అట్టి విష్ణుని నమస్కరింతును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

32 - 33 - 34. ఇపుడు శివుని నమస్కరింతును. ఎవడు తన మస్తకమునందు గంగనుధరించెనో ఎవనికి ఐదు మొగములును పది భుజములు కలవో తనఅర్ధశరీరమందు జగన్మాతకలదో ఎవనికి ఐదు నోళ్ళుకలవో ఎవడు ఈసృష్టిని సంహారమందునట్లు చేయునో అందు వలననే ఎవరిని * శ్మశానవాసి అందురో అట్టి పరమశివుని చరణము లందు నా నమన (నమస్కార)ము. ఎవనికి వ్యాఘ్రచర్మము దుప్పటియో ఎవని సర్వావయవములందును పాములు చుట్టులు కలవో ఇటువంటి వాడు అయి యుండియు ఎవడు శంభుడు (ఎల్లలోకములకు సుఖము కలిగించువాడు) ఉమారమణుడు (జగన్మాత మనస్సునకానందము కలిగించువాడు ను అయి యున్నాడో అటువంటి పరమేశ్వరునకు నా నమస్కారము.

సకలదేవ - ఋషి - నమస్కారము.

35. సమస్త సురవరులారా! నమస్కారము; సిద్ధ సాధ్యులారా! అవధానము కలవారు కండు; నా నమస్కారము అందుకొనుడు గంధర్వ యక్ష కింనరులారా! నా నమస్కారము; ఋషీశ్వరులారా! నమస్కారము.

సుకవి నమస్కారము

36. ఇపుడు ఇక వినుడు; పరాశరుడు మొదలగు స్మృతికారు లగు మునులుగ నున్న కవులకు (పండితులకు) ను వ్యాస భగవానుడు మొదలగు తత్త్వవేత్తలగు కవులకును, వాల్మీకి మొదలగు రసవత్కావ్య నిర్మాతలగు కవులకును ఇట్లు వివిధ కవికులములకును ఇదే నా నమస్కారము.

---

* విశ్వసంహార మొనరించిన తరువాత కూడ శివుడు ఈభస్మమయ విశ్వమందుండును. అట్లు అది శ్మశానమే కావునను అందతడు వసించును కావునను శివుడు శ్మశానవాసి యనదగి యున్నాడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

37. కవిత్వము అనగా ఏమో నేను ఎరుగను. ఈ హేతువు చేతనే బూాకు నేను మనవి చేయుచున్నాను; అయ్యలారా! మీరు మాదాపుమకదా! అను తలపుకలిగి అట్టి అనుగ్రహము మూలముననే మీరు నేను మీమీదనే విశ్వాసము ఉంచుకొనినందులకు తగినట్లుగా నాకు జ్ఞానమును ఈయవలయును అని ప్రార్థించుచున్నాను.

38. గ్రంథరచనలతీరు ఎట్టిదో ఎరుగను; శాస్త్రముల విచారణయు ఎరుగను; నాభాషయు * మహారాష్ట్రి కాదు; ఇందువలననే ఇట్లు మీకు మనవిచేయుచున్నాను;

39. మీరు అందరును నాయందు దయచూపవలయును; నా పలుకులలో మీా అందర సాహాయ్యము నాకు కావలయును ♦ శబ్దవ్యుత్పత్తి కూడ ఎరుగను; కావున ఓ కవిజనులారా! నన్ను మీరే ప్రతిపాలించ వలయును - అని ప్రార్థన.

వం శ పూ ర్వు ల స్తు తి

40. ఇట్లు అందరను ప్రార్థించిన అనంతరము నావంశమందలి పూర్వజులను మనస్సునందు ధ్యానింతును; జననీ జనకుల - ఇరువుర - పక్షములందలి పుణ్య పురుషుల మాహాత్మ్యమును (గొప్పదనమును) స్మరింతును.

41. నేను (కృష్ణయజుర్వేదమునకు చెందిన) ఆపస్తంబ శాఖకు చెందినవాడను; కౌండిన్య మహాఋషి మాగోత్ర పురుషుడు; 'సాఖరే'

---

* ఈ శ్రీగురుచరిత్ర గ్రంథకర్త యగు సరస్వతీ గారి మాతృభాష కన్నడము. వీరి పూర్వులు గుల్బర్గా తాలూకా యందలి కడగంచి గ్రామాధికారులు కులకర్ణి - లేదా శానభోగ - కరణము - గా నుండిరి.

♦ వ్యాకరణశాస్త్రము ననుసరించి శబ్దముల రూపములు ఏర్పడురీతియు దాని ననుసరించి శబ్దముల అర్థములు ఏర్పడుతీరును వ్యుత్పత్తి అనబడును. ఇందలి పాండిత్యమును కూడ వ్యుత్పత్తి అందురు.





జగద్గురు
శ్రీ బోధానంద భారతీ స్వామి



జగద్గురు
శ్రీ కళ్యాణానంద భారతీ స్వామి
గుంటూరు



జగద్గురు
శ్రీ సదాశివానంద భారతీ స్వామి
గుంటూరు



జగద్గురు
శ్రీ నృసింహానంద భారతీ స్వామి
గుంటూరు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

అని ఖ్యాతి చెందినది మావంశ నామము. (ఇంటిపేరు). సాయం దేవుడు అను పూర్వజునినుండి మావంశము ఇటు ఆరంభమగును.

42. అతని (ఆసాయం దేవుని) నుండి 'నాగనాథుడు' కలిగెను. అతని కుమారుడు 'దేవరావు.' అతని కుమారుడు గంగాధరుడు;' సదా శ్రీసద్గురుచరణ ధ్యాత (ధ్యానపరుడు) అగు ఆ గంగాధరుడు నా తండ్రి.

43, 44, 45. ఇట్లు నా జనకుని చరణములకు నమస్కరించిన తరువాత మాజననికి, పూర్వజులగు పెద్దలను మనస్సున ధ్యానింతును. ఎవరు (ఏపూర్వజులు ఋగ్వేదమునకు చెందిన) ఆశ్వలాయనశాఖకు చెందినవారిలో పేరుపొందిన వారో - కాశ్యప గోత్రజులో - అట్టి వంశమున * గంగానదికి జహ్నుమహాముని వలెనో ♦ భగీరథుని వలెనో నిశ్చయముగ పూజనీయుడును 'చౌడేశ్వరుడు' అను పేరుగలవాడును అగు నత ఉండెను. అతని కొమరితయే నా జనని; ఆమె నామము 'చంపా' ఆమె నిశ్చయముగ భవాని (పార్వతి) వంటిది; ఇంకను చెప్పెదను వినుడు; ఆమెయే నాకు స్వామిని;

శ్రీ గురు నమస్కృతి

46. ఇట్లు జననీజనకులను నమస్కరించిన అనంతరము ఇపుడు శ్రీ గురుచరణములను స్మరించవలయునను మతిప్రకాశము కలిగినది. అట్లు శ్రీగురువులను నమస్కరించుచున్నాను.

47. నావిషయము చెప్పెద వినుడు. ఎవడు సదా శ్రీగురు చరణములను ఏకభావముతో ఎడతెగకుండ ధ్యానించుచుండునో అట్టి గంగాధరుని కడుపున జనించితిని.

48. (అట్లు తనకుగల శ్రీగురుభక్తి భావముతోనే నా తండ్రి నాకు 'సరస్వతి' యను నామము ఉంచెను.) ఈ హేతువులచే 'సరస్వతీ-

* జహ్నుముని * భగీరథుడు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

శ్రీగురుకథను వినవలసినదిగా గ్రంథకర్త శ్రోతలను ప్రార్థించుట.

60. పుణ్యప్రదమును పావనమును (వినిన) వారిని చదివినవారిని పవిత్రులనుగా చేయునదియును అగు శ్రీగురు కథను విస్తరించుచు చెప్పెదను; అధికమగు శ్రమము పడవలసిన పని లేకుండగనే కోరికలు దీనిచే సిద్ధించును; ఇది సత్యం, (చదివినను వినినను వెంటనే - అతి శీఘ్రముగా) ఫలప్రదము; ఇది అనుభవమున మీరే చూడుడు.

61. ప్రయాసము ఏమియు లేకుండగనే నిధి లభించుచుండ (ధన ప్రాప్తికై) ఎంతో శ్రమతో కష్ట (క్లేశ) పడవలసిన పని ఏమున్నది? నా మాటలయందు మీకు విశ్వాసమున్నదో శ్రోతలారా ! ఇది ఏక (ఏకాగ్రతతో నిండిన) చిత్తముతో వినుడు.

62. నాకు ఈవిషయమునందు సాక్షాత్ (స్వయముగ) అనుభవము ఘటిల్లినది. అందువలననే దృఢముగా మనవి చేయుచున్నాను. (ఈరూపమున శ్రీదత్తాత్రేయ) గురుస్మరణము శుభకరము అయినది ? మీరు ఎల్లరును కూడ ఈశుభమును అనుభవించుడయ్యా !

63. ఆహారమును భుజించువాడు తనకు తృప్తి కలిగినమీదట త్రేనిచి తనకు తృప్తి కలిగినది అను విషయమును ఎట్లు తెలపునో అట్లులే నేనును శ్రీగురుమహిమను స్వయముగా అనుభవించిన తరువాతనే (ఈకథా రచనారూపమున) ఈ ఉద్గారమును (తనకు అందుచే కలిగిన తృప్తిని అనుభవమును బయటకు ప్రకటించుట) చేయుచున్నాను.

64. నేను సామాన్యుడను అను కారణమున నా మాటయందు (నా ఈ రచనయందును) అలక్ష్యత చూపకుడు; తేనెటీగ నోటినుండి (లభించు) తేనె ఎట్లు గ్రాహ్యము అగుచున్నది ?

65. సాధారణమగు ముత్తెపుచిప్పయందుండి ముక్తాఫలము ఎట్లు ఉత్పత్తి చెందుచున్నదో అతిసామాన్యమగు కర్పూరపు అరటినుండి

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

కస్తూరము ఎట్లు ఉత్పత్తినందుచున్నదో (అట్లే ఇదియును అని తల చుడు.) ఆలోచించి చూడుడు - అశ్వత్థ వృక్షముల (రావి మొలక) ఉత్పత్తి దేనినుండి అగుచున్నది ? (కాకి విసర్జించిన మలమందుండి వెలికివచ్చిన రావిగింజనుండి కదా ఆ రావి మొక్క మొలచు చున్నది!)

(ఈ చెప్పిన వన్నియు అతి సాధారణమగు దానినుండియో అప విత్రమగు దానినుండియో ఉత్పత్తి నందెనను వానిని ఎల్లరును పవిత్ర మయినవానినిగాను విలువగలవానినిగాను గ్రహించుచు ఉపయోగిం చుచు ఆదరించుచు ఆనందించుచు ఉన్నారు కదా ! అట్లే అతి సామా న్యుడ నగు నేను రచించు ఈ శ్రీగురుచరిత్ర గ్రంథమునుకూడ శ్రోత లగు తాము ఎల్లరును గ్రహించవలయును అని ప్రార్థనము.)

66. శ్రోతలారా ! మీరు నా గ్రంథమును అలక్ష్యము చేసెద రేమో (చేయకుడు.) చెరకుగడ నల్లనిదిగా వంకరగా కనబడుచుండును (అయినను) దాని (నుండి) రసము అమృత (సమాన)ముగా వెలి వచ్చుచున్నది. (కనుక) మీరు దానిమీద(నే) దృష్టి నుంచుడు.

67. అదేవిధముగా మీరు నా మాటల ననుసరించి (నామాట లను విశ్వసించి) మీలో ఎవరికి శ్రీగురుస్మరణమునందు అభిరుచి (ప్రీతి) కలదో వారు ఎల్లరును విషయమును మాత్రము గ్రహించుటయందు నేర్పరులయి ఏక (ఏకాగ్ర) చిత్తముతో దీనిని స్వీకరించువారయి దీని వలన లభించు ఆనందమును పుణ్యఫలమును అనుభవింతురు గాక !

68. ఈమాటలను రుచిచూచుటవలన కలుగు అనుభవము ఎవరికి సంభవించునో అట్టివారికి ఈ నామాటల రసపు అనుభవము కలుగుటతోపాటే (తత్ క్షణమే) బ్రహ్మానంద రసపు అనుభూతియును ఫలించును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

69. ఈ శ్రీగురుచరిత్రము కామధేనువు; వినుచుండగనే మహా జ్ఞానము కలుగును. శ్రోతలారా! మీ మీ శ్రోత్రముల చెవులను సావధానములను (తత్పరతకలవానిని)గా చేసికొని ఏక (ఏకాగ్ర) చిత్తముతో వినుడు. గ్రంథావతరణిక - నామధారకుడు శ్రీగురు దర్శనమునకై తహతహపాటు చెంది శ్రీగురుస్తుతి ఫలముగా శ్రీగురు సాక్షాత్కారము నందుడు.

70. శ్రీదత్తాత్రేయ గురుమూర్తి యగు శ్రీనృసింహ సరస్వతి వారు గాణగాపురమునందు సదా ఉన్నారు. వారి మూలమున ఆ గ్రామమునకు కలిగిన ఖ్యాతియును మహిమయును అత్యున్నతియును చెప్పెదను, ఏక (ఏకాగ్ర)చిత్తులరయి వినుడు.

71. ఆ గ్రామమునందు శ్రీగురు దత్తాత్రేయులు ఉన్నారు; అను హేతువుచే అత్యధికమగు మహిమము ఏర్పడెను. నాలుగు దేశములందును ఉండు జనులు ఈ విషయమును ఎరిగిరి. అచటికి యాత్ర చేయుటకై అందరును పోవుచుండిరి.

72. జనులు అక్కడకుపోయి వారిని ఆరాధించుచుండిరి. (వారికి) త్వరితముగా ఫలప్రాప్తి కలుగుచుండెను. పుత్త్రులు - దారలు (ఉత్తమ పత్ని) ధనము సంపత్తి - జనులు ఇట్టివి ఏవి ఏవి కోరుచుండిరో అవి ఎల్లను వారికి లభించు చుండెను.

73. (సంతానార్థులు) సంతానమును పొందిన తరువాత శ్రీ గురువుల నామమునే ఆ సంతానమునకు నామముగా ఉంచుచుండిరి.

74. ఇట్లు వర్తమానము నడుచుచుండగా నామకరణి (శ్రీ గురువుల నామమే తన పేరుగా ధరించిన నామధారకుడు - అనగా ఈ గ్రంథ కర్తయగు 'సరస్వతీ' నామము గలవాడు) అను శ్రీగురు భక్తుడు ఒకడు అతిగహన (గాఢ) మగు క్లేశము నందుచుండెను. ఎల్లప్పుడును శ్రీ గురువులనే ధ్యానించుచుండెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

75. (అతడు తన) మనస్సునందు వ్యాకులితుడు అయ్యెను. చింతలు మిగుల చుట్టివేసి ఉండెను. శ్రీగురు దర్శనమునకై పోవుదును. అను నిశ్చయముకల మనస్సుతో బయలుదేరెను.

76. మానసమునందు కలిగిన అతి దృఢ నిశ్చయముచే శిష్య శిరోమణి యగు ఆ నామధారకుడు శ్రీ గురుచరణములయందు లయ మును (తల్లీనతను - తాదాత్మ్యమును) పొంది ఆకలిదప్పులు కూడ మరచి పయనించుచు పోవుచుండెను.

77. అతడు తన మనస్సునందు ఇట్లు అని నిశ్చయము చేసి కొనెను; శ్రీ గురువులను దర్శించియే తీరెదను. అట్లు చేసికొనలేక పోవుదో దేహమునే విడుతును. ఈ జడ (వ్యర్థ) దేహముతో (మరిఇక) ఏమి చేయదగియున్నది ?

78. ఎవరి నామమును స్మరణము చేసినచో త్వరితము దైన్య హరణము జరుగునో అట్టి శ్రీ గురువుల నామముతో నేను అంకితుడను (గురుతుగానుండు పేరు కలవాడను) ఏ కారణమున ఐనట్లు ? అన సాగెను. (తన నామమును స్మరించినవారి దైన్యమును పోగొట్టు మహా మహిమశాలియని కదా మా పెద్దలు నాకు వారిపేరు పెట్టిరి; అట్టి విశ్వాసము జనులయందు నిలువవలెను. అనినచో వారు నా దైన్యమును పోగొట్టవలయును గదా ! నేను వారి నామమును ఎంతగ స్మరించినను నా దైన్యము పోనదేల ?

79. నా అదృష్టము కొరతయై యున్నది; అందుచే నీవు వారి నెంతగ ధ్యానించినను వారి యనుగ్రహము కలుగుటలేదు అనినచో మరి శ్రీగురు చరణములను ఏల భజించ (సేవించ) వలయును ? స్పర్శ వేది తనకు తాకిన క్షణమునందే ఇనుము సువర్ణముగా మారునుగదా!

80. అదే విధముగా నీ నామము అను స్పర్శవేది సదా నా హృదయమునందు వాసము చేయుచున్నది కదా అయినను నాకు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

క్లేశములు తీరక ఇట్లు ఆయాసమును పొందుచునే యున్నాను. అనినచో సిగ్గు ఎవరికి?

81. నేను పలికిన ఈ మాటయందు (ఈమాటనుబట్టి) నాకుగల గాఢమగు కోరిక ఏదియో ఎరిగి మనస్సునందు ఉంచుకొని గురుమూర్తి! సదాశివా! సర్వభూతములయందును కృపాలురగు స్వామీ! నాకు ఆ కోరిక సిద్ధింపజేయుము.

82. శ్రోతలారా! వినుడు. ఈ విధముగా శ్రీగురుభక్తుడగు నామధారకుడు తన మనస్సునందు అతివ్యాకులతనంది బాలల క్లేశమును అనుభవించెను. అతడంతట తన వాక్కుతో శ్రీగురువులను నిందా స్తుతి (పైకి నిందవలె అనునట్లు తోచినను వాస్తవముగ స్తోత్రము) చేయ నారంభించెను.

83. విఘ్నహరుడగు పార్వతీ కుమారుని నమస్కరింతును; సుందర (ఆనందప్రద) తత్త్వరూప యగు శారదా! నీకును వందనము.

84. శ్రీగురువులే త్రిమూర్తి రూపులు అని వేద వచనములు చెప్పుచున్నవి. ఈ కలియుగమునందు (ఈనాటి ప్రపంచము నందు) కనబడుచున్న దృష్టాంతములును ఈవిషయమునే యథార్థమైన దాని నిగా ఋజువుపరచి చెప్పుచున్నవి.

85. కృపాసాగరుడగు శ్రీ నృసింహ సరస్వతీ! తాము భక్తులకు సారథిగానుండి వారిని వారి వారి గమ్యమునకు తీసికొనిపోవుదురు. అని ఈ కలియుగమునందు తమకు ఖ్యాతి ఏర్పడియున్నది.

86. త్రయీ (వేదత్రయ) మూర్తియు త్రిమూర్తి రూపియు అగు శ్రీగురునాథుడు భక్తుల విషయమున కృపాసాగరులు, అని వేదములు వర్ణించు చున్నవి.

87. త్రిమూర్తి రూపుడవగు త్రిగుణాత్మక తత్త్వపు సగుణ రూపమును ఈ త్రిగుణములకును నిధానము (నిధివలె ఆశ్రయమగు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

మూలస్థానము) అగు జగద్బీజ రూపమగు పరమేశ్వర తత్త్వమును తామే అయి యున్నారు; తాము భక్తులను రక్షించు దయానిధులు.

88. దయానిధి యగు యతిరూపా! శ్రీపతి (మహావిష్ణు) రూపా! నాకు భావభక్తి అనగా ఏమో తెలియదు. భావభక్తి నా అంతఃకరణమునందు లేదు. అని ఈ వాస్తవమును తమకు మనవి చేయుచున్నాను.

89. శ్రీగురూ! నా అంతఃకరణము స్థిరత్వమునంది యుండుట లేదు. కృపాసాగరు లగు తాము వేగమే నా కడకు వచ్చి చేరుడు.

90. నృసింహా! (నృసింహాసరస్వతీ!) అనంతా! ఇప్పుడే వేగమున రండు. తల్లి తన బాలునికడకు వచ్చునట్లు రండు. (నన్ను) ఎందులకు విడిచెదరు ?

91. నీవే తల్లివి; నీవే తండ్రివి; నీవే మిత్రుడవు; నీవే భ్రాతవు; నీవే మావంశమున పరంపరాగత యగు కులదేవతవు.

92. వంశ పరంపరాగతు డగు మా కులదైవతము వీరే యని నిర్ధారణము మనస్సునం దుంచుకొని నేను శ్రీనృసింహాసరస్వతిని సేవించు చున్నాను.

93. శ్రీనృసింహాసరస్వతీ ! నా వాకిట దైన్యము నెలకొని యున్నది. అందువలన నేను నిరంతరమును క్లేశములను అనుభవించు చున్నాను.

94. ఇప్పటివరకును నిరంతరమును క్లేశములను చింతను ఏల ఇచ్చుచున్నావు ? నీవు భక్తుల (డ నగు నా) విషయమున కృపాసముద్రు డవు ఎపుడు అయ్యెదవు ?

95. భక్తుల విషయమున కృపాసాగరా ! అనంత కృపాళూ ! త్రయీ (వేదత్రయ) మూర్తీ! త్రిమూర్తి రూపా ! (సర్వక్రియా) సమర్థా! దయానిధీ !

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

96. నీవు త్రిమూర్తి (త్రయీమూర్తి) రూపుడవు అయి ఉన్నావు. విశ్వమును నీవే పాలించుచున్నావు. సమస్త దేవతలను నీవే కాపాడు చున్నావు. వరదాతవు నీవే.

97. సమస్త దేవతలకును (వర) దాతవునీవే; నేను మాత్రము నిన్ను కాక మరెవరిని వేడుకొందును.

98. ఇపుడు నీవుతప్ప (వర) దాత ఎవరున్నారు? నీవు విశ్వ మును పోషించు వాడవును; సర్వజ్ఞుడవును.

99. నీవు సర్వజ్ఞుడవు అని శ్రుతులు పురాణములు చెప్పు చున్నవి. కాని ఇవి సాక్ష్యములు (ప్రమాణములు) కావు అని నా అంతఃకరణమునందు తోచుచున్నది.

100. సర్వజ్ఞుని గురుతులు - అనగా లక్షణములు ఇవి: (సర్వజ్ఞు డగు వాడు) అందరను గూర్చియు ఎవడు ఎటువంటి వాడు - అనునది ఎరుగవలయును.

101 (ఏలయన) ఈ భూమిమీద నుండువారి (వాని)లో ఎవరు ఎట్టివారు (ఏది ఎట్టిది?)అను విషయమును ఎరిగియుండినచో మాత్రమే- అప్పుడే అతడు సర్వజ్ఞుడు అనదగి యుండును.

102. బాలకుడు పాలు త్రాగగోరి యున్నాడు. (పాలకై ఏడ్చు చున్నాడు.) ఈ విషయమును తల్లిదండ్రులు ఎరుగ లేరు. ఆ తల్లి దండ్రులకు (తమ బాలకునిపై) దయ ఎపుడు కలుగును?

103. (ఇతడు నాకు ఏదయిన) ఇచ్చిననే తప్ప (ఇతనికి ఏదియు) ఈయరాదు. అని నీ మనస్సునందు ఉన్నదా? నాకు చెప్పుము.

104. బలి నీకు సమస్త మహీతలమును ఇచ్చెను. అతనిని నీవు పాతాళమునందు కూర్చుండ బెట్టితివి!

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

105. నీవు ఒకనికి (విభీషణునకు) బంగారపు (ము వంటి) లంకను ఇచ్చితివి. అతనిచే అంతకుమునుపు ఆ లంకకు (తగిన మూల్యముగా) నీకు ఏమి ఈయబడెను ?

106. హృషీకేశుడ వగు నీవు ధ్రువునకు ధ్రువ (స్థిర) స్థానమును ఇచ్చితివి. అతడు మాత్రము నీకు అంతకుముందు ఏమి ఇచ్చియుండెను?

107. ఈ మేదినిని (భూమిని) నిఃక్షత్రియమునుగా చేసి విప్రున (ల)కు (కశ్యపునకు) ఇచ్చితివి కదా ! అపుడు అందులకు మారుగా ఎవరు నీకు ఏమి ఇచ్చిరి ?

108. దేవా ! ఈ సృష్టికి అంతటికిని పోషకుడవు నీవు, ఇట్టి నీకు - పోమ (వంటివాడు) ను నేను ఏమి ఇత్తును ?

109. నరహరీ ! నీవు శ్రీమంతుడవు కాకపోయినచో (కదా - నీవు నానుండి ఏమయిన అడుగుట ?) మహాలక్ష్మి (సదా) నీ గృహ మందు ఆనందముతో ఉన్నదే !

110. ఇటువంటి నానుండి హృషీకేశా ! ఏమి కోరుదువో చెప్పుము; ఏమి ఇత్తును ?

111. బాలుడు తన తల్లి క్రోడపయి (ఒడిలో) కూర్చుండి స్తన్యము త్రావవలయును అను కాంక్షతో తన ముఖకమలమును తెరచి ముందునకు చాచును. (అనుకొనుము.)

112. నామాట వినుము; తండ్రీ ! శ్రీగురునాథా! అప్పుడు తల్లి ఆబాలునినుండి (అతనికి తాను ఈయబోవు స్తన్యమునకు (ప్రతి ఫలముగా) ఏమికోరును ? అట్లే నేనును మీకు ఏమి ఇత్తును ?

113. సేవనుకాని మరేదికాని తీసికొనియే ఇచ్చునప్పుడు దాత అనెడు పేరు ఉండదు కదా ! దయానిధి అనిపించుకొను నీకు ఇది కీర్తిని ఇచ్చునా ?

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

114. (ప్రతిఫలము ఏమియు గ్రహించక నాకు ఏమియు) ఈయ జాలవా ? నేను నామనస్సులోనిమాట చెప్పుచున్నాను; చతుర్దశ భువనముల(ందలి వారల) కును దాతవు (అందలి ప్రాణులకు ఎవరికి - వేనికి ఏదికావలయును అనినను ఇచ్చువాడవు) నీవే !

115. అట్లుగాక నీ మనస్సునందు మరి ఇంకేమయిన తలంపు ఉన్నదేమో ! (నేను నీకు) సేవచేయలేదు అనుకొనుచున్నావేమో !

116. సేవను అందుకొని ఇచ్చుట సామాన్యమగు విషయము; దాతృత్వమునకు అది పేరు (లక్షణము) కాదు, అని తెలిసికొనుము.

117. క్రింద భూమిపై దిగుడుబావులును బావులును ఉండును; మేఘుడో పైని ఆకాశమం దుండును; (అతడు వీనియందు) వర్షించుచునే ఉన్నాడు.

118. దిగుడుబావులు బావులు చెరువులు మొదలగునవి ఆ మేఘునకు సేవచేయజాలవు - చేయవు అను స్వాభావికమగు విషయమే ఐనను అతడు వీటిని అన్నిటిని నీటితో నింపినవానినిగా ఎట్లు (ఏల) చేయుచున్నాడు ?

119. సేవను అపేక్షించినచో (అట్టి వానికి) దాత అనుమాట ఉండునా ? (వర్తించునా ?) దయానిధి అని అనిపించుకొనుట ఎట్లు సరిపడును ?

120. సేవ ఎటువంటిదో నేను ఎరుగను. నా మానసము స్థిరముగ ఉండుటయు లేదు. మా వంశపరంపరా క్రమమున అందరును నీకు దాసులుగా ఉన్నారు.

121. నా వంశమునందలి పూర్వజు లందరును నిన్ను సేవించి యుండినారు. అనేక విధములుగా నీచరణములనే పట్టుకొని యుండినారు.

122. నేను నిన్ను సేవింపలేదే అను కొనుము. దయావంతు లగువారు తను సేవించిన తండ్రుల పుత్త్రులను కూడ దయతో పాలిం

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

తురు. అదే విధముగా మీరు మమ్ములను కాపాడవలయును. అని వేడుకొనుచున్నాను.

123. నా పూర్వజులు తమసేవ అను ధనమును ఏ ప్రతిఫలమును ఆనాడు కోరక మీకు ఋణముగా ఇచ్చియుండినారు. కృపా సింధూ ! (ఆవిషయ మాలోచించియైన) కరుణ ఏల లేదు ?

124. పూర్వారికి మాకు ఇచ్చు విషయమున నైన నీ చిత్తమందు ఆలోచనము ఏలలేదు; ఈ విషయము నేను సత్పురుషులకు (పెద్దలకు) చెప్పెదను. ఇప్పుడు ఇప్పించుకొందును.

125. నృసింహ సరస్వతీ ! నీవు ఇప్పటికిని అది ఈయనివో వ్యవహారమునందు గెలిచి తీసికొందును; ఎరుగుదువా ?

126. గురునాథా ! నీవు ఇపుడు (ఇంతవరకు) నాపై కాఠిన్యము వహించినట్లు కనబడుచున్నది. కాని - నేను మొదటినుండియు నీకు అంకితుడనైన సనాతన దాసుడను (కదా !) ఇట్టి నాపై కాఠిన్యము వహించ తగునా !

127. నాతో సమానుడు ఎవడు ఉన్నాడు ? అను (పొగరుబోతు) వారి విషయమున నీ మనస్సును కఠినమునుగా చేసినదో చేయుము.

128. హరీ ! (నరహరీ ! నృసింహ సరస్వతీ !) నీవు దైత్యుల విషయమున మనస్సును కఠిన మొనర్చుము. దైత్యుడే ఐనను నీ సేవకుడగు ప్రహ్లాదుని రక్షించితివే !

129. నీ సేవకులగు బాలుర (అసమర్థులును అమాయకులును అగు వారి) విషయమున ఇట్లు చేయకుము; చెప్పుచున్నాను; వినుము; కాఠిన్యము మంచిదిగా కనబడదు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

130. ఒకవేళ నేను అపరాధము చేసియుంటిని; అనుకొనుము. ఆ అపరాధమును నీవు నీ బుద్ధియందు నిలుపుకొని నీ అంతఃకరణము నందు ఉన్న క్రోధమును చూపుచుండినవో (చెప్పెదను వినుము.)

131. బాలకుడు అజ్ఞానవశమునను మాయావశమునను తన తల్లిని ఉద్దేశించి నిష్ఠురవచనములు పలికినయెడలను కొట్టినయెడలను కూడ -

132. మాత ఆ కుమారుని విషయమున ఎట్లు కోపమును ఉంచు కొనకుండునో పైగా హర్షముతోనే వానిని ఆలింగనముచేసికొనునో సముదాయించునో ఆ విషయము చూడుము.

133. అహో ! హృషీకేశా ! నేను చేసిన ఏ అపరాధమునకై నాతో మాటలాడకున్నావో నాకు చెప్పుము.

134. తల్లి బాలకునిపై కోపించి ఏమయిన అనినచో బాలుడు పోయి తన తండ్రితో చెప్పుకొనునుకదయ్యా !

135. ఒకానొక సమయమున తన తండ్రి కోపించి ఏదయిన అనినచో వానిని వానితల్లి దయదలచి సముదాయించును.

136. గురునాథా ! నాకు నీవే తల్లివి; నీవే తండ్రివి అయి ఉంటివి అట్టి నీవే కోపించుచుంటివి. మరిచెప్పుము; ఇప్పుడు నన్ను ఎవడు రక్షించును ? (నాపై ఎవరు దయ చూపుదురు ?)

137. ఎల్లరకును నీవే స్వామివి ! అని ఇట్లు జగమున ఖ్యాతి ఏర్పడియున్నది. కావున నేను ఎటువంటివాడనైన కావచ్చుగాక ! దాసుడను కావున నన్ను రక్షించుము.

138. నీవు అనాథరక్షకుడవు; అని లోకము నిన్ను గూర్చి చెప్పు చున్నది. నేను నీ బాలకుడను; నన్ను రక్షించుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

139. నీవు కృపాళుడవు అని (వేదములు) పురాణములు చెప్పు చున్నవి. కాని నీవు నామాటలు చెవిని వేసికొనక వేసికొన కున్నావే !

140. గురురాజా ! నా జాలిగొలుపు మాటలను వినకున్నావే నీవు చూపు ఈ ఉదాసీనత ఎటువంటి (దిగా ఉన్న) దో చూడుము.

141. నా జాలిగొలుపు మాటలను నీవు చెవులతో వినకున్నావు. విని(నవో) రాలుకూడ కరగునే !

142. కరుణాకరుడు (కరుణా-ఆకరుడు - దయకునిధి) అని ఇట్లు నిన్ను ప్రశంసించుచున్నారే ! (ఈ మాట సత్యము) అయినచో ఇప్పటికిని దయరాకున్నదే ! ఇది ఎటువంటిది ?

143. ఈ విధముగా స్వ నామాంకితుడు (తన పేరేకల 'సరస్వతీ' అను భక్తుడు) విన్నవించుచుండగనే కృపాళుడగు గురునాథుడు త్వరి తుడై వేగముగా (అతని సన్నిధికి) వచ్చెను.

144. ధేనువు తన దూడకొరకై ఇంటికివచ్చి ఎట్లు నిలువబడునో అట్లే శ్రీగురువులు తాము నామధారకునికడకువచ్చి అతని సమీ పమున నిలిచిరి.

145. అట్లు వారు రాగానే నామధారకుడు తన మస్తకమును నా చరణ యుగళమునందు (పాదములజంటయందు) మోపి నమస్కరించెను.

146. అతడు తన కేశములను ముడివిప్పెను. వానితో శ్రీగురు వుల చరణధూళిని తుడిచెను. ఆనందాశ్రుజలములతో వారిపాదములను ప్రక్షాళించెను.

147. అతడు తన హృదయమందిరమునందు శ్రీ గురువులను అందముగా కూర్చుండబెట్టి షోడశవిధములగు ఉపచారములతో వారిని పూజించెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

148. నామధారకుడు ఆనందభరితుడు అయ్యెను. అతని హృదయమునందు గురునాథుడు స్థిరుడు అయ్యెను.

149. శ్రీ గురునాథుడు భక్తుని హృదయమునందు ఉండిపోయెను. 'సరస్వతి'కి అత్యంతముగా సంతోషము కలిగెను.

ఇది పరమకథా కల్పతరువయి సిద్ధనామధారక సంవాదరూపమున ప్రవచింపబడిన శ్రీ నృసింహసరస్వత్యుపాఖ్యానరూపమగు శ్రీగురు చరిత్రామృతమునందు మంగళాచరణము అను ప్రథమాధ్యాయము.

ఓవీ సంఖ్య - 149

# శ్రీ గురు చరిత్రామృతము

## ద్వితీయాధ్యాయము

శ్రీ గణేశాయ నమః శ్రీ సరస్వత్యై నమః శ్రీ గురుభ్యో నమః

[ప్రథమాధ్యాయమునందు కడపట చెప్పినట్లు నామధారకునకు శ్రీ గురుసాక్షాత్కారానుభవము కలిగిన తరువాతను అతడు ఈవిధముగ శ్రీగురువులను మనస్సులో స్తుతించుచు పోవుచుండెను.]

1. త్రయీ (వేదత్రయ) మూర్తియు - త్రిమూర్తి రూపుడును నగు శ్రీ రాజా! నీవే నాకు గురువవు; నీవు కృష్ణా తీరమునందు (కురవగడ్డయందు శ్రీ పాద వల్లభ రూపమున) వాసము చేసి (చేయుచు) వర్ధిల్లుచు శక్తిశాలివై జాగరూకుడవై (ఆశ్రిత రక్షణము నందు సమర్థుడవును సదా జాగరూకుడవునునై) యున్నావు. ఉత్తములగు భక్తులు అక్కడ ఆనందమును అనుభవించుచున్నారు. స్వర్గమునందు ఉండి దేవతలు ఈ వినోదమును (తమ ఈ లీలలను)

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

చూచు చున్నారు. (శ్రమ ఈ మహాలీలలకు దేవతలు సాక్షులు; దేవతలే సాక్షులు అనినచో ఇందు ఏమాత్రమును అసత్యము లేదు అని తాత్పర్యము.)

2. ఇట్లు శ్రీగురు చరణములనే ధ్యానించుచు భక్తుడగు నామధారకుడు (శ్రీగురుచరిత్ర గ్రంథకారుడగు 'సరస్వతి') పోవు చుండగా అతడు నడచి నడచి చాల శ్రమ చెందెను. అందుచే త్రోవ యందలి ఒక వృక్షముక్రింద ఉండిపోయెను.

3. అతడు ఒక క్షణకాలము నిద్రించెను. స్వప్నమునందును అతడు శ్రీగురుపులను ధ్యానించుచునే ఉండెను. సత్యము చెప్పు చున్నాను; వినుడు. అనంత కృపానిధియు అనంతుడును అగు శ్రీగురువులు అతనికి స్వప్నమునందు దర్శనమును ఇచ్చిరి. (సాక్షాత్కా రించిరి.)

4. ఆ నామధారకునకు (సరస్వతికి) తన స్వప్నమునందు జటా ధారియు భస్మాంకితమును వ్యాఘ్ర చర్మమును పరిధానము (కట్టు వస్త్రము) గా ధరించినదియు పీతాంబరమును పైవస్త్రము (ఉత్తరీ యము)గా వేసికొని నదియు అగు రూపము కనబడెను; (శ్రోతలారా! ఈరూపమును మీరును మనోభావనచే) చూడుడు.

5. ఇట్టి యోగీశ్వరుడు నామధారకుని దగ్గరకువచ్చి తత్ క్షణమే అతని నుదుటియందు భస్మము అంటించెను. అతనిని ఓదార్చి ఆయోగి అతనికి అభయహస్తమును ఇచ్చెను.

6. నామధారకుడు ఇంతమాత్రము స్వప్నమునందు దర్శించెను. అంతట అతడు మెలకువ నందెను. నాలుగు దిక్కులను కలయ చూచెను. (ఎవరును కనబడ నందున) ఆ సమయమున చాల ఆశ్చర్యము నందెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

7. అనంతరము నామధారకుడు తాను తన స్వప్నమునందు ఏమూర్తిని చూచెనో ఆమూర్తినే తన మనస్సునందు ధ్యానించుచు బయలుదేరెను. త్రోవయందు నడచుచు పోవుచుండగా అతడు అటు వంటి మూర్తినే ప్రత్యక్షముగా చూచెను.

8. ఆ యోగీశుని చూచుచునే నామధారకుడు (సరస్వతి) అతనికి దండవత్ ప్రణామము చేసెను. దీనవదనుడై (జాలికొలుపు మొగము కలవాడై) నన్ను తరింపజేయుడు - నన్ను తరింపజేయుడు. అనుచు దయ కలుగునట్లు పలికెను.

9. నామధారకుడు ఇంకను ఇట్లు అనెను. యోగాధీశా ! తమకు జయము ! జయము !! అజ్ఞానము అను తమస్సును (చీకటిని) వినాశ మొందించు స్వామీ ! నీవే స్వయంజ్యోతిః ప్రకాశ రూపుడు అగు పరమాత్మవు; కృపానిధీ ! సిద్ధమునీ !

10. తమ దర్శనముచే పరితిములను (పాపములను) కలిగించు నా దోషములు అన్నియు తొలగిపోయినవి. నాకు తారకుడవు (నన్ను తరింపజేయువాడవు) నీవే. అందువలననే (నన్ను తరింపజేయవలయును అను దయాప్రవృత్తితోనే) తాము ఇచ్చటికి వచ్చితిరి - స్వామీ !

11. కృపణు (దీను) డగు ఈభక్తుని (ఉద్ధరించు) నిమిత్తమయి తాము ఎచ్చటనుండి వచ్చుట జరిగినది ? ఏ మునియని తమ నామ ధేయము ? తమ నివాసము ఏ స్థానమునందు ?

12. నామధారకుని ప్రశ్నము విని సిద్ధుడు ఇట్లు పలికెను. నేను యోగిని; (పవిత్రమగుటచే స్వర్గమే యనదగిన) ఈ (భారత) భూమి యందలి తీర్థ క్షేత్రములయందు సంచరించు చుందును. నా గురువు ఈ జగమునందు శ్రీ నరసింహ సరస్వతి యని విఖ్యాతులు.

13. ఎవరి (ఏ మహనీయుని) స్థానము భీమా-అమరజానదుల సంగమ ప్రదేశ సమీపమునందు భీమానది తీరమునందు ఉన్న గాణగా

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

పురము అయి యున్నదో అట్టి త్రయీ (వేదత్రయ) మూర్తియు త్రిమూర్తుల అవతార సమష్టియు అగు శ్రీ నృసింహ సరస్వతియే మా గురువులు.

14. వారు భక్తులను తరింపజేయుటకై త్రయీ (వేదత్రయ) మూర్తిగా త్రిమూర్త్యవతారముగా జగమునం దవతరించిన ఆ గురువు లను అభ్యాసపరులగు యోగులు భవసాగరమును తరించుటకై సదా ధ్యానించు చుందురు.

15. మా శ్రీ గురువులు ఇటువంటివారు; వారు దయా సము ద్రులు; భక్తజనుల విషయమున సదా వరప్రదులు; వారు తమ శిష్య వర్గమునకు అఖిల సౌఖ్యములను శ్రీని ముక్తిచేకలుగు ఆనందమున ఇచ్చుచు ఉందురు.

16. వారి భక్తులకు దైన్యము ఎక్కడిది? వారిని ఉపాసించు వారు అఖండ లక్ష్మీ పరిపూర్ణులయి ధనధాన్యాదులతోను గోధనము తోను * అష్ట విధైశ్వర్యములతో ఆనందించుచుందురు.

17. సిద్ధముని ఇట్లు పలికెను. అదివిని నామధారకుడు (సరస్వతి) ఇట్లు సిద్ధునితో మనవి చేసెను. నేనును సదా ఆ శ్రీ గురుయతుల వారి ధ్యానమునందే యుందును.

18. (వారికిగల) కీర్తియు బిరుదములును ఖ్యాతియును ఇట్టివి యని సిద్ధులును యతులును చెప్పుచున్నారు. వంశపరంపరా క్రమ మున నేనును వారికి భక్తి (భజనము - సేవ) చేయుచునే యున్నాను. నేను ఏల క్లేశములను చూడ (పొంద) వలసి వచ్చినది?

19. నాకు నీవే తారకుడవు; (మీ మూలమున ఈ సంసార సముద్రమునుండి తరించు అదృష్టము నాకు లభించ నున్నది.) అందు

* అష్టవిధైశ్వర్యములు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

వలననే తాము నన్ను కలిసితిరి. (నాకు తమతోడి సాంగత్య భాగ్యము లభించినది.) స్వామీ! నా సంశయమును సంహరించి (తీర్చి) (శ్రీగురువులు నాపై కరుణించని హేతువు నాకు) తెలుప ప్రార్థించు చున్నాను.

30. ఆ సమయమున (అనంతరము అంతట) సిద్ధుడు ఇట్లు పలికెను. శిష్యవర్గ మంతటిలో ఉత్తముడ వగు శిష్యా! వినుము; చిన్నల యందును పెద్దల యందును (అందరి విషయమునను) శ్రీగురువుల కృప (సమానముగానే ప్రవర్తిల్లును.) ఏలయన - వాస్తవము చెప్పెద వినుము; శ్రీగురువులు భక్త వత్సలులు.

31. ఎవరికి (ఎవరివిషయమున) శ్రీగురుకృప కలుగునో వారికి వారు దైన్యమును ఏల కలుగనిత్తురు? సమస్త దేవతలును అతనికి (ఆ శ్రీగురు భక్తునికి) వశ్యులగుదురు. ఆ నరుడు కలికాలమునే జయించును.

32. ఇటువంటి వస్తువును (శ్రీగురువులను) పూజించి (యు) దైన్యపు వ్యాప్తి కలిగెనని తొందరపాటున (సరిగా ఆలోచింపక) పలుకుచున్నావు. బహుశః నీ మనస్సునందు దార్ఢ్యము లేదేమో! అందువలననే క్లేశములను అనుభవించుచున్నావేమో!

33. శ్రీగురువులు త్రయీమూర్తి రూపులు - త్రిమూర్తి రూపులు - అని నిర్ధారణముగా ఎరుగుము; (భావించుము;) వారు అఖిల వరములును ఈయ గలరు. ఏకభావముతో వారిని (నీవు) సేవించవలయును.

34. ఏదయిన సమయమున ఎవరికైనను శ్రీహరి కాని త్రిపురారి (శివుడు) కాని కోపించినవో శ్రీగురువులు తమ శిష్యజనులను నిర్ధారణ ముగా రక్షించును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

25. ఎవ్వరికైన ఎప్పుడయిన శ్రీగురువులు తామే కోపించినచో వ్యోమకేశుడు (ఆకాశమే తన కేశరాశిగా గల శివుడు) కాని అథవా విష్ణువు కాని రక్షించజాలరు అనుట నిశ్చయము అని చెప్పుచున్నాను; వినుము.

26. ఇట్లు పలికిన వచనములను విని నామధారకుడు (సరస్వతి) సిద్ధుని చరణములపై వ్రాలి నమస్కరించెను. తన హృదయమునందు ఏమియు కాపట్యములేక నిండారిన భక్తిని ప్రదర్శించుచు చేతులు జోడించి అతడాతనితో ఇట్లు మనవి చేసెను.

27. స్వామీ ! తాము ఇట్లు సెలవిచ్చితిరి. కాని నామనస్సు నందు సందేహము కలుగుచున్నది. శ్రీగురువులే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అను త్రిమూర్తులు ఎట్లు అగుదురు ?

28. తాము మరియొకమాటకూడ సెలవిచ్చితిరి ? విష్ణువు కాని రుద్రుడు కాని కోపించినచో శ్రీగురువులు నిశ్చయము రక్షించగలరు. గురువు కోపించి నప్పుడు ఎవరును రక్షించ (జాల)రు. అంటిరి.

29. ఈ వచనము ఎవరిది ? ఏ శాస్త్రమునందలిది ? ఏపురాణము నందలిది ? నా మనస్సునందలి ఈ సందేహమును తీర్చుడు. దేనిచే (ఏమిచేయుటచే) నా మనస్సు దృఢమగునో అది తామే చేయుడు.

30. నామధారకుడు సిద్ధుని నమస్కరించి అతనిని ఈవిధముగా ప్రశ్నించెను. శ్రోతలారా ! వినుడు. కృపానిధి యగు ఆ సిద్ధుడు సంతోషించి ఇట్లు చెప్ప నారంభించెను.

31. సిద్ధుడు తన శిష్యు (డగు నామధారకు) నితో ఇట్లు చెప్పు చున్నాడు. నీవు నన్ను అడిగితివి కదా ! ఈ విషయమును వేదవాక్య సాక్ష్య (ప్రమాణ) ముతో చెప్పెదను. ఏక (ఏకాగ్ర) చిత్తముకల వాడవయి వినుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

32. బ్రహ్మదేవుని నాలుగు ముఖములందుండి నాలుగు వేదములును ఉత్పన్నములు అయ్యెను. వాటి (యందుండి) దగ్గరనుండి అష్టాదశ పురాణములును ఉత్పన్నములయి విఖ్యాతము లయ్యెను.

33. ఆ పదునెనిమిది పురాణములందును సాక్షాత్ బ్రహ్మ స్వయముగ పలికిన వాక్యము అని ప్రఖ్యాతము అయిన బ్రహ్మ వైవర్త పురాణము త్రిభువనములయందును ప్రఖ్యాతమయి యున్నది.

34. సర్వ జడ చేతనపదార్థములను తాను సృష్టించి వాటియందు తాను ప్రవేశించినందున విష్ణుమూర్తి యని కీర్తింపబడు నారాయణుడు ద్వాపర యుగాంతమునందు వ్యాసుడుగా నయ్యెను. బ్రహ్మప్రోక్త వాక్య విస్తారరూపమగు ఈ బ్రహ్మ వైవర్తపురాణమును ఈభూలోకమునందు ప్రకాశమునందు జేసెను.

35. ఆ వ్యాసుని దగ్గరనుండి అది సమస్త ఋషిజనులయందును (చేతను) శ్రుతము (వినబడినది) అయ్యెను. అదే కథను విస్తారముగ దెంచి చెప్పెదను. ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

36. కలియుగము (కలియుగాభిమానదోష పురుషుడు) ఒక నాడు బ్రహ్మదేవునికడకు వచ్చి తనకు శ్రీగురుమహిమను తెలిపి హర్షము కలిగించుమని ప్రశ్నించెను. బ్రహ్మదేవుడు అతనికి అది విస్తారపూర్వకముగా తెలియజెప్పెను.

37. సిద్ధుడు ఇట్లు పలుకగానే నామధారకుడు మరల సిద్ధునకు నమస్కరించి తన రెండు చేతులను జోడించి తన నిర్మల హృదయము నిండారి కురుసుకొనిన భక్తితో ఇట్లు మనవి చేసెను.

38. అతడిట్లనెను : సిద్ధయోగీశ్వరా ! అజ్ఞానము అనెడు చీకటులను నశింపజేయు భాస్కరుడా ! భవసాగర తారకా ! దయాసాగరా! నన్ను తరింపజేయుటకే తాము నాకు తమసాంగత్యమును అనుగ్రహించితిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

39. ఏ హేతువుచే బ్రహ్మదేవుడు కలియుగమునకు (కలియుగాధిష్ఠాతయగు రోషపురుషునకు ఈ విషయము) చెప్పెను. ఈ విషయమును ఆద్యంతముగా స్వామీ! సవిస్తారముగా నాకు తెలియ జెప్ప వేడుచున్నాను.

40. అనగా సిద్ధుడు అదివిని ఇట్లనెను: శిష్యా ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము. ఏ సమయమునందు * నైమిత్తికుడు ప్రళయము జరుగుట సంభవించునో ఆ సమయమునందు • ఆదిమూర్తి యగు శ్రీవిష్ణువు ఏ సంకల్పములును లేనివాడగుచు వటపత్రశయనుడగును.

41. • అవ్యక్తమూర్తి యగు నారాయణుడు అట్లు వటపత్రశయనుడయి యుండగా (కొంతకాలమునకు తరువాత) ఆ అవ్యక్త చైతన్యమునందు మరియొక సృష్టిని రచించుటకు (రచించవలయును అని) బుద్ధి (సంకల్పము) ఉత్పన్నమయ్యెను.

42. ◦ ప్రపంచము అనగా సృష్టి రచన చేయవలయును. అను సంకల్పము ఆ వ్యక్తమూర్తి మనస్సులోనికి వచ్చెను. ఈ కారణమున ఆ ఆదిపురుషుడు ఆ సంకల్పానంతరము (తన యోగనిద్రనుండి) మేలు కొనెను.

43. ఇట్లు నారాయణుడు జాగరితుడయిన తరువాత అతని ఆ అవ్యక్త చైతన్యమునందు కలిగిన సంకల్పాత్మక బుద్ధికి ఫలముగా ఈ త్రైలోక్య విశ్వనిర్మాణగృహ మగు కమలము ఉత్పన్న మయ్యెను.

44. ఆ కమల మధ్యమునుండి సాక్షాత్ బ్రహ్మ ఉదయ మందెను. అతడు తన మనస్సుతోనే నాలుగు దిశలను చూచి చతుర్ముఖుడు అయ్యెను. ఇది ఎంత అద్భుతమో చూడుము.

---

* నైమిత్తిక ప్రళయము; • ఆదిమూర్తి (ఆదిపురుషుడు)
• అవ్యక్తమూర్తి • ప్రపంచము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

45. ఆసమయమున (అంతట) బ్రహ్మ తనలో తాను ఇట్లను కొనెను: అన్నిటి (అందరు) కంటెను నేనే బలవంతుడను. నాకంటె శ్రేష్ఠతముడు మరియెవరును లేరు. అనసాగెను.

46. అదివిని అపుడు నారాయణుడు నవ్వి గూఢార్థముకల శబ్దాత్మకమగు వాక్కులు ఇట్లు పలికెను. మహావిష్ణుడను నే నున్నాను. నన్ను సేవించుము అనెను.

47. నాయనా ! వినుము. బ్రహ్మదేవుడు నారాయణుని చూచి హస్తపూర్వకముగా నమస్కరించెను. బహువిధముల బహుకాలము స్తుతిచేసెను.

48. అంతట నారాయణుడు సంతోషించి మహోత్తమ మగు ఆజ్ఞ ఇచ్చెను. సృష్టి రచించుమోయీ ! అని ఆజ్ఞాపించెను.

49. అది విని విష్ణునితో బ్రహ్మ ఇట్లు మనవి చేసెను. సృష్టి రచించుటెట్లో నేను ఎరుగను. అది ఎట్టిదిరో నేను చూడలేదు. ఎట్లు రచింతును ? అనెను.

50. బ్రహ్మదేవుని వచనమును విని మహావిష్ణువు అతనితో ఇట్లు సెలవిచ్చెను. (అందు నీకు సహాయపడుటకై) వేదములు ఉన్నవి. అవి ఇవిగో ! తీసికొనుము. అని అపు డతనికి అవి ఇచ్చెను.

51. సృష్టి రచించుటకు సంబంధించిన విచారము (ఆలోచన ప్రకారము) ఈ వేదములయందు సవిస్తరముగ ఉన్నది. ఆ ప్రక్రియనే అనుసరించి స్థిర (లయనుందిన) రూపముననున్న ఈ సృష్టిని మరల రచించి అది ప్రకాశము నందునట్లు ప్రకటమగునట్లు చేయుము. అని శ్రీ మహావిష్ణువు బ్రహ్మదేవునితో చెప్పెను.

52. వేదములు అనాది (శబ్దరాసులు) అయి ఉన్నవి. అని ఎరుగుము. సృష్టికి సంబంధించిన లక్షణములను నిరూపించునవి ఇవియే

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

(ఐ యున్నవి.) ముఖపు లక్షణములను తెలుపుటకు అద్దము ఎటు వంటిదియో సృష్టిని రచించుటకు వేదములు అటువంటివి.

53. ఈ వేదములు ప్రతిపాదించిన మార్గము ననుసరించి - బ్రహ్మదేవా ! అహర్నిశలును సృష్టి రచించుమోయీ; అని హృషీకేశుడు పలికెను. తదనుసారముగనే బ్రహ్మ సృష్టిని రచించెను.

54. ఈ సృష్టి యందు అనుక్రమమున ప్రజలు అనగా వివిధము లగు స్థావర (సంచరించలేనివియు) జంగమములు (సంచరించగలవియు) అను ప్రాణులు - స్వేదజములు (చెమటనుండి జనించు నల్లులు, పేళ్లు మొదలగునవి.) అండజములు (గ్రుడ్లనుండి వెలికివచ్చు పక్షులు, పాములు మొదలగునవి.) జరాయుజములు (తల్లిగర్భమునుండియె మావిచే కప్పబడిన శిశువుగా నుండి మావినుండి వెలువడు చతుష్పాత్ ప్రాణులు మానవులు మొదలగు ప్రాణులు, ఉద్భిజ్జములు (నేలను చీల్చుకొని వెలికివచ్చు వృక్షజాతి ప్రాణులు) ఇట్టి నాలుగు విధము లగునవి ఉత్పన్నములు అయ్యెను.

55. శ్రీ మహావిష్ణుదేవుని ఆజ్ఞచే సృష్టిరచనా క్రమమున బ్రహ్మ దేవునిచే త్రిజగములును సృష్టించబడెను. అని వ్యాసునిచే చెప్పబడినది.

56. సిద్ధుడు తన శిష్యుడగు నామధారకుని (సరస్వతి) తో ఇంకను ఇట్లు చెప్పెను. వేదవ్యాస రూపుడగు నారాయణుడు విఖ్యాతములగు అష్టాదశ పురాణములను విస్తారమంద జేసెను.

57. వాటి అన్నిటియందును బ్రహ్మవైవర్త పురాణము ప్రఖ్యాతమయి ఉన్నది. దానిని సూతుడు (శౌనకాది) ఋషీశ్వరులకు చెప్పెను. అదేవిధమున నేను నీకు చెప్పెదను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

58. బ్రహ్మదేవుడు ఈ వేదములందు చెప్పబడిన లక్షణములను అనుసరించి నిర్గుణమగు నివృత్తిమార్గమున బ్రహ్మవిష్ణులయి యుండు సనకాదిఋషులను ఉత్పన్నులనుగా జేసి అనంతరము సుగుణమగు ప్రవృత్తి మార్గమున ధర్మనిష్ఠులగు * మరీచి మొదలగు పదిమంది ప్రజా పతులను సృజించెను.

59. నాయనా ! వినుము; బ్రహ్మదేవుడు ఆ ప్రజాపతులనుండి దేవ దైత్యాదులను ఉత్పన్నుల నొనర్చెను. ప్రకృతమున చెప్పుటకు ప్రసక్తమయిన (ప్రకృతప్రసంగమున చెప్పబడిన) కథ విస్తారముగా నున్నది. శిష్యోత్తమా ! వినుము.

60. బ్రహ్మదేవుడు కృత - త్రేతా - ద్వాపర యుగములను అనంతరము కలియుగమును ఉత్పన్నముల చేసెను. అనంతరము మరి అతడు వాటిని ఒక్కొక్క దానినే భూమిపై (భూలోకమున) ప్రవర్తిల్లు టకు ప్రవర్తిల్లవలసినది అని ఆజ్ఞాపించెను.

61. వినుము; బ్రహ్మదేవుడు కృతయుగమును (కృతయుగా ధిష్ఠాతృపురుషుని) పిలిపించి ఇట్లు ఆజ్ఞ ఇచ్చెను. "నీవు భూలోకమునకు పోయి తను (నిన్ను నీవు) ప్రకాశునిగా (ప్రకటితునిగా) చేసికొనుము."

62. బ్రహ్మదేవుని వచనమును విని కృతయుగము (యుగాధిష్ఠా తృపురుషుడు) సంతోషమునంది భూలోకమునకు వచ్చెను. (వచ్చుటకు సిద్ధు డయ్యెను.) ఆ యుగపు (పురుషుని) లక్షణములు చెప్పెదను; శ్రోత లారా ! ఏకచిత్తులరై (ఏకాగ్రచిత్తముకలవారయి) వినుడు.

63. అతడు అసత్యము అన నేమో ఎన్నడును ఎరుగనైన ఎరు గడు. వైరాగ్యభావముతో నిండినవాడు; జ్ఞానవంతుడు; సత్యమందే

* మరీచ్యాది దశ ప్రజాపతులు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

నిలుచునాడు; అతనికి యజ్ఞోపవీతమే ఆభరణములు; రుద్రాక్ష మాలతో కర కంకణములు.

64. ఈ రూపముతో నుండిన సత్య (కృత) యుగము (పురుషుడు) బ్రహ్మదేవునితో ఇట్లు మనవి చేసెను. తామేమో భూలోకమునకు పొమ్ము అని నాకు ఆజ్ఞ ఇచ్చుచున్నారు. భూమిమీద ఎచ్చటకు పోవుదును ?

65. భూమిపయినుండి మనుష్యజనులు అసత్యపరులు; అకారణ పరనిందాపరులు; అపవాదములను ఆడుచుందురు; వినుము; వారు నన్ను సహించరు. ఏవిధముగ నేను అచట ప్రవర్తింతును ?

66. సత్యయుగపు (రుషుని) వచనములను విని బ్రహ్మదేవుడు తాను ఇట్లు సెలవిచ్చెను. నీవు అచట కొంతకాలము ఇదేవిధముగ ఏదో ఒకవిధముగ - ఏక్లేశములనైన సహించుచు ఓర్పుకలిగి సత్త్వగుణుడవై వర్తిల్లు చుండవలయును.

67. నిన్ను దుఃఖితునిగా చేయను. అని ఎరుగుము; 1728000 సంవత్సరములు అయిన తరువాత మరియొక యుగమును పంపెదను; అంతవరకు నీవు సావధానుడవయి యుండవలయును సుమా, అని బ్రహ్మదేవుడు ఆ కృతయుగమును భూమిమీదకు పంపెను.

68. నాయనా ! వినుము. ఇట్లు జరుగుచుండగా (కృతయుగము భూలోకమున ప్రవర్తిల్లుచుండగా) సత్యయుగ కాలప్రమాణపు అవధి (గడువు) అయిపోయెను. మరి వినుము; అంతట బ్రహ్మదేవుడు త్రేతాయుగమును యుగాధిష్ఠాతృ పురుషుని పిలిపించి విడివిడిగా అన్నీ విషయములు తెలిపి పై వలెనే ఆజ్ఞాపించెను.

69. శిష్యా ! నామధారకా ! ఆ త్రేతాయుగపు లక్షణములను తెలిపెదను వినుము. అతని శరీరము స్థూలమయియుండును. అతని హస్తములందు యజ్ఞసామాగ్రి యుండును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

70. ఈ కారణముననే త్రేతాయుగమునందు సకలజనులును యజ్ఞములను అనుష్ఠించు చుందురు. బ్రాహ్మణులయందు ధర్మశాస్త్రముల ననుసరించిన ప్రవర్తనములును కర్మ మార్గానుసరణమును ఉండును.

71. ఆ త్రేతాయుగ పురుషుని హస్తమునందు వృషభము ఉండును; (అదియే ధర్మదేవత) అతడు దానిని లోకమున సదా ప్రవర్తింపజేయుచు జీవించు చుండును. ఇటువంటి త్రేతాయుగ పురుషుడు బ్రహ్మదేవుని ఆజ్ఞను అందుకొని హర్షముతో భూమిమీదకు పోయెను.

72. (కొంతకాలమునకు తరువాత) బ్రహ్మదేవుడు హర్షపూర్వకముగా ద్వాపరయుగమును (యుగాధిష్ఠాతృ పురుషుని) పిలిపించి (అతనిని భూలోకమునకు పొమ్మని) ఆజ్ఞాపించెను. అతని రూపము (మొదలగునవి) చెప్పెదను. శ్రోతలారా! ఏకచిత్తులై (ఏకాగ్ర చిత్తము కలవారై) వినుడు.

73. అతని రెండుచేతులందు * ఖడ్గమును ఖట్వాంగమును మరి రెండుచేతులందు ధనువును బాణములును ఉండును. అతనియందు ఉగ్రతయు శాంతియును ఈ రెండుభావములును కనబడుచుండును. నిష్ఠురత్వమును దయయును అతనియందు కలవు.

74. పుణ్యమును పాపమును రెండును అతనియందు కలవు. ద్వాపరయుగ పురుషుడు ఇటువంటి మంచిరూపముతో ఉండును. అతడు తాను బ్రహ్మదేవుని ఆజ్ఞను గ్రహించి కుతూహల (సంతోష) పూర్వకముగా భూమిమీదకు వచ్చెను.

75. అతని దినములు పూర్ణమయిన పిదప బ్రహ్మదేవుడు కలియుగమును (కలియుగాధిష్ఠాతృ పురుషుని) పిలిపించెను. నాయనా!

* ఖట్వాంగము : మంచపుకోటివలెనుండు ఒక ఆయుధము

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

చూచుము. బ్రహ్మదేవుడు అతనితో నీవు త్వరగా భూమిమీదకు వెళ్ళవలసియుండును. అని పలికెను.

76. నాయనా ! చూడుము; కలియుగ పురుషుడు ఇటువంటి వాడు అనియు వాడు ఎట్లు (ఎట్టిరూపముతో) బ్రహ్మదేవుని సమక్షమునకు వెళ్లెను ? అనునదియు తెలియునట్లు వాని లక్షణములను చెప్పెదను; వినుము.

77. వాడు తన అంతఃకరణమునందు విచారణము (ఆలోచనము) లేనివాడు; వాని మొగము పిశాచపు మొగమువంటిది; వాడు మొగము క్రిందికి దించుకొని ఉండును. అడుగడుగున పడిపోవుచుండును.

78. వాడు తాను క్రూరుడు; వైరాగ్యహీనుడు? (సుఖలాలస కలవాడు;) కలహము ద్వేషము మొదలగు వాని నన్నిటిని వెంట తీసికొని తన ఎడమచేతియందు (తో) శిశ్నమును ధరించి (ఎత్తిపట్టుకొని) బ్రహ్మదేవుని ఎదుటికి వచ్చి నిలిచెను.

79. కుడిచేతితో అతడు తన నాలుక పట్టుకొని మిగుల సంతోషముతో నాట్యమాడ సాగెను. దోషారోపణ ప్రధానమును పుణ్యపాప సంమిశ్రితమును అగు స్తుతి చేసెను.

80. కొక్కిరింతగా ఉండు ఏడ్పులును; నవ్వులును ప్రదర్శించుచు నాలుకను పొట్టను వంకరలుగాచేసి ఏమిసెలవు ఇత్తురు ? అనుచు బ్రహ్మదేవుని సమక్షమున నిలువ బడెను.

81. వాని లక్షణములు చూచి బ్రహ్మదేవుడు మిగుల గాఢముగా (పొట్ట చెక్కలగునట్లు) నవ్వెను. లింగమును జిహ్వను ఏల పట్టుకొంటివి ? అని అతడు అతనిని మిగుల వినోద పూర్వకముగా ప్రశ్నించెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

82. కలియుగాధిష్ఠాతృ పురుషుడు బ్రహ్మదేవునితో ఇట్లు పలికెను. (వీనితో) నేను సమస్తలోక (జన) ములను జయింతును. తమ జిహ్వను లింగమును (కామ ప్రవృత్తిని) రక్షించుకొను (తమ అధీనము నందుంచుకొను) వారికి నేనే స్వయముగ ఓడిపోవుదును.

83. బ్రహ్మదేవా! ఈ కారణముచేతనే నేను లింగమును జిహ్వను పట్టుకొని నాట్యము చేయుచున్నాను. నేను ఎక్కడకు పోవుదునో అట్టి ప్రతి (ఏ) యొక చోటను నేను ఎవనికిని భయపడను; ఇది నా స్వభావము.

84. కలిపురుషుని వచనములను విని బ్రహ్మదేవుడు వానితో "నీవు భూలోకమునకుపోయి స్వ (నీ) గుణములను ప్రకాశింప జేసికొనుము." అని సెలవు ఇచ్చెను.

85. కలియుగపురుషుడు బ్రహ్మదేవునితో ఇట్లనెను: నన్ను భూమికి పంపునప్పుడు (నేను నీచే పంపబడి భూలోకమునకు పోయిన తరువాత) నా గుణములు ఎట్టివిగా ఉండునో చెప్పెదను. స్వామీ! వినుము.

86. ధర్మమును భిన్నముగా చేయుదును. నిరంకుశుడనుగా ఉందును. ఇంకను వినుము; నిరానందత (హాయిగా ఉండకుండుట) నిద్ర - కలహము - ఇవి నాకు ప్రాణ (ములతో సమానముగా ప్రీతి పాత్ర) ములు.

87. పరద్రవ్యాపహారులును పరస్త్రీలయందు ఆసక్తులగువారును ఈ ఇరువురును రెండు విధములగువారును నా అన్నదమ్ములు. మోసము మత్సరము - కపటము (ఇవి) వీరు నాకు ప్రాణసఖులుగా ఉందురు.

88 - 89. ఇంకను వినుము; కొంగలవంటి (దొంగ) సన్యాసులు ఉందురే! వారే నాకు ప్రాణము (లవలె ప్రీతిపాత్రము)లు. (అమా

యుకులను) మోసగించి (తమ) ఉదరము పోషించుకొనుటకై సంపా దించుకొనువారు ఉందురే - వారే నాకు సఖులును ప్రాణములును. వీరు కాక ఇతరులు (ఏకొలదిమందియో) పుణ్యజనులు ఉందురుకదా! వారే నాకు శత్రువులు - అని ఎరుగుము. అని కలి బ్రహ్మదేవునితో పలికెను.

90 ఇదివిని బ్రహ్మదేవుడు కలిపురుషునితో ఇట్లు పలికెను. నీకు ఉపదేశ (వచన) ములు పలికెదను, వినుము. నీ యుగమునందు నరులకు ఆయువు స్వల్పము - అనగా ఒక నూరు సంవత్సరములు ఉండును.

91. ఇది చూడుము; ఇతఃపూర్వపు ఆయా యుగములందు మనుష్యలోకమున జనులకు అధికమగు ఆయుష్యము ఉండెను. వినుము; అందుచే అప్పటివారు అనేక దినములవరకును తపములును అనుష్ఠానము లును చేయుచుందురు.

92. మరియు అప్పుడు వారికి ఉత్తమగతి (తమ తపోఽనుష్ఠాన ములకు ఫలితముగా కలిగినదో) కలిగెడిది. (ఏమయిననూ) వారికి అప్పుడు అఖండ (అత్యధిక) మగు ఆయుష్యము ఉండెడిది; కావున వారు తమ తపోఽనుష్ఠానాదుల సంసిద్ధికై ఈ భూలోకమందు బహు దివస పర్యం తము క్లేశముల నందుచుండెడివారు.

93. కాని ఇప్పుడు (ఈ కలియుగమునందు) ఇట్లు కాదు; అని ఎరుగుము. ఈ నీ యుగమున మనుష్య జాతియందు ఆయుష్యమును స్వల్పము; దానికి తగినట్లు (అల్పకాలము మాత్రమే) తపోఽనుష్ఠా నాదికము ఆచరింతురు; దానికి తగినట్లు శీఘ్రముగనే పరమార్థమును (తాము లక్ష్యముగా ఉంచుకొనినసిద్ధిని) పొందుదురు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

101. చూడుము; ఏజనులు శివుని హరిని ధ్యానింతురో ఏ మనుష్యులు ధర్మరతులు (ధర్మానుష్ఠానమునందు ఆసక్తులుగా) నుందురో వారు నన్ను మిగుల క్లేశపరతురు; నన్ను చూచుచునే వారు నాయందు దయలేనివా రగుదురు

102. ఇంకను మరికొందరు నాకు శత్రువులు కలరు. వారు ఎవరన - కొందరు పోయి గంగాతీరమునందు వాసము చేయుచుందురు; మరికొందరు వారణాసికిపోయి అందు ఉండి ధర్మములను అనుష్ఠించుచుందురు; అని చూడుము (తెలిసికొనుము.)

103. మరికొందరు కాలినడకతోనే తీర్థముల (క్షేత్రముల)కు యాత్రలు చేయుచుందురు. మరికొందరు పురాణములను వినుచుందురు. మరికొందరు సదా దానములు ఆచరించుచుందురు. ఎవరు ఎవరు ఇట్లు ఆచరించుచుందురో - వారే నాకు శత్రువులు అని ఎరుగుము.

104. ఎవరి మనస్సులయందు శాంతియుండునో వారే నాకు శత్రువులు అని ఖ్యాతినందిన విషయము. ఎవరు నిష్కపటభావముతో పుణ్య (కర్మ)ములను అనుష్ఠించుచుందురో వారి చూచినంతనే నేను భయపడుచుందును.

105. తమ నాసాగ్రమునందు తమ దృష్టిని నిలిపి అనుష్ఠాన సమయములందు జపములు చేయుచుందురే - వారిని నా కన్నులతో చూచినంతనే నా ప్రాణములు పోవుచుండును.

106. మాయా పాశమునకు వశులయి తమ దారపుత్రాదులపై ప్రీతికలిగి వర్తించుచుందురే - వారిపై నాకు ప్రీతి విస్తరముగా నుండును. వారు నాకు పరమ ప్రియులు అని ఎరుగుము.

107. వేదశాస్త్రములను దూషించుచుందురే - హరి హరుల నడుమ భేదము (న్నట్లు) చూచుచుందురే - అథవా శివుని విష్ణుని - కుంఠ దూషించుచుందురే - వారు నాకు పరమాప్తులు; అని తెలిసికొనుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

108. ఏ నరులు జితేంద్రియులుగా ఉందురో సదా హరిహరులను సేవించుచుందురో రాగద్వేష వివర్జితులు (ఇది నాకు ఇష్టమయినది. ఇది నాకు ద్వేషపాత్రము అగునది. అను భావములను విడిచి - సర్వత్ర సర్వదా సమభావము కలిగి) ధీరులు (స్థిరమతి కలవారు.) ఐ ఉందురో - వారిని చూచినంతనే నాకు భయము కలుగును.

109. ఇదివిని బ్రహ్మదేవుడు కలియుగపురుషునితో ఇట్లు పలికెను : భూలోకమున బహు విధములుగా అత్యధికముగా నీ ప్రకాశము (నీశక్తి వ్యాపనము) జరుగును; నీవు నీవు భూమికి పోవుచునే అచటి వారు నీ ఇచ్ఛను అనుసరించియే ప్రవర్తిల్లుదురు.

110. ఎక్కడనైనను ఎప్పుడైనను ఎవ్వరో కొందరు అరుదుగా పుణ్యవంతులు నరులు ఉందురే వారికి నీవు సహాయుడవు అగుచు నడుచుకొనుచు ఉండవలసినది. అని బ్రహ్మదేవుడు కలియుగాధిష్ఠాన పురుషునితో పలికెను.

111. నాయనా! వినుము. బ్రహ్మదేవుని వచనములను విని కలియుగపురుషుడు ఆ దేవునకు నమస్కారము చేసెను. కరసంపుటములను జోడించి అతడా దేవునితో ఇట్లు మనవి చేసెను. నా స్వభావమే దుర్వర్తనము అయి ఉండెనే! అట్టి నేను ధర్మమునకు ఎట్లు సహాయుడను అగుదును? స్వామీ! ఇందులకు ఉపాయము చెప్పుడు. నేను ఏ ప్రకారమున నడుచుకొనవలసి యుందును?

112. కలిపురుషుని వచనములను విని బ్రహ్మదేవుడు మిగుల గాఢముగా (పెద్దపెట్టున) నవ్వెను. అంతట ఆ కలిపురుషునకు అతడు ప్రవర్తించుటకు కావలసిన ఉపాయములను విస్తరించి ఇట్లు చెప్పనారంభించెను.

114. కాలము - దోషము (పాపము) అను వారు ఇద్దరు ఉన్నారు గదా! వారు సద్గుణ రహితులు; వారు నీకు సహాయులు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

అయి వత్తురు; నీ వెంట ఉందురు; వారే నీకు ఈ విషయమున మార్గము చూపుదురు.

115. ఏ జనులు నిర్మలులు అయి ఉందురో వారే నీకు వైరులు అని ఎరుగుము. మరి వినుము; మలమూత్రములతో (ఆయా మాలిన్యములతో) చుట్టుకొనబడి ఉండువారు నీకు ఇష్టులు.

116. ఈ కారణముచేతనే పాప పుణ్యములకును పరస్పరము విరోధము కలదు; (ఒకటిఉన్నచోట మరియొకటి ఉండదు) అని విని ఎరుగుము. కావున వీరిలో ఎవరు అధిక పుణ్యరాశి స్వరూపు లయి ఉందురో - వారు నిన్ను జయింతురు, అను నామాట వినుచుంటివా!

117. ఈ కారణముననే అరుదుగ ఏకొలదిమందియో జనులు పుణ్యవంతులు అయి ఉందురు. వారే నిన్ను జయింతురు; ఇది నిశ్చితము. చాలమంది నీకు వశ్యులగుదురు.

118. వివేకవంతులగు ఎవరయిన జనులు నీవు తమకు కలిగించు ఉపద్రవములను సహింతురో - వారు పూర్ణపురుషు లగుదురు; నీ దారుణ ప్రవృత్తిని సహించకుందురో - వారు నీకు వశ్యులు అగుదురు; అని ఎరుగుము.

119. ఈ కలియుగ కాలములో జనులు ఈ విధముగా ఉందురు; ఏజనులు నీ క్రూరత్వ దృఢమతులయి సహింతురో - వారు ఈశ్వరునియందు ఐక్యమును అందుదురు.

120. బ్రహ్మదేవుని వచనములను విని కలియుగ పురుషుడు ఇట్లు అతనిని ప్రశ్నించెను. సాధుజనుల అంతఃకరణము ఎటువంటిది? అది ఏ అంశ (గుణ) ములతో కూడి ఉండును; తెలపీయ ప్రార్థించుచున్నాను.

121. అంతట బ్రహ్మదేవుడు "ఏక (ఏకాగ్ర) చిత్తముతో వినుము కలీ!" అని ఇట్లు చెప్పసాగెను; అని సిద్ధుడు తన శిష్యుడగు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

నామధారకుని (సరస్వతి) తో పలికెను. సకల శ్రోతలారా! అది చెప్పెదను; వినుము.

122. ఏ జనులు తమ అంతఃకరణములందు ధైర్యమును (ధీరత్వమును - ఎట్టి క్లేశములందును ఆపదల యందును చలించకుండుటను) నిలుపుకొని శుద్ధమగు బుద్ధితో కూడి ప్రవర్తిల్లుచుందురో అట్టి వారికిని లోభవర్జితు లగు నరులకును ఎక్కడను ఎప్పుడును నీవలని దోషములు అంటవు; అని ఎరుగుము.

123. ఏజనులు హరినికాని హరునికాని అభేదభావముతో ఈ ఇరువురనుకాని భజించు (సేవించు) చుందురో అథవా కాశీనివాసులయి ఉందురో నిరంతరమును గురువులను సేవించుచుందురో అట్టి వారికి నీవలని దోషములు అంటవు.

124. మాతా పితరులను సేవించు వారికిని అథవా ఎవరు బ్రాహ్మణులను సేవింతురో అట్టివారికిని గాయత్రిని కపిల ధేనువులను సేవించు వారికిని నీవలని దోషములు అంటవు.

125. వైష్ణవులనుగాని అథవా శైవులనుగాని బాధించకుము. అనునిత్యమును ఎవరు తులసితో భగవానుని సేవించుచుందురో అట్టి వారిని నీవు బాధించకుము. అని నా ఆజ్ఞ. ఇట్టిదిగా ఉన్నది.

126. ఏ జనులు గురుసేవకులై ఉందురో పురాణశ్రవణము చేయువారో తమకుగల సర్వసాధనములతోను ధర్మపరులే అయిఉందురో అటువంటివారిని నీవు బాధించకుము.

127. సుకృతకర్మములను ఆచరించువారిని శాస్త్ర విహిత ధర్మపరాయణులను ఎవరు వంశపరంపరా క్రమమున తరతరములుగా శ్రీ దత్తాత్రేయ గురువులను సేవింతురో అట్టివారిని వివేకపూర్వకముగా (ధర్మపు స్వరూపమును ఎరిగి) ధర్మమును ఆచరించువారిని ఇటువంటి వారిని నీవు బాధించకుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

128. ఈ బ్రహ్మవచనములను విని కలి ఆదేవునితో ఇట్లు మనవి చేసెను. 'గురు' అను శబ్దపు వ్యుత్పత్తియు అర్థమును ఎటువంటిది అయి ఉన్నది? 'గురువు' అనగా ఎవరు? గురుని స్వరూపము ఏమి? నాకు ఇది యంతయు విస్తార పూర్వకముగా చెప్పవలయునని వేడు చున్నాను.

129. కలిపురుషుడు పలికిన వచనములు విని బ్రహ్మ తాను అతనితో ఇట్లు పలికెను. 'గురు' అను పదమునందలి వర్ణములలో (గ్ - ఉ - ర్ - ఉ) - అను నాలుగింటిలో; గకారము (గ్) అను నది సిద్ధిని ఇచ్చునది; రేఫము - (ర్) - అనునది పాపమును దహించి వేయునది.

130. 'ఉ' కారము విష్ణుని 2. అవ్యక్త తత్త్వమును తెలుపును. ఇంతేకాదు - గురుడు అనగా బ్రహ్మయు రుద్రుడునుకూడ; అనునది నిశ్చితము; శ్రీ గురుడు బ్రహ్మ విష్ణు రుద్ర త్రితయరూపుడు అను నది సత్యమగు వచనము; అని కలితో బ్రహ్మదేవుడు పలికెను.

131 - 132. వహ్ని - (అగ్ని) తోను విష్ణునితోను కూడిన వాడగు గణేశుడు వర్ణ (అక్షర) ద్వయాత్మకమగు మంత్రమగును; ఈ మంత్రము ధర్మార్థ కామ మోక్ష నామక చతుర్వర్ణ (పురుషార్థ) ఫల ప్రదము. (ఇది 'గురు' అను మంత్రమునకు ఉద్ధారము; దీని వివరణము ఏమనిన - బీజనిఘంటు ననుసరించి) గణేశ = గ్; (గ కారము); అగ్ని = ర్ (రేఫము); విష్ణు = ఉ; ఇవి క్రమములో కలువగా గ్-ఉ-ర్-ఉ= గురు - అగును.

133 - 134 - 135. గురుడే తండ్రి; గురుడే తల్లి; గురుడే పర శివుడు; అనునది నిశ్చితము; చెప్పెదను వినుము. ఒకవేళ ఈశ్వరుడు ఎవరి విషయమునన్నైన కుపితుడు అయినచో అతనిని గురుడు రక్షిం

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంభరా !

చును; కాని ఎవనినైనను గురుడు కోపించినచో - వినుము; ఈశ్వరుడు ఆతనిని రక్షించజాలడు.

136 - 137. గురుడే బ్రహ్మదేవుడు; గురుడే విష్ణు భగవానుడు; గురుడే భగవానుడగు మహేశ్వరుడును, గురుడే పరతత్త్వ రూపుడు; ఇదియంతయు సత్యము; అందుచేతనే గురునే ఆశ్రయించవలసి ఉండును.

138 - 139. శ్రీహరి తమ విషయమున ప్రసన్నుడు (అనుగ్రహము కలవాడు) గా ఉండినను విష్ణుభక్తులగు జనులు అవ్యయము (ఏనాటికిని మార్పు నొందనిది.) అగు గురుభక్తి తమకు కలుగవలయునని శ్రద్ధాపూర్వకముగా ప్రార్థించుచుందురు. ఏలయన - గురుడు ప్రసన్నుడైనచో సర్వజగత్తులకును అధీశ్వరుడగు జనార్దనుడు సంతుష్టుడగును; సర్వసిద్ధిప్రదుడగును. ఈశ్వరుడు ప్రసన్నుడయి ఉండిన యెడల అట్టివారికి (అట్టివారి విషయమున) గురుడు సాక్షిమాత్రుడు (తటస్థుడు - ఉపేక్షాభావముతో ఉండువాడు) కావచ్చును; కాని ఎవరి విషయమునందయిన వారిగురువు స్వయముగ ప్రసన్నుడగునపుడు వారికి (తమకు) ఈశ్వరుడును స్వాధీనుడు అగును.

140 - 141 - 142. శ్రీగురువులు జ్యోతిఃస్వరూపులు; ఈవిషయమును ఎరిగి వారిని సేవించవలయును; శ్రీగురుని సేవించినవారు సన్మహిమముచే శాస్త్ర విహితములగు సాధన మార్గములను ఎరుగుదురు. తీర్థ క్షేత్ర యాత్రలను యోగములు తపస్సులు మొదలగు ధర్మములను ఆచరించినందుచే గలుగు ఫలమును వర్ణాశ్రమాచారాది కర్ముల తత్త్వములకును యజ్ఞవిశేషములకును సంబంధించిన జ్ఞానమున భక్తి వైరాగ్యములతో కూడ పరతత్త్వ విషయకమగు జ్ఞానమును పొందుదురు. ఏలయన ఇన్ని విషయములందును త్రోవచూపువారు శ్రీ గురువులే.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

143. ఇంతవరకును బ్రహ్మదేవుడు పలికిన వచనములను విని కలి యుగాధిష్ఠాతృ పురుషుడు చేతులు జోడించి ఆ దేవునితో ఇట్లు మనవి చేసెను : (శ్రీ) గురువులు సర్వదేవసమానులు ఏ హేతువుచే ఎట్లు అయిరి ? నాకు తెలుప ప్రార్థించుచున్నాను.

144. అనగా విని బ్రహ్మదేవుడు కలిపురుషునితో ఇట్లనెను : నీ వడిగిన ప్రశ్నమునకు సమాధానము విస్తార పూర్వకముగా చెప్పెదను. ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము; గురువులేనిదే సంసారమును తరించు మార్గము లేదు.

145 - 146 - 147. ఏ యొకనికిగాని గురువులేనిచో చెవిలేదు; అనియే అర్థము. చెవిలేనిదే శాస్త్రములను వినుట ఎట్లు జరుగును ? మానవునకు శ్రవణము (చెవి) ఉన్నచో అతడు సమస్త శాస్త్రములను వినును. (వినగలుగును.) నామాటను వినుము; శాస్త్రములను శ్రవణము (వినుట) చేసినప్పుడే సంసారపాశమునుండి విడుదలపొందును. (సంసారసాగరమును తరించును.) ఈ చెప్పిన హేతువులచే శ్రీ గురువులే ప్రకాశమును అందజేయు జ్యోతిఃస్వరూపులు అని ఎరుగుము.

148. గురుని సేవించినపుడే సర్వసిద్ధులును కలుగును; ఇంకను వినుము; సర్వ ఋ (సమృ) ద్ధులును కలుగును. ఈ విషయమున అనాది (అతిప్రాచీనము) అగునదియు వాస్తవమున జరిగినదియు అగు కథయొకటి కలదు. అది అపూర్వమయినది; దానిని నీకు చెప్పెదను.

149. పూర్వకాలమందు గోదావరీ నదీతీరమున ఆంగీరస ఋష్యాశ్రమము ఉండెడిది. అది విశాలమయినది. అందు నానావిధములగు వృక్షములు ఉండెడివి. పుణ్యా కరములు (పవిత్రములు) అగు కస్తూరీమృగములు అందు వసించు చుండెడివి.

150. ఆ ఆశ్రమ స్థానమునందు బ్రహ్మ ఋషులు మొదలగువారు (మునులును యోగులును) తపస్సాచరించుచుండెడి వారు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

వారిలో పైలుడు అను మునికి కుమారుడగు వేదధర్ముడు అను నామము గల ద్విజుడు ఉండెడివాడు.

151. అతనికి చాలమంది శిష్యులు ఉండెడివారు. వారు అతని యొద్ద వేదములును శాస్త్రములును అభ్యసించుచుండెడి వారు; కలి పురుషా ! వినుము : వారిలో దీపకుడు అను ప్రఖ్యాతిచెందిన శిష్యుడు ఒకడు ఉండెను.

152. ఆ శిష్యుడు గురుపరాయణుడు (గురుడే తనకు ముఖ్యమగు ఆశ్రయము అని భావించువాడు.) గా ఉండెను. అతడు తన గురునొద్ద శాస్త్రములను పురాణములను అభ్యాసము (అధ్యయనము) చేసెను. అతడు తన గురువుల సేవ చేయుటయందును అతి నిపుణుడు అయి యుండెను.

153. శ్రోతలగు సకల జనులారా వినుడు; (బ్రహ్మదేవుడు కలి పురుషునితో ఇట్లు చెప్పెను.) ఒకదినమున వేదధర్మ ముని తన శిష్యులను అందరను తనయొద్దకు పిలిపించుకొని సంతోష పూర్వకముగా ఇట్లు అడిగెను.

154. తానట్లు పిలిపించుకొనిన తన శిష్యులతో గురుడగు ఆముని ఇట్లు పలికెను; ఏమనిన - మీకు నాయందు ప్రీతి ఉండు నెడల అపుడు మీరందరును నా వాక్యమును వినుడు. (వినెదరు గాక!)

155. శిష్యులు తమ గురునితో ఇట్లు పలుకసాగిరి. స్వామీ! తాము మాకు ఏమేమి సెలవు ఇత్తురో అదియెల్ల విశ్వాసపూర్వకముగా అంగీకరింతుము. మాకు అందరకును మీరే తారకులు. (సంసార సాగరమునుండి తరింప జేయువారు.)

156. గురుని వాక్యమును (అనుసరించి) ఎవడు చేయడో - వాడే ఘోరమగు రౌరవ నరకమునందు పడును. ఆ నరుడు అవిద్యా కృత

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

మగు) మాయా (నిర్మితమయిన సంసార) సాగరమునందు మునిగి పోవును.

157. మరి వానికి ఏవిధమున ఉత్తమగతి లభించును? ఏలయన- వాడు సతతమును నరకమునందు ఉడికి పోవుచుండునాయెను; గురుడే తారకుడు; అనెడు ఈ ఖ్యాతి (గురునికి గల కీర్తి)ని వేదములును పురాణములును చెప్పుచున్నవి.

158. తన శిష్యులు పలికిన వచనములను విని వేదధర్మముని సంతుష్టుడు అయ్యెను. నాయనా! వినుము; వారిలోనుండి (సం) దీప కుడు అను శిష్యుని తనకడకు పిలిపించుకొని అతడు ఇట్లు పలుకు చున్నాడు.

159. ఓ నా సకల శిష్యులారా! వినుడు; మాకు పూర్వార్జితము అగునది(దోషము) ఒకటి ఉన్నది. వేలకొలదిగ మా పూర్వ జన్మాంతరము లందు మహాపాతకములను చేసియుంటిమి.

160. మేము అనుష్ఠానము చేయగా చేయగా మాకు కల ఆ పూర్వార్జిత మహాపాతక దోషములో చాలభాగము కడిగి వేయబడి (నట్లయి) పోయినది. ఇప్పటికిని ఇంకను ఏదియో శేషించి ఉన్నది. అది అనుభవించిననేతప్ప పోదు; అని ఎరుగుడు.

161. నాకుగల తపః సామర్థ్యముచేత ఇది నన్ను ఏమియు చేయదు లెమ్ము అని ఇపుడు నేను ఉపేక్షచేసినచో ఈ పూర్వార్జిత దుష్కృత శేషము నాకు ప్రాప్తించు మోక్షమునకు అంతరాయమయి మీదకు వచ్చిపడును. ఈ కారణముచే ఆ ఘోరపాపమునకు నిష్కృతి (ప్రాయశ్చిత్తము) చేసికొనదగియున్నది.

162. ఎవరుకాని తనదేహముతో తానుచేసిన తన పాపమును మరి తనదేహముతోనే అనుభవించనిచో దానికి నిష్కృతి (తొలగుట) జరుగదు. నాయనలారా! చూడుడు; ఇది నిశ్చయముచేసి

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

కాని నేను ఇది అనుభవించవలసి యున్నది; అని దృఢముగా చెప్పు చున్నాను. వినుము.

163. ఈ పాపపు నిష్కృతికయి మేము వారాణసికి వెళ్లవలసి యున్నది. ఐనచో పాపము శీఘ్రముగా పోవును. అని అఖిల శాస్త్రములయందును ప్రఖ్యాతమయి ఉన్నది.

164. ఈ కారణమున మీరెల్లరును మమ్ము వారాణసిపురికి తీసికొని వెళ్లవలసి యుండును. నేనచట స్వదేహముతో నా పాపమును అనుభవింతును. నన్ను మీరచట సంభాళించుకొనవలసి యుండును.

165. ఈ సమస్త శిష్యులలోను ఎవరు అందులకు సమర్థుడు అగును ? అది ఎరిగి ఎవరో యొకరు త్వరితముగా తమ అంగీకారము తెలుపుడు. అని వేదధర్మముని శిష్యులను కోరెను.

166. ఈ శిష్యుల నడుమనే ఒక డుండెను. అతని నామము 'సందీపకుడు' చూడుడు. అతడు తన గురునితో అతి వివేకముతో ఈ విధముగా పలుకసాగెను.

167. దీపకుడు తన పూజ్యగురునితో ఇట్లు పలికెను: పాపమును చేసినచో అది దేహమునకే (జన్మమునకే) నాశము కలిగించునంతగా ఉన్నచో దానికి తాము శీఘ్రముగా ప్రతీకారము చేసికొనుడు. చేసికొనక పోరకుంటిరో - దుఃఖములను సంగ్రహపరచుకొనినవా రగుదురు.

168. అదివిని వేదధర్మముని శిష్యుడగు దీపకునితో ఇట్లనెను: మనుష్యునకు వాని దేహము దృఢముగా ఉండగానే వాడు తన పాపమును క్షాళనము చేసికొనవలసి యుండును. లేనిచో విషప్రభావము వలెనే పాపప్రభావము కూడ వృద్ధినందును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

169. పాపమొనర్చి పాపి అగువాడు తాను తీర్థయాత్రలు చేసి కొని కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రత రూపములగు ప్రాయశ్చిత్తములను చేసికొని కాని తానే తన దేహముతో ఎరిగి ఆ పాపఫలమును అను భవించి ఆపాపమును తననుండి (అనగా తీర్థయాత్రలుకాని కృచ్ఛ్రచాం ద్రాయణాది వ్రతరూప ప్రాయశ్చిత్తములు కాని సుసుఖముగా విలాస ముగా కాక తానుచేసిన పాపపు బరువును ఎరిగి ఆపాపమును అనుభ వించుటతో సమానమగు క్లేశముల ననుభవించుచు ఆచరించినపుడే ఆపాపమునుండి జీవుడు ముక్తుడు అగునని తెలియుచున్నది.) విదలించు కొనిననేతప్ప తనకు ముక్తి లభించదు అనుట నిశ్చయము.

170. దేవశ్రేష్ఠులేకాని ఋషి ముని శ్రేష్ఠులేకాని మానవులు కాని జంతువులు మొదలగు తిర్యక్ప్రాణులు కాని తాము ఏదో రూపమున ఆ పాపపుఫలము తమకుతామై అనుభవించనిదే పాపమును క్షాళనము చేసికొనుట జరుగదు.

171. అనిన తన గురుని వచనములు విని సేవకు డతనితో ఇట్లు పలికెను: స్వామీ! తాము నాకు సెలవు ఇండు. ఏమియు సందే హించక నాశక్తికొలదిని తమసేవ చేయుదును చెప్పుడు.

172. దీపకుని వచనములు విని గురువు అగు వేదధర్ముడు తాను ఇట్లు పలికెను; వినుము; నేను అంగహీనుడగు కుష్ఠరోగిగా అంధుడుగా కుంటివాడుగా అయ్యెదను.

173. ఇట్టి స్థితిలో నేను ఇరువదిఒక సంవత్సరములు ఉందును. అంతకాలమును నీవు నన్ను మిగుల సంబాళించుకొనవలసి ఉండును. నీవు దృఢవ్రతుడవు (గట్టి పూనికతో ఈ పని చేయుటకు సిద్ధపడిన వాడవు.) అయినచో - అట్టి స్థితిలో మాత్రమే నీవు ఇందులకు అంగీ కారము తెలుపుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

174. దీపకుడు తన గురునితో ఇట్లనెను : తమకు మారుగ నేనే స్వయముగా హర్షపూర్వకముగా కుష్ఠరోగిగా అయ్యెదను. అంధుడను అయ్యెదను. (కుంటివాడను కూడ అయ్యెదను.) ఇట్లు ఏకవింశతి వత్సరములు ఉండి (అనుభవించి) పాప నిష్కృతి చేసెదను.

175. తమ పాపపు నిష్కృతిని నిశ్చయముగ నేను స్వయముగ చేసెదను. స్వామీ ! త్వరితముగ ఆజ్ఞ ఇండు. అని దీపకుడు తన గురుని పాదములపై వ్రాలెను.

176. శిష్యుని వచనములను విని వేదధర్ముని తాను తనలో సంతోషము నందెను. అత డతనితో ఇట్లు పలికెను : నాయనా ! నాకుగల ఆ పాపపు లక్షణములను విస్తారపూర్వకముగా పలికెదను.

177. నాయనా ! వినుము : ఎవరికిగాని తన పాపము తనదియే, (నా పాపము నాదియే,) అంతేకాని అది పుత్త్రశిష్యాదులది ఎన్నడును కాదు. నేనది నా స్వదేహముతో అనుభవించనిదే ఆ పాపము పోదు.

178. నాయనా ! దీపకా ! చూడుము. ఈ చెప్పిన కారణముచే నా పాపఫలమగు దుఃఖమును స్వయముగనే నే అనుభవింతును. ఆ ఇరువది యొక సంవత్సరముల కాలమును నన్ను నీవు సంబాళించుకొనుము. అంతమాత్రము చాలును.

179. చూడుము. ఎవరు రోగములచే పీడింపబడుచుందురో వారిని కనిపెట్టుకొని ఉండుటలో క్లేశము అధికముగా నుండును. అనగా నాయనా ! పాప దుఃఖ ఫలమును అనుభవించు నాకు కంటె నన్ను కనిపెట్టి చూచు నీకే దుఃఖము అధికముగను, అని ఎరుగుము.

180. ఈ కారణమున నేను స్వయముగ నా దేహముతో నా ఆ పాప దుఃఖ ఫలమును అనుభవింతును. ఇది నిశ్చితము. చూడుము : నీవు నన్ను కాశీపురికి తీసికొనిపోయి కనిపెట్టి చూచుకొనుచుండుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

181. ఇది తెలిసికొనుము. ఆ కాశీనగరమునందు నేను పాప ముక్తుడను అయ్యెదను. శిష్యోత్తమా ! నీ మూలమున నేను శాశ్వత పద (మోక్షస్థాన) మును పొందెదను.

182. అనగా విని దీపకుడు తన గురునితో ఇట్లు పలికెను. తప్పక నేను మిమ్ములను కాశీ నగరమునకు తీసికొనిపోవుదును. అచట తమకు ఏకవింశతి సంవత్సరములు సేవ చేసెదను. తాము నాకు విశ్వనాథునితో సమానులు.

183. బ్రహ్మ కలిపురుషునితో ఇట్లు పలికెను : ఆ గురుని శిష్యుడు ఎట్టివాడో విని తెలిసికొనుము. తన గురునకు కుష్ఠవ్యాధి కలిగిన వెంటనే అతనిని కాశీనగరమునకు తీసికొని పోయెను.

184. కలిపురుషా ! వినుము. అచ్చట మణికర్ణికా ఘట్టమునకు ఉత్తరదిశయందు కంబళేశ్వరుని సంనిధియందు ఆ గురుశిష్యులు ఇద్దరును నివసించుచుండిరి.

185. వారు ప్రతిదినమునను మణికర్ణికా ఘట్టమునందు స్నానము చేసెడివారు; శ్రీవిశ్వేశుని పూజ చేసెడివారు. పైనిచెప్పిన (కంబళేశ్వర సంనిధి) స్థానమునందు ఆ గురువు అగు వేదధర్ముని ప్రారబ్ధ భోగానుభవము జరుగుచుండెడిది.

186. ఆ గురువు కుష్ఠరోగముచే మిగుల వ్యాపితుడయ్యెను; నేత్రదృష్టి హీనుడయ్యెను. అతిదుఃఖితు డయ్యెను. అట్టి అతనికి గురువు అతిభక్తి పూర్వకముగా సేవచేయుచుండెడివాడు.

187. ఆగురుని దేహమునందు కుష్ఠము మిగుల వ్యాపించెను. చీమును క్రిములును రక్తమును వెలికి వచ్చుచుండెను; అతడు అత్యంతము దుఃఖముతో వ్యాపితుడయ్యెను. అపస్మారి (మూర్ఛవంటి తెరలు)- అశక్తత - కలవాడు.) కూడ అయ్యెను. అతనికి ఎట్టిబాధలు కలిగెనో తెలిసికొనుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

188. దీపకుడు అనునిత్యమును భిక్షాటనముచే ఆహారము అడిగి కొనితెచ్చి తన గురునికడకువచ్చి అతనికి అది ఇచ్చుచుండెడివాడు. ఈ గురుడే విశ్వనాథరూపుడు అనుచు ఏక (ఏకాగ్ర) భావముతో అతనికి పూజ చేయుచుండెడివాడు.

189. సహజముగ సాధుజనుడు కూడ రోగములచే పీడితు డగువో ఆ నరుడు క్రూరుడుగా అగును. అదేరీతిగ ఈ బ్రాహ్మణ శ్రేష్ఠుడగు వేదధర్ముడు కూడ తన దేహమున వ్యాపించిన వ్యాధుల బలముచే క్రూరుడుగా అయ్యెను.

190. ఒకదినమున దీపకుడు యథారీతిగ భిక్షాహారము తీసికొని రాగా శ్రీగురుడు కోపముచేసి అది తినకపోయెను. స్వల్పముగనే తెచ్చి తివి, అనుచు అది తినక విడిచివేసి భూమిపై పడవేసి శిష్యుని క్లేశ పరచెను.

191. మరియొక (మరుచటి) దినమున శిష్యుడు దీపకుడుపోయి అధిక పరిమాణములో ఆహారము భిక్షాటనముచే సంపాదించి తెచ్చెను. మృష్టాన్నము (మధురాహారములు) తీసికొనిరాకపోతివి కదా! అని ఆగురుడు అతనిని క్లేశపరిచెను. వినుము, ఇది ఎట్లున్నదో!

192. అట్లు అతడు మృష్టాన్నమును (మధురాహారమును) తీసి కొనిరాగా వివిధములగు పక్వాన్నములను (పిండివంటలను) ఏల తీసికొని రాకపోతివి? అని గురుడు కోపముపూని తాను అతని మీదకు పోయి కొట్టవచ్చెడివాడు. వివిధములగు శాకములు కావలెననియు కోరెడువాడు.

193. ఆ శిష్యుడు ఎన్ని ఎన్ని అడిగికొని తీసికొని వచ్చినను ఆ గురుడు అవి అన్నియు పాడుచేసి వ్యర్థపరచెడు వాడు, ఇంకను వినుము, కోపించి అతని పరిపరి విధములుగ తిట్టెడువాడు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

194. ఇట్లుండ - ఒకానొక సమయమున గురుడగు వేదధర్ముడు శిష్యుడగు దీపకునితో ఇట్లనెను; నాయనా! జ్ఞానరాశీ! శిష్యోత్తమా శిష్యశిఖామణీ! నాయీకాలమున నీవు చాల క్లేశ పడుచున్నావు.

195. అని ఇట్లు మెచ్చుకొనియు మరల అప్పటికి అప్పుడే ఇట్లు అనసాగెను; పాపీ! క్రూరుడా! నీవు నన్ను చాల బాధ పెట్టుచున్నావు. చీమును - మాంసమును మలమూత్రములను క్షణక్షణమును కడుగు చున్నావు కావు.

196. దీపకా! నన్ను ఈగలు తినివేయుచున్నవి. వాటిని ఏల నివారించవు? రాకుండ తోలవు? అనెను, సరేకదా యని అతడు ఆపనికి పూనగా భిక్షాహారము ఏల తీసికొని రావు? అనెను.

197. ఈ వేదధర్ముని వృత్తాంతమును దృష్టాంతముగా గ్రహించి ఈ హేతువుననే పాపమునకు ఫలములగు గుణములు ఇట్లే ఉండునని తెలిసికొనుడు. మంచిగుణములు ఏమాత్రమును లేని చెడుమాటలు పలుకుటయును పాపపు ఒకానొక రూపమే (పాప పరిణామమే) అని ఎరుగవలసి యుండును.

198. పాపము ఎచట (ఎవనియందు) అధికముగ ఉండునో అచట అది దీనత్వము మాత్సర్యము (ఒకరి గొప్పతనమును సుఖమును వృద్ధిని చూచి సహించలేకపోవుట) అను వానితోకూడి ఆ మానవునియందు నివసించును. ఒక సమయమందును ఇట్టి మానవుడు శుభాశుభములు (మంచి చెడుగులు) ఎరుగనే ఎరుగుడు. ఇట్టివారు అందరును పాప రూపులు (ఈ అవగుణములు అన్నియు పాపఫల రూపమయినవి) అని ఎరుగవలసియుండును.

199. ఎప్పుడయినను కానిమ్ము - ఇట్లు పాపఫలముగ దీనత్వము మొదలగు ఈ చెప్పిన దోషములు కలవానికి ఎటువంటి సుఖప్రాప్తి

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

అగునో చూడుము. ఎవనికి అపస్మారము అను వ్యాధికలుగునో వాడే పాపఫలరూపుడు అని ఎరుగుము.

200. ఇంతేకాదు; సమస్త రోగములును ఉన్నవి కదా ! నాయనా చూడుము; (ఆలోచించుము) అవి అన్నియు కలసినను కుష్ఠవ్యాధిలో పదునారవ పాలునకును సరిపోలవు; ఇది ఇట్లుండగా - నాయనా! వినుము; ఈ వేదధర్ముడు అను బ్రాహ్మణముని ఈ విధముగా ఇన్ని వ్యాధులతో వ్యథ పడుచుండెను.

201. కాని ఆశిష్యుడు ఇటువంటి తన గురుని గుణములను కాని దోషములను కాని మనస్సులోనికి కూడ రానిచ్చేవాడు కాడు. అతడే ఈశ్వరుడు అని భావించుచు ఏక (ఏకాగ్ర) మానసుడయి అత నికి సేవచేయు చుండెను.

202. ఆదీపకుడు ఎట్లు ఎట్లు భిక్షాటనముచే అన్నమును అడిగి కొని పరిపూర్ణ పరిమాణములో తెచ్చి ఇచ్చుచుండెనో అట్లు అట్లు ఆతడు ఈశ్వరుడు విష్ణుడును ఎటువంటివాడు అగునో గురుడును అటువంటివాడే అని తలచుచుండెను.

203. వారాణసివంటి (అంతటి) క్షేత్రమునందు ఉండుచుకూడ ఆదీపకుడు ఒకానొకప్పుడును ఏతీర్థమునకును యాత్ర చేయలేదు. తన గురునకు సేవచేయుటయే తప్ప మరి ఏదేవుని స్థానమునకును దొంగ చాటుగానైన యాత్రకే పోయియుండలేదు.

204. తీర్థయాత్ర చేయనక్కరలేదు. (దేవస్థాన) యాత్ర చేయ నక్కరలేదు. తన దేహయాత్రా యత్నమును చేయ పని లేదు. లోక యాత్ర (వ్యవహారము) తో పనియేలేదు. అహర్నిశమును తన గురుడే బ్రహ్మయు హరియును ఈశుడుచు అను బుద్ధితో ఆగురుని శరణుచొచ్చి ఆశ్రయించి ఉండువాడు అగుచో అట్టివానికి మరి ఇంకే దియు సేవింపవలసినది యుండదు. అని శాస్త్ర వచనము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

205. అట్లే ఈ దీపకుడును శిష్యోత్తముడు కావున ఎన్నడును తన దేహ సంరక్షణమును కూడ చేసికొనెడు వాడు కాడు; తన శ్రీగురు చరణములయందు లయము (నిమగ్నత) పొంది యుండెడివాడు; ఎవరి తోను మాటలాడెడివాడు కాడు.

206. ఈవిధముగా అహోరాత్రములును నిశ్చయముగ తన గురుడే బ్రహ్మయు విష్ణుడును త్రిపురారియు (ఈశ్వరుడును) అగును అని భావించుచు సేవ చేయుచుండెను.

207. గురుడు నిష్ఠురవచనములు పలికినను ఆ దీపకుడు తన మనస్సునందు సంతోషముతో ఉండెడివాడు. అతని మనస్సునందు ఎట్టి ఎట్టి భావము కనబడునో అట్లు అందులకు అనుగుణముగా నడచు కొనెడి వాడు.

208. చూడుము; ఇట్లు జరుగుచుండగా పినాకపాణి (పినాకము అను ధనుస్సు తన హస్తమందు గలవాడు - శివుడు) ప్రసన్నుడు అయి దీపకునిదగ్గరకు వచ్చి అతని సమ్ముఖమున నిలువబడెను. నీకు కావలసిన వరము కోరుకొనుమని పలికెను.

209. ఓయీ! గురుభక్తా! దీపకా! మహాజ్ఞానీ! కులదీపకా! ఉత్తమమగు నీ భక్తికి సంతుష్టుడను అయితిని. ఇపుడు వరము కోరు కొనుము అని శివుడు పలికెను.

210. దీపకుడు ఈశ్వరునితో ఇట్లనెను; హేమృత్యుంజయా! వ్యోమకేశా! (ఆకాశమే తన కేశములుగా కలవాడు) వినుము; నేను నాగురుని అడుగనిదే ఏవరమును గ్రహించను.

211. ఇట్లు అని ఆదీపకుడు తన గురునిదగ్గరకు పోయెను. అత డతనితో ఇట్లు మనవి చేసెను. అయ్యా! విశ్వనాథుడు నాయందు ప్రసన్నుడై వచ్చియున్నాడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

212. స్వాముల (తమ) సెలవు అయినచో తమవ్యాధికి ఉపశమనము వరముగా కోరెదను; సదాశివుల వరము లభించినచో తమకు మేలు అగును.

213. శిష్యుని వచనమును విని కోపించి గురువు ఇట్లు పలికెను. నా వ్యాధి (కి ఉపశమనము) నిమిత్తమయి ఈశ్వరుని ప్రార్థించకుము; నామాట అర్థము చేసికొనుము.

214. నామాట వినుము; ఓయీ! అనుభవించిననేతప్ప పాతకమునకు నివృత్తి లేదు. (అనుభవించక మరి ఏవిధముననైన నివృత్తి కలుగజేసికొనినచో) అది జన్మాంతరమునందు బాధించును. అని ఇట్టి ధర్మశాస్త్ర వచనము కలదు. అని ఎరుగుము.

215. ఎవని మనస్సునందు ముక్తి కావలెనను అపేక్ష ఉండునో వాడు తన పాపప్రవాహమునకు నివృత్తి కలిగించుకొనవలయును. అవగుణముల ఫలమగు ఆ పాతకము శేషమయి ఉండినచో - అది మోక్షమునకు విఘ్నమునే కలిగించును.

216. వినుము; ఈవిధముగా గురుడగు వేదధర్ముడు తన శిష్యుడగు దీపకునితో చెప్పెను. తన శ్రీగురుని సెలవు తీసికొని (తమ సెలవు చొప్పుననే చేయుదునని) శిష్యుడు మరల ఈశ్వరుని సమ్ముఖమునకు పోయెను.

217. పోయి అతడు ఈశ్వరునితో ఇట్లు అనెను : నాకు ఏవరము తోను పనిలేదు; నాగురుని మనస్సునందును తనకై వరముతీసికొనుట ఇష్టము కాకున్నది; కనుక నేను ఎట్లు వరము తీసికొందును ?

218. ఇదివిని వ్యోమకేశుడు (శివుడు) ఆశ్చర్యపడి నిర్వాణ (ముక్తి) మండపమునకు పోయెను. అచటికి సమస్త దేవతలను పిలిపించి విష్ణుని సమక్షమున ఈ వృత్తాంత మంతయు చెప్పెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

219. శ్రీ విష్ణువు శంకరునితో ఇట్లనెను : ఎటువంటి గురువు? ఎటువంటి శిష్యుడు? వారి నివాసస్థానము ఎచ్చటనున్నది? అంతయు ప్రకాశపరచి నాకు చెప్పుము.

220. ఈశ్వరుడు విష్ణునితో ఇట్లనెను : విష్ణూ! వినుము; నేను ఆశ్చర్య (కరమగు విషయ) మునే చూచితిని. దీపకుడు అను ఆ బాలుడు అపూర్వమగు ఎటువంటి గురుభక్తి (గురుసేవ) చేయుచున్నాడు!

221. గోదావరీతీరవాసి యగు వేదధర్ముడు అను తాపసుడు ఉన్నాడు. ఈ దీపకుడు అహర్నిశములును ఏక (ఏకాగ్ర) చిత్తుడై భావము (భావశుద్ధి) తో అతనికి సేవచేయుచున్నాడు.

222. అంతటి దృఢనిశ్చయముతో గురుభక్తి (గురుసేవ) చేయువానిని ఎవ్వనిని నేను ఇదివరకు వినియుండలేదు; చూచి యుండలేదు. ఆతనిని చూచి నా మనస్సునందు అత్యంతమగు ప్రీతి ఏర్పడి యున్నది.

223. విష్ణూ! వినుము; వరము ఇత్తును; అని నేను అతని దగ్గరకు వెళ్ళి యుంటిని. అపుడు ఏమిజరిగినదో వినుము; తన గురుని అనుమతిలేదని అతడు వరమును గ్రహించకున్నాడు.

224. మహర్షులును అనేక సహస్ర దివ్యవర్షముల కాలము అహర్నిశములును నానా క్లేశములును పడి తపస్సు చేయుదురు. తుదకు వరములు కోరుదురు.

225. అటువంటి తాపసులకును యోగులకును వరము ఇచ్చుటకు నాకు మనస్సు కలుగదు; అయినను బలాత్కారమున ఇత్తును; ఇట్లుండ ఆ దీపకుడు వరము ఇత్తుననగా గ్రహించుటలేదు. ఎటువంటి ఆశ్చర్యకర విషయము!

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

226. అతడు తన తనువును (శరీరమును) మనస్సును తన గురువునకు సమర్పించి సంతోషపూర్వకముగా తపము చేయుచున్నాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అను త్రిమూర్తులును గురుడే యని అతడు తన మనస్సునందు నిశ్చయముచేసికొని యున్నాడు చూడుము.

227. సమస్త దేవతలును తల్లియు తండ్రియు గురుడే యగును; వేరు అనును. అతడే పరమాత్ముడు; అని ఇట్లు అతడు తన చిత్తమునందు నిశ్చయము చేసికొని యున్నాడు.

228. అతనిని నేను ఎంతయని వర్ణింతును? వినుము; అవిద్య (అజ్ఞానము) అను అంధకారమునకు దీపము అతడు; అతడు కులదీపకుడు. (తనవంశమును ప్రకాశింపచేయువాడు) కావుననే అతనికిగల దీపకుడు అను నామము సత్యమై (సార్థకమయి) యున్నది.

229. ధర్మమును జ్ఞానమును సర్వమును గురుడు ఒక్కడే; అనుచు దీపకుడు భక్తితో తనగురుని చరణసేవను మనః పూర్వకముగా చేయుచున్నాడు.

230. ఇంతయును విని శార్ఙధరుడు (శార్ఙము - అను ధనువు ధరించువాడు - విష్ణువు) ఆ శిష్యుని గురుని చూచుటకై పోయెను. అంతట అతడు అచ్చట ఆశిష్యుని భక్తి ప్రకారమును చూచినవాడయ్యెను.

231. విశ్వనాథునిచేత చెప్పబడినదాని కంటెను ఇంకను చాల అధికముగా కూడ మంచిలక్షణములు దీపకునియందు శ్రీమహావిష్ణువునకు కనబడెను. వినుము; దీపకుని విషయమునందు సంతుష్టుడై శ్రీవిష్ణువు ఇట్లు పలికెను.

232. హృషీకేశుడు (విషయేంద్రియములకు అధిపతి - హృషీక–ఈశుడు) దీపకుని పిలిచి ఇట్లు చెప్పసాగెను: 'నీభక్తికి సంతుష్టుడను అయితిని. వరము కోరుకొనుము.' అనెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

233. దీపకుడు విష్ణునితో ఇట్లనెను : అయ్యా ! వినుడు; నాకు గల ఏభక్తినిచూచి మీరు నాకు వరము ఇచ్చుచున్నారు ? దానితో మీకు అగు పనిఏమి ? నాకు తెలుపుడు.

234. అరణ్యవాసు లగు మహామునులు ఎందరో సహస్రకోటి దివ్యవర్షముల కాలము తపమాచరించు చుందురు. వారియందును మీరు ఉదాసీనత (ఉపేక్షాభావము) వహించుచుందురు. నారాయణా! అట్టివారికిని మీరు వరమీయకుందురే !

235. నేను అయిననో ! మిమ్ము సేవించుచున్నవాడను కాను; మీ నామస్మరణము కూడ నాయొద్దలేదు. చూడుడు; వచ్చి బలాత్కారమున నాకు ఎందులకు వరము ఇచ్చుచున్నారు.

236. దీపకుని వచనములను విని మహా విష్ణుడు సంతుష్టుడు అయ్యెను. చూడుము; ఆ దీపకుని ఉద్దేశించి అతడు ఇట్లు విస్తార పూర్వకముగా చెప్పెను.

237. దృఢభక్తి నిశ్చయ భావముతో శ్రీగురుభక్తి (శ్రీగురు సేవ) చేయుచున్నావు; ఇందుచేతనే నేను సంతుష్టుడనయితిని; నీవు ఏ గురుభక్తి (శ్రీగురుసేవ) చేయుచున్నావో - అదియే నీవు మమ్ము లను పొందునట్లు చేసినది.

238. ఎవరు ఎవరు శ్రీగురుభక్తులు అయి ఉందురో వారే వారే నాకు ప్రాణములు అగుదురు.; అని ఎరుగుము. నేను స్వయ ముగా వారికి వశ్యుడను అగుదును. వారు ఏమి ఏమి కోరుదురో - అవి అవి నేను వారికి ఇత్తును.

239. కొందరు తమ మాతాపితరుల సేవ చేయుదురు; ఆసేవయే నన్ను చేరును; స్త్రీలు తమ పతికి సేవ చేయుదురు; ఆసేవయే నన్ను చేరును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

240. ఎవ్వరు అయినను ఉత్తములగు బ్రాహ్మణులను కాని యతులను కాని యోగీశ్వరులను కాని తాపసులను కాని భక్తితో నమస్కరింతురు; ఆనమస్కారములే నన్ను చేరును; అని ఎరుగుము.

241. ఇటువంటి శ్రీమహావిష్ణుని వచనములను విని దేవకుడు ఆయనకు నమస్కరించినవా డయ్యెను; ఇంకను ఇట్లు మనవి చేసెను; అది చెప్పెదను వినుము; అని సిద్ధుడు ద్విజునితో (బ్రాహ్మణునితో - నామధారకునితో - ఈ గ్రంథకర్త యగు సరస్వతితో) పలికెను.

242. శ్రీ మహావిష్ణూ! హృషీకేశా! వినుము; నా మానసమునందు ఇట్టి నిశ్చయ భావము ఉన్నది; ఏమి అనిన - వేదములను శాస్త్రములను పురాణములు మొదలగువానిని మీమాంసాది విద్యలను నాకు మా శ్రీగురువులే ఇత్తురు.

243. మాకు సర్వవిధములగు సర్వజ్ఞానములును మా శ్రీగురువులనుండియే లభించును. త్రిమూర్తులును మాకు అధీనులు అగుదురు. మాకు సర్వదేవులును శ్రీగురువులే; నాకు వారు మరియొకవిధమగు వారు కారు; అని ఎరుగుము.

244. సర్వదేవులును సర్వతీర్థములును మాకు మహాగురువులే అయి ఉన్నారు; ఇది సత్యము. మాకు పరమార్థమును వారిచేతనే లభ్యము అగును; అది మాకు దూరమునందు ఎట్లు ఉండును? చెప్పుము.

245. సమస్త యోగులును సిద్ధజనులును గురువు ఉన్ననే తప్ప జ్ఞానవంతులు కారు; జ్ఞానము (శ్రీగురుకృపచే) కలిగినంతనే స్వయముగ ఈశ్వరుడే ఐనను ఎట్లు దూరమందుండును? నాకు చెప్పుము.

246. మీరు నాకు ఏమివరము ఇత్తురో అది శ్రీగురువులును ఇస్తురు, అనుట ఏమిఆశ్చర్యకరము? వినుము: ఈకారణమున నేను నా శ్రీగురుపాదులనే సేవించుచున్నాను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

247. శ్రీమహావిష్ణువు సంతోషించి ఇట్లనెను : ధన్యుడవు - ధన్యుడవు, శిష్య శిరోరత్నమా! నాకు ప్రాణమవు నీవే, నాకు నిర్వ్యాజభక్తుడవు నీవే.

248. నీవు ఏదయినను సరియైన వరము కోరుకొనుము. సర్వథా (ఎల్లవిధముల - తప్పక) ఆవరమును ఇత్తును. మొదట నీ కడకు విశ్వనాథుడు వచ్చియుండెను. తరువాత రెండవవాడనుగా నేను వచ్చితిని, స్వయముగా నిన్ను (నీ యోగ్యతను) చూచితిని.

249. నా మనస్సు సంతుష్టమయినది. నీ మానసమునందు ఏది యున్నదో ఆవరమును కోరుకొనుము. నేను నీకు వశ్యుడను అయితిని. ఏది కావలయునో అది ఇపుడు నేను నీకు ఇత్తును.

250. అనగా విని దీపకుడు శ్రీమహావిష్ణునితో ఇట్లనెను: తాము నాకు వరము ఇచ్చుచో నా మానసము నందు గురుభక్తి అధికము కావలయును. అదేవిధముగ శ్రీగురువిషయకమగు జ్ఞానము కూడ అధికము కావలయును; నాకు ఈ వరములను ఇండు.

251. నేను స్వయముగ గురుస్వరూపమును తెలిసికొన (గలుగ) వలయును. అందులకు అనుకూలించు జ్ఞానము సుఖలభ్యము కావలయును. ఇంతకుమించి నేను మరి ఏమియును కోరను. అని దీపకుడు శ్రీమహావిష్ణుని చరణములందు వ్రాలి అవి స్పృశించెను.

252. అంతట శార్ఙ్గపాణి (శ్రీమహావిష్ణువు) దీపకునకు ఆవరములను ఇచ్చెను. సంతోషించి ఈవచనమునుకూడ పలికెను : శిష్య శిరోమణీ! దీపకా వినుము: నీవు నాకు ప్రాణ (సమానప్రియ) సఖుడవు అయి ఉన్నావు.

253. నీవు శ్రీగురువులను (శ్రీగురు తత్త్వమును) తెలిసికొందువు. ఆగురుడే పరబ్రహ్మ (తత్త్వ) మును దృష్టితో చూచెదవు.

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ఇంకను మరియొక విషయము; నీవు నన్ను అడుగుచో చెప్పెదను, ఏక (ఏకాగ్ర) చిత్తుడవు అయి వినుము.

254. లౌకికమగు ఉత్తమ బుద్ధితో చేయు ఎటువంటి విచారణ రీతి కలదో - దాని ననుసరించి చూచినను ధర్మాధర్మ తత్త్వమును ఎరిగిన ఉత్తమ విచారణ పూర్వకమగు మనస్సుతో చూచినను శ్రీగురుడే ఉత్కృష్టమగు వాని అన్నిటికంటె ఉత్కృష్టమగు తత్త్వము అని ఎరిగి ఆ శ్రీగురువులను స్తుతి చేయుచుంతుము.

255. ఏ ఏ సమయమునందు నీవు భక్తితో శ్రీగురువులను స్తుతి చేయుదువో - ఆయా సమయమందెల్లను ఆస్తుతిచే నేను సంతుష్టుడను అగుదును. ఏలయన ఆగురుస్తుతియే నా స్తుతి, అని తెలిసికొనుము.

256. సాంగములుగా (వేదాంగములతోను వేదమందలి విష యమును సరిగా గ్రహించుటకు సహాయపడు శాస్త్రములతోను కూడ) వేదములను జనులు అధ్యయనము చేయుచుందురు. వారు అహర్నిశ ములను భక్తితో వేదాంత భాష్యములను అధ్యయనము చేయు చుందురు. ఇది అంతయు వారు తాము నిశ్చయముగ నన్ను పొంద వలయును అనియే చేయుచుందురు.

257. కాని - వేదప్రోక్తములగు సిద్ధాంతములు ఇట్లు చెప్పు చున్నవి. గురుడే పరబ్రహ్మము అని అవి అనుచున్నవి. ఈకారణము ననే నీవు గురుని సేవించుచుండుటచే సర్వదేవులును నీకు వశ్యులగు దురు. (చున్నారు.)

258. 'గురు' అను రెండు అక్షరములును అమృతపు సముద్రములు అని ఎరుగుము. వాని నడుమ మునిగిన తత్క్షణముననే * తాప

* తాపత్రయము : 1. ఆధ్యాత్మికములు (శరీర సంబంధులు); 2. ఆధిభౌతికములు (పృథివ్యాదిభూతముల - ప్రకృతి - నుండి సంభవించునవి); 3. ఆధిదైవికములు - అని మూడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

త్రయమును ఎట్లు ఉండును ? (ఎంతమాత్రమును మిగులక ఆ తాపములు శాంతించును ) ఇంకను చెప్పెదను వినుము.

259. ఎవరి హృదయమునందు శ్రీగురు స్మరణము ఉండునో అతడే త్రైలోక్య ప్రాజ్యుడు; అని ఎరుగుము. ఈ శ్రీగురుస్మరణము సదా ఉండెడిదియు సగుణమును (సకల సద్గుణ సహితమును) అగు అమృతపానము. అట్టి శిష్యుడే అమరుడగును.

260. ఎపుడు నరులకు నా యనుగ్రహమో శివానుగ్రహమో బ్రహ్మానుగ్రహమో బ్రాహ్మణానుగ్రహమో, కలుగునో అపుడే వారిచే సద్గురుడు స్మరింపబడును. శ్రీగురుని స్మరించవలయునను మతి కలుగుటకును భగవత్ కృపయు విప్రానుగ్రహమును కావలయును.)(శ్లో.)

261. తా. నేను కాని ఈశ్వరుడు కాని బ్రహ్మ కాని ఎవరయినను వరము ఇచ్చినపుడే దాని ఫలముగా గురుడు లభించును. ఈకారణముచేతనే గురుడు త్రిమూర్తి రూపుడు.

262. విష్ణుడు దీపకునకు ఇటువంటి వరమును ఇచ్చెను; వినుము; అని బ్రహ్మదేవుడు కలియుగాధిష్ఠాత్ర పురుషునితో పలికెను. ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి ఇంకను వినుము.

263. (విష్ణునివలన) వరమును పొంది దీపకుడు శ్రీగురు సమ్ముఖమునకు పోయెను... శిష్యా ! వినుము; ఆగురుడగు వేదధర్మ మునియును తన శిష్యుడగు ఆ దీపకుని ఇట్లు ప్రశ్నించెను.

264. కులదీపకా! శిష్యా ! వినుము; నీకు వినాయకుడు (శ్రీమహావిష్ణువు) ఏమి ఇచ్చెను ? ఆ మంచివార్త నాకు విస్తారపరచి చెప్పుము; అది విని నా మనస్సు స్థిరము (నెమ్మదిపడినది) అగును.

265. అనవిని దీపకుడు తన శ్రీగురునితో ఇట్లు అనెను : అవును; హృషీకేశుడు నాకు వరము ఇచ్చెను; నాకు గురుభక్తి కావలయును; అని ఇటువంటి వరమును నేను కోరితిని. (అతడు అది ఇచ్చెను.)

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

266. తత్పరత్వముతో శ్రీగురుని సేవ చేసిన వో తత్ఫలముగా అంతఃకరణము దృఢమును నిర్మలమును అగును; అను విూచరణముల యందు దృఢమగు భక్తిని నా విషయమున సంతుష్టుడయిన శ్రీహరి నాకు వరముగా ఇచ్చెను.

267. గురుడగు వేదధర్మ మునియును తన శిష్యుడు వచించిన ఈ విషయమంతయు యథార్థమే యని తన యోగదృష్టిచే సాక్షాత్క రించుకొని సంతుష్టుడై తన ఆ శిష్యుని విషయమున ప్రసన్నుడయ్యెను. అతడు ఇట్లనెను : నాయనా! నీవు నీ జీవితమునందు స్థిరుడవు (దీర్ఘా యుష్మంతుడవు) అగుము. కాశీపురియందు వాసము చేయుము.

268. నీ వాక్యమునందు సర్వసిద్ధులును నిలుచును. నీ ద్వారము నందు * నవనిధులును నిలుచును. విశ్వనాథుడు నీకు స్వాధీను డగును. అని ఆగురుడు సంతోషముతో అనెను.

269. ఎవడు నీ స్మరణము చేయుదురో - వారి క్లేశములు నివా రణమునందును. భవత్స్మరణ మాత్రము చేతనే వారు శ్రీయుక్తులయి ఆనందింతురు.

270. శిష్యా! నామధారకా! వినుము. ఈవిధముగా ఆ గురుడు తన శిష్యుని విషయమున ప్రసన్నుడు అయ్యెను. ఆ వేద ధర్ముడు తత్ క్షణమునందే దివ్యదేహు డయ్యెను.

271. తన శిష్యుని అంతఃకరణమునందలి భావమును పరీక్షించు టకొరకై ఆ గురుడగు వేదధర్ముడు కుష్ఠియును ఆవ్యాధిచేత క్లేశ వంతుడును అయ్యెను. ఏలయన ఆ తాపసుడు అతి విశిష్టుడు, అటు వంటివానికి దేనికి సంబంధించినపాపము ఉండును ?

* నవనిధులు : 1. మహాపద్మము; 2. పద్మము; 3. శంఖము; 4. మకరము; 5. కచ్ఛపము; 6. ముకుందము; 7. కుందము; 8. నీలము; 9. ఖర్వము

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

272. అట్లు ఏపాపములును లేని పవిత్రమూర్తి అయి యుండి యును ఆ వేదధర్మముని లోకములను అనుగ్రహించుటకొరకే ఈనెప ముతో కాశీక్షేత్రమునకు వెళ్లియుండెను.

వాస్తవస్థితిలో కాశీక్షేత్రమహిమ ఇటువంటిదిగా నున్నది. ఏమనిన - అందు ఉన్నవారికి సహస్రజన్మములయందు ఆర్జించిన పాప ములయినను తొలగిపోవును.

273 .ధర్మాసక్తులే కానిమ్ము, అధర్మాసక్తులే కానిమ్ము, నరు లెవ్వరయినను ఆ కాశీనగరమునందు ఏ సమయమునందైనను - ఎక్కడ నయినను వాసము చేయుదురో - అట్టివారికి పునర్జన్మముండదు.

274. ఇట్లు కలియుగాధిష్ఠాతృ పురుషునకు బ్రహ్మదేవుడు వేదధర్మముని శిష్యుడగు దీపకుని ఆఖ్యానమును చెప్పి వినిపించెను. అని సూతుడు నైమిశారణ్యవాసులగు ఋషి (ముని) శ్రేష్ఠులకు చెప్పెను; వినుము.

275. అని సిద్ధుడు నామధారకునితో ఇంకను ఇట్లు పలికెను. ఇటువంటి లక్షణములుకలిగి నరుడు దృఢమనస్కుడుగా ఉండవల యును. ఈ విధమగు గురుభక్తికలిగి ఉండవలయును. అట్లయినచో మానవుడు భవార్ణవమును (సంసారసాగరమును) తరించనే తరించును.

276. (శ్లో.) ఎప్పుడు ఏమహాత్మునకు దేని (ఎవరి) యందు దేని (ఎవరి) యందు దృఢమగు భక్తి యుండునో - దాని (వారి) యందు దాని (వారి) యందు మహాదేవుడు (శివుడు - పరమాత్ముడు) ప్రకాశమును (సాక్షాత్కారమును) పొందును.

277. (తా) ఎవనియొద్ద - అనగా - ఎవని అంతఃకరణమునందు * త్రికరణశుద్ధి పూర్వకముగా దృఢభక్తి ఉండునో అతడే ఈశ్వరుని పొందును, ఈశ్వరుడు అతనికి వశగతు డగును.

---

* త్రికరణశుద్ధి : మనస్సు - వాక్కు - శరీరము, ఇవి త్రికరణములు.

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

278. గంగాధరుని కుమారుడు (అగు సరస్వతి) ఇట్లనుచు శ్రోతలకు నమస్కారము చేయుచున్నాడు. ఈ నా • బోసినోటి మాటలను న్యూనములు (కొరతకలవి – దోషయుక్తములు) అనికాని పూర్ణములు (నిండినవి – గుణవంతములు అని కాని అనకుందురుగాక!

ఇది పరమకథా కల్పతరువయి సిద్ధనామధారక సంవాదరూపముగ ప్రవచింపబడిన శ్రీనృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు శిష్య దీపకాఖ్యానము అను ద్వితీయాధ్యాయము.

---

• బోసినోటిమాటలు – ప్రాకృతభాష భారతీ బాల్య భాషితము – అవి పెద్దల వచనము. ఇచట శ్రీగురుచరిత్ర గ్రంథకర్తయు 'సరస్వతి' యే; ఇతడు తన ఈ రచన తన బోసినోటిమాటలు అనుచున్నాడు. అనగా తనది ప్రాకృతభాషా రచనయని ఎవరును అనాదరము చేయకుందురు గాక ! ఒకవేళ దీనిని ఆదరించకున్నను నేను చింతించను. అని భావము.

# శ్రీ గు రు చ రి త్రా మృ త ము

## తృ తీ యా ధ్యా య ము

శ్రీ గణేశాయ నమః శ్రీ సరస్వత్యై నమః శ్రీ గురుభ్యో నమః

1. ఈ విధముగా సిద్ధముని శిష్యదీపకాఖ్యానము విస్తారపూర్వకముగా చెప్పిన వాడయ్యెను. అదివిని నామధారకుడు (సరస్వతి) సంతోషించి మరల ఇట్లని విన్నవించెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ॥**

2. సిద్ధమునీ ! జయ - జయ, నన్ను ఈ భవార్ణవము (సంసార సాగరము) నందుండి తరింపజేయు తారకుడవు నీవు, ఇంతవరకును నా మనస్సునందు సందేహము ఉండెడిది. నీవు నేడు అది తొలగించితివి.

3. నీచే నేడే నేను సర్వస్వమును పొందితిని. ఆనంద జలమునందు మునిగితిని. పరమార్థతత్త్వమును సంపాదించుకొంటిని.

4. ఇటువంటి శ్రీగురు మహిమమును తన్మహిమ స్వరూప జ్ఞానమును నాకు మీరు ప్రతిపాదించితిరి. స్వామీ ! మీ ధర్మమా ! అని నా మనస్సు ఆనందవంతము అయినది.

5 అనునిత్యమును తమ నివాసము ఏ స్థానమునందు ? మీ ఆహారము ఎచ్చట ? ఇపు డికమీదట మీదాసుడను అయ్యెదను. అని నామధారకుడు సిద్ధముని చరణములపై వ్రాలి ఆ చరణకమలములను స్పృశించెను.

6. కృపానిధియగు సిద్ధముని ఆశిష్యుని ఆలింగనము చేసికొని ఆశీర్వచనము ఇచ్చి తన వృత్తాంతము అతనికి ఇట్లు చెప్పెను.

7. ఏ ఏ స్థానమునందు శ్రీగురువులు ఉందురో - ఆ స్థానము నందెల్ల నేను మమకారముతో (నివసింతును.) ఉందును. నా ఆహార (విషయ)ము అడుగుదువో అను నిత్యమును గురుస్మరణమే (నా ఆహారము అని) ఎరుగుము.

8. శ్రీ గురుచరిత్ర మహిమము ఉన్నదే ! అదియే (దానిని మననము చేయుటయే) నాకు అమృతపానము; దీని (ఈ శ్రీగురు మహిమమునకు సంబంధించిన) సద్గుణములనే సదా సేవించు చుందును. అని సిద్ధముని తనకడనున్న శ్రీగురుచరిత్ర పుస్తకమును నామధారకునకు చూపెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

9. ఈ శ్రీగురుచరిత్రమును వినినప్పుడు (వినినచో) భుక్తియో ముక్తియో పరమార్థమో - ఆర్తుడయి తన మనస్సునందు ఏది ఏది కోరునో అది యెల్ల త్వరితముగా సాధ్యమగును.

10. ఈ శ్రీగురు చరిత్రమును వినినంతనే ధనార్థియగు వానికి అక్షయమగు ధనమును పుత్రపౌత్రాదికమగు ధన సంపత్తియును గోధనాది వివిధములగు ధనములును వీని అన్నిటిని మించి మరియొక మహాఫలము ఏమనిన కథాశ్రవణము చేసిన తత్క్షణముననే జ్ఞానసిద్ధియును అగును ! అని ఎరుగవలయును.

11. మనుష్యలోకమునందలి ఏ మానవుడు భక్తితో ఈ శ్రీగురుచరిత్రమును ఒకదిన సప్తకముపాటు పఠించునో - వినునో - అట్టి వానికి తత్కాలముననే వాని కామ్యములు నెరవేరును; పుత్రహీనులు పుత్రవంతులు అగుదురు.

12. గ్రహపీడకాని రోగపీడకాని వ్యాధికాని ఇది వినువారికి ఎన్నడును ఎక్కడను కలుగదు అని ఎరుగుము. మనుష్యుడు బంధనమునందు ఉన్నచో ఇది వినినచో త్వరితముగా అది వదలును.

13. విశ్వాసముతో ఈ కథను వినువారు జ్ఞానవంతులును దీర్ఘాయుష్మంతులును అగుదురు. ఏక (ఏకాగ్ర) చిత్తులయి వినునెడల బ్రహ్మహత్యాది పాపములును నశించును.

14. సిద్ధుడు చెప్పిన ఇంతయును విని నామధారకుడు (సరస్వతి) ఆసమయమున ఆసిద్ధునికి నమస్కరించి ఇట్లనెను : స్వామీ ! కృపానిధీ ! సిద్ధమునీ ! నన్ను తరింపజేయుము, తరింపజేయుము.

15; నాకు జగజ్జ్యోతిర్మయ స్వరూపులును సాక్షాత్ శ్రీ గురు స్వరూపులును అగు తాము లభించితిరి; మీదర్శనము ఒసగితిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

శ్రీగురుచరిత్రమును వినవలయును; అని నా చిత్తమునందు ఇచ్ఛకలిగి యున్నది.

16. ఎప్పుడైనను ఎవడైనను మార్గస్థుడయిపోవుచు ఉండు నప్పుడు దప్పికచే పీడితుడుకాగా వానికి అమృతమును తెచ్చి ఇచ్చినచో ఎట్లుండునో అట్లు మీరు నాకు (శ్రీగురు చరిత్రమును వినిపించుటకై) లభించితిరి. (తమదర్శనము ఒసగితిరి.)

17. చెవులార శ్రీగురువుల మహిమమును వినవలయునని కోరుచున్నాను. స్వామీ ! నాకు అది విస్తరించి చెప్ప ప్రార్థించుచున్నాను. అంధకారముతో నిండిన రాత్రిని సూర్యోదయమువలె తాము నన్ను ప్రకాశమయునిగా చేయుడు.

18. ఇట్లు నామధారకుడు (సరస్వతి) పలికిన సమయమున (పలికినంతటనే) సిద్ధయోగి అతనికి అభయప్రదానము చేసెను. ఆమహానీయుడు అతనిని తమ ఎడమచేతితో పట్టుకొని తనవెంట తీసికొని తాను ఉండెడి (స్వ) స్థానమునకు పోయెను.

19. భీమా-ఉమరజానదుల సంగమప్రదేశమున భీమరథీ (భీమా) నదీతీరమున (ఈ రెండునదులును సంగమించిన తరువాత ఏర్పడిన నదికి భీమా (భీమరథీ) నది యని వ్యవహారము.) ఎటువంటిస్థానము జ్ఞానమార్గానుయాయులకు ఆశ్రయమయి యుండునో అటువంటి ఆశ్రమస్థానము - ఒకటి కలదు. అందు కల్పవృక్షముతో సమానమగు అశ్వత్థవృక్షము కలదు. దాని ఆశ్రయమునందు కూర్చుండి ఆ సిద్ధయోగి నామధారకునకు జ్ఞానోదయకరములగు వచనములను ఈ విధముగా పలికెను.

20. శిష్యుడవగు నామధారకా వినుము. నీవు గురుసేవా ప్రకారమును సరిగా ఎరుగవు; ఈ కారణముచేతనే నీకు మానసిక శారీరక బాధాకరములగు చింతలును క్లేశములును ఏర్పడుచున్నవి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

21. శ్రీ గురుమూర్తి స్వరూపమును నీవు సాక్షాత్కరించు కొనవలయును అనినచో నీవు పాటించవలసిన ఆచరణములను తెలిపె దను; వినుము; నీవు నీమానసమునందు దృఢభక్తిని నిలుపుకొనినచో మరి అప్పుడు శ్రీగురువులను సాక్షాత్కరించుకొందువు.

22. సిద్ధయోగి పలికిన వచనమును విని నామధారకుడు మిగుల సంతోషించెను. జాలిగొలుపు మాటలు పలుకుచు క్షణక్షణ మునకు వంగి (మరల మరల ఆసిద్ధయోగికి) నమస్కరించెను.

23. అయ్యా ! నేను ఇంతవరకును తాపత్రయము (ఆధ్యాత్మి కములు-ఆధిదైవికములు-ఆదిభౌతికములు అనెడి మూడు విధములగు తాపములనెడు జలప్రవాహముతో నిండిన సంసారసాగరమునందు మునిగియుంటిని. క్రోధము మొదలగు (అరిషడ్వర్గమునకు చెందిన ఆరు) దోషములు అనెడు జలచరముల (తిమింగలములు మొదలగు వాని) చే భక్షింపబడుచుంటిని. అజ్ఞాన జాలము (అజ్ఞానము అనెడు వల) చే చుట్టబడియుంటిని.

24. తాము నన్ను జ్ఞానము అనెడు పడవయందు కూర్చుండ బెట్టి శమ దయ అనెడు గాలి వీచునట్లుచేసి (నా) దేహమును 'తారక' మునుగా (పడవను నడపి నదులను సముద్రమును దాటుట కుపయో గించు సాధనము - తెడ్డుగా) చేసి - స్వామీ - నన్ను తరింప జేయుడు.

25. అని ఇట్లు పలికి నామధారకుడు (సరస్వతి) సిద్ధుని హృద యమునందు తన విషయమున దయ కలుగునట్లుచేసి మనవి చేసెను. అంతియకాక అతడు అంతట తనమస్తకమును సిద్ధుని చరణములయందు సలిపెను వాడ ఉయ్యేను.

26. అపుడంతట ఆ సిద్ధముని నామధారకుని ఓదార్చి లేవనెత్తి ఈవిధముగా పలికెను: నాయనా ! నీ మనస్సునందు ఏమియును చింత

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

పెట్టుకొనకుము. ఇపుడు ఇక నేను నిన్ను ఇంతవరకును బంధించి యుంచిన సంకెలలను వదలింతును.

27. ఎవనికి దృఢభక్తి యుండదో - వాడు సర్వదా దీనదశ నొందుచు క్లేశములను అనుభవించుచు ఉండును. కాని ఆ విషయమున నిందమాత్రము శ్రీగురువులపై నిలుపును. అవిద్యామాయ (అజ్ఞానమును - దాని మూలమున కలిగిన మాయయును) తనపై చుట్టుకొనినందుననే అతడు ఇట్లు చేయును.

28. నీవు నీ మనస్సునందు సంశయము పెట్టుకొని - శ్రీగురువులు నాకు ఏమి ఇత్తురు ? అనుచున్నావు. ఈ గుణపు (దోషపు) ప్రభావముచేతనే ఈభోగమును (క్లేశానుభవమును) అనుభవించుచున్నావు. నానాచింతలతో వ్యాకులితుడ వగుచున్నావు.

29. సంశయమును విడిచి నిశ్చయమును నీ చిత్తమున నిలుపుకొనుము. అపుడు శ్రీగురుమూర్తి అపారమగునది (బ్రహ్మానందమును) ఇచ్చును. శ్రీగురువులు సహజముగనే కృపాసాగరులు. వారు నిన్ను సర్వథా (ఏవిధముగను - ఎంతమాత్రమును) ఉపేక్షచేయరు.

30. శ్రీగురుమూర్తి కృపాసముద్రులు; వేదాంత శాస్త్రముచే లభించు జ్ఞానమునందు ఈ అంశము ప్రఖ్యాతమయి యున్నది. నీ అంతఃకరణమునందు వారి (శ్రీగురువుల) చరణములపై నిలుకడ ఉన్నది; అనుకొనుము. (అది ఉన్నచో) నీకు ఏకొరతయును ఉండదు.

31. అఖిల భూలోకమునందు (ఉండు సకలప్రాణులకు) శ్రీగురువులు దాతలు (అయి అన్ని కోరికలను తీర్చువారు.) మేఘపు గుణము ఎటువంటిదో చూచుచునే యున్నావు కదా ! పర్జన్యుడు (మేఘుడు) సర్వప్రదేశములయందును (సమానముగా) పడును, (వర్షముపడునట్లు చేయును.) శ్రీగురువులును ఇటువంటి కృపామూర్తిఅయి యున్నారు.

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

32. ఐనను ఆవిషయమునందే ఒక విషయమును చూడుము! ఏమియనిన - శ్రీగురుకృప కూడ పాత్రానుసారముగనే ప్రవర్తిల్లును; ఇందు ఒక బలమగు సాక్ష్యము (దృష్టాంతము) చెప్పెదను. పల్లపు నేలయందు మాత్రమే నీరు నిలుచును; ఎత్తుప్రదేశములయందు నీరు నిలువదు; ఇది నీకును తెలియును కదా !

33. పల్లపునేల ఎట్టిదియో అటువంటిది దృఢభక్తి. దాంభికభక్తి అనునది ఎత్తుప్రదేశము; అని నీవు ఎరుగుము; ఈ కారణముచే నీవు నీ మానసిక వాచిక కాయిక కర్మముల (వర్తనముల) తో శ్రీగురువులు పరమ కృపాళురు అను విషయమును నిశ్చయించుకొనుము; (ఆ నిశ్చయముతో వారిని సేవించుము.)

34. కావున శ్రీగురువులకు (ఎవరితో కాని దేనితో కాని) పోలిక (యున్నదనగలమా ?) ఏలయన శ్రీగురువులు తమ హస్తమును తన శిష్యుని మస్తకముపై కృపాపూర్వకముగా ఉంచిన వో ఆశిష్యునకు ప్రపంచము పరబ్రహ్మమే యగును. (అజ్ఞానకృతమగు మాయాఽఽవరణము తొలగినందున ప్రపంచము ప్రపంచముగా కాక దానికి * అధిష్ఠానమగు

---

* అధిష్ఠానము : ముత్తెపుచిప్పనుచూచి ఒకడు 'ఇది వెండి' అను కొనెను. అచ్చట వాస్తవముగనున్నది ముత్తెపుచిప్ప; ద్రష్ట (చూచువాడు) అది వరకు తాను చూచియుండిన "వెండి" గా దీనిని భ్రమించు చున్నాడు "ఇది ముత్తెపు చిప్ప" యనివానికి తెలియదు. ఇచ్చట "ఇది" అను పదమునకు రెండర్థములు కనబడుచున్నవి. * తెలియని ముత్తెపుచిప్ప (2) తోచుచున్న వెండి అని రెండర్థములు. ఇచట ద్రష్టకు తెలియక మరుగుపడిన "ముత్తెపుచిప్ప" అధిష్ఠానము. అట్లే వాస్తవముగ "బ్రహ్మము" మాత్రమే అగు పరమార్థ తత్త్వమును మాయావశమున "ఇది బ్రహ్మము" అని తెలియక ఇది ప్రపంచము అని సంసారి అనుకొనుచున్నాడు. ఇచట పైఉదాహరణము ననుసరించి "బ్రహ్మము" "అధిష్ఠానము" అని ఎరుగవలెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

పరబ్రహ్మముగానే సాక్షాత్కృతమగును. ఇటువంటి మహామహిమము ఎవరికి కలదు.

35. శ్రీగురువులకును కల్పవృక్షమునకును పోలిక పెట్టుదమా ? (మాయా) కల్పితములగు ప్రాపంచిక పదార్థములను లభింపజేయుట దాని మహిమము; అట్లు మాయాకల్పితములు కానివానిని లభింపజేసి కోరికలను పూరించు (తీర్చు) కామధేనువు శ్రీగురువే.

36. శ్రీ గురువులు ఇటువంటి వారనియు సాక్షాత్పరబ్రహ్మ రూపులు అనియు శ్రుతులయందును స్మృతులయందును ప్రఖ్యాతులయి యున్నారు. కావున నీవు సంశయములను విడిచి ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి శ్రీగురువుల పాదపద్మములను ధ్యానించుము.

37. నామధారకుడు (సరస్వతి) సిద్ధముని పలికిన ఇంతమాత్రపు వచనములను విని ఒక క్షణకాలము అతనిని నమస్కరించి తన రెండు చేతులను సంపుటముగా పట్టుకొని ఆసిద్ధయోగితో ఈవిధముగా మనవి చేసెను.

38. శ్రీగురూ ! సిద్ధా ! యోగీశ్వరా ! కామధేనురూపా ! కృపాసాగరా ! తమ చరణ ధూళిని సేవించువాడనగు నేను ఒక విషయము మనవి చేయుచున్నాను; శ్రద్ధగా వినుము.

39. స్వామి (యగు తమ) చేత సకల విషయమును నిరూపింప (సవిస్తరముగ తెలియజేయ) బడినది. నా మనస్సు నిర్మలము అయినది. ఇపుడు ఇక శ్రీగురువుల చరిత్రము వినవలయును అను దృఢమగు కుతూహలము మాత్రము ఏర్పడియున్నది.

40. శ్రీగురువులు త్రిమూర్తి రూపులు అని నా చెవులార విని యుంటిని. వారు మనుష్య లోకమున ఏల అవతరించిరి ? అదియంతయు విస్తరించి నాకు చెప్పవలసినదిగా మిమ్ము వేడుచున్నాను. అనుచు నామధారకుడు (సరస్వతి) సిద్ధుని చరణములపయి వ్రాలెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

41. అపుడు మరల సిద్ధయోగీంద్రుడు ఏమి అనెను ? శిష్యా ! పూర్ణచంద్రసమానుడా ! ఎంత ఆనందకరమగు విషయము. నీవు నాకు జ్ఞానసముద్రుడవు; నీ ప్రశ్నముచే నా జ్ఞానసముద్రము అంతయు జ్ఞానామృతముతో నిండినది. నీ ప్రశ్నముతో నా మనస్సు ఎంత ఉత్సాహముతో నిండినది అనుకొనుచున్నావు ! (ఎంతయో ఉత్సాహముతో నిండినది.)

42. నీచే మహాసుఖము పొందబడినది. నీవుచేసిన శ్రీగురు సేవ ఫలించినది. నీవు ఇపుడు ఇక ఈ నాటి (ఈక్షణము) నుండియే పరబ్రహ్మ తత్త్వమును అనుభవించితివి.

43. నేను ఇంతవరకును సకల భూమండలమునందును సంచరించుచు వచ్చుచున్నాను. ఎవ్వనికిని ఇటువంటి మతి కలుగలేదు. శ్రీగురుచరిత్రమును ఎవరును అడుగరు. నేను నేను నిన్ను (ఒక్కనినే ఇట్టివానిని) చూచితిని.

44. ఎవనికి ఇహ పర సుఖములయందు ఇచ్ఛకలదో - వానికి ఈ కథ సుచికరముగ నుండును. అట్టివారు మనస్సు - వాక్కు - శరీరము అను త్రికరణములను దృఢములుగా (మరి ఏ ఇతర విషయముల మీదకును పోనివానిగా) చేసికొని ఏక (ఏకాగ్ర) చిత్తులయి ఈ శ్రీగురుచరిత్రమును వినుడు.

45. నీవు శ్రీగురువుల విషయమున కేవల (నిర్వ్యాజ) భక్తుడవు. అందువలననే నీకు ఇట్టి ఉన్నతమగు బుద్ధి కలిగినది. నేను పలుకుచున్న ఈ వచనము నిశ్చితమయినది. అని ఎంచుము. నీవు ధర్మము అర్థము కామము మోక్షము అనెడు నాలుగు పురుషార్థముల (వలన మహాఫలము) లను పొందెదవు.

46. ధన ధాన్యాది సంపత్తియు పుత్త్ర పౌత్త్రాదులును ధృతి (క్లేశములు కలిగినను మనస్సు చలించకుండుట) యును స్మృతి (కర్తవ్

స్మరణ యోగ్యత) యును ఇహలోక సౌఖ్యములును శతసంవత్సరాయువును అంతమునందు ఉత్తమ గతియును నీకు లభించును; అని ఎరుగుము.

47. ఏలయన - శ్రీగురుచరిత్రము కామధేనువు (వంటిది.) ఈ మాట వేదశాస్త్ర సమ్మతమయినది; అని ఎరుగుము. త్రిమూర్తి రూపమగు సాక్షాత్ పరబ్రహ్మ తత్త్వము కలియుగమున నరరూపము ధరించి అవతారము నందెను.

48. భూమికి గల భారమును దింపుటకును భక్తజనులను తరింపజేయుటకును హరి హరులు ఈ కార్యనిర్వాహణమే కారణముగా అవతారరూపులయి వచ్చుచుందురు.

49. సిద్ధుడు పలికిన ఈవచనమును విని శిష్యోత్తముడు అగు నామధారకుడు (సరస్వతి) సిద్ధయోగిని ఇట్లు ప్రశ్నించెను. త్రిమూర్తి రూపమగు పరబ్రహ్మము ఏకారణమున మానుష్యలోకమున మానుష దేహమును ధరించి అవతారమును అందెను ?

50. ఆ విషయము అంతయు నాకు విస్తారపూర్వకముగా దయతో తెలుపుడు స్వామీ ! అని దీనవచనములు పలుకుచు నామధారకుడు సిద్ధుని చరణములపై వాలెను.

51. అంతట సిద్ధుడు నామధారకుని (సరస్వతి) తో ఇట్లు పలికెను. నాయనా ! వినుము; త్రిమూర్తులనియును మూడు వేరు వేరు గుణములు; ఆదివస్తువగు పరతత్త్వము తాను ఒక్కటియే; ప్రపంచ ప్రవృత్తికై ఏర్పడిన అతని మూర్తులు మాత్రము మూడు అని తెలియుము.

52. ఈ మూడు మూర్తులలో బ్రహ్మ దేవునిది రజోగుణము; విష్ణువు సత్త్వగుణప్రధానుడు; ఉమా రమణు డగు రుద్రుడు తమో

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

గుణ ప్రధానుడు; ఇంతమాత్రమున వీరు మువ్వురును పరస్పరము భిన్నులు కారు; మూలతత్త్వమున ఇందరును ఒక్కటియే ఆయా గుణ ములు ప్రాధాన్యము వహించి ఉద్రిక్తములయినపుడు ఆయా మూర్తులు తమ తమ ఆయా కార్యములు నిర్వహించుచుందురు, అని మాత్రము నిశ్చయముతో నుండుము.

53. బ్రహ్మదేవుడు సృష్టిని రచించుటకు ఏర్పడినమూర్తి; విశ్వ మును పోషకుడు శ్రీమహావిష్ణువు; ప్రళయము (సృష్టి తత్త్వములను ప్రకృతియందు ఏకత్వమునందించుట) జరుపునది రుద్రమూర్తి (సి [illegible]చిన పరతత్త్వము); ఇట్లు త్రిమూర్తులకుగల మూడు (సత్త్వ రజ స్తమో) గుణములు ప్రపంచ ప్రవృత్తికి సంబంధించిన మూడు కార్య ములను నిర్వహించుటకు సాధనములుగా నున్నవి.

54. వారు మువ్వురును ఒకరినివిడిచి (ఒకరికంటె భిన్నులయి) మరియొకరు ఉండరు : ఆయా కార్యములను నెరవేర్చు నిమిత్తమయి ఈ త్రిమూర్తి సమష్టియగు పరమేశ్వరుడు అవతారమునందును; భూమికిగల భారమును తొలగించును; ఇట్లని ఈవిషయము శ్రుతి స్మృతి పురాణముల యందు ప్రసిద్ధమయి యున్నది.

55. ఇపుడు ఈ విషయము సాక్ష్యము (ప్రమాణము - దృష్టాం తము) తో తెలిపెదను. అంబరీషుడు అను ద్విజుడు (సూర్యవంశజు డగు క్షత్రియుడు) ద్వాదశీవ్రతము కారణముగా విష్ణువు అవతార ములు ధరించుటకు హేతువయ్యెను. (విష్ణుచే అవతారములు ధరింప జేసెను.)

56. అట్లు (శ్రీమహావిష్ణువు) అవతారములు (ధరించినవాడు) అగుటకు హేతువు నీకు విస్తారపూర్వకముగా చెప్పెదను. మనస్సును సావధానముగా నొనర్చుకొని ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

57. ఆ ద్విజుడు (సూర్యవంశజ క్షత్రియుడు) ద్వాదశీవ్రతమును అనుష్ఠించుచుండెడు వాడు. ఆ వ్రతసందర్భమున అభ్యాగతులను పూజించు చుండెడువాడు. అతడు దృఢవ్రతుడయి శ్రీవిష్ణువే పరమదైవతము అని నిశ్చయము చేసికొని సర్వకాలము లందును హరి చింతనము చేయుచుండెను.

58. అతని ఇటువంటి వ్రతానుష్ఠానమునకు భంగము కలుగజేయుటకై ఒకానొక ఋషి వచ్చెను. దుర్వాసుడను ఆ ఋషి ఆ ద్వాదశీవ్రతమునకు అతిథిఅయి (అభ్యాగతుడయి) ఆ అంబరీషుని కడకు వచ్చి చేరెను.

59. "సాధన ద్వాదశి" అగుటచే ఆ దినమునందు సూర్యోదయానంతరము ద్వాదశీ తిథి ఒక గడియమాత్రమే ఉండెను. అటువంటి ఆదినమున కారణికుడై (జరుగనలసియున్న దైవిక ఘటనమునకు హేతుభూతుడయి) ఆ అతిథి అట్లు వచ్చెను. ఇది ఎట్లు ఘటిల్లెనో కదా అని అంబరీషునకు భయముతో కూడిన ఆదరము కలిగెను.

60. ఆఋషి వచ్చెను అనునది చూచి అంబరీషుడు అతనిని అభివందనముచేసి అర్ఘ్యమును (సర్వవిధములగు పూజా ద్రవ్యములను) పాద్యమును ఇచ్చి ఆ యా ఉపచారములతో ఆ దూర్వాసునకు పూజ చేసెను.

61. అంబరీషుడు ఆ దుర్వాస ఋషితో ఇట్లు మనవి చేసెను. ఇది సాధన ద్వాదశి అగుటచే ఇప్పుడిక ఒకగడియ వరకు మాత్రమే ద్వాదశి తిథి ఉన్నది. తాము తమ అనుష్ఠానమును త్వరలో ముగించి శీఘ్రము మే భుజించుటకై రావలయునని ప్రార్థించు చున్నాను.

62. ఆ ఋషి నదికి పోయి విధిపూర్వకముగా అనుష్ఠానము చేసికొనెను. అతనికి ఆ అనుష్ఠానమునందు తడవు అగుచుండగానే సాధనద్వాదశీ సంబంధి అగు ఆ ఒకగడియయును ముగియ వచ్చెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

చరణములను పట్టుకొనెను. ఆ మహావిష్ణునకు భక్తవత్సలుడు (భక్తుల యందు వాత్సల్యము కలవాడు.) అను బిరుదము కలదు. అని నీవు (ను) ఎరుగుదు (ఎరుగుదువు కదా !)

69. శ్రీమహావిష్ణువు దుర్వాసునితో ఇట్లు పలికెను : నీవు నాభక్తుని శపించితివి. నేను నాదాసుని రక్షింతును. నీవు అదే శాపమును నాకు ఇమ్ము.

70. దూర్వాసుడు సామాన్యుడు కాడు; అతడు జ్ఞానియగు ఋషీశ్వరుడు; ఆతడు కేవలము ఈశ్వరావతార రూపుడు. ఇక ముందు శ్రీమహావిష్ణువు ఈ భూమికి గల భారమును తొలగించుటకు ఈ శాపము హేతువు అగుచున్నది కదా ! (అగునుకదా !) అని అతడు తనలో అనుకొనెను.

71. జ్ఞాని శిరోమణి యగు ఆ మహర్షి తనలో ఇంకను ఇట్లు అనుకొనెను : ఈ భూలోకమునందలి మానవులు యుగములకొలది కాలము తప మాచరించు చున్నారు. అయినను వారికి అప్పటికిని శ్రీహరి చరణముల దర్శనము ప్రాప్తము అగుట లేదు - అది వారికి ఈ భూమిపై దుర్లభ మగుచున్నది.

72. కాని నేను అతనిని శపించినచో ఈశాప సంబంధముచే సమస్త భక్తజనులను తరింపజేయు నిమిత్తముయి ఈ మహావిష్ణువు లక్ష్మిని తనవెంట తీసికొని అవతరించి భూలోకమునకు వచ్చును.

73. పరోపకార నిమిత్తముయి ఈ శ్రీమహావిష్ణువునకు శాపము ఈయవలసి యున్నది. భూమికి గల భారము తొలగించుటకు ఉపాయము ఇదియే అగుచున్నది. అనియు దూర్వాసు డనుకొనెను.

74. ఇట్లు తన మనస్సునందు విచారణచేసికొని దుర్వాసుడు విష్ణునితో ఇట్లు పలికెను : నీవు భూమియందు అవతరించి నానా స్థానముల యందు జన్మింపవలసినది.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

75. నీవు అట్లు పదిమారులు అవతరించి ప్రసిద్ధుడవగుదువు; కాని ఇవికాక అన్నింటికంటెను పయిదియును దేశకాలములకు అతీతమును అగు అవతారము పూర్ణ బ్రహ్మ రూపము; సహజముగనే నీవు విశ్వాత్ముడవు; (సకల ప్రపంచరూపుడవు;) సకల సూక్ష్మ పదార్థముల యందును నీవే వసించుచున్నావు.

76. లోకములకు తండ్రి యగు శ్రీమహావిష్ణువు ప్రపంచ ప్రవృత్తిని నిర్వహించు మహాకార్యమునకు హేతువయి దుష్టులను నిగ్రహించుటకును శిష్టులను అనుగ్రహించుటకును అనుకూలించు ఈశాపమును అంగీకరించెను.

77. అనంతరూపుడగు నారాయణుడు ఇట్లు పది అవతారములను ధరించెను. అను కథను నీవు వినియే యుందువు; ఈ కథలు అన్నియును శ్రీమహాభాగవతమునందు విస్తార పూర్వకముగా ప్రతిపాదింపబడి యున్నవి.

78. మహాకార్య నిర్వహణమునకు హేతుభూతములగుచు ఈ అవతారములు జరుగుచుండును. అని ఒకప్పుడు ఒక చోట ప్రకటముగా జరుగును. మరియొకప్పుడు మరియొక చోట గుప్తము (రహస్యము) గా జరుగుచుండును. బ్రహ్మజ్ఞానులు మాత్రమే అవి ఎరుగుదురు. మూఢ జనులు ఏమి ఎరుగుదురు ?

79. ఇది కాక ఇంకను మరియొక విషయము నీకు చెప్పెదను. ఇది సహజముగనే వినోద (కుతూహల) జనకము అగు విషయము అయి ఉన్నది. అత్రి మహామునికి భార్యయు పతివ్రతా శిరోమణియు అగు అనసూయ అను నామె కలదు (కదా !)

80. ఆమె ఇంటియందు త్రిమూర్తులును జన్మమునంది అవతరించిరి. ఇది ఎట్లు జరిగెను - అని - ఆ త్రిమూర్తులును కపట వేషము ధరించి వచ్చిరి. వారే ఆమెకు పుత్త్రులు అయిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

81. అనగా విని నామధారకుడు (సరస్వతి) సిద్ధు నిట్లు ప్రశ్నించెను: మీరు నాకు వినోద (కుతూహల) కరమగు కథను చెప్పుచున్నారే: త్రిమూర్తులగు దేవులు (ఆమెకడకు) కపట వేషులై వచ్చిరి; (ఆమెకు) పుత్త్రులు అయిరి. అనుచున్నారే? ఇది ఎట్లు?

82. మొదట అత్రి ఋషి ఎవరు? ఆముని ఎవరినుండి ఉత్పన్నుడయ్యెను? వీరికి మూలపురుషుడు ఎవరు? విస్తార పూర్వకముగా నాకు చెప్పుము.

83. (ఇట్లు నామధారకుడు అడుగగా అతనికి తెలిపిన) అనంతర కథా విస్తారమును సరస్వతీ గంగాధరుడు (గంగాధరుని పుత్త్రుడగు సరస్వతి) చెప్పెను; అది వినినంతనే మనోహరమయి యొప్పును. వినువారికి సకలాభీష్టములను సిద్ధింప జేయును.

ఇది పరమ కథా కల్పతరువయి సిద్ధ నామధారక సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీ నృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీ గురుచరిత్రామృతమునందు అంబరీష వ్రత నిరూపణము అను తృతీయాధ్యాయము.

సంఖ్య - 83

# శ్రీ గురు చరిత్రామృతము

## చతుర్థాధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీసరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః

1. ఇటువంటి శిష్యుని మనవిని విని సిద్ధయోగి ఏమి చెప్పుచున్నాడు? నీ భక్తి సాధు - సాధు; (మిగుల మెచ్చదగినది; మిగుల మెచ్చదగినది.) నీవు శ్రీగురుచరణములయందు ప్రీతిని పొందితివి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ఏర్పడిన బుద్ధ్యాది సూక్ష్మతత్త్వముల సమష్టి నాశ్రయించిన సర్వజీవ సమష్టి అథవా ప్రథమ జీవుడు హిరణ్యగర్భుడు అను నామము పొందెను. ఈ అవ్యక్త తత్త్వాత్మకమగు బ్రహ్మాండము ఆ అవ్యక్త దశలో ఒక దివ్య వర్ష కాలము ఉండెను.

7. నాయనా! శృణుము; (వినుము) అటు తరువాత ఆ బ్రహ్మాండమే బ్రద్దలుఅయి రెండుశకలములు (ముక్కలు) అయ్యెను; ఆ రెండు శకలములును ఒకటి ఆకాశముగాను (ద్యులోకము) - మరియొకటి భూమిగాను అయి నిలిచెను.

8. రజోగుణ ప్రధానుడుగా ఉత్పన్నుడయి(న) బ్రహ్మ దాని (ఆ బ్రహ్మాండమునందు) నుండి చతుర్దశ భువనములను దశదిశలను మనస్సును వాక్కును కాలమును కామక్రోధాది సకల తత్త్వములను నిర్మించెను.

9. ఇక తరువాత జరుగవలసిన సృష్టిని రచించుటకై ఆబ్రహ్మ సప్త మానసపుత్త్రులను సృష్టించెను. ఆ ఏడుమంది బ్రహ్మ (మానస) పుత్త్రుల నామములను) చెప్పెదను వినుము.

10. మరీచి - అత్రి - అంగిరసుడు - పులస్త్యుడు - పులహుడు - క్రతువు - వసిష్ఠుడు - అను శ్రేష్ఠులగు సప్త పుత్త్రులు జనించిరి. వీరి కందరకును సృష్టి కర్త (తండ్రి) ఆదిబ్రహ్మ భగవానుడే; అని జ్ఞప్తియందుంచుకొనుము.

11. ఈ ఏడుమంది పుత్త్రులనడుమ యందును అత్రి అను ప్రజాపతినుండియే శ్రీగురుపీఠ పరంపర ఆరంభమగుచున్నది. ఈ విషయమును వినగలుగుచున్న నీవు - నామధారకా! - అదృష్టవంతుడవు. అది అంతయు ఎట్లు జరిగెనో చెప్పెదను; ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

26. అనసూయాదేవి గుణములు ఎట్టివో (పరీక్షించి) చూచుటకై త్రిమూర్తులును భిక్షుకుల వేషము ధరించిరి అభ్యాగతులయి అత్రిమహా మున్యాశ్రమమునకు వచ్చిరి.

27. (ఆసమయమున) అత్రిఋషి అనుష్ఠానము చేసికొనుటకై పోయియుండెను. త్రిమూర్తులును తాము వచ్చి అనసూయను వేడుకొన వచ్చిరి. మేము నీకడకు అతిథులము అయి వచ్చితిమి. (మాకు ఆతిథ్యము ఇమ్ము.) అని ఆమెను వారు బ్రతిమాలుకొనిరి.

28. బ్రాహ్మణులము. మేము ఆకలిచేత మిగుల పీడితులము అయి వచ్చియున్నాము. ఓ పతివ్రతా ! త్వరితముగా మాకు అన్నము పెట్టుము. నీవు కాదు, అనినచో మరియొక చోటికి పోవుదుము.

29. హే అనసూయే ! మీ ఆశ్రమమునందు సదా అభ్యాగతులకు సంతర్పణము జరుగుచుండును. అను మీ విఖ్యాతమగు కీర్తిని విని యుంటిమి. అందువలననే మేము ఇపుడు నీకడకు వచ్చితిమి.

30. నీవు ఇచ్ఛాభోజన దానమును (ఎవరు ఏది ఎట్లు కావలెనని కోరినచో అది అట్లు ఇచ్చుచు అన్నదానమును చేయుట) చేయుదువు అని మేము నీవిషయమున వినియుంటిమి. ఇదే సంకల్పముతో - ఇచ్ఛా భోజనమును అడుగుటకే - నిశ్చయముచేసికొని వచ్చియున్నాము.

31. వారు పలికిన ఇంతటి మాటలను విని అనసూయాదేవి అతి వినయనతియై నమస్కారము చేసెను. వారు కూర్చుండుటకు ఆసనము మొదలగునవి ఇచ్చి కూర్చుండజేసి వారిపాదములను క్షాళనము చేసెను.

32. ఆమె వారికి గంధాక్షత పుష్పములతో కూడ అర్ఘ్యము పాద్యము ఇచ్చి వారందరతోను హర్ష పూర్వకముగా "మీరు భోజనము చేయ సంసిద్ధులు అగుడు" అనెను.

33. అపుడు ఆ అతిథులు ఇట్లు అనిరి. మేము స్నానము (అను ష్ఠానము మొదలగునవి) ఆచరించియే వచ్చి యున్నాము. అత్రిఋషి

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

ఇంకను చాలసేపటికి వచ్చును (అనుకొందుము.) కనుక మాకు త్వరితముగా భోజనము పెట్టుము (పెట్టవలసినది.)

34. అతిథుల అభిప్రాయముగురుతించి ఆ పతివ్రత (అగు అనసూయ)ఏమిచేసెను? (ఏమిచేసెనో తెలియునా ?) త్వరితముగా వారికి పీటలు విస్తళులు మొదలగునవి వేసెను. వారినచ్చట కూర్చుండ జేసెను.

35. ఆమె వారిని పీటలమీద కూర్చుండ జేసి నేతితో పాత్రాభిఘారము చేసెను; అంతట ఆ ఇల్లాలు అనసూయాదేవి శాకములు పాకములు తీసికొని (వడ్డించ) వచ్చెను.

36. అపుడు వారు ఆమెతో ఇట్లు అనిరి : ఓ ఇల్లాలా ! మేము ఎంతయో దూరమునుండి అతిథులుగా వచ్చి యున్నాము. నీవు రూపమున చాల సుందరివిగా ఉండుట చూచి మా మానసమునందు మరి యొక అభీష్టము ఏర్పడియున్నది.

37. వినుము; నీవు నగ్న (వివస్త్రవై) మాకు అన్నము వడ్డించ వలసియుండును. అది నీవు కాదు అనినచో మేము మరియొకచోటికి పోయెదము. ఈ విషయమున ఏమి చెప్పెదవో చెప్పుము.

38. ఆ అతిథుల మాట విని ఆ అనసూయాదేవి ఆలోచనము చేసెను. ఈ విప్రులు నా మనస్సు పరీక్షించి చూచుటకు వచ్చి యున్నారు. వీరు బహుశః కారణ పురుషులు అయి ఉండవచ్చును.

39. ఆ పతివ్రతా శిరోమణి తన అంతఃకరణమునందు ఇట్లు విచారణము చేసికొనెను : అతిథులు (మా విషయమున) విముఖులయినచో మాకు తపోహాని యగును. (ఇది నా పతి ఇచ్చిన ఆజ్ఞకు విరుద్ధము.) పతి ఆనతిని ఏల ఉల్లంఘింతును ?

40. నా మనస్సు నిర్మలమయి యున్నది. (అట్లు ఉన్నంతవరకు) (ఎంత) దుష్టుడు (అయినను) మన్మథుడు తాను నన్ను ఏమిచేయును?

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

నాపతి సంపాదించిన తపఃఫలము (నాకు తోడుగ) ఉన్నయెడల అదియే నన్ను రక్షింపజేయును. అని ఆమె తనలో తాను అనుకొనెను.

41. ఆమె తన మానసమునందు ఇట్లు ఆలోచించి వారితో "తథాఽస్తు" "అట్లే కానిండు" అనెను. స్వచిత్తానుసారము (మీ చిత్త సంకల్పము ననుసరించి - స్వస్థత - నెమ్మది తనముతో - నిండిన చిత్తము కలవారయి) భోజనము చేయుడు. నేను నగ్న (వివస్త్ర) నై వడ్డింతును, అనెను.

42. ఆమె తాను పాక స్థానమునకు (వంటఇంటిలోనికి) పోయి తన పతిచరణములను చింతనచేసెను. తన వస్త్రములను వదలివేసి నగ్నురాలు అయ్యెను. ఈ అతిథులు నా బాలురే అని ఆమె భావించెను.

43. శృణుము; (వినుము) ఆ సతి (పతివ్రతయగు అనసూయ) నగ్నురాలుఅయి అన్నోదకములను తీసికొని వచ్చెను. అప్పుడు వారే (అతిథులు అగు త్రిమూర్తులే) బాలకులు అయిరి. ఆ పీటలపయిని వారు (పొరలియాడుచు) ప్రాకాడు చుండిరి.

44. అనసూయ ఆ బాలకులను చూచి భయచకితురాలు అయి మరల వస్త్రములను ధరించి ఆ బాలకుల దగ్గరకు వచ్చెను.

45. ఆ మూవురు బాలురును రోదనము చేయుచుండిరి. అనసూయ వారిని ఒకరి తరువాత నొకరినిగా మాటి మాటికీ ఊరకుండ బెట్టుచుండెను. పాపము వీరు కేవలము క్షుధార్తులు (ఆకలితో బాధ నొందుచున్నవారు.) అయి ఉన్నారు. అని వారిని ఆమె తన (ఒడిలోనికి) తొడమీదికి తీసికొనెను.

46. ఆమె ఆ బాలకులను తనఒడిలోనికి తీసికొని హర్షముతో వారికి స్తన్యపానము ఇచ్చుచుండెను. ఒకరినివదలి (ఒకరికి ఐన తరు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

వాత) మరియొకరికి ఆమె అట్లు క్షుధా నివారణము (ఆకలి తీర్చుట) చేయసాగెను.

47. ఆశ్చర్యకరమగు సంఘటనము ఏమి సంఘటిల్లెనో చూడుము నామధారకా! త్రిమూర్తులే (అంతటి వారే) బాలకులు అయిరే! స్తన్యపానమాత్రముతోనే వారి ఆకలి పోయెనే! పతివ్రతకు గల తపఃఫలము ఇటువంటిదియే.

48. ఎవరి ఉదరమునందు పదునాలుగు భువనములును సప్త సముద్రములును వాని యందలి బడబాగ్ని (బడబా అనగా ఆడు గుఱ్ఱము;) దాని మూతి రూపున మహా సముద్రాంతర్భాగమున నుండు అగ్ని బడబాగ్ని (ఇది ఈకాలమునందును పసిఫిక్ మహాసముద్రమునందు ఉన్నది.) యును ఇమిడి యున్నవో - అట్టివారి క్షుధా నివారణము పతివ్రతా స్తన్యపానమాత్రముతో అయ్యెను.

49. ఏ మహానుభావుని కృత్యము అహర్నిశలును సృష్టిరచన సేయుటయో - అట్టి చతుర్ముఖబ్రహ్మకును ఆకలి స్తన్యపాన మాత్రముతో ఏవిధముగా అయ్యెను.

50. ఫాలాక్షుడు (నుదుటియందు కన్ను గలవాడు) కర్పూర గౌరుడు (కర్పూరమువలె తెల్లనివాడు) పంచముఖుడు * అగు కాలాగ్ని రుద్రుడును సుందరియగు అనసూయ ఇచ్చిన స్తన్యమును త్రాగెను. ఆహా! అత్రి మహర్షి ఇట్టి తపస్వికదా!

51. అనసూయాదేవి ఇటువంటి అత్రిమహామునికి రమణి (ఆనందకరురాలగు భార్య.) ఇట్టి ఆమె మరియొకతె ఎవతె ఉండును?

---

* పంచముఖుడు ; 1 తత్పురుష 2 అఘోర 3 సద్యోజాత 4 వామదేవ 5 ఈశాన.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

ఆమె త్రిమూర్తులకు జనని ఆయెను. త్రిభువనములందును విఖ్యాతు రాలు అయ్యెను.

52. ఆసమయమందు ఆమె ఆ మూవురను బాలకులను ఒడి లోనికి తీసికొని ఆడించసాగెను. బాలకులను ఊయలలో వేసి జోల పాటలు పాడెను.

53. ఆమె ఉపనిషదర్థ ప్రతిపాదకములగు జోలపాటలను మిగుల నేర్పుతో ఎంతో ఉల్లాసముతో సప్తస్వర ప్రస్తార విన్యాసములతో నానావిధములగు జోలపాటలను పాడి త్రిమూర్తులను సముదాయించ సాగెను.

54. ఇవి ఇంతయు జరుగు సమయమునకు అతిథి సమయమగు మధ్యాహ్న వేళ అయ్యెను. అత్రిఋషియు నిర్మలమగు మనస్సుతో తన ఆశ్రమమునకు వచ్చెను.

55. అతడు అంతట ఇంటిలోనికి వచ్చెను. చూచెను. అపు డాతడు అనసూయ పాడుచుండుటయు చూచెను. ఈ బాలకులు ఎక్కడివారు ? అని ఆమెను అడిగెను.

56. ఆమె అతనికి జరిగిన వృత్తాంతము అంతయు చెప్పెను. ఆ ఋషియు తన తపోజ్ఞానముతో ఇది చూచెను. వీరు త్రిమూర్తులే అనెను. తాను వారికి నమస్కారము చేసెను.

57. చూడుము; అత్రిమహర్షి నమస్కారము చేయగా విష్ణు వును, పినాకపాణియగు మహాదేవుడును, చతుర్ముఖుడును సంతోష మును ఆనందమును చెందిరి. వారి వారి విషయమున ప్రసన్నులయిరి.

58. బాలురు (గా) ఊయలల యందే ఉండిరి. వారు తమ తమ మూర్తులతో ఆ దంపతుల సంముఖమున నిలిచిరి. అత్రిఋషీ ! పతివ్రతయగు అనసూయా ! బాగు ! బాగు !

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

59. మీ భక్తితో మేము సంతుష్టుల మయితిమి. ఏది కోరుదువో ఆవరము అడుగుడు; అని వారు వారితో ననిరి. అత్రియు తన సతితో. - నీవు ఇపుడు ఏది ఇచ్ఛగించుచున్నావో అది వారిని కోరుకొనుము - అనెను.

60. అనసూయ అత్రితో. ఇట్లు అనెను. (మీరు) నీవు నాకు ప్రాణేశ్వరుడవు (లు) అయి ఉన్నావు (రు) నీ భక్తితోనే ఈ ముగ్గురు దేవులు వచ్చియున్నారు. నీవు (మీరు) ఇపుడు వారిని పుత్త్రిలను వరముగా కోరుము (డు)

61. ఈ మువ్వురు బాలకులును మన ఇంటియందు మన పుత్త్రిల వలె (పుత్త్రిలుగా అయి) ఉండవలయును; త్రిమూర్తులును ఏక రూపులును అయి (మనఇంట) ఉండవలయును. మీరు నిశ్చితముగ ఈ వరమునే కోరుకొనవలయును.

62. ఇటువంటి అనసూయా వచనములను విని త్రిమూర్తులును దంపతులకు వరమును ఇచ్చిరి. మా అంశముతో రూపొందిన ఈ బాలురు ఇచ్చట ఇట్లే ఉందురు. అని పలికి వారు తాము తమ ఆవాసములకు వెడలి పోయిరి.

63. అట్లు త్రిమూర్తులును ఆమె ఇంట ఉండిపోయిరి; అనసూయయు వారిని తన పుత్త్రిలుగా పోషించెను. వినుము; ఆమె ప్రీతిపూర్వకముగా వారికి * త్రివర్ణముల నామములు ఉంచెను.

64. బ్రహ్మాంశసంభవుడగు బాలుడు "చంద్రుడు" అను నామము కలవాడయ్యెను. విష్ణ్వంశ సంభూతుడగు శిశువు కేవలుడు (సాక్షాత్పరమాత్మ రూపుడు) అగు "దత్తుడు" అను పేర బఱ్ఱెను.

* త్రివర్ణముల నామములు : 1 ధర్మము 2 అర్థము 3 కామము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

ఈశ్వరాంశ సంజాతుడగు బాలకుని "దుర్వాసుడు" అని పేరందెను. ఇట్లు వారు మువ్వురును అనసూయాదేవికి పుత్త్రులయిరి.

65. నాయనా! చూడుము; దుర్వాసుడును చంద్రుడును తమ తల్లిదైప్రేమకు తిరిగి ఉండి ఆశ్చర్యకరముగా తాము తపమునకు (ఒకడును) తమ నిజస్థానమునకు (ఇంకొకడును) పోవుదుము. అనుచు ఆమెకు అంజలులకై అనుమతి కోరిరి.

66. దుర్వాసుడు అనసూయతో ఇట్లనెను; అహో! జననీ! నేను ఋషిగా అటు అనుష్ఠానము ఆచరించుకొనుటకును తీర్థయాత్రలు చేయుటకును పోవుదును అని అనుమతి కోరెను.

67. చంద్రుడు ఇట్లు పలికెను; ఓ మాతా! నాకు నీవు త్వరితముగా అనుమతి ఇమ్ము. నా నివాసస్థానము (ఇకమీదట) చంద్రమండలము అగును. అను నిత్యమును నాకు అచ్చటినుండియే నీచరణముల దర్శనము లభించును.

68. వారు ఇద్దరును ఇట్లు అనసూయను అనుమతి వేడి ఇంకను ఇట్లు పలికిరి; మాలో మూడవ వాడగు ఈ 'దత్తుడు' విష్ణుమూర్తి రూపుడు; అతడు నీచేత చిత్తమునందు నిలుపుకొనబడి (ఇచటనే) ఉండును. ఇంతియ కాదు; ఇతడు నిశ్చితముగా త్రిమూర్తి రూపుడు; అని చెప్పుచున్నాము. ఈమాట నీవు నీచిత్తమునందు నిలుపుకొనుము.

69. ఈ 'దత్తుడే' త్రిమూర్తిరూపుడు అని ఎరుగుము; 'సర్వం విష్ణుమయం జగత్' అను శాస్త్రవచనము ప్రసిద్ధము గదా! ఈ వచనము ననుసరించి త్రిమూర్త్యాత్మకుడుగా సర్వజగద్రూపుడుగా సర్వలోక వ్యాపక చరాచర జగదంతర్యామిగా నీచే స్వచిత్తమునందు ధారణ చేయ (నిలుపుకొన) బడి శ్రీ విష్ణుమూర్తి రూపుడగు ఈ దత్తాత్రేయుడు నీకడ ఉండును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

70. త్రిమూర్తులును ఐక్యమునంది తాను దత్తాత్రేయుడై యుండి ఉన్నాడు. అని ఇట్లు పలికి దుర్వాసుడును చంద్రుడును అనసూయకడ సెలవు తీసికొని తమకు ఇష్టములగు ఆయా స్థానములకు పోయిరి.

71. నామధారకా ! చూడుము; అనసూయాదేవి గృహము నందు త్రిమూర్తులును ఏకమూర్తియై ఉండి పోయిరి. ఈ మూర్తి నామము దత్తాత్రేయుడు అని తెలిసికొనుము ఇంకను వినుము; ఇదియే శ్రీగురువుల మూలపీఠము.

72. శ్రోతలారా ! వినుడు; (చూడుడు;) ఈ ప్రకారముగ సిద్ధుడు నామధారకునితో (సరస్వతితో) కథను చెప్పెను. వినుము; ఇది విని అతడు సంతోషముతో సిద్ధుని ఈ ప్రశ్నము అడిగెను.

73. జయ జయ సిద్ధయోగీశ్వరా ! భక్తజన మనోహరా ! సంసార సాగర తారకా ! జ్ఞానసభే ! కృపాసింధో !

74. నీ యనుగ్రహమున నాకు మహాసతి యగు అనసూయకథ వినుట మూలమున జ్ఞానము ఉత్పన్న (ప్రకాశిత) మయినది. నాకు తారకుడవగు యోగిరాజా ! నా మనవిని వినుము.

75. తాము నాకు శ్రీదత్తాత్రేయావతారపు పౌర్వాపర్యము అంతయు తెలిపితిరి. తరువాత మరల శ్రీగురువులు ఏవిధముగా అవతారము ధరించినవారు అయిరి. సెలవు ఇండు.

76. స్వామీ ! అదియంతయు తాము విస్తారపరచి ఈ బాలునకు ప్రీతితో చెప్పవలసినదిగా వేడుచున్నాను. శ్రీగురుమూర్తి ఎట్లు అవతారము ధరించిరి ? అను క్రమమున ప్రతిపాదింప ప్రార్థించు చున్నాను.

77. గంగాధరుని పుత్త్రుడగు సరస్వతి ( ఈ శ్రీగురుచరిత్ర గ్రంథకర్త) అనంతరపు కథయగు విస్తారమును ఇక చెప్పును. విను

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

చున్న కొలదియు అది మనోహరముగా నుండును. సకలాభీష్టములను సిద్ధింపజేయును.

ఇది పరమకథా కల్పతరువయి సిద్ధ - నామధారక సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీ నృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురు చరిత్రామృతమునందు త్రిమూర్త్యవతార కథనము అను చతుర్థాధ్యాయము.

సంఖ్య - 77

# శ్రీ గురు చరిత్రామృతము

## పంచమాధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీసరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః

1. శ్రీగురుభక్తు డగు నామధారకునితో (సరస్వతితో) సిద్ధయోగి "మానుష్యలోకమున జనుసు ఆలాగా యవతారములు భక్తజనులను తరింపజేయుటకే" అనుచు ఆవిషయమును ఈవిధముగ విస్తారపూర్వకముగా చెప్పెను.

2. భక్తుడ వగు నామధారకా వినుము; అంబరీషుడు హేతువుగా శ్రీమహావిష్ణువు మానవలోకమున తాను అవతారములు ధరించుటను అంగీకరించెను. అని వింటివికదా ! దానిని అనుసరించియే భగవానుడు మానుషలోకమున నానా రూపములను గ్రహించె (ధరించె) ను; అనియు చూచితివి (తెలిసికొంటివి.)

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

3. ఆ క్రమమును మానవుడు; మత్స్యము - కూర్మము - (యజ్ఞ) వరాహము - నరుని దేహమును సింహపు ముఖమును గల నారసింహము - అను అవతారములు ఆకృతు ధరించెను; వామన రూపుడయి భిక్షుకుడు (యాచకుడు) అయ్యెను. క్షత్రియకర్మ మాచరించు బ్రాహ్మణుడు (పరశురాముడు) అయ్యెను.

4. దశరథుని వంశమునందు (గృహము) నందు, జన్మముచాలించి ప్రఖ్యాతమగు శ్రీ రఘురామావతారము ధరించెను. ఇట్లు ఆ జన్మమున రాజుగా అయి మరియొక (తరువాతి) జన్మమున గోపాలకుల ఇంట పుట్టి గోవులను కాచెను.

5. (తరువాత) వస్త్రములను వదలి నగ్నుడు (వస్త్రములు ధరించనివాడు) అయ్యెను. అట్లు శ్రీ మహావిష్ణువు తాను బౌద్ధ రూపుడు అయ్యెను. (జిన - బుద్ధ - రూపములకు భేదములేని భావనతో ఇట్లు చెప్పబడినది.) తెలిసికొనుము. యుగాంతమున కల్క్యవతారముగా అయి అశ్వారూఢుడు అగును. (ఇట్లు శ్రీమహావిష్ణువు అవతారములు ధరించుటలో అతనికి భక్తరక్షణము తప్ప వేరు కోరికలు ఏమి (ఉన్నవి ?)

6. హృషీకేశుడు * అగు నారాయణుడు సాధుమానవులను (ప్రాణులను) తరింపజేయుటకును దుష్టులను నిగ్రహముచేయుటకును నానా ప్రకారములగు నానా రూపములను ధరించెను.

---

* త్వక్ - చక్షుః - శ్రోత్ర - జిహ్వా - ఘ్రాణములు అను ఐదు విషయేం - జ్ఞానేం - ద్రియములను అధిపతియై అంతఃకరణమునందుండు వసించుచు వాటిని తన అదుపులో ఉంచుకొనుచు సర్వాంతర్యామి అగు మహానుభావుడు - సర్వ - అంతర్ - యామి - అన్నిటికిని లోపలనుండి వాటిని సకల జీవులను తన అదుపునందుంచుకొనువాడు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

7. (ఇట్టి యుగ పరివర్తన క్రమములో కృష్ణావతారమునకు ఆశ్రయ మగు) ద్వాపర యుగము ముగిసి కలియుగము అయ్యెను. లోకములు (లోకులు - జనులు) అజ్ఞాను లయిరి. బ్రాహ్మణ కులము నందు ఆచారహీనులు (తమకు విహితములగు సత్కర్మములను ఆచరించనివారు) ప్రబలు లయి వర్తిల్లసాగిరి; కలియుగమందలి మహిమ ఇటువంటిది.

8. ఇట్టి సమయములో శ్రీ గురునాథులు అగు దత్తాత్రేయులు భక్తజనరక్షణార్థము అవతారమందెను. సగరులను (సగరపుత్త్రులను) తరింపజేయుట కారణముగా తీసికొని భగీరథుడు గంగను భూమండలమునకు తీసికొనివచ్చెను గదా !

9. నాయనా ! వినుము; అదేవిధముగా ఒక విప్రవనిత సాక్షాత్ శ్రీవిష్ణుమూర్తియే యగు శ్రీ దత్తాత్రేయుని ఆరాధించెను. ఆమె కడుపున ఆ దత్తాత్రేయులు అవతారము ధరించుటవల్లనే (ధరించుట అనగా) ఆశ్చర్యము జరిగెననియే యర్థము గదా !

10. పూర్వదేశమునందు పీఠాపురమునందు ఉత్తమ వంశజుడును ఆపస్తంబ శాఖీయుడును అగు బ్రాహ్మణుడు ఉండెను. అతని నామము 'అప్పలరాజు' అని ఎరుగుము.

11. అతని భార్య పేరు 'సుమతి;' ఆమె సదాచారవతియు పతివ్రతయును; ఆమె భక్తిభావముతో అతిథులకును అభ్యాగతులకును పూజలు (సేవలు) చేయుచుండెను.

12. ఆమె సద్గుణపూర్ణురాలయి ఏక (ఏకాగ్ర) మనస్సుతో నిరంతరమును పతిసేవయును అతిథిపూజయును చేయుచు ఉండగా - జరిగిన వృత్తాంతమును వినుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

13. చూడుము; ఇట్లు జరుగుచుండగా ఒక దినమున శ్రీదత్తాత్రేయులు అతిథివేషుడై వారిఇంటికి వచ్చెను. ఆ నాడా విప్రుని గృహమున అమావాస్యా (ప్రయుక్తధర్మ) శ్రాద్ధము జరుగుచుండెను.

14. శ్రీదత్తాత్రేయులు అతిథియై భిక్షార్థము వచ్చునప్పటికి వారి ఇంటి యందు (శ్రాద్ధభోక్తలగు) బ్రాహ్మణులు భోజనము చేయకున్నను ఆ విప్రస్త్రీయగు సుమతి ఆ అతిథికి భిక్ష వేసెను. అంతట శ్రీదత్తాత్రేయులు ప్రసన్నులు అయిరి. సాక్షాత్కారము నందిరి.

15. వారు త్రిమూర్తుల రూపమును ధరించి మహోదాత్తమగు స్వరూపము నామెకు దర్శింపజేసిరి. ఆ పతివ్రతయును వారి చరణములను పట్టుకొని మనోభావముతో (తన మనస్సునందంతటను నిండిన) నిర్మలభక్తిభావముతో వారికి నమస్కారము చేసెను.

16. శ్రీదత్తాత్రేయులు ఆమెతో ఇట్లు పలికిరి. ఓమాతా! నీవు ఏమికోరుచున్నావో - అది అడుగుము. ఏ ఏ వాసన (కోరిక) నీ మానసమునందు ఉన్నదో - అదియెల్ల త్వరితముగా పొందెదవు. అని వారు అనిరి.

17. స్వామివారి వచనమును విని ఆ విప్రవనిత ఆలోచనము చేసెను. కరములు జోడించి నానావిధములుగ స్తుతించి ఇట్లు మనవి చేసెను.

18. జయ జయ జగన్నాథా! నీవు తారకుడవు. (సంసారము నుండియు క్లేశములనుండియు దాటించువాడవు.) నీవే విశ్వ (సృష్టిస్థితిలయ) కర్తవు. నా మానసమునందు ఒక ఆర్తి (వేదన - వ్యథ) ఉన్నది. (ఆవిషయ మందలి) కోరికను - ఓ దేవరాజా (దేవదేవా!) పూరించుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

19. నీవు సర్వభూతముల విషయమునందును కృపాళుడవు. అని వేదములును, పురాణములును వక్కాణించు చున్నవి. నీ కీర్తిని ఎట్లు వర్ణింతు (చగల)ను. భక్త వత్సలా ! కృపానిధీ !

20. నీవు పలికిన వచనము మిథ్య (జరుగకుండునది - మరియొక విధముగా జరుగునది కాని) కాదు. నీవు ధ్రువునకు ఎటువంటి అచల మగు స్థానమును ఇచ్చితివి? విభీషణునకు లంకాద్వీపపు రాజ్యమునందే ప్రతిష్ఠించితివి కదా !

21. నీవు భక్తజనులకు అవలంబనము అగుటకే అవతారములను ధరింతువు. చరాచర (కదలెడి - కదలని - పదార్థములతోను ప్రాణుల తోను నిండిన) చతుర్దశ భువనములయందును నీయశోగానము ఇట్లే వ్యాప్తమయి ఉన్నది.

22. నీవు ఇపుడు నాకు వరము ఇచ్చు (ఇత్తునను) చున్నావు. నా మానసము నందును (ఒక) కోరిక ఉన్నది. కృపాసింధో ! దేవ రాజా (దేవదేవా !) నీవు మరల మాటతప్పక ఉందువుగాక !

23. జగత్త్రియజనకా ! నా మానసమునందలి కోరికను నీవు పూరించ వేడుచున్నాను. అనాథతారకా ! నారాయణా ! అని ఆమె శ్రీ దత్తాత్రేయుల చరణములను స్పృశించి నమస్కరించెను.

24. ఆమె పలికిన కరుణ (జాలిగొలుపు) వచనములను విని త్రిమూర్తి స్వరూపుడగు శ్రీ దత్తాత్రేయులు తాను సంతోషమునందెను. అత డామె కరము పట్టుకొని ఆశ్వాసించి (ఓదార్చి) తల్లీ ! అడు గుము. అని పలికెను.

25. అపుడు ఆ పతివ్రత ఇట్లు పలికెను : స్వామీ ! మీరు ఇపుడు నాకు తల్లీ ! అను పేరుపెట్టి ఏమని సెలవు ఇచ్చితిరో - ఆ ఈ మాటకు యథార్థతను కలుగజేయుడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

26. నాకు చాలమంది పుత్త్రులు కలిగిరి. కాని - వారు స్థిర జీవితులు కాకపోయిరి. ఇపుడు ఎవరు సజీవితులయి ఉన్నారో - వారు నేత్రహీనులును పాదహీనులును అయి ఉన్నారు.

27. ఎవరును యోగ్యులు కాకున్నారు. ఆ అయోగ్యప్రాణులు ఏమి చేయుటకు పనికివత్తురు ? ఇటువంటి లక్షణములతో వారు ఉండియు లేనివారే కదా ! పుత్త్రులు లేనిజన్మము ఏమిజన్మము ?

28. జ్ఞానవాన్ ! పరమపురుషా ! జగద్వంద్యా ! దేవసదృశా ! (పరమాత్మ సమానా !) మాకు పుత్త్రుడు కలుగవలయును. నాకు కలుగు ఆ పుత్త్రుడు నీతో సమానుడు కావలయును.

29. ఆమె పలికిన వచనములు విని శ్రీదత్తాత్రేయులు తాము ప్రసన్నులు అయిరి. తరువాత తాము నెరవేర్చవలసిన భక్తజనోద్ధరణ నేత్రా కార్యమునకు ఈ వరదానము కారణము కావలయును. అను సంకల్పముతో వారు ఆమె కోరికను అంగీకరించిరి.

30. అంతట ఆ తాపసి ఆ పతివ్రతతో ఇట్లు పలికెను. నీకు తాపసి అగు పుత్త్రుడు కలుగును. అతడు నీ వంశమును ఉద్ధరించును. కలియుగమునందు ఖ్యాతి (కీర్తి) మంతుడగును.

31. తల్లీ ! చూడుము. (ఇది జ్ఞప్తియందు ఉంచుకొనుము.) నీవు అతని మాటయందు ఉండవలసియున్నది. (నీవు అతడు చెప్పిన విధమున నడచుకొనవలయును.) అట్లు కానిచో అతడు నీయొద్ద ఉండడు. అతడు జ్ఞానమార్గమునందు చాల సమర్థుడు అగును. నీకు గల దైన్యమును నూరించువాడు అగును.

32. నామధారకా ! వినుము; ఆ తాపసుడు ఇంతమాత్రము చెప్పి అదృశ్యుడు అయ్యెను. ఇట్లు జరిగిన ఆ సమయమున ఆ విప్ర వనిత (యగు సుమతి) తన మానసమున ఆశ్చర్యము పొందెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

33. ఆమె అట్లు ఆశ్చర్యపడి ఇంటియందు (ఉండిన) భర్తతో (జరిగిన) వృత్తాంతమును చెప్పెను. ఇద్దరును హర్షనిర్భరులు అయిరి. వీరు దత్తాత్రేయులు అయి ఉందురు. అని వారు (ఒకరితో మరియొకరు) అనిరి.

34. మధ్యాహ్న సమయమునందు అతిథికాలమునందు - ఇట్టి పవిత్ర సమయమునందు - దత్తాత్రేయులు వత్తురు. ఆ కాలమునందు గృహస్థులు అతిథి విషయమునందు విముఖులు కారాదు. ఆ వచ్చినవారికి భిక్షమాత్రము (ఏ రూపమునైనను ఎట్టిస్థితియందయినను) వేయవలయును.

35. శ్రీ దత్తాత్రేయులు తరచుగా ఉండు స్థానములను తెలిపెదను; ఎరుగుము. మాహురక్షేత్రము కరవీరక్షేత్రము అను ఈ గ్రామములందును పాంచాలేశ్వర నగరమునందును వారు తరచుగా వాసము చేయుచుందురు. ఇవి వారి నివాసములకు సంకేతము (అనగా ఇట్టి స్థానములందు వారు ఉందురు.

36. అట్టి శ్రీదత్తాత్రేయులు నానా రూపములలో భిక్షుక వేషముతో హర్షపూర్వకముగా వచ్చుచుందురు. అట్లు వారు వచ్చినప్పుడు నీవు నా అనుమతిని అడుగకయే వారికి తప్పక భిక్ష వేయవలసియుండును.

37. అనగా అపుడు ఆ విప్రస్త్రీ పతితో ఇట్లు పలికెను. నేను ఈనాడు మిమ్ములను అవజ్ఞ (అలక్ష్యము) చేసితిని. శ్రాద్ధ సందర్భమున బ్రాహ్మణులు భుజించనిదే వారికి (శ్రీదత్తాత్రేయమూర్తి యగు భిక్షుక రూపమునకు) భిక్ష వేసితిని అనెను.

38. తన పత్ని పలికిన వచనమును విని ఆవిప్రుని మనస్సు సంతోషమును పొందెను. అతడు ఆమెతో ఇట్లు పలికెను: పతివ్రతా!

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

(నీవు చేసిన ఈపని పతివ్రతా ధర్మమునకు ప్రతికూలము కాదు.) మంచి పనినే చేసితివి. దానిచే నా పితరులు తృప్తులు అయిరి.

39. మనము పితరుల పేరట శ్రాద్ధాది కర్మములను ఆచరించి విష్ణునకే (అన్నా అన్నాదికమును) సమర్పణము చేయుదుము. అట్టి వంటి శ్రీమహావిష్ణువే స్వయముగా వచ్చి సాక్షాత్తా నమ్కారమునంది గృహమునందు భిక్షము (భిక్షా గ్రహణము) చేసెను.

40. సాక్షాత్ శ్రీ మహావిష్ణువును త్రిమూర్త్యవతార రూపుడును నగు శ్రీ దత్తాత్రేయులే మనకు దర్శనము నొసగి లభించిరి. అందుచే నిశ్చయముగ మన సమస్త పితరులును కృతార్థులయిరి. స్వర్గ ప్రతిష్ఠితులయిరి.

41. ఏ నీవు ఇప్పుడు ఇట్టి ఉత్తమ మగు వరమును పొందితివో అటువంటి నీతల్లి దండ్రులు ధన్యులు - ధన్యులు; నిస్సంశయముగ నీకు (శ్రీదత్తాత్రేయులే) పుత్త్రుడు (గా) కలుగును, మనస్సునందు ఏమియు చింతపెట్టుకొనకుము. అనెను.

42. నామధారకా! వినుము; ఆ దంపతులు ఇరువురును హర్షముతో నిర్భరులు (మిగుల నిండినవారు) అయి మనస్సునందు నిశ్చింతులయి ఉండిరి. ఇట్లు జరుగుచుండగా ఆ విప్రస్త్రీ అంతర్వత్ని (గర్భవతి) అయ్యెను.

43. ఇట్లు నవమాసములు గడచి (నమోదట) ఒక శుభదినమున ఆమె ప్రసూత (ప్రసవించినది) అయ్యెను. ఆ శుభసమయమునందు విప్రుడు ఆ అప్పలరాజు స్నానమాచరించి శిశువునకు జాతకర్మము జరిపెను.

44. అంతట విప్రకులజులగు జ్యోతిషికులగు పెద్దలను అందరను సమావేశపరచి అతడు ఆ నవజాత శిశువునకు జాతకము వ్రాయిం

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

చెను. ఇతడు మహాతపస్వియు దత్తాత్రేయుడు జగద్గురుడును అగును, అని వారనిరి.

45. అదివిని ఆ తల్లిదండ్రులు ఇట్లనిరి. ఇట్లు ఇతడు మాకులమును ఉద్ధరించువాడు అగును అనుట ఎంతయో ఆనందకరము. శ్రీదత్తాత్రేయులు మాకు వరమునొసగి చ్చి (ఇట్లు జన్మించి) రి. అనుచు ఆ హేతువుచే ఆ బ్రాహ్మణుడు ఆ శిశువునకు (ఆ అర్థముతోనే) నామకరణము చేసెను

46. ఇట్లు పలికి ఆ బ్రాహ్మణుడు ఆ కారణముతోనే ఆ శిశువునకు 'శ్రీపాద' 'శ్రీవల్లభ' 'పూజ్యపాదులు' అగు 'లక్ష్మీభర్త' (సాక్షాత్ శ్రీమహావిష్ణువు) అని నామకరణము చేసెను. ఇట్లు భక్తజనులను తరింపజేయుటకై త్రిమూర్త్యాత్మకుడగు శ్రీమహావిష్ణువు అవతరించెను.

47. ఆ విప్రుని గృహమునందు అతడు అట్లు పెరుగుచు ఉండగా ఏడు సంవత్సరములవాడు అయ్యెను. (గర్భవాసముతో ఎనిమిది సంవత్సరములవాడయ్యెను.) అట్టి సమయమున (ఆ గర్భాష్టమవయస్సులో) ద్విజోత్తముడగు ఆ అప్పలరాజు ఆ బాలునకు మౌంజీ బంధనము (ఉపనయనము) జరిపినవా డయ్యెను.

48. మౌంజీబంధనము అయినప్పటినుండియు ఆ బ్రహ్మచారి నాలుగు వేదములను అధ్యయనము చేసి చెప్పివేసెను. ఆ అల్పసమయమునందే అతి విస్తృతములగు మీమాంసాశాస్త్రమును తర్కశాస్త్రమునుకూడ సర్వమును చెప్పనారంభించెను.

49. ఈ విషయమును విని ఆ నగరమునందలి జనులు అందరును ఆశ్చర్యమును అందుచుండిరి. ఇతడు కారణజన్ముడగు అవతారిదివ్యపురుషుడు అయి ఉండును అని తమలో తాము చెప్పుకొనుచుండిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

50. ధర్మ శాస్త్ర ప్రోక్తము లగు ఆచారకాండ - వ్యవహార కాండ - ప్రాయశ్చిత్తకాండము లందలి సమస్త విషయములను తానే స్వయముగా చెప్పుచుండెను. వేదాంత భాష్యములను వేదార్థములను కూడ ద్విజవరులకును తానే చెప్పుచుండెను. 

51. నామధారకా! వినుము; ఇట్లు జరుగుచుండగా శ్రీపాద శ్రీవల్లభుడు పదునారు సంవత్సరములవాడు అయ్యెను. అపుడు జరిగిన విషయమును తెలిసికొనుము; తల్లి దండ్రులు తమ ఆ పుత్రునకు వివాహము చేయుదము అని తలచిరి. 

52. వారు తమ పుత్రునితో ఓయీ! నాయనా! నీకు పెండ్లి చేయదలచి యున్నాము. అని పుత్రునితో ఆ విషయము ప్రస్తావించిరి. నామధారకా వినుము. శ్రీపాదుడు ఇట్లు పలికెను; భావమునందు ఉన్న నా కోరికను చెప్పెదను వినుడు. 

53. నాకు మీరు వివాహము చేయుడు; సరియే - చెప్పెదను వినుడు. నేనును ఆలోచించితిని. 'విరక్తి' అనెడు స్త్రీ నాకు యోగ్యురాలు అయిఉన్నది. నాకు కామప్రవృత్తియు ఆమె యందే యున్నది.

54. ఆస్త్రీ తప్ప మరి ఇతరస్త్రీలు ఎల్లరును నాకు మాతృ సమానలే అని ఎరుగుడు. ఆ సుందరి వచ్చినచో అపుడు ఆమెను నేను వరింతును. (పెండ్లాడెదను.)

55. నేను తాపసుడను బ్రహ్మచారిని (బ్రహ్మ విషయక మగు అనుష్ఠానమును అనుష్ఠించు వాడను) అయి ఉన్నాను కదా! నాపేరు 'శ్రీవల్లభుడు' (శ్రీ అను స్త్రీకి ప్రియుడు - శ్రీ అను స్త్రీ తన ప్రియురాలుగా కలవాడు) కదా! కావున ఇట్టినాకు 'యోగశ్రీ' తప్ప మరి ఇతరస్త్రీ యోగ్య కాదు. ఈమాట నిర్ధారింపబడినమాట అని తెలిసి కొనుడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

56. 'శ్రీపాద శ్రీవల్లభుడు' అను ఇటువంటి నాకు ఏర్పడెను కదా ! 'త్రిమూర్తి' రూపుడు అనగా మరి ఎటువంటి వాడు ? నేను ఇక ఉత్తరాపథమునకు పోయెదను. అని అతడు తన తండ్రితో పలికెను.

57. పుత్త్రుని వచనమును విని పూర్వపు సూచనము స్మృతి గతము (జ్ఞప్తికి వచ్చినది) అయ్యెను. ఆ నాడు భిక్షుకుడు (గా వచ్చిన శ్రీదత్తాత్రేయులు) నిర్గుణ (తాత్త్వీక) విషయమును చెప్పెను గదా ! అది ఇపుడు యథార్థము అయ్యెను. అని వారు అనుకొనిరి.

58. ఇపుడు ఈతని మాటకు అభ్యంతరము (కాదు అను అడ్డు మాట) చెప్పినచో వినుము - నిశ్చితముగా విఘ్నము (మన సంకల్పమునకు ప్రతి కూలమగు విషయము) జరుగును. అని అపుడు ఆ దంపతులు తమలో అనుకొనిరి.

59. ఇతనిని మనపుత్త్రుడు అని భావింప దగదు. ఇతడు అవతారపురుషు డగు తాపసుడు (అయిన శ్రీదత్తాత్రేయులే) ఇతని మనస్సునందు ఎటువంటి తలంపు కలదో అట్లే చేయవలసియుండును. అని ఆ తల్లిదండ్రులు అనుకొనిరి.

60. ఇట్లు ఆ జననీజనకులు తమ మనస్సులయందు నిశ్చయము చేసికొని ఆ కుమారునితో ఇట్లు అనిరి. నాయనా ! మేము ఆశాబద్ధులము అయి జీవించు చున్నాము. నీవు మమ్ములను ప్రతిపాలనము చేయ (కనిపెట్టుకొని ఉండ) వలయును. అని వారు అనిరి.

61. ఇట్లు వారు మనస్సునందు వ్యాకులితులుకాగా వారికన్నుల నుండి అశ్రుపాతము (అశ్రుధార) బయలువెడలెను. పుత్త్రవిషయక మగు స్నేహము మూలమున జనని మూర్ఛాగతురాలు అయ్యెను.

62. తల్లికి కలిగిన దుఃఖమును చూచి పరమపురుషుడు ఆమెను ఓదార్చ సాగెను. తన కరకమలములతో ఆమెను లేవనెత్తి అశ్రుధారలను తుడిచెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

63. ఓ మాతా ! చింత చేయకుము ఏమి ఏమి కోరుదువో అది యెల్ల ఇపుడు నీకు ఇత్తును. నీవు నీ చిత్తమును దృఢమయిన జ్ఞానినిగా చేసికొని సుఖవంతురాలవయి ఆనందించుచు ఉండుము.

64. ఆమాట విని తల్లి అతనితో ఇట్లు పలికెను: ఓ నాయనా ! నీ (వు ఉండుట) వలనను మేము మా అంతఃకరణము నందలి దుఃఖమును మరచియుంటిమి. మా వార్ధకములో మమ్ములను రక్షింతువు అనియు మాకుగల దైన్యమును పోగొట్టెదవు అనియు తలచి ఉంటిమి.

65. మాకు ఇద్దరు కుమారులు ఉన్నారు. వారు (వారిలో) ఒకడు కాళ్ళులేని కుంటివాడును-కన్నులులేని గ్రుడ్డివాడును; ఇపుడు ఇక వారిని ఎవరు పోషింతురు ? మమ్ములను ఎవరు రక్షింతురు ?

66. అపుడు అంతట జననీ వచనములను విని శ్రీపాద శ్రీవల్లభులు అమృతపూర్ణ నయనములతో చూచిరి. దానితో ఆ ఇరువురు పుత్త్రులును అవలక్షణములు తొలగి మంచిలక్షణములు కలవారు అయిరి. వారికి కాళ్ళు కన్నులు మొదలగునవి వచ్చెను.

67. ఎట్లు చింతామణి స్పర్శ వశమున లోహ ఖండము సువర్ణ సమానము అగునో - అట్లే ఆ మహాత్ముని దృష్టి వృష్టి పడగనే ఆ లక్షణ హీన కుమారులకును తత్కాలమే యోగ్యత (మంచిలక్షణములు) ఏర్పడెను.

68. ఆ మొదటి కుమారులు ఇరువురును వేదములను వ్యాకరణాది శాస్త్రములను అన్నిటిని యథా సంప్రదాయముగ అధ్యయనము చేసినవారువలె తత్క్షణమే చెప్పసాగిరి. మేము కృతార్థులము అయితిమి. అని పలుకుచు ఆ ఇరువురు కుమారులును శ్రీపాద శ్రీవల్లభుల చరణములపై పడిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

69. అంతట వారు ఆ అన్నలను ఓదార్చి తత్కాలముననే ఇట్లు వరములను ఇచ్చిరి. మీకు అధికముగా పుత్త్రపౌత్రాదులు కలిగి ఆనందింతురు. బహుకాల పర్యంతము శ్రీ సంపద్యుక్తులు అగుదురు.

70. జననీ జనకుల సేవ చేయుదురు. మహా జ్ఞానవంతులయి సుఖము పొందుదురు. ఇహమున సౌఖ్యములను పొంది అంతమున ముక్త లగుదురు. ఇది నిశ్చితము.

71. ఇట్లు వారితో పలికి వారు తల్లిని ఇట్లు ఓదార్చిరి. తల్లీ ! నీవు ఈ ఇద్దరు పుత్త్రులను చూచుకొని ఉండుచు సౌఖ్యమును పొందెదవు.

72. ఈ పుత్త్రులు ఇద్దరు శతాయుష్మంతు లగుదురు. ఇది నీ మనస్సునందు నిశ్చయరూపమున ఉంచుకొనుము. వారికి కూతులును కుమారులును కలిగెదరు. నీవు నీకన్నులతో పౌత్త్రి పుత్త్రిలను (మునిమనుమలను) కూడ చూచెదవు.

73. వీరి ఇండ్లయందు అఖండలక్ష్మి ఉండును. వీరి వంశపారంపర్యమును సచరాచర లోకములందును వేదశాస్త్ర పాండిత్య సంపన్నులు అగుదురు.

74. ఓ జననీ ! నా మాటను అలక్ష్యముచేయక నాకు అనుమతి ఇమ్ము. నేను ఉత్తరాపథమునకు పోవలసియున్నది. సాధుజనులకు దీక్ష ఈయవలసియున్నది.

75. నామధారకా ! వినుము. తన తల్లిదండ్రులతో ఈ విధముగా చెప్పి శ్రీపాద శ్రీవల్లభులు అదృశ్యులు అయిరి. త్వరితముగా కాశీపురి చేరుకొనిరి. అచ్చట వారు గుప్తరూపులై ఉండ నారంభించిరి.

76. అచటినుండి బదరీవనమునకు బయలువెడలి పోయిరి. మహా కార్య నిర్వహణము కారణముగా తాను ధరించిన తన అవతారమే అగు నారాయణమునితో సమావేశమును అందుకొనిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

77. వారు అంతటి నుండి సాధుజనులకు దీక్ష ఇచ్చుటకై తాము తీర్థప్రదేశములయందు సంచరించ సాగిరి. మనోవేగమున మార్గమును అతిక్రమించుచు గోకర్ణతీర్థమునకు వచ్చిరి.

78. సిద్ధుని వచనములను విని నామధారకుడు (సరస్వతి) తాను అతనితో ఇట్లు మనవి చేసెను. శ్రోతృ జనులారా! అది వినుడు అని గంగాధర పుత్త్రుడు అగు సరస్వతి చెప్పుచున్నాడు.

ఇది పరమకథా కల్పతరువయి సిద్ధనామధారక సంవాదరూప మున ప్రవచింపబడిన శ్రీ నృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు శ్రీదత్తాత్రేయ శ్రీపాదావతార కథన మను పంచమాధ్యాయము.

సంఖ్య - 78

# శ్రీ గురు చరిత్రామృతము

## షష్ఠాధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. నామధారకుడు (సరస్వతి) సిద్ధయోగితో ఇట్లు పలికెను; స్వామీ! నీవు (అజ్ఞానమనెడు) అంధకారమునకు జ్యోతిఃస్వరూపుడవు; అయ్యా! నీవు నాకు శ్రీగురులీల (వృత్తాంత)ము ఆదినుండియు నాకు ప్రకాశితముగ ఒనర్చితివి.

2. తాను సాక్షాత్ త్రిమూర్త్యవతారుడు అయి ఉండియు తీర్థ యాత్రలు చేయుటకు కారణము ఏమి? గోకర్ణక్షేత్రమునందు ఏమి విశేషము ఉన్నది అని వారు ఆ తీర్థక్షేత్రస్థానమునకు వెడలిరి?

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

3. అసంఖ్యాకములు అగు తీర్థక్షేత్రములు ఉన్నవి కదా ! ప్రీతి (ఆనంద) కరములగు ఆ క్షేత్రములను అన్నిటిని విడిచి శ్రీ దత్తాత్రేయావతారులు అగు శ్రీపాద శ్రీ వల్లభులు ఆస్థానమును అచటికి ఎట్లు చేరిరి ?

4. స్వామీ ! తాము నాయందలి కృపతో నాకు ఈ విషయము అంతయు విస్తరించి చెప్పవలసినదిగా వేడుచున్నాను. అనుచు నామధారకుడు (సరస్వతి) ప్రీతికరములగు సిద్ధయోగి చరణముల పైబ్రాలి అవి స్పృశించెను.

5. నామధారకుని వచనమును విని సిద్ధుడు తాను సంతుష్టుడు అయ్యెను. ఆతడు ఇట్లు అనెను; శ్రీగురుచరిత్రమును విస్తార పూర్వకముగా చెప్పెదను వినుము.

6. శిష్యశిఖామణీ ! వినుము; నీవు నన్ను ఏ ప్రశ్నమును అడిగితినో–దానిచేత నా అంతఃకరణము సంతుష్టము అయినది. శ్రీగురువుల చరిత్రమును చెప్పెదను.

7. వత్సా ! నీ మూలమున నాకు సాటిలేని మహాలాభము కలిగినది. నీకు శ్రీగురుచరిత్రమును చెప్పవలయును. అని నామానసము నందు ఉత్కంఠ (ఎప్పుడు ఎప్పుడు చెప్పుదునా యను తహ తహ) కలుగుచున్నది.

8. అనుచు సిద్ధుడు ఇంకను ఇట్లు పలికెను : తాను సాక్షాత్ త్రిమూర్త్యవతార రూపులు అగు శ్రీపాద శ్రీవల్లభులు. తాను తీర్థముల యందు ఏల సంచారము చేసిరి ? విశేషము ఏమి కలదని (అందును విశేషించి) గోకర్ణక్షేత్రమునకే ఏల చేరిరి ? అని నన్ను అడుగుచున్నావు కదా ! చెప్పెదను–వినుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

9. ఈ విషయమును ఎరిగి గుర్తుంచుకొనుము. శ్రీ దత్తాత్రేయులు తాను తీర్థరూపులు అయి యున్నారు. నిజమే; అయినను - భక్తజనులను దీక్షితులనుగా (పేరునందినవారినిగా) చేయుటకును (నారికి తత్త్వమును) ఉపదేశించుటకును అను ఇట్టి హితమాచరించుటకే వారు తీర్థాటనము ఆచరించిరి.

10. ఇంతియు కాక - అది విశిష్టమగు తనస్థానమను భావనతో శంకరుడు తాను స్వయముగా గోకర్ణక్షేత్రమునందు సదా వసించు చుండును. ఈ కారణముచేతనే సకల గుణాతీతులును త్రిమూర్త్యవతారులును అగు శ్రీ దత్తాత్రేయుల అవతారమగు శ్రీపాద శ్రీవల్లభులు ఆ క్షేత్రమునందు వసించిరి.

11. శిష్యా! నామధారకా! (సరస్వతీ!) * శ్రీ గోకర్ణక్షేత్ర మాహాత్మ్యము సాటిలేనిది యని చెప్పబడుచున్నది. నీవు నీ చిత్తమును ఏకాగ్ర మొనర్చుకొని నియమముతో వినుము.

12. ఆ గోకర్ణతీర్థపు వృత్తాంతము ఆదినుండియు జరిగినది నీకు విస్తరించి చెప్పెదను. ఇందు ఎవరు ఎవరు వరములనుపొంది యుండిరో అది యంతయు వినుటకు అపూర్వము (ఆశ్చర్యకరము)గా ఉండును.

13. నాయనా! వినుము. ఈ క్షేత్రమునందలి మహాబలేశ్వర లింగము శివాత్మకమగు స్వయంభూలింగము. ఇది లంబోదరు (గణేశుని) చేత ప్రతిష్ఠింపబడినది. దీనికై విశిష్టమగు ఆఖ్యానము కలదు; అది చెప్పెదను; వినుము.

14. ఇదివిని శిష్యుడు సిద్ధునితో ఇట్లనెను; ఈ తీర్థపు మహిమము విశిష్టమయినది అని తాము వర్ణించు చున్నారు. విఘ్నేశ్వరుడు దీనిని (ఈమహాబలేశ్వరలింగమును) ఎట్లు - ఏల - ప్రతిష్ఠించెను? అదియంతయు నాకు విస్తార పూర్వకముగా చెప్పవలసినదిగా వేడుచున్నాను.

---

* గోకర్ణ - కొంకణ

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

15. ఇట్లు శిష్యుడు విన్నవించగా విని మిగుల సంతుష్టుడయి మహాబలేశ్వరలింగ చరిత్రమును ఆదినుండియు ఆరంభించి సిద్ధుడు చెప్ప నారంభించెను.

16. పులస్త్యుడు అను బ్రహ్మకు (ప్రజాపతికి)భార్య కలదు. ఆమె నామము కైకసి; ఆమెకు ఈశ్వరునియందు భక్తి అత్యంతమును ప్రియ మయినది. ఆమె సర్వకాలములందును శివపూజ ఆచరించు చుండును.

17. ఆమె అనునిత్యమును లింగపూజనము ఆచరించు చుండెడిది; పూజలేనిదే (చేయక) అన్నము తినెడిది కాదు; ఇట్లు గడచు చుండగా ఒకనాడు ఆమెకు పూజకై లింగము లభింపకపోయెను.

18. నాయనా ! అనపహితుడవయి వినుము; వ్రతభంగము అగును అని భయపడి మృత్తికా లింగమును నిర్మించి అంతటికే సంతుష్టురాలయి ఆమె దానిని భక్తిపూర్వకముగా పూజించు చుండెను.

19. ఆమెకు పుత్రుడు కలడు; అతడు అతి క్రూరుడు; వాని నామము దశశిరుడు (రావణుడు); తన తల్లిని దర్శించుటకై ఆ సమ యమున వాడు అచ్చటకు మిగుల వేగముగా వచ్చెను.

20. వాడు అపుడు తన మాతకు నమస్కరించినవాడు అయ్యెను. ఏమిపూజ చేయుచున్నావు ? అని అతడు ఆమెను అడిగెను. ఆమె వానితో వృత్తాంతము అంతయును చెప్పి తాను ఆ సమయమున మృత్తి కతో నిర్మించిన లింగమును పూజించుచుంటిననియు చెప్పెను.

21. రావణుడు తనతల్లితో ఇట్లు అనెను. నీవు నా (రావణుని) తల్లి అని చెప్పబడుచున్నావు; మృత్తికతో చేసిన లింగమును పూజించు చున్నావు; ఇది మన దుర్భాగ్యము కదా ! అనెను.

22. వాడు మరల ఆమెతో ఇట్లు అనెను; 'పూజించినచో కలుగు ఫలము ఏమి ?' కైకసి తన కొడుకుతో ఇట్లు పలికెను; 'కైలాసపదము పొందబడును. (లభించును.)'

23. రావణుడు తన తల్లితో ఇట్లు అనెను: 'కైలాసమును నీదగ్గరకు తెచ్చి ఇచ్చినచో ఎట్లు ఉండును? (ఎంతయో గొప్పగను సుఖముగను ఉండును గదా!) ఎంతో శ్రమ పడుచు ఇటువంటి ఈపూజ ఏల చేయుచున్నావు?

24. అని ఇట్లు పలుకుచునే రావణుడు తన తల్లి దగ్గర ఇట్లు ప్రతిజ్ఞ చేసెను చాల శీఘ్రముగా నేను కైలాసపర్వతముతో కూడ ఉమారమణుని లంకకు తీసికొని వత్తును.

25. 'స్వస్థచిత్తురాలవయి దానిని పూజించుకొనుచుండుము. మృత్తికాలింగము అనునది ఎందులకు పనికివచ్చును?' అని పలుకుచునే ఆ నిశాచరుడు (రాక్షసుడు - రావణుడు త్వరితముగా (వెంటనే) మనోవేగమున బయలుదేరెను.

26. వాడు త్వరితముగా శివపురమును చేరెను. శుభ్ర (తెల్లని) వర్ణముకలదియు మనోహరమునునగు ఆకైలాసపర్వతమును పట్టి తన ఇరువది బాహువులతోను భుజబలమునంతటిని వినియోగించుచు క్రోధముతో కదలించెను.

27. రావణుడు కైలాస నగరమును అటునిటు ఊపెను. అతడు దానిని పెల్లగించెను. తన పది తలలయందును దానిని నిలుపుకొని ఉత్సాహముతో ఎత్తుకొని పోవుదును. అనివాడు తలచెను.

28. రావణుడు (వంగి) ఆ కైలాస పర్వతమును తన శిరముల మీదకు తెచ్చుకొని (నచ్చునట్లు ఆనించుకొని) చేతులను మోకాళ్లకు ఆనించుకొని తన పూర్ణమగు బలముతో దానిని పైకెత్త నారంభించెను. * సప్త పాతాళములును ఈకదలికతో ఉయ్యాలలూగెను.

29. ఆదిశేషుడు తన పడగలను వ్రేలాడవేసెను. ఆది కూర్మము భయముతో వణకెను. దేవగణము భయచకితము (భయా

* చూ 7 అ. 102 శ్లో

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

శ్వర్యములతో ఏమియు తోచనిది) అయ్యెను. అమరావతీనగరము (నందలి ప్రాణిసమూహము) కంపము నందెను.

30. స్వర్గలోకమంతయు కంపించి పోవసాగెను. సత్యలోకాది ఊర్ధ్వలోకములు ఏమను విష్ణులోకమును గడగడలాడెను. మేరు పర్వతముకూడ గందరగోళములో పడెను. ప్రళయము వచ్చినట్లు ఉన్నది. అని ఎల్లరును అనుకొనిరి.

31. అప్పుడు కైలాస పర్వత (నగర) మునందు ఉండిన దేవతలు అందరును భయముతో భీతులయి కంపించిరి. స్వయముగా పార్వతి యును భయచకితురాలయి శివునిదగ్గరకు పోయెను.

32. పార్వతి శివునితో ఇట్లు మనవిచేసెను. స్వామీ ! కైలాస పర్వతమునకు ఏమయినది. ఇది అధిక భారముతో ఊగిపోవుచున్నదే ? ఇది నిశ్చయముగా పడిపోవనున్నట్లు కనబడు (తోచు) చున్నది.

33. (కైలాస) నగరమునందు అంతటను హాహాకారము ఏర్పడి నదే ! మీరు మాత్రము స్వస్థచిత్తులయి కూర్చుండి యున్నారు. తాము త్వరితముగా దీనికి ప్రతీకారము చేయుడు. అనుచు పార్వతీదేవి పరమేశ్వరుని పాదముల పయిపడి వానిని స్పృశించెను.

34. ఈశ్వరుడు గిరిజతో (హిమవత్పుత్రియగు దేవితో) ఇట్లు పలికెను. దేవీ : నీవు మానసమునందు చింతచేయకుము. చెప్పెదను వినుము. రావణుడు అను నా భక్తుడు భక్తితో ఇట్లు ఆడుకొను చున్నాడు.

35. ఇట్లు పలికిన శివుని వచనములు విని గిరిజ నమస్కరించి శివునితో ఇట్లు మనవిచేసెను. దేవా ! శూలపాణీ ! రక్ష ! రక్ష ! (రక్షించుము - రక్షించుము) సమస్త దేవగణములను రక్షసేయుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

36. ఇట్లు (పార్వతి) ఉమాదేవి చేసిన వినతిని విని శంకరుడు తన వామహస్తముతో (కైలాసపర్వతమును) అణచెను. దానితో రావణుని పదితలలును ఇరువదిభుజములతోకూడ పర్వతపు సందులలో ఇరుకుకొని పోయెను.

37. రావణుడు అంతట తన మనస్సునందు మిగుల చింతచేసెను. 'శివ ! శివ !' అని ఉచ్చరించసాగెను. ధ్యానము చేయసాగెను. శివుని స్తుతిచేయ సాగెను. నేను శరణాగతుడను. దేవా ! రక్షించుము. అన సాగెను.

38. పినాకపాణీ ! (ప్రణవాత్మకమగు పినాకము అను ధనువును కరమునందు ధరించినవాడా !) జగద్రక్షక శిరోమణీ ! (లోకములను రక్షించు దేవతలందరలో శిరోమణి వంటివాడా !) త్రాహి - త్రాహి ! (కాపాడుము; కాపాడుము.) నీ పాదములకు శరణాగతుడను అయి యున్నాను. నీ భక్తునకు మరణము కలుగుట ఎక్కడిది.

39. శంకరుడు భోళాచక్రవర్తి (అవ్యాజకరుణాపూర్ణచిత్తులలో చాల గొప్పవాడు) కదా ! అందుచే ఆ స్వామి వాని (ఆ రావణుని) మనవిని విని కృపకలిగి పర్వతమును అణచిపెట్టి యుంచిన తన వామ హస్తమును త్వరితముగా తొలగించెను.

40, 41. దానిచే లంకేశ్వరుడు అక్కడినుండి విడుదలనందెను. అపారములగు (అంతు - లెక్క - లేనన్ని స్తోత్రములతో శివుని స్తుతించెను. తన శిరములను ఖండించి తన చేతులయందు పట్టుకొనెను. వానిని కాయలుగా అమర్చి తంబూర అథవా వీణ నిర్మించెను. తన ప్రేవులను లాగి సన్నని దారములుగా చేసి ఆ తంత్రీవాద్యమునకు అమర్చెను. సంగీతమునకు మిగుల అనుకూలమయి సహస్రశాఖలుగ నున్న (సామ) వేదమును ఒకటిగా చేర్చి అమర్చి వానికి సంగీతమునకు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

అనుకూలముగ వర్ణక్రమాదికమునుకూర్చి సమస్తరాగములతో గానము చేయ నారంభించెను.

42. లంకానాథుడగు రావణుడు అంతట ఆయా గణములతో రసములతో స్వరములతో కూడ గానము చేసెను. విఖ్యాతములగు వాని - వాని - నామములను చెప్పెదను. నామధారకా! (సరస్వతీ!) ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

43. మూడేసి అక్షరములతో ఏర్పడు గణములు (అక్షరముల సమూహములు) ఎనిమిది ప్రఖ్యాతములయి యున్నవి. లంకానాథుడు తన గానక్రమములో వానిని ఉచ్చరించ నాగెను. అందు మూడును గురువులేకల (ఉన్న) 'మ' గణము బ్రాహ్మణజాతిది అని ప్రఖ్యాతము; మూడు లఘువులతో ఏర్పడు 'స' గణము వినయవంతమగు క్షత్రియ జాతికి చెందినది.

44. గురువు లఘువు లఘువు గల 'భ' గణము ధ్యాన సంపన్నమగు వైశ్యజాతిది. ఇంకను వినుము; లఘువు గురువు గురువు కల 'య' గణము శూద్రజాతీయము; లఘువు గురువు లఘువు కల 'జ' గణము దైత్యజాతీయము. గురువు లఘువు గురువు గల 'ర' గణము ప్రేతజాతికి చెందినది. గురువు గురువు లఘువు గల 'త' గణము రాక్షస జాతీయము.

45. లఘువు లఘువు గురువు గల 'స' గణము అశ్వరూపము; నాయనా! వినుము. లంకాపతియగు రావణుడు ఇటువంటి ఎనిమిది గణములను సంగీత గానమునందు విస్తరించెను.

46, 47. ఇంతే కాదు; ఆతడు తన గానమునందు నవరసములను (అభివ్యక్తము చేయుచు) గానము చేసెను. వాని నామములను చెప్పెదను వినుము. శాంతరసము - భయానకరసము - అద్భుతరసము - శృంగారరసము - హాస్యరసము - కరుణరసము - రౌద్రరసము - వీర రసము - భీభత్సరసము - అను ఈ నవరసములను ఆ రావణాసురుడు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

మిగుల ఉల్లాసము (ఉత్సాహము అథవా ఆసక్తి) తో అభివ్యక్తము చేయుచు భావస్ఫోరకముగా గానము చేసెను. అతడా గానముతోపాటు దానికి అనుగుణముగా ధ్యానపూర్వకముగను శాస్త్ర విధానానుసారముగను సప్తస్వర ప్రస్తారముతో వీణను మ్రోయించెను.

[సంగీతము నాదాత్మకము. ఇది పరబ్రహ్మరూప మయినది. పరబ్రహ్మ తత్త్వసిద్ధికి సాధనమును ఇదియే; ఈ సంగీతమును గానము చేయుటలో వినియోగింపబడు సప్తస్వరములును కంఠము మొదలగు ఆయా స్థానములందు ఉత్పన్నము లగును. ఈ కంఠాది స్థానములు శరీరము (పిండాండము) నందలివి. పిండాండమునందు ఏవికలవో అవియే బ్రహ్మాండమునందును - బ్రహ్మాండమునందు ఏవికలవో అవియే పిండాడము నందును కలవు. కావున ఇవియే బ్రహ్మాండమునందును ఆయారూపములతో నున్నవి. అని పెద్దలవచనము. ఈ పిండాండాంశముల కును వానికి సమానములగు బ్రహ్మాండాంశములకును అధిష్ఠాత్రులగు దేవతలును ఉన్నారు. ఆయాస్వరములు ఆయా పక్షిపశ్వాది ప్రాణుల స్వరములను పోలియుండును; అనియు గమనించి వానినికూడ మునులు శాస్త్రములందు పేర్కొనినారు. ఆయా స్వరములు ప్రాధాన్యము నహించునట్లు స్వరప్రస్తారముచేసి పాడుటచే ఏయే రసములు అభివ్యక్తములయి ఉత్తమ భావానుభూతి కలుగునో కూడ మునులు శాస్త్రములందు చెప్పియున్నారు. ఈ లక్షణములనుబట్టి ఆయా స్వరములకు శారీరకచ్ఛాయయు జాతి మొదలగునవియు శాస్త్రములందు చెప్పబడి నవి. అవిఅన్నియు ఇందు పేర్కొనబడినవి. పైని తెలిపిన గణముల విషయమునకూడ ఈ యంశములను తగిన ట్లవ్వయించుకొనవలె.

48 - 49. నాయనా! నామధారకా! (సరస్వతీ!) వినుము. నాసిక - కంఠము - ఉరము - తాలువులు - జిహ్వా - దంతములు అను ఆరుస్థానములను తాకుచు ఉత్పన్నమగుటచే దేనినాదము 'షడ్జమా'

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

బసను దేనిఉత్పత్తి ప్రధానముగా కంఠమునుండియో దేనివాసస్థానము బ్రహ్మాండ గోళమున జంబూద్వీపమో ఆ ప్రథమ స్వరము (షడ్జ - స) మయూర (నెమిలి) కంఠస్వరము ననుకరించుచు ఆలపించబడును. దాని ఉత్పత్తియు ఉత్తమజాతియందే; ఈ షడ్జస్వరము దేవతా కులమున బ్రహ్మ (బ్రాహ్మణ) వంశమున జన్మించినది. వినుము; ఇది పద్మపత్ర (తామరపూరేకు) చాయ వంటి దేహచ్ఛాయ కలది. అగ్ని దీని అధిష్ఠాతృదేవత, దీని (చే అభివ్యక్త మగు) రసము శృంగారరసము.

50 - 51. ద్వితీయ స్వరమగు "ఋషభము" (రి) నకు జన్మము (బ్రహ్మాండగోళమున) ప్లక్షద్వీపము. అది పిండాండమున (మానవ శరీరమున) హృదయస్థానమునందు జనించును ఈ స్వరపు ధ్వని "చాషము" అని పక్షిపలుకు స్వరమునకు అనుకరణముగా నుండును. ఇది * ఋషికులమునందు క్షత్త్రియ వంశమునందు జన్మమునంది ప్రఖ్యాతమై యున్నది. దీనిది పిశాజ (సింగళ - ఎరుపు - పసిమి కలిసిన) వర్ణ దేహచ్ఛాయ. యముడు దీని అధిష్ఠాతృ దేవత. ఇది అద్భుత రసముతో (ను అభివ్యక్తము చేయుచు) క్రీడిం (విహరిం) చును. దీనిని కూడ రావణుడు (గాత్రముతో పాటయే కాక) వీణాపై ప్రయోగించెను.

52 - 53. లంకాధీశుడు అగు రావణుడు తృతీయ స్వరమగు 'గాంధార' మును కూడ తన గానమునందు ప్రధానస్వరమునుగా చేసి గానము చేసెను. ఆ స్వరమునకు వాసస్థానము బ్రహ్మాండగోళకమున కుశద్వీపము; పిండాండమున నాసిక దాని (జన్మ - వాస) స్థానము. అజ (మేక) కంఠధ్వనినిపోలు ధ్వనితో అది ఆలాపనము చేయబడును.

* ఋషులు అనగా ఇంద్రియాతీతములగు వానిని కూడ దర్శించువారు; తాము స్వయముగా 'ఋక్' మంత్రములను దర్శించువారు. ఇట్టివారు క్షత్రియులలోను కలరు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

గీర్వాణ (దేవతా) కులమున వైశ్యవంశమున అది జనించినది. సువర్ణ వర్ణము ఈ స్వరపు దేహచ్ఛాయ; చంద్రుడు దీనికి అధిష్ఠాతృ దేవత. దీని రసము అద్భుతరసము. ఈ స్వరమునకు ప్రాధాన్యమునిచ్చి చేయు గానము అద్భుతరసమును అభివ్యక్తము చేయును.

54 - 55. నాలుగవది మధ్యమము (మ) అను స్వరము; వినుము; దీని నివాసస్థానము బ్రహ్మాండగోళమున క్రౌంచద్వీపము; పిండాండమున దీని (వాస) జన్మస్థానము ఉరస్సు; అనగా అందుండి ఇది సుఖముగ (ఆనందకరముగ) ఉచ్చరింపబడును. ఇది క్రౌంచ (పక్షి) స్వరమును పోలు స్వరము (ధ్వని) తో ఆలపించబడును. ఇది గీర్వాణకులమున బ్రహ్మ (బ్రాహ్మణ) వంశమున జనించినది, దీని దేహచ్ఛాయ కుందపుష్పము (మొల్లపూవు) నకుగల ఛాయనుపోలుచు మిగుల సురస (ఆనందకర) మైనది. లక్ష్మి దీనికి అధిష్ఠాతృదేవత; ఇది కరుణరసమును అభివ్యక్తము చేయును; లంకాధీశుడగు రావణుడు దీనిని (దీనికి ప్రాధాన్యము ఉండు స్థాయితో) కూడ గానము చేసెను.

56 - 57. ఐదవది యగు పంచమ (ప) స్వరమునకు నివాస స్థానము బ్రహ్మాండగోళమున శాల్మలీ ద్వీపము; ఈ నాదము పిండాండమున కంఠస్థానము నందు జన్మిం(నివసిం)చును. కోకిలస్వరమునుపోలు స్వరముతో ఇది ఆలపించబడును. ఇది పితృ దేవతా వంశమున జనించినది. (ఇచట దీనికి బ్రాహ్మణాదిజాతి చెప్పబడలేదు.) దీనిరూపము (దేహచ్ఛాయ) కృష్ణవర్ణము; గణనాథుడు దీని అధిష్ఠాతృ దేవత; దీని (ఇది అభివ్యక్తముచేయు) రసము హాస్యరసము. లంకానాథుడగు రావణుడు ఈస్వరముతో (దీనికి ప్రాధాన్యముగల స్థాయితో) కూడ గానము చేసెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

58 - 59 - 60. ఆరవ స్వరమగు 'ధైవతము' (ధ) నకు వాస (జన్మ) స్థానము బ్రహ్మాండగోళకమున శ్వేతద్వీపము అని శాస్త్రములందు ప్రఖ్యాతము. ఈనాదము పిండాండమున లలాటస్థానమునుండి అభివ్యక్త మగును; ఘోషము; (తెలిసికొనుము.) ఇది దర్దుర (కప్ప)స్వరమును పోలు స్వరముతో ఆలాపించ బడును. ఇది ఋషికులమున ఉత్తమ వంశ మున జనించినది. అని అవధానముతో శాస్త్రవిచారణము చేయగా తెలియుచున్నది. దీని రూపము పీత (పసిమి) వర్ణముకలది; నారదుడును గణేశుడును (అథవా నారదుడు అను ప్రమథ గణాధిపతి) దీనికి అధి ష్ఠాతృదేవత (లు). ఇటువంటి లక్షణములు కల 'ధైవత' స్వరమునకు (దీనిచే అభివ్యక్తము చేయబడు) రసము బీభత్సరసము; లంకానాథు డగు రావణుడు శివుని విషయమున తనకుగల భక్తితోను అత్యధికోల్లాస (త్సాహ)ముతోను ఈస్వరము (నకు ప్రాధాన్యముగల స్థాయి)తో కూడ గానము చేసెను. (నారదుడను గంధర్వుడును కలడు. అతడు దీని కధి ష్ఠాత అయి ఉండును.)

61 - 62 - 63. నాయనా! వినుము; 'నిషాదము' (ని) అను నామముగల ఏడవస్వరమునకు బ్రహ్మాండగోళమున పుష్కరద్వీపము ఉత్పత్తి (నివాస) స్థానము; పిండాండమున తాలువుల (దౌడల లోపలి నైపునగల) సంధిస్థానము (సందు) దీని ఉత్పత్తి (వాస) స్థానము; ఇది హస్తి స్వరమునుపోలు స్వరముతో ఆలాపించబడును. ఇది అసుర వంశమున వైశ్యజాతియందు జన్మించినది. దీని రూపము పాటలీ పుష్పపు శుద్ధవర్ణము కలది; దీనిదగ్గరనుండు అధిష్ఠాతృదేవత తుంబుర ముని (గంధర్వుడు) దీనికి అధిష్ఠాతృ దేవత సూర్యుడు అని నిశ్చయ ముగా తెలియుము; దీని (చే అభివ్యక్తమగు) రసము భయానకము - అని తెలియుము. అనగా (దీనికి ప్రాధాన్యమునిచ్చి) రాగమును ఆలా పించినచో తప్పక శ్రోతల మనస్సునందు వ్యాకులత అభివ్యక్తమగును.

16] దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

ఇటువంటి లక్షణములుగల సప్తస్వరములతోను (వీనిలో ఒక్కొక్క స్వరమునకు వేరు వేరుగా ప్రాముఖ్యమునిచ్చు స్థాయిలలో లంకానాథుడు గానము చేసెను.

64. దశశిరుడగు రావణుడు సామవేదమును శ్రీరాగము, వసంత రాగము మొదలగు రాగములతో రాగిణులతో ఆలాపనముచేసి గానము చేసెను.

65. లంకానాథుడగు రావణుడు శివుని ఉద్దేశించి భైరవము మొదలగు పంచ (మ) రాగములతో నటనారాయణ - మేఘ (మల్లారి)- రాగములతో అభ్యాసయోగ పూర్వకముగా గానము చేసెను.

66. గౌడి - కోలాహలి - అంధాళీ - ద్రావిడి - కౌశికమాలి- దేవగాంధారి - రాగములతో కూడ ఆనందలీలాకరముగా లంకా నాథుడు గానము చేసెను.

67. ధనాశ్రీ - వరాళీ - రామక్రియా - మంజరీ-గౌడక్రియా- దేశాక్షీ - అను మనోహర రాగములలోను లంకేశ్వరుడు గానము చేసెను.

68. భైరవి - గుర్జరీ - లలితమగు వేళావళి - కన్నడ - హంస ధ్వని - రాగములతోను దశశిరుడు గానము చేసెను.

69. చూడుము; త్రోటకీ - మోటకీ - టంకాక్షీ - సుధా - నాటికా - ఇంకను వినుము; సైంధవి - మాళవి - ఈ రాగములతోను లంకానాథుడు గానము చేసెను.

70. బంగాళీ సౌరఠ రాగములు కాంభోజి, మధుమాధవి రాగ ములు దేవక్రియా - భూపాళీ రాగములు వీనితోను దశాననుడు గానము చేసెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

71. మాధుర్యము కల వల్లభరాగము - హర్ష (సంతోష) కరమగు రావేరీ రాగము వీరరసప్రధానమగు విహంగ ద్రాత్రీరాగము వసవీజాదిరాగములు వీనితోను రావణుడు గానము చేసెను.

72. చూడుము; రావణేశ్వరుడు తన శిరస్సులను నరకి వానిని కాయలుగా అమర్చి వీణా యంత్రమును నిర్మించి తన కరపద్మములందు ఉంచుకొనెను. ప్రేవుల నరములను వెలికితీసి తంత్రులుగా అమర్చెను. ఇట్లు చేసికొనిన వీణతోను మ్రోయించుచు అతడు గానము చేసెను.

73. నాయనా! వినుము; దశశిరుడగు రావణుడు తాను ఏ రాగమును ఆలాపించుటకును పాడుటకును ఏది తగుసమయమో ఏది అసమయమో ఎరిగి గానము చేసెను. అతడు ప్రాతఃకాలమును ఎనిమిది రాగములను గానము చేసెను.

74. ఎట్లు అనిన - మధ్యమరాగము - వేళావళి - దేశాఖ్యము - భైరవి - భూపాళి - మల్లారము - ధనాశ్రీ - బంగాళి - ఈ ఎనిమిది రాగములను అతడు ప్రాతఃకాలమునందు పాడెను.

75. నాయనా! వినుము; వరాళి - లలితా - గుర్జరీ - గౌడక్రియా - ఆహీరీ-కౌశికీ-అను ఆరురాగములను రావణుడు మధ్యాహ్న సమయమున శివుని ఉద్దేశించి గానము చేసెను.

76. వినుము; సురంజి - తోడీ - మాలశ్రీ - దేశాఖ్య పంచమము - అను ఈ రాగములను ఆ రావణాసురుడు అతి హర్షముతో అపరాహ్ణ సమయమున ఈశ్వరుని ఉద్దేశించి గానము చేసెను.

77. నాలుగవ జామునందు రామకలీ - శ్రీరాగము - దేవక్రియా - పటమంజరీ - ఋతునామముతో ప్రసిద్ధమయియున్న వసంత రాగము అనునవి ఆ రావణుడు శివుని ఉద్దేశించి గానము చేసెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

78. ఇటువంటివే ఇంకను మరికొన్ని రాగములును కలిసి మొత్తము ముప్పదియారు రాగములను సామవేదముతో సమన్వయ పరచి అతడు గానము చేసెను. దానికి చంద్రమౌళి యగు ఈశ్వరుని యందు కల నిశ్చిత దృఢభక్తి ఎటువంటిది - అను విషయము దీనిని బట్టియే తెలిసికొనవచ్చును.

79. రావణుని ఇటువంటి భక్తికి ఈశ్వరుడు త్వరితముగానే ప్రసన్నుడు అయ్యెను. ఆ మహాదేవుడు అతిహర్షముతో నిజరూప మున ఆతని సమ్ముఖమునకు వచ్చి నిలువబడి ఉండెను.

80. ఐదు ముఖములు - మూడు నేత్రములు - దశభుజములు కల స్వరూపము ధరించి వాని ఎదుట నిలువబడియుండి శివుడు సంతోష పూర్వకముగా - "వరములను కోరుకొనుము." అని పలికెను.

81. రావణుడు శివునితో ఇట్లనెను: దేవా ! నేను నీదగ్గరనుండి 'ఇదికావలయును.' అని ఏమి అడుగుదును ? లక్ష్మి నాఇంటిదాసిగా నున్నది; అష్టనిధులును నా ద్వారమునందే పడియుండును.

82. చతుర్ముఖుడగు బ్రహ్మ నాకు జ్యోతిషికుడు. ముప్పది మూడుకోట్ల దేవతలును సూర్య చంద్ర వరుణ వాయువులును హర్ష ముతో నాకు సేవ చేయుచుందురు.

83. అగ్నిదేవునివంటి వాడును నాకు సేవచేయుచున్నాడు. అతడు అధికమగు నేర్పుతో నా వస్త్రములను ఉదికి శుద్ధములనుగా చేయుచుండును. యముడు నా ఆజ్ఞను తలపై ధరించి నెరవేర్చు చుండును. నా ఆజ్ఞ లేనిదే ఆతడు ఎవరిని చంపడు.

84. ఇంద్రుని పరాభవించిన కుమారుడు నాకు కలడు. కుంభ కర్ణుని అంతటివాడు నా భ్రాత నా నివాసస్థానము సముద్రమునందు ఉన్నది. కామధేనువు నా ఇంటియందే కలదు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

౮౫. * ఆరు కోట్ల సంవత్సరములు నా ఆయుష్యము. నాతో సమానుడు, రెండవవాడు ఎవడును లేడు. అయినను ఇపుడు నేను ఇష్టుడను కైలాస పర్వతమును లంకకు తీసికొనిపోయెదను. అను సంకల్పము కలిగి ఈశ్వరా మీద నీకడకు వచ్చి యున్నాను.

౮౬. కృపామూర్తీ? వరప్రదాతా! నేను నాకయి ఏమియు కోరి కోరుటకు రాలేదు. నా జననికి వ్రతము ఒకటి యున్నది. అనునిత్యమును ఆ వ్రతనియమము ననుసరించి ఆమె నిన్ను పూజించవలసి యున్నది. కనుక ఇది కోరివచ్చిన నీ భక్తుని మనోరథమును పూరించవలయును. అని మిమ్ము వేడుచున్నాను.

౮౭. అనగా విని ఈశ్వరుడు రావణునితో ఇట్లనెను. నీ మనస్సున నా పూజకు గురించిన కోరిక యున్నచో నీవు కైలాస (పర్వత) ముతో ఏమిచేయుదువు? నా ప్రాణలింగమును నీకు ఇత్తును.

౮౮. మనస్సునందు ఏ ఏ కోరిక యుండునో - అదియెల్ల అది పూరించును. అని తెలిసికొనుము. ఏలయన ఆలింగము నా ప్రాణ సన్నిధానము అయి యున్నది. అని పలికి ఈశ్వరుడు రావణునకు అది ఇచ్చెను.

౮౯. త్రికాలములల (ప్రాతర్ - మధ్యాహ్న - సాయం - సంధ్యా సమయముల) యందును స్నానించి పూజించుము; అష్టోత్తర శత సంఖ్యతో (ప్రణవము మంత్రముగా అథవా రుద్రాధ్యాయమును) జపముచేసి అభిషేకమును జరిపి ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి ఆ ప్రాణలింగమును నీవు పూజ చేయుము.

---

* ఒక మహాయుగమున 4320000 సంవత్సరము లుండును. ఇది భువన సంఖ్యయగు 14 తో గుణించగా 60480000 అగును. అనగా రావణుడు ఒక్కొక్క భువనమును 1 మహాయుగము చొప్పున పాలించెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

90. ఇట్లు నీవు మూడుసంవత్సరములపాటు పూజచేసిన-చో నీవే నా రూపము (పొందినవాడవు) అగుదువు. మనస్సునందు ఏది ఏది కోరుదువో అది త్వరితముగా నిశ్చయముగను పొందుదువు. అని ఎరుగుము.

91. ఇంకను వినుము; ఈ లింగము ఎవనియొద్ద ఉండునో - వానికి మృత్యువు ఉండదు. అనునిత్యమును దానిని దర్శించినంత మాత్రముననే త్వరితముగను నిశ్చితముగను దోషములు (అన్నియు) తొలగిపోవును. అని తెలిసికొనుము.

92. నీవు దీనిని భూమిపై పెట్టకుము. నీవు ఎప్పుడు నీ నగరమునకు చేరుదువో అప్పటినుండి మూడు సంవత్సరములపాటు దానిని పూజించుము. నీవే ఈశ్వరుడ వగుదువు.

93. ఇట్లు లంకేశ్వరుడగు రావణుడు ఈశ్వరుని వలన వరములను పొందెను. అతడు అతనికి సాష్టాంగ నమస్కారము చేసెను. * కర్పూర గౌరుడు (ఈశ్వరుడు) అతనికి అనుమతి ఇచ్చెను. అది అందుకొని అతడు త్వరితముగా లంకకై బయలుదేరెను.

---

* కర్పూరమువలె తెల్లనివాడు; మొదట కర్పూరము ఒక పదార్థముగా గోచరించుచుండును. దానినుండి సుగంధము అనుభవమునకు వచ్చును. ఆనందము కలుగును. క్రమముగా అది హరించును. సుగంధము మాత్రము అనుభవములో మిగులును. ఆనందము కలుగును. దానిలో తాదాత్మ్యము కలిగిన తరువాత ఆనందము మాత్ర ముండును. అట్లే సగుణోపాసనకాలమున (ఈశ్వరుడు శుద్ధసత్త్వమూర్తియగు స్వయంజ్యోతిరూపుడు) పరమేశ్వరరూపము తద్దర్శనము ఆనందము - క్రమముగ ఈశ్వరరూప భావము లయమందు ఆనందము మాత్రముండును క్రమముగ ఆనందానుభవము నందుచున్నానను భావనకూడ లయమంది. ఆనందరూపత (శుద్ధమైనది) మాత్రము మిగులును. అదియే కైవల్యము. ఇట్టి దశకు అవలంబనమగు పరమేశ్వరుడు కర్పూరగౌరుడే కదా !

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

94. ఇది ఇట్లు జరుగుచున్న సమయమునందే నారదుడను ఋషీశ్వరుడు ఉన్నాడు కదా, ఆతడు మిగుల వేగముగా ఇంద్ర (స్వర్గ) లోకమునకు పోయి అమరపురి (అమరావతి) చేరెను.

95. పోయిన నారదుడు ఇంద్రునితో ఇట్లు పలికెను. స్వస్థ చిత్తుడనయి ఏల కూర్చుండి యున్నావు ? ఇపుడు రావణునకు అమర త్వము ఈయబడినది. నీ లక్ష్మి నీనుండి తీసికొనపోబడినది.

96 - 97. లంకేశ్వరుడు చిరాయువు అయినాడు. (ఏలయన) కర్పూర గౌరుడు అతనికి తన ప్రాణలింగమునే ఇచ్చినాడు. ఇంతియే కాక వరములను కూడ అతడనికి ఇచ్చినాడు; ఏమి అనిన - "నీవే ఈశ్వరుడ వయ్యెదవు, మూడు సంవత్సరములు (నా ఈ ప్రాణలింగ మును యథోక్త విధానమున) పూజించినచో నీవే నాస్వరూపము (కలవాడవు) అయ్యెదవు. నీ నగరియే కైలాసము అగును. నీకు ఎన్న డును మృత్యువు ఉండదు."

98. ఇటువంటి వరములను పొంది సంతోషించి రావణుడు బయలుదేరి వెళ్లినాడు. ఇపుడు ఇక ముప్పదిమూడుకోట్ల దేవతలు నీచేత వాని (రావణుని) చెరనుండి విడిపింపబడగలరు !

99. నీవు ఇపుడు త్వరితముగా లంకకు పోవలసియుండును. లంకానాథుని సేవ చేయవలసియుండును. ఊర్వశి - రంభ - మేనక - మొదలగు అప్సరసలను త్వరితముగా రావణునకు కానుకగా కొనిపో (యి అర్పించ) వలసి యుండును.

100. ఇటువంటి నారదుని వచనములను విని ఇంద్రుడు భయ మంది కంపించెను. అతడు కరములు జోడించి నారదునకు ఇట్లు మనవి చేసెను : నేను ఇపుడు ఏమి చేయ వలసి యుండును ? అనెను.

101. నారదుడు ఇంద్రునితో ఇట్లు అనెను : త్వరితముగ నీవు ఒక ఉపాయము చేయవలసి యున్నది. నీవు బ్రహ్మదేవుని కడకు

పోవలసి యుండును. అతడు ఇందులకు తగిన ఉపాయమును త్వరిత ముగా చేయును.

102. ఇంద్రుడు వెంటనే త్వరితముగ నారదునితో కలిసి బ్రహ్మలోకమునకు పోయెను. ఇంద్రుడు జరిగిన వృత్తాంతము అంతయును బ్రహ్మకు విస్తరించి చెప్పెను.

103. బ్రహ్మదేవుడు ఇంద్రునితో ఇట్లు పలికెను : త్వరితముగ (మనము) వైకుంఠమునకు వెళ్లవలయును. హృషీకేశుడు (మహావిష్ణువు) దైత్యులపై (చేయదగిన) ఉపాయమును నిశ్చయముగ చేయును.

104. ఇట్లు అని ముప్పురును అక్కడినుండి బయలుదేరిరి. త్వరితముగా వైకుంఠలోకమునకు చేరిరి. శ్రీమన్నారాయణుని దర్శించి అతనితో సమావేశము నందిరి. అతనికి రావణుని వృత్తాంతము అంతయు చెప్పిరి.

105. బ్రహ్మదేవుడు విష్ణునితో ఇట్లనెను : మిగుల శీఘ్రముగా మీరు దీనికి తగిన ప్రతీకారమును చేయవలయును వినుము; ఈ రావణుడు నీవు శ్రీరామావతారమును ధరించుటకు నిమిత్తభూతుడు అయి ఉన్నాడు.

106. వీడు ముప్పది మూడు కోట్ల దేవతలను బంధనములలో వేసి ఉన్నాడు. ఈకారణముననే ఈతని వృత్తాంతము నీ అవతారమునకు కారణమయి ఉన్నది. అని ఎరుగుము.

107. ఈ దైత్యుడు తన మంచితనముతో ఈశ్వరుని ప్రాణ లింగమునే తీసికొని వెడలినాడు. ఇపుడు ఈ రావణుడు ఎవరికిని భంగ పరచ నలవికాని వాడయి నాడు. ఏలయన - ఇపుడిక వాడే ఈశ్వరుడు అగును.

108. త్వరితముగా దీనికి ఉపాయము చేయుము. తడవుచేసినచో తరువాత నీకును అసాధ్యుడు అగును. ఈ రాక్షసుని నిర్దళనము

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

(సృష్టి - నశింపజేయుట) చేయుటకై నీతో (రామావతారమే కాక అనేకమైన ఇతరములగు రూపముల) అవతరించిపోవలసి వచ్చెను.

109. చతురాననుడు (నాలుగు ముఖములు కలవాడగు బ్రహ్మ) స్తుతి చేసెను. అప్పుడు శ్రీమహావిష్ణువు కోపించి ఇట్లు పలికెను: కార్యము అంతయు చెడిపోయినది. ఇట్లని అతడు చట్టున కైలాసమునకై బయలుదేరెను

110. శ్రీమహావిష్ణువు ఈశ్వరుని సమీపమునకు వచ్చెను. "శంకరా! ఎంతపనిచేసితివయ్యా! నీవు రావణునకు నీ ప్రాణలింగమును ఈయవలసిన కారణము ఏమి?" అని పలికెను.

111. రావణుడు మొదటే క్రూరుడగు మహాదైత్యుడు గదా! సకల సురవరులును వానికి భృత్యులయినారు. అతని ఇంటి వారు అందరును కారాగృహబంధితులై యున్నారు.

112. ఇటువంటి దురాచారునకు వరము ఇచ్చితివనిన నీవు ఎటువంటివాడవయ్యా! దేవత్వము వాని ఇంటికి పోయెనే! ఇక వాడు స్వర్గమునుకూడ తన యధీనముచేసి తీసికొనును - అనుట నిశ్చయము.

113. ఈశ్వరుడు విష్ణునితో ఇట్లుపలికెను: నేను వాని భక్తికి సంతుష్టుడ నయితిని. ఆ ఆనందములో నాకు ఇదియంతయు మరపునకు వచ్చెను. అందుచే సంతోషించి నేను వానికి నా ప్రాణలింగమును ఇచ్చితిని.

114. చూడుము. వాడు తన శిరములనే ఖండించి తనచేతులతో నాడి కాయలుగా ఏర్పరచి వీణను చేసెను. సప్తస్వర ప్రస్తార పూర్వకముగా భక్తితో వేదాధికము గానము చేసెను.

115. శ్రీమహావిష్ణువు ఉమాకాంతుని (శివుని) తో ఇట్లు అనెను. నీవు ఇటువంటి వరమును ఇచ్చినందువలననే ఈ దైత్యుడు (లు)

ఉన్మత్తుడు (లు) అగుచున్నాడు (రు). అందుచే నాకు మిక్కిలి శ్రమ యగుచున్నది.

116. ఏలయన - వీడు (రు) దేవతలు ద్విజులు మొదలగు సజ్జనులతో కూడిన లోకములకు అత్యధికమగు పీడ కలిగించుచున్నాడు(రు). ఈ కారణముచే నాకు అవతారములను ధరించుట ఆవశ్యక మగుచున్నది; చూడుము.

117. భక్తుడు నా విషయమున చూపు భక్తివలన కలుగు పారవశ్యముచే నేను (సాధారణముగా) అన్నియు మరచిపోవుచుందును; పొరబాటు పడుచుందును. నిజము చెప్పుచున్నాను. వినుము; అట్టి స్థితిలో నా భక్తుడు (అగు రావణుడు) నన్ను పార్వతినే ఇమ్మని అడిగినను ఇత్తును. (ఇచ్చి యుండెడివాడను.) అట్టిస్థితిలోనే వాడు నా ప్రాణలింగమును తీసికొనిపోయెను; ఏమిచేయగలను ?

118. నీవు వానికి లింగమును ఎప్పుడు ఇచ్చితివి ? (ఇచ్చి ఇప్పటికి ఎంతసేపు అయినది ?) ఈ పాటికి వాడు దానిని లంకకు తీసికొనిపోయి యుండడునా ? అని విష్ణువు అడిగెను. 'చూడుము; ఐదు గడియలైనది.' అని శంకరుడు విష్ణువుతో అనెను.

119. శివునిమాట వినుచునే నారాయణుడు ఒక ఉపాయము చేసెను. సూర్యునకు అడ్డము అగుటకై (కావలసినది అని ఆజ్ఞాపించి) అతడు తన సుదర్శన చక్రమును పంపెను.

120. మరియు - హృషీకేశుడు నారదుని తన సమీపమునకు పిలిచి అతనితో ఇట్లు చెప్పెను. నీవు త్వరితముగా పొమ్ము; రావణుడు లంకకు పోవుచున్నాడు గదా !

121. వినుము; వాని శ్రోవయందే (నీవును) పొమ్ము. పోయి తడవు అగునట్లు చేయుము; వానిని నీవు లంకకు పో (చేర) నీయరాదు. త్వరితముగా పొమ్ము. అని నారదునితో విష్ణువు పలికెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

122. ఇంకను అతడు అతనితో ఇట్లు పలికెను: నా సుదర్శన చక్రము సూర్యునకు అడ్డమయి ఉన్నది. రావణునికో స్నానసంధ్యలు అనిన చాల ఆసక్తి; నీవు పోయి గట్టిగా (ప్రయత్నించి) వానికి తడవు కలిగించుము.

123. ఇటువంటి శ్రీ మహావిష్ణుని వచనమును విని నారదముని త్వరితముగా పోయెను. మనోవేగముతో పోయి లంకానాథు డగు రావణుడు పోవుచున్న త్రోవలో అతడు ఉన్న చోటున చేరెను.

124. ఇట్లు నారదుని పంపి (న తరువాత) శ్రీ మహావిష్ణువు తన మనస్సులో ఆలోచించెను. వానికి (రావణునకు) విఘ్నము కలిగించుటకై విఘ్నేశ్వరుని వేడుకొని పంపుదును. అని తలచెను.

125. విష్ణువు గణేశుని పిలిపించి వినయముతో ఇట్లు పలికెను: రావణుడు ఎట్టివాడో వింటివా? వాడు సదా నిన్ను ఉపేక్షాభావముతో చూచు చున్నాడు.

126. సకల దేవతలును నిన్ను నమస్కరింతురు. నీవు వారి కోరికలను పూరింతువు. ఏ జనులు (ప్రాణులు) నిన్ను ఉపేక్షింతురో - వారికి విఘ్నములు కలుగును.

127. చూడుము: వాడు నీకు తెలియకుండగనే ఒకానొక విధానమును (నిధిని) తీసికొనిపోయి నాడు వింటివా? శివుని మోసగించి అతి విశిష్టమగు శివుని ప్రాణలింగము తీసకొనిపోయెను.

128. వినుము; నీవు ఇపుడు ఒక పని చేయవలయును. కపటవేషమున పొట్టి బ్రహ్మచారివి కావలయును. అట్లు బాలక వేషము ధరించి రావణునికడకు పోవలయును.

129. (వాడు) త్రోవలో ఉండగా సూర్యుని అస్తమయమగును. రావణుడు సంధ్యావందనము చేయును. ఈ కారణముననే (ఇదే పని

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

మీద) అనగా రావణునికి విఘ్నముకలిగించి విలంబము అగునట్లు చేయుటకే ఇంతకు ముందే నారదుడు పోయి ఉన్నాడు.

130. ఈ ప్రాణలింగమును భూమిపై పెట్టరాదు అని రావణునకు శివుని ఆజ్ఞ; శౌచము ఆచమనము (మొదలగునవి) చేసికొను సమయమునందు వాడు దానిని తనదగ్గర ఉంచుకొనడు.

131. గణపతీ! నీవు బాలకుని రూపమున వానిదగ్గరకు పోవలయును. వాని శిష్యుడేమో యనునట్లు వానికి నీపై కారుణ్యభావము (వాత్సల్యము) కలుగునట్లు నీ పసితనపు అమాయికత్వమును చూపవలయును. వానిని నమ్మించి ఆ ప్రాణలింగమును తీసికొని రావలయును.

132. తనకు నీయందు కలుగు నమ్మికచేత రావణుడు సంధ్యా (వందన) సమయమున ఆ ప్రాణలింగమును నీ చేతికి ఇచ్చును. నీవు ఆ లింగమును నేలపై ఉంచవలసినది. అది ఇక అచ్చటనే ఉండిపోవును. (లంకకు ఎన్నటికి చేరదు.)

133. నామధారకా! వినుము; శ్రీమహావిష్ణువు ఈవిధముగా గణేశునకు అతడు చేయవలసిన పనిలో శిక్షణము ఇచ్చెను. గణేశుడును సంతోషించెను. మహాహర్షము చెందెను. ఆసమయమందే ఆ గణపతి తనకు (బారిబత్తెముగా) చిరుతిండి ఏదయిన కావలయునని విష్ణుని కోరెను.

134. మావులతో చేసిన లడ్డులు - పంచఖాద్యములు - (పంచకజ్జాయములు) చెరకు - కొబ్బరి - దానిమ్మపండ్లు - చక్కెర - నేయి (మొదలగువానితో చేసిన తినుబండారములు) నన్ను (నాతిండిబోతుతనమును)కనిపెట్టిచూచి ఇప్పటికిప్పుడు త్వరితముగా ఈయవలసియుండును.

135. నాకు నానవేసిన శనగలు బియ్యము - ధనియాలు - చక్కెర - ఈమూటితో చేసిన చిరుతిండ్లు నాకు గాను ప్రత్యేకముగా తెప్పించి భక్షణమునకై త్వరితముగా ఈయవలయును. అనెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

136. విఘ్నేశ్వరుడు ఏది ఏది అడుగుచుండెనో. అదియెల్ల శ్రీ మహావిష్ణువు త్వరితముగ ఇచ్చుచు పోవుచుండెను. గణపతియు అవియెల్ల భక్షించుచునే బ్రహ్మచారివేషమును ధరించి మిగుల త్వరితముగా బయలుదేరి పోసాగెను.

137. గణపతి కంటె ముందుగా పోవుచుండిన మహర్షి బ్రహ్మర్షియగు నారదుడును రావణునకు ఎదురుగావచ్చి అతనిముందు నిలువబడి చాల అమాయికముగా (తాను ఏమియు ఎరుగనట్లు) ఎక్కడినుండి వచ్చుచున్నావు? అని వానిని ప్రశ్నించెను.

138. రావణుడు నారదునితో ఇట్లు పలికెను: నేను కైలాస పర్వతమునకు వెళ్లియుంటిని. మహాతపస్సుచేసితిని. చంద్రమౌళిని (తన శిరస్సునందు తలపూవుగా చంద్రుడేకల శివుని) సంతోషింప జేసితిని.

139. వినుము; ఆ మహాదేవుడు నా విషయమున ప్రసన్నుడు (అనుగ్రహముకలవాడు) అయి నాకు (తన ప్రాణ) లింగమును ఇచ్చెను. తన సంతోషములో ఆభగవానుడు ఇంకను ఈ లింగమహిమము అపారమని కూడ చెప్పెను.

140. అని పలికిన రావణుని వచనములు విని నారదుడు వానితో "లంకానాథా! ఇపుడు నీకు (నీవిషయమున) దైవము (అదృష్టము) అధికముగా ఫలించి లభించినది; కావుననే నీవు ఈ అమృత (మృత్యుజయకరమగు) లింగమును పొందితివి. నాకు ఈ లింగపు ఆద్యంతమంతయు తెలియును.

141. "ఏదీ! ఒకమారు నాకు ఆలింగమును చూపుము; అది ఎటువంటిదో చూతును. నామాట వినుము; నేను లింగలక్షణములు ఎరుగుదును. ఈ లింగలక్షణములు (చూచి వాని ఫలములను) నీకు చెప్పెదను."

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

142. నామధారకా ! (సరస్వతీ !) వినుము; రావణుడు నారదుని వచనములను విశ్వసించ లేదు. (దానిపైనున్న వస్త్రపు చాటును తొలగించి) దూరమునుండి పేం. ఆలింగము 'ఇదిగో' ఇది ఇట్టిది అని వ్యక్త (స్పష్ట) పరచి ఆ లింగమును ఆ సమయమునందు చూపెను.

143. నారదుడు లంకేశునితో ఇట్లు పలికెను : రావణా ! నేను ఈలింగమహిమమును ప్రకాశపరచి చెప్పెదను. దీని మహిమము చాల అధికమయినది. దీనికి సంబంధించిన కథ గలదు కూర్చుండి వినుము.

144. ఈ లింగము ఏదినమున ఎట్లు ఉత్పన్నమయ్యెనో కూడ - దీని పూర్వాపరములన్నియు నేను ఎరుగుదును; ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము; దీని విషయమున అపూర్వమగు కథ ఒకటి కలదు.

145. వినుము; ప్రళయ కాలాగ్ని సమానమగు మృగము ఒకటి యుండెను. అది బ్రహ్మాండ ఖండమందంతటను చొరబడుచు తిరుగు చుండెను. సకల సైరిభము (అడవిదున్న మొదలగు మృగము) లను తినుచుండెను.

146. వినుము; బ్రహ్మ విష్ణు మహేశ్వరులు దానిని వేటాడుటకై వెళ్లియుండిరి. వారు ఆమృగమును చంపిరి. అంతట (తరువాత) వారా మృగపు మేదస్సును (ఎముకల సంధులయందలి క్రొవ్వునంటు ఒకానొక పదార్థమును) తినిరి.

147. దానికి (ఆ మృగమునకు) మూడు శృంగములు ఉండెను. వాని అడుగుభాగమున మూడు లింగములు ఉండెను. వినుము; అవి తమ తమ ప్రాణలింగములు అని ఆ మూవురును ఒక్కొక్కరు ఒక్కొక్క దానిని తమ భాగమునకు పంచుకొనిరి.

148. ఈలింగపు మహిమమును చెవులార వినుము; ఎవరు ఇది మూడు సంవత్సరములు నిరంతరముగ పూజింతురో వారు నిస్సంశయముగ ఈశ్వరుడుగ అగుదురు. అట్టివారు తామే వరదమూర్తి అగుదురు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

149. ఈ లింగము ఏస్థానమునందు ఉండునో - అదియే కైలాసము అగును. అని తెలియుము. ఈలింగముల యోగ్యత మూలము ననే బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును ఇంతటి గొప్ప మహత్త్వము వచ్చినది.

150. ఇంతేకాదు; ఈలింగమునకు ఇంకను అపారమగు మహిమము కలదు; అదికూడ చెప్పెదను; ఏక (ఏకాగ్రతా) నియమముతో వినుము, అని ఇంకను నారదుడు చెప్పుచు పోవుచుండ రావణుడు అతనిని నడుమనే నిలిపి ఇట్లు అనెను, (నారదా ! నాకు అంతయు తెలియును; నీవు నాకు మరియేమియు చెప్ప పనిలేదు. నీ మాటలు వినుచు కూర్చుండు తీరికయు నాకు లేదు,) నాకు పనియున్నది; త్వరితముగా లంకకు పోవలసి యున్నది.

151. ఇట్లు పలికి మహాబలుడగు ఆ రావణుడు బయలుదేరెను; అప్పుడు నారదుడు వానితో ఇట్లు అనెను : రావణా! సూర్యాస్తమయ (కాల) ము సమీపించుచున్నది; బ్రాహ్మణునకు ఇది సంధ్యావందన సమయము గదా !

152. నీవు సహస్ర (శాఖాత్మక) మగు (సామ) వేదమును చదివినవాడవు గదా ! సంధ్యా (వందన) కాలము గోల్పోవలసిన నడతువా ? (అది తగునా ?) తప్పినలోనే నీకు రాత్రియగునే ! సంధ్యా (వందన) లోపము జరుగునే!

153. ఇదుగో నేనును సంధ్యావందనము చేయబోవుచున్నాను. అని నారదుడు వినయ పూర్వకముగా రావణుని (నీవు కూడమరి సంధ్యావందనమునకు వత్తువా యని) అడిగి అతడు నదికి పోయెను.

154. ఇంత జరుగుచున్న నా సమయముననే గణేశుడు అక్కడికి చేరెను. ఆతడు బ్రహ్మచారి రూపుడై చూడ వేడుక కలిగించు వేష

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ముతో నుండి (తన అగ్నికార్యమునకేమో) యనునట్లు సమిధలను విరచుకొని యుండి కాలినడకతో రావణుని ముందునకు వచ్చెను.

155. రావణుడును అపుడు తన మనస్సునందు ఇట్లు చింతించెను. నాకు వ్రతభంగము అయ్యెనే! నేను త్రిసంధ్యాకాలము లందును సంధ్యా వందనము చేయవలసియున్నది. కాని ఇపుడు సందేహాస్పదమగు స్థితి ఏర్పడినది.

156. ఏలయన - ఈశ్వరుడు నాతో ఈ ప్రాణలింగమును భూమిపై పెట్టవలదు, అని చెప్పియుండెను. (లింగమును) దగ్గరనుంచు కొని శౌచాదికమును సంధ్యావందనమును ఎట్లు చేయవచ్చును?) ఇపుడో - సంధ్యాసమయము ఐనది; నిశికూడ అగుచున్నది. ఏమి చేయుదును? అని వాడనుకొనసాగెను.

157. అదేసమయమున రావణునకు ఒక బ్రహ్మచారి కనబడెను. అతడు అతి సుందరుడు. చిన్న బాలకునివలె నుండెను. నదీతీరమున తిరుగుచు ఉండెను. అట్టివానిని రావణుడు ఆసమయమున (గమనించి) చూచెను.

158. మరియు లంకానాథుడు తన మనస్సులో ఇట్లు విచారించు కొనెను: ఈ బ్రహ్మచారి కుమారుడు (చిన్నవయస్సులో ఉన్న కుఱ్ఱవాడు) గా కనబడుచున్నాడు. నాకు (నావిషయములో) విశ్వాస ఘాతము చేయడు. కనుక అతనిచేతిలో (చేతికి) ఈ లింగమును ఇత్తును.

159. స్వస్థమయిన (ఏచింతయు లేని) చిత్తముతో సంధ్యా వందనము చేసికొందును. అంతసేపును లింగము అతని యొద్ద ఉండును. ఇతడు నిశ్చితముగా బాలుడే. (మోసగాడు ఏమాత్రమును కాడు.) ఇట్లు అనుకొని అతడు అతనిదగ్గరకుపోయెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

160. దశ శిరుడగు రావణునిచూచి లంబోదరుడు (భయపడి) పారిపోవసాగెను. (వెంటనే) రావణుడు (ఆ పదితలలు కల రూపము విడిచి) బ్రాహ్మణ శ్రేష్ఠుడుగా అయ్యెను. 'అభయము' (ఇచ్చుచున్నాను.) నావలన నీకు ఏమియు భయములేదు. అనుచు అతడు గణపతిదగ్గరకు పోయెను.

161. రావణుడు అతనిని ఇట్లు ప్రశ్నించెను. నీవు ఎవడవో నాకు చెప్పుము. నీకు తల్లిదండ్రులు ఎవరు ? నీ జన్మము (నీవు పుట్టినది) ఏ కులమునందు ?

162. బ్రహ్మచారి రావణునితో ఇట్లు అనెను; నీవు నన్ను ఇంత అడుగుచున్నావు; కారణము ఏమి ? మా నాయన నీకు (తాను నీయొద్దనుండి తీసికొనిన) ఋణము ఏమి ఈయవలసియున్నదో నాకు మొదట చెప్పుము.

163. లంకేశ్వరుడు చిరునవ్వు నవ్వి వాత్సల్య విశేషముతో ఆ బాలుని చేయి పట్టుకొనెను. బాలకా! చెప్పుము; నీవు ఎవరికుమారుడవు ? ప్రీతిభావముతో నేను అడుగుచున్నాను. అని అడిగెను.

164. బ్రహ్మచారి అంతట రావణునితో ఇట్లు అనెను. మా తండ్రి ఎవరు అని ఏమి అడిగెదవు ? అతడు జటాధారి; భస్మాంగుడు; అతనికి రుద్రాక్షమాలయు ఉన్నది సుమా.

165. శంకరుడు అనునది అతని పేరు. అతడు అహర్నిశము లును (నింతరమును) భిక్షము అడుగుకొనుచుండును. వృషభమును ఎక్కి తిరుగుచుండును. సరసురాలు, జగన్మాత యగు ఉమ వంటిది - మా తల్లి.

166. నన్ను ఇంత ఎందులకు అడిగెదవు ? ఉన్నమాట చెప్పెదను; వినుము; నిన్ను చూచినంతమాత్రముననే నాకు చాల భయము కలుగుచున్నది. నాచేయి వదలుము; వెళ్లిపోయెదను.

167. అనగా విని రావణుడు ఆబ్రహ్మచారితో ఇట్లు పలికెను : నీ తండ్రి దరిద్రుడుగా ఉన్నాడు గదా! నిరంతరమును భిక్షము అడిగి కొనుచు అధికముగా క్లేశ పడుచుండును. నీకు ఎక్కడను సౌఖ్యమే లేదుకదా!

168. నా నగరము లంకాపురము; నా గృహము రత్నఖచితము (రతనములు తాపటము చేసినది) గా నున్నది. అబ్బాయీ మా ఇంటికి రావయ్యా! సుఖముగా అచ్చట దేవపూజ (మా ఇంటి దేవతార్చన) చేయుచు ఉండుము.

169. వినుము నీవు నన్ను ఏది ఏది అడిగెదవో - అదియెల్ల ఇత్తును. సుఖముగా మాతో సమానముగా జీవించు చుండుము. అని రావణుడు అపుడు ఆ బ్రహ్మచారి (రూపమున ఉన్న గణపతి)తో పలికెను.

170. అది విని బ్రహ్మచారి వానితో ఇట్లు పలికెను: లంకయందు చాలమంది రాక్షసులు ఉందురు. నేనో - అరణ్యవాసి యగు బాలకుడను; అక్కడ వారు నన్ను తినివేయుదురు. సుమా!

171. నేను నీపట్టణమునకు రాను; నన్ను విడిచిపెట్టుము; నేను మా ఇంటికి పోవుదును; ఆకలితో చాల బాధపడుచున్నాను. అని గణపతి తనదగ్గరనున్న చిరుతిండ్లను తిని వేసెను.

172. ఇంతమాత్రము పలికిన విఘ్నేశ్వరుని మాటలు విని లంకానాథుడు ఆ బాలకుని బ్రతిమాలసాగెను; నేను సంధ్యావందనము చేసికొందును. అంతవరకు ఈ లింగమును పట్టుకొనుము అని పలికెను.

173. ఆ బాలకుడు వానితో ఇట్లు మనవి చేసెను. ఏమయ్యా! వినుము; నేను లింగమును పట్టుకొనను. నేను అరణ్యవాసి యగు బ్రహ్మచారిని. నన్ను ఊరక బాధపెట్టవద్దు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

174. నీ లింగము చాల బరువుగా నున్నది అని నాకు తోచు చున్నది. నేనో - ఏమియు ఎరుగని బాలకుడను అయి ఉన్నానుకదా! కనుక నేను నీ లింగము తీసికొననైన తీసికొనను; పోవుదును; వదలుము. నీకు పుణ్యము కలుగునయ్యా!

175. అని ఇట్లు గణపతి పరి పరి విధముల బ్రతిమాలినను లంకానాథుడగు రావణుడు కూడ ఆ గణపతిని మరియు పరి పరి విధ ములుగ బ్రతిమాలి లింగమును ఆ బాలకునకు ఇచ్చుచునే తాను సంధ్యావందనము చేసికొనుటకై త్వరితముగా పోయి సముద్రతీరమున కూర్చుండెను.

176. అంతలోనే ఆ బ్రహ్మచారియు సముద్రపు టొడ్డున లేచి నిలువబడెను. రావణునితో ఇట్లని మనవి చేసెను: నాకు ఈలింగము బరువయినది. త్వరలోనే భూమిపై పెట్టుచున్నాను.

177. ఏమయ్యా! వినుము; నేను నిన్ను మూడుసారులు పిలి చెదను. అప్పటికిని నీవు వచ్చుటకు తడవు పట్టినచో నే నిది భూమి మీద పెట్టెదను.

178. ఇట్లు నిశ్చయముచేసి చెప్పి గణేశుడు లింగము చేతపట్టు కొని నిలువబడెను. సమస్త దేవతలును తమ తమ విమానములందు కూర్చుండి కుతూహలముతో ఇదియంతయు చూచుచుండిరి.

179. నామధారకా! వినుము; రావణుడు అర్ఘ్యము అర్పించు చున్న సమయమునకు సరిగా గణేశుడు వానిని పిలిచెను. నాకు ఈ లింగము బరువయి పోయినది. ఇది తీసికొనుమయ్యా! అనెను.

180. చూడుము; రావణుడు శాస్త్ర సంప్రదాయములను బాగుగా ఎరిగినవాడు కావున అతడు అత్యంత వివేచనముతో గాయత్రీ మంత్రమునకు చేయవలసిన న్యాసములను చేసియే అర్ఘ్య ప్రదానము చేయుచుండెను. (అందుచే అతడు మానముతో నుండియే) బాలకా!

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

(అబ్బాయీ !) వచ్చుచున్నాను; ఉండుము ; అని అర్థము అగునట్లు చేతితో సైగలు చూపెను.

181. ఇంకను ఒక క్షణకాలము వరకు చూచి గణేశుడు రెండవ మారులు వానిని పిలిచెను. ఇది నాకు చాల బరువయినది; శీఘ్రముగా రావలయును అనెను.

182. రావణుడు ధ్యానస్థుడుగ నుండెను. అందుచే అతడు రాలేదు. గణేశుడు పైవిధముగ ఉచ్చరించుచునే సమస్తదేవతలును సాక్షులు (గా నున్నారు.) అనుచు లింగమును భూమిపై ఉంచెను.

183. గణేశుడు శ్రీమహావిష్ణుని స్మరించి లింగమును భూమిపై స్థాపనముచేసి ఉంచెను. గగనమందుండి ఇదిచూచి సురవరులు సంతుష్టులయి పూలవాన కురియించిరి.

184. లంకేశ్వరుడు అర్ఘ్యము ఇచ్చుట ముగించి చాల త్వరితముగ బయలుదేరివచ్చెను. మరియు అక్కడ లింగమెక్కడనా యని చూచెను. అప్పటికే అది భూమిపై ఉంచబడి యుండెను.

185. నామధారకా ! చూడుము. శ్రద్ధగా వినుము; రావణుడు ఆవేశముచెంది గణనాయకుని గుద్దు గుద్దెను. * హస్తివదనుడు (ఏనుగు మొగము కలవాడు - వినాయకుడు) హాస్యవదనుడై (నవ్వు మొగముతో - కొంటెతనముగా) ఏడువ సాగెను. ఆ ఏడుపుతోనే భూమిపై పొరలిపోడసాగెను.

186. గణనాయకుడు (ఏడ్చుచునే) ఇట్లు అనెను. నేను ఇపుడు త్వరితముగాపోయి మా నాయనతో చెప్పెదను. బాలకుని (పసివాడనగు నన్ను) ఏల కొట్టితివి ? అనుచు ఏడ్చుచు అచ్చటినుండి బయలుదేరెను సుమా !

---

* ఇచట మూలములో హాస్య వదనేఽదని యున్నది. కాని ఇచట 'హస్తి వదన' అని యుండవలె నేమో అను ఊహతో తాత్పర్య మిట్లు వ్రాయుట యైనది.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

187. మరి అప్పుడు ఆరావణుడు ఏమిచేసెను? అనుకొనుచున్నావు? ఆ లింగమును పట్టుకొని దృఢయత్నము చేసెను. దానిని పైకెత్తుటకు నానావిధముల యత్నము చేయుచు పోయెను. భూమితో కూడ పైకిఎగురుచు పోయెను. లింగమును కదలించివేయ సాగెను.

188. అతడట్లుచేయు సమయము భూమి కంపించెను. రావణుడు మహాబలము చూపి పైకి ఎత్తెను. కాని లింగము పైకిరాలేదు. కాని రావణుని తలలు ఆ లింగమునకు మోటించి తన బలమంతయు చూపి అది ఎత్త ప్రయత్నించెను. అంతటి మహాబలుడురు దానిని కదలించి ఎత్తజాలక ఊరక ఉండిపోయెను.

189. ఈ కారణముచేత ఆ లింగము మహాబలేశ్వరుడు అను ప్రసిద్ధనామమును పొందెను. అని తెలిసికొనుము. దానిని రావణుడు మెలిపెట్టి పిండి పిసికి లాగుటచేత అది గోకర్ణాకారముకలది అయ్యెను సుమా !

190. ఇట్లు చేసిన తరువాత లంకానాథుడు అటనుండి వెడలి పోయెను. మరల తపస్సాచరించ సాగెను. ఆ క్షేత్రమునకు గోకర్ణ క్షేత్రము అను ఖ్యాతి ఏర్పడెను. సమస్త దేవతలును అచ్చటకు వచ్చిరి.

191. ఇంతేకాదు, ఆ లింగమునకును ఆక్షేత్రమునకును గల మహిమము అపారమయినది. అది అంతయు చెప్పుచు పోయినను అలవికానంతగా అనుపమాన మయినది. (సాటిలేనిది.) ఈ లింగక్షేత్రముల విస్తీర్ణమహిమము స్కాందపురాణమునందు వర్ణించబడి యున్నది. అది త్రిభువనములయందును ప్రఖ్యాతి నందినది.

192. గురుడగు సిద్ధయోగి చెప్పిన వచనమును విని శిష్యుడగు నామధారకుడు సంతోషము నందెను. మరల నొకసారి అతడు గురుని

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

పాదములను స్పృశించి నమస్కరించెను. అని సరస్వతీ గంగాధరుడు చెప్పుచున్నాడు.

ఇది పరమ కథా కల్ప తరువయి సిద్ధనామధారక సంవాద రూప మున ప్రవచింపబడిన శ్రీ నృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు మహాబలేశ్వరలింగ ప్రతిష్ఠాపన - గోకర్ణక్షేత్ర మహిమములను షష్ఠాధ్యాయము.

విశేషాంశము : ఈ అధ్యాయమున 145 - 146 - 147 - 148 - 149 ఓవీలందు నారదుడు రావణుడు చెప్పిన కథ రహస్యార్థము కలది. ఎట్లనగా - మృగమనగా మృగరాజ (సింహ) వాహనయ శ్రీదేవి; ఆమె సమస్త బ్రహ్మాండ ఖండములయందును వ్యాపించిన జగత్పరిణామ మూలతత్త్వము, ఆమె మహిషాసురుడు మొదలగు రాక్షసులను చంపినది. ఆమె ప్రళయాగ్నివలె అనంతశక్తి కలది. (అనంతశక్తి రూపురాలు) బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆ మృగ వాహన వలన తమ తమ సృష్ట్యాది కృత్య నిర్వహణ శక్తిని సంపా దింప తపస్సాచరించిరి. తపస్సుచే వారామెను మెప్పించి అనుగ్రహింప జేసికొనిరి. ఆమె తన శక్తి యందలి ప్రధానాంశములను (మేదస్సు) వారికి ఇచ్చెను. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి అను శక్తిత్రయమును మూడు శృంగములు వాటికి మూలస్థానమునందు కల మూడులింగము లును ప్రకృతియందలి యంశము లగుచు సామ్యావస్థయందు ఉండిన సత్త్వ రజ స్తమో గుణములు. వాటియందలి తాత్త్వికాంశములు వారి వారి ప్రాణలింగములు. ఇట్టి మహాశక్త్యంశ ప్రభావముననే త్రిమూర్తు లును తమ తమసృష్టి స్థితి సంహార కార్యనిర్వహణ సమర్థులయిరని తాత్త్వికార్థము.

సంఖ్య - 192

# శ్రీ గురు చరిత్రామృతము

## సప్తమాధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. నామధారకుడు (సరస్వతి) సిద్ధునితో ఇట్లు పలికెను. తాము దయతో గోకర్ణక్షేత్ర మహిమమును నాకు విస్తారపరచి తెలుప వేడు చున్నాను. పూర్వము అచ్చట ఎవరు వరములనందిరి ?

2. ఇంకను భూమండలమునందు గల ఇతర తీర్థములను అనేక ములను విడిచి శ్రీపాద శ్రీవల్లభులు అచటికే ఏకారణమున వెళ్లి యుండిరి? పూర్వ మచట ఎవరా మహాబలేశ్వరుని ఆరాధించిరి? ఈ విష యమున గల పురాణ కథను నాకు తెలుప వేడుచున్నాను.

3. జ్ఞానజ్యోతిః స్వరూపా ! కృపామూర్తీ ! గురురాయా ! ఎవరియందు గురువునకు ప్రీతియుండునో అట్టి వారికే తీర్థమహిమము విననలయునని తమచిత్తమునందు వాంఛ కలుగును.

4. అనగావిని సిద్ధయోగి నామధారకునితో (సరస్వతితో) ఇట్లు పలికెను : గోకర్ణక్షేత్రమహిమను తెలుపుమని నన్ను అడుగుచున్నావు కదా ! అదియంతయు విస్తారపరచి నీకు తెలిపెదను. ఏక (ఏకాగ్ర) చిత్తము కలవాడవయి అది విననలయును.

5. వినుము; పూర్వము ఒకానొక మహాయుగమునందు ఇక్ష్వాకు వంశ్యుడు అగు మిత్రసహుడు అను రాజు ఉండెడి వాడు; అతడు ప్రతాపవంతుడును స్వ (క్షత్రియ) ధర్మమునందు ఆసక్తుడు నగు క్షత్రియ వంశజుడు సుమా !

6. ఆ రాజు సకల శాస్త్రములను ఎరిగిన వాడును వివేకవంతు డును వేదములయందును వేదాంగములయందును అందులకు సంబం

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

ధించిన శాస్త్రములయందును) నేర్పు - పాండిత్యము కలవాడును బలాఢ్యుడును శూరుడును అనేక విషయములను బాగుగ ఎరిగిన వాడును నిరంతరమును తన కర్తవ్య కృత్యములందు పూనిక కలవాడును, దయానిధియు అయి ఉండెను.

7. ఇట్లు ఉండగా ఒక నాడు ఆరాజు వినోదార్థమయి వేటకయి బయలు వెడలెను. సింహ శార్దూలాది మహామృగములకు వాసస్థానమగు అరణ్యమునందు ప్రవిష్టుడయ్యెను.

8. నిర్మనుష్యమగు అరణ్యమునందు ఆరాజు వేటాడుచు అచ్చట ఆశ్చర్యకరమును భయానకమును నగు రూపము కలిగి జ్వాలాకారుడు అగు ఒక దైత్యునితో తారసిల్లెను.

9. రాజు వానిని చూచుచునే కోపముచెంది వాని శరసమూహము వర్షించెను. అంతట ఆ దైత్యుడు మూర్ఛవచ్చి భూమిపయిని పడెను.

10. అట్లు ఆరాజు ఆ దైత్యుని వధించుచుండ ఆ సమయమున వాని సమీపమునందే వాని బంధువులును (సోదరులు మొదలగు రక్త సంబంధులును) ఉండిరి. వారు బంధు వియోగ శోకము మూలమున ఆక్రందించ (ఏడువ) సాగిరి.

11. మిత్రసహుని చేతిలో దెబ్బతినిన ఆ నిశాచరుడును తన ప్రాణములు వదలు సమయమున తన సోదరుని పిలిచి ఈ వాక్యము పలికెను: నీవు నా సహోదరుడవు అగుదో త్వరితముగా నావిషయమున ఈ మిత్రసహుడు చేసిన అపకారమునకు పగతీర్చుము.

12. ఈ విధముగా తన సోదరునితో పలికి ఆదైత్యుడు పంచత్వమును (మరణమును) పొందెను. వాని తమ్ముడగు ఆ రాక్షసునికడను అనేకములగు మాయలు కలవు. అందుచే వాడు అంతట (ఆసమయమున) నరరూపమును ధరించెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

13. వాడు మానవుని రూపమును ధరించి తన వాక్కుతో సౌమ్యములగు మాటలు పలుకసాగెను. మిగుల నమ్రతతో మాటలాడి (నమ్మించి) రాజునకు సేవకు డయ్యెను.

14. ఎట్లు చేసినచో తనస్వామికి (యజమానునకు) మనస్సునకు ఇంపగునో - అట్లుగా నానావిధములుగా సేవలు చేయుచుండెను. ఇట్లు జరుగుచుండగా ఒకానొక దినమున రాజు వనమధ్యమునకు వెళ్లియుండుట సంభవించెను.

15. వినుము. ఆరాజు సమస్త మృగములను చంపి దుష్టజీవములను నరికి మరలి తన నగరమునకు వచ్చి చేరెను.

16. ఇట్లు అప్పుడప్పుడు జరుగుచుండెను. ఇట్లుండగా కొంత కాలము గడచిన తరువాత ఏమిజరిగెనో వినుము. ఆరాజు నింట (రాజు తాను) పితృశ్రాద్ధము జరుగవలసి యుండెను. అతడు అందులకై వశిష్ఠాది మునివరులగు ఋషులను నిమంత్రణము (శ్రాద్ధమున భుజించుటకై పిలుపు) చేసెను.

17. ఆ దినమున ఆరాజు నియమ పూర్వకముగా వివేచనతో స్వయంపాకము (పవిత్రమగు వంట) జరిపించు ఏర్పాటు చేసెను. ఏ సేవకుడు కపటియై తనకడ నుండెనో - వానినే ఆ (పాక) స్థానమునందు నిలిపెను.

18. రాజు వానితో ఇట్లు చెప్పెను. పాకస్థానమునందు నీవు ఉందువు కదా ! వంటసాలయందలి ఉద్యోగులు ఏది ఏది అడుగుదురో అది ప్రతియొకటియు నీవు తెచ్చి (తెప్పించి) వారికి ఈయవలయును.

19. ఆ సేవకుడు సరేయని అంగీకరించి కాపట్యభావముతో నరమాంసమును తెప్పించి ఆ శ్రాద్ధ సమయమునందలి ప్రక్రియకై అది వండించి దానితో కూరలు చేయించెను సుమా !

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

20. ఋషీశ్వరులకు భోజనపాత్రములందు వడ్డించునప్పుడు వాడు మరిదే నరమాంసమును వడ్డింప జేసెను. ఆ సమయమునందు అది చూచుచునే వసిష్ఠముని కోపించెను. రాజునకు శాపము పెట్టెను.

21. ఆసమయమున వసిష్ఠుడు ఆరాజుతో శాపవచనమును ఇట్లు పలికెను : నాకు నరమాంసము వడ్డింపజేసితివి. కనుక నీవు త్వరితముగా బ్రహ్మరాక్షసుడ వగుము. అని అతడు తన కోపము నిట్లు ప్రకటించెను.

22. వసిష్ఠముని ఇట్లు శాపము ఇచ్చుచునే రాజుకూడ అతనిపై అతి ప్రబలమగు కోపము చెందెను. నాయందు ఏఅపరాధమునులేని దే వ్యర్థముగా ఏల శపించితివి ? అనెను.

23. మాంసపాకమును ఎవరు చేయించిరో నేను ఎరుగను. ఆ విషయమున నా అనుమతి ఏమియు జరుగలేదు. నీవు అకారణముగ నాకు శాపము పెట్టితివి. కనుక నేనును నిన్ను శపింతును. అని రాజు పలికెను.

24. ఇట్లనుచు అతడు ఆ సమయమున తన దోసిటియందు ఉదకమును గ్రహించి వసిష్ఠుని శపించుటకు సంసిద్ధుడు అయ్యెను. అపుడు ఆ రాజుగారి భార్య తన పతి కడకు వచ్చి గురుని శపింపవల దని ఆతనిని నిషేధించుచు వేడుకొనసాగెను.

25. ఆమె తన పతితో ఇట్లనెను : గురుని శపించుట అత్యంతము దోషజనకమగు పని. నమస్కరించి ఆతని చరణములను పట్టుకొనుము. దానిచే మనము సంసారసాగరమునుండి తరించెదము.

26. రాజు తాను తన పత్నియగు మదయంతి పలికిన వచనమును అంగీకరించినవా డయ్యెను. అతని దోసిటియందు అతడు తన గురుని శపించుటకై తీసికొనిన జలము ఉన్నది. (అని నీకు తెలియును.) గదా! అది ఆరాజుగారు తన పాదముల మీదనే పడవేసి (నిచ్చి) కొనెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

27. శాపము ఈయవలయును అని తీసికొనిన తన పాణి (చేతి) యందలి కల్మషోదకము రాజుపాదములపై పడెను; అందుచే ఆతని ఆ పాదములు మలినము లయ్యెను. అందుచే ఆతడు కల్మాషపాదుడు అను పేరుతో బ్రహ్మరాక్షసుడు అయ్యెను.

28. పతివ్రతయగు ఆ రాజమహిషి (రాణి) వశిష్ఠమహర్షి పాదములను అంటి నమస్కరించెను. స్వామీ! బాలకుల (మది అవివేకులము అగు మమ్ముల) ను తాము ఉద్ధరించవలయునని వేడు చున్నాను. ఇంతటి కోపము ఏల పూనెదరు?

29. పతివ్రతయగు రాణి ఆ మదయంతి పలికిన జాలిగొలుపు మాటలను విని వసిష్ఠ మహాముని శాంతు డయ్యెను; పండ్రెండు సంవత్సరములు గడచిన తరువాత నీపతి మరల రాజుగా అగును

30. అని ఇట్లు శాపనివృత్తిని అనుగ్రహించి వసిష్ఠ మహర్షి తన స్థానమునకు తాను పోయెను. నామధారకా! వినుము; రాజు ఆశాప ప్రభావమున బ్రహ్మరాక్షసుడు అయి వనమధ్యమునకు పోయెను.

31. అతడు నిర్మనుష్యమగు అరణ్యమునందు ప్రఖ్యాతుడగు రాక్షసుడుగా అయ్యెను; అనేకములగు జంతువులను పశువులను పక్షులను మనుష్యులను ఇట్టి అనేక ప్రాణులను భక్షించుచుండెను.

32. ఆ వనమునందు అతనికి ఇట్లు కాలము గడచుచుండెను. ఒకనాడు ఆ కల్మాషపాదుడను బ్రహ్మరాక్షసుడు మార్గస్థులు (బాటసారులు) అగు బ్రాహ్మణజాతి దంపతులు త్రోవగడచి పోవుచు తనుజూచి భయాతురులగుట చూచెను.

33. వాడు పరుగెత్తుకొనుచు వచ్చి వ్యాఘ్రము పశువును (గోవును) పట్టుకొనినట్లు పట్టుకొనెను. తినుటకై అతనిని వాడు పట్టుకొని పోవుచుండెను. ఆవిప్రుని స్త్రీ (భార్య) ఆ రాక్షసునికడకు పోయెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

34. ఆ బ్రాహ్మణి అత్యంత శోకముతో ఏడువసాగెను. పోయి ఆ బ్రహ్మరాక్షసుని చరణములపై పడెను. అయ్యా! నా ఐదవతనము రక్షించ ప్రార్థించుచున్నాను. నా ప్రాణేశ్వరుని వదలుము.

35. నీవు నాపతిని భక్షించవలదు; నాకు నా ప్రాణేశ్వరుని యందు ప్రీతి అధికము; అయ్యా! నీవు నన్ను సుఖ (కర) ముగా భక్షించుము; నా పతిని వదలివేయుము.

36. పతిలేకయుండు (విధవ) స్త్రీ జన్మము రాతినలె వ్యర్థమయి యుండును. కనుక నేను నా భర్తలేక జీవించజాలను. కావున మొదట నన్ను ఆహారముగా స్వీకరించుము; నా పతిప్రాణములను కాపాడుము.

37. నాభర్త చాల లావణ్యము కల సుందరుడు; యౌవనవయస్సున నున్నాడు; వేదశాస్త్ర పారంగతుడు, ఇట్టి మహనీయుని ప్రాణములను నీవు రక్షించుచో సమస్తజగత్తును రక్షించినంత పుణ్యము నీకు లభించును.

38. కావున - అయ్యా! ఇట్లు చేసి నాయందు దయచూపుము; నేను నీకడుపునపుట్టిన కుమారిని - నీ ఆడుబిడ్డను - అగుదును. నాకు మగశిశువు జన్మించుచో వానికి నీపేరు పెట్టెదను.

39. ఆ విప్రస్త్రీ ఇట్లు అనేకవిధములుగా తన దుఃఖమును ప్రకటించెను సుమా! కాని - వింటివా! ఆరాక్షసుడు ఆమెమాటలను వినలేదు. తుదకు ఆ బ్రాహ్మణుని వాడు భక్షించనే భక్షించెను.

40. వాడు తనపతిని భక్షించెను అనునది చూచి ఆ బ్రాహ్మణ స్త్రీ ఆ బ్రహ్మరాక్షసునకు శాపము పెట్టెను. ఆమె ఇట్లు పలికెను; రాక్షసా! నేను నీకుపెట్టుచున్న శాపపువచనములను చెవులారవినుము.

41. నీవు సూర్యవంశమున జన్మించిన రాజవు; కాని శాపము మూలమున రాక్షసుడవు అయితివి; ద్వాదశ సంవత్సరములు గడచిన అనంతరము మరల రాజవు అయ్యెదవు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

42. కాని నీవు అపుడు నీ స్త్రీతోకూడి రమించు సమయమున నీ ప్రాణములు అకారణముగా పోవును. దురాత్ముడవు అగు బ్రహ్మ రాక్షసా అనాథులమగు మమ్ములను నీవు దుష్టభావముతో తిను చున్నావు దాని ఫలితము ఇదియే.

43. ఇట్లు శాపముపెట్టిన తత్ క్షణముననే ఆ విప్రస్త్రీ తన మగని ఎముకలు అన్నియును పోగుచేసికొని అధిక పరిమాణము గల కాష్ఠములయందు అవి ఉంచి అగ్నిని ప్రజ్వలింపజేసి తాను అందు ప్రవేశించెను.

44. చూడుము; ఇట్లు కాలము గడచుచుండగా - రాజు బ్రహ్మ రాక్షస రూపమున జీవించుచుండగా అతనికి అక్కడనే - ఆ అరణ్యము నందే పండ్రెండు సంవత్సరములును గడచిపోయెను. వినుము; తరు వాత అతడు మరల మునుపటివలెనే రాజుగా అయి తన నగరమునకు వచ్చెను.

45. తాను తన భార్యతో రతిసంయోగము జరిపిన క్షణము నందే తనకు మృత్యువు అగును అని తనకు కలిగిన విప్రస్త్రీ శాప వృత్తాంతమును అతడు తన భార్యతో స్పష్టముగా చెప్పెను.

46. తన పతి పలికిన వచనమును విని ఆతని రాణియగు మద యంతి తాను మిగుల దుఃఖపడెను. తాను తన ప్రాణములను వదల వలయును. అని నిశ్చయముకూడ చేసికొనెను.

47. మిగుల దుఃఖముతో మదయంతి రాజుతో ఇట్లు పలికెను: నీకు ఇంతవరకును సంతానము లేదాయెను. ఇంతవరకును పండ్రెండేండ్ల కాలము అరణ్యమునందే క్లేశముల ననుభవించితిని. ఇప్పటికిది మన దుష్ప్రారబ్ధము ముగియలేదు కదా !

48. అని ఇట్లు తన సతిపలికిన వచనములను విని ఆరాజు చాల గాఢ శోకముతో వ్యాప్తుడయ్యెను. అతని కంఠము డగ్గుత్తిక పడెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

నోటమాట పెల్లగిలి రాకపోయెను. కన్నులనుండి దుఃఖ బాష్పములు కారసాగెను. ఏమి చేయగలను ? అని అతడెట్లో పలికెను.

49. నామధారకా! వినుము; తరువాత అతడు తన మంత్రులను పెద్దలను పురోహితులను పిలిపించెను. వారితో అతడు నాకు బ్రహ్మహత్యాదోషము ఘటిల్లినది. ఏవిధముగా దీనినుండి విముక్తియగుదును ? అని అడిగెను.

50. మంత్రులును వృద్ధులును పురోహితులును, రాజుతో ఇట్లు పలికిరి. ఆ మాటను వినుము; నీవు సమస్త తీర్థక్షేత్రములకును యాత్ర చేయవలసినది; దానిచే నీవు పవిత్రుడవు అయ్యెదవు.

51. ఇట్లు తన మంత్రులతో వృద్ధులతో పురోహితులతో ఆలోచనము జరిపిన తరువాత ఆరాజు తీర్థయాత్ర ఆచరించుటకై బయలుదేరెను. ఒకదాని తరువాత మరియొకటిగా శాస్త్రవిధాన పూర్వకముగా సకల తీర్థక్షేత్రసేవనమును చేయుచు పోయెను.

52. ఆరాజు తాను ఏ ఏ తీర్థములకు పోయెనో అచ్చట నెల్ల అతడు అనేకములగు పుణ్యకార్యములను ఆచరించుచుండెను. తెలియుము; అతడు అచ్చటనెల్ల యజ్ఞములు మొదలగు దేవపిత్రాది కర్మానుష్ఠానములును బ్రాహ్మణులను ఇతరజనులకును అన్నదానములును చేసెను.

53. ఇట్లు అతడు నానా తీర్థక్షేత్రములను సేవించుచునే యుండెను. పోయినచోటికెల్ల బ్రహ్మహత్యాదోషము అతనివెంట వచ్చుచునే ఉండెను. అది ఘోరరూపముతో అతనికి కనబడుచునే యుండెను. ఏవిధముగను ఆతనిని అది వదలకుం (ఆతడు దానినుండి తప్పించుకొన లేకుం) డెను సుమా !

54. అతడట్లు తీర్థసేవనము చేయుచు అనేకవిధములగు క్లేశములను అనుభవించుచు ఇది నన్నెప్పటికిని విడువదు అని తన మనస్సు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!**

లోపల నిశ్చయించుకొని మిగుల చింతాక్రాంతుడయి తిరుగుచు తిరుగుచు మిథిలానగరమును చేరుకొనెను.

55. నామధారకా! వినుము; ఆరాజు మిగుల శ్రమచెంది ఆనగరమునకు బాహ్యప్రదేశమున ఒక వృక్షచ్ఛాయ యందు కూర్చుండి తన మనస్సునందు చింతించ సాగెను.

56. లోకవిఖ్యాతు డగు గౌతమ ఋషీశ్వరుడు తన ప్రమథగణములతో కూడిన రుద్రుడువలె ఇతర ఋషీశ్వరులతో కూడినవాడయి ప్రకాశించుచు అకస్మాత్తుగా అక్కడకు వచ్చిచేరెను.

57. రాజు అట్లు అటకు వచ్చిన గౌతమ ఋషిని చూచి సంతోషమునంది అతని చరణములపై పడి దొరలెను. మిగుల హర్షముతో అతనికి నమస్కరించెను. తనకు గల భావ భక్తిని ప్రదర్శించెను.

58. అంతట ఆ గౌతమఋషి తనకు ఆ రాజు విషయమున కలిగిన కరుణాభావముతో తన అంతరంగము వ్యాప్తముకాగా అతనిని ఓదార్చి ఆతని సకల క్షేమసమాచారములను అడిగెను; ఇతరములగు వృత్తాంతములను కూడ అడిగెను.

59. ఆ గౌతముడు ఇట్లనెను: రాజా! నీరాజ్యము ఏమయినది? ఏకారణమున అరణ్యవాసివి అయితివి? నీ ముఖాంబుజము చింతతో వ్యాకులితమయి యున్నదే? ఏకారణముచే ఇట్లు అగుట ఘటిల్లినది?

60. ఋషీశ్వరుని వచనమును విని రాజు జరిగినది అంతయు విస్తారపూర్వకముగా చెప్పెను. విప్ర వచనమున నాకు శాపము తగిలినది. దాని ఫలముగా నాకు బ్రహ్మహత్యాదోషము ఘటిల్లినది అని అతడనెను.

61. నేను ఇంతవరకును సకల విధములగు ప్రాయశ్చిత్తాది కర్మలను యజ్ఞాది దేవతారాధన కర్మములను సకల ధర్మాదికార్యములను

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

సమస్త తీర్థక్షేత్ర యాత్రా సేవనమును ఇది శ్రమయనుకొనక ఇదిగో సుఖము అనుకొనుచు నేను ఆచరించుచు వచ్చుచున్నాను సుమా!

62. కాని ఇంతచేసినను ఈ నాదోషము శాంతినందుట లేదు. భయంకర ఘోరస్వరూపముతో అది నావెంటనే వచ్చుచునే యున్నది. కోట్లకొలదిగ వ్రతములను ఆచరించితిని. కాని అది నన్ను విడుచుట లేదు; వినుము.

63. ఇట్లు ఉండగా ఈనాడు నా జన్మము సఫలము అయినది. నీదు చరణముల దర్శనము నాకు లభించినది, ఇపుడిక నాకు క్లేశనివారణ మగును. అని పలుకుచు రాజు ఆఋషి చరణములు అంటి నమస్కరించెను;

64. రాజు పలికినమాటలు విని తాను స్వయముగ కరుణా సముద్రుడగు ఆ గౌతమ ఋషి ఇట్లనెను. రాజా! భయము విడువుము; నా నిశ్చితవచనము వినుము; మృత్యుంజయుడగు శంకరుడే నిన్ను తరింపజేయును.

65. నీకు పాపనివారణము అగుటకును సకల మహాపాతక సంహారము అగుటకును ఉపయుక్తమగు తీర్థవిశేషమును తెలిపెదను; గోకర్ణము అను నామముగల తీర్థస్థానముకలదు.

66. గోకర్ణక్షేత్రమును స్మరించినంతటనే బ్రహ్మహత్యాది పాపములు నశించును. మృత్యుంజయుడును సదా శివుడును నగు ఈశ్వరుడు ఆక్షేత్రమునందు సదా నివసించును.

67. రాజా! వినుము; కైలాస పర్వతపు శిఖరముల యందును మందర పర్వతపు శిరఃప్రదేశములయందును కర్పూరగౌరుడగు పరమేశ్వరుడు ఎట్లు నిరంతర వాసము చేయునో అట్లే ఈ గోకర్ణక్షేత్రము నందును నిరంతర నివాసము చేయుచుండును; ఇది నిశ్చితము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

68. రాత్రి కాగానే అంధకారము వ్యాపించగా అది ఎట్లు ఆసూర్యునిచేతనే తప్ప అగ్నిచేతను నశించదో; చంద్రోదయము చేతను అది నాశమునందదో; ఆ భాస్కరుడు తప్ప మరెవ్వరును ఆ తమమును నశింపచేయజాలరో -

69. అదే విధముగా సమస్త తీర్థక్షేత్ర (సేవన) ములచేతను వాటి ప్రభావముచే పాపములు పోవు; సూర్యోదయముచే అంధకార నాశము జరిగినట్లే గోకర్ణక్షేత్ర దర్శనమాత్రముచేతనే పాపనాశము జరుగును.

70. వినుము; ఈ శరీరికి వేయి బ్రహ్మహత్యా దోషములు ఘటిల్లియున్నను సరియే - గోకర్ణక్షేత్రమునందు ప్రవేశము జరిగిన వెంటనే ఆ ప్రాణి పూతాత్ముడు (పవిత్రమగు ఆత్మ కలవాడు) అగును.

71. రాజా! వినుము; ఇంద్రుడును ఉపేంద్రుడును (విష్ణు మూర్తియును) బ్రహ్మదేవుడును ఈ మొదలగువా రందరును ఆ గోకర్ణ తీర్థక్షేత్రమునకుపోయి తమ తమ కామ్యములు సిద్ధినందుటకును ఉత్తమ గతి లభించుటకును అచట తపమాచరించిరి సుమా!

72. ఆ గోకర్ణతీర్థక్షేత్రమునందు భక్తి పూర్వకముగా జపములు వ్రతములు మొదలగునవి ఏవి ఆచరించినను సరియే-వానివలన సాధారణముగా కలుగవలసిన ఫలమునకు లక్షగుణితముగా ఫలము లభించునని తెలిసికొనుము.

73. చూడుము; ఎచ్చట బ్రహ్మయు విష్ణుడును ఇంద్రుడును మొదలగు సకల దేవతలును తమ తపములచే సిద్ధిపొందినవారు అయిరో అట్టివంటి పవిత్రక్షేత్రము విషయమున ఇంతకంటె మరి ఏమి చెప్పుదును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

74. అచటను భగవానుడు సాక్షాత్ (స్వయముగా) ఈశ్వరుడు; ఆ గోకర్ణక్షేత్రము సాక్షాత్‌గా కైలాసనగరము; విష్ణువు ఒసగిన ఆజ్ఞను వినయముతో పాటించి అచట ఆశివుని ప్రతిష్ఠితునిగాచేసిన వాడు విఘ్నేశ్వరుడు. దీనిని బట్టియే ఆ క్షేత్రపు మహత్త్వమును ఎరుగుము.

75. బ్రహ్మయు విష్ణువును ఇంద్రుడును విశ్వేదేవులును మరుద్గణములును ఈ మొదలగు సకల దేవతలును ఆగోకర్ణపుణ్యక్షేత్రమునకు వత్తురు; అచట వసింతురు.

76. వినుము; ఆక్షేత్రపు పూర్వద్వారమునందు సూర్యచంద్రులు వసువులు నివసింతురు. వారు ఆస్థానమునందలి ప్రీతిచే భక్తిపూర్వకముగా అచ్చట వసించుచుందురు.

77. ఆక్షేత్రపు దక్షిణ ద్వారమునందు అగ్ని యమ చిత్రగుప్తులును ఏకాదశ రుద్రులును పితృదేవతలును వాసము చేయుచుందురు; అతి సన్తోష పూర్వకముగా వారచ్చట వసించుచుందురు.

78. వినుము; ఆ గోకర్ణక్షేత్రపు పశ్చిమద్వారమునందు వరుణాది జలాధిష్ఠాతృ దేవతలతోకూడి సకల గంగలును చంద్రమౌళి యందలి ప్రీతిభావముచేత వాసము చేయుచుందురు.

79. కుబేరుడు వాయువు భద్రకాళి సప్తమాతృకా దేవతలు చండి ఇత్యాది సకల దేవతలును ఆ మహాక్షేత్రపు ఉత్తరద్వారమునందు వాసముచేయుచు ప్రాతః ర్మధ్యాహ్న సాయంకాలములు అనెడు త్రికాలములయందును ఆ మహాబలేశ్వరునిపూజ చేయుచుందురు.

80. చిత్రరథుడు విశ్వావసుడు చిత్రసేనుడు మొదలగు గంధర్వులు అందరును ఆ గోకర్ణతీర్థక్షేత్రమునందు సదా వాసముచేయుచు మహేశుని పూజ చేయుచుందురు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

81. ఇంకను వినుము; ఘృతాచి రంభ మేనక తిలోత్తమ ఊర్వశి ఈ మొదలగు అప్సరసలందరును మహాబలేశ్వరుని సమ్ముఖమున అనునిత్యమును ఆ దేవునకు సుఖ (ఆనంద) కరముగా నృత్యము చేయుచుందురు.

82. వసిష్ఠుడు కశ్యపుడు కణ్వుడు అను ఋషులును మహాతాపసియగు విశ్వామిత్రుడును భరద్వాజుడు జైమిని జాబాలి అనేక ఋషులును అచ్చట సదా ఆ మహాబలేశ్వరునకు పూజచేయుచుందురు.

83. క్రతువు ఆంగిరసుడు అను మహాతాపసులగు బ్రహ్మ ఋషులు ఈ గోకర్ణక్షేత్రమునందు ఉండి సదాచారములను అనుష్ఠించుచు మహాబలేశ్వరునియందలి భక్తితో అతనిని సేవించుచు నివసించుచుందురు.

84. ఇంకను వినుము; మరీచి నారదుడు - అత్రి మొదలగు బ్రహ్మఋషులును దక్షుడు మొదలగు బ్రహ్మమానస పుత్త్రులు మునులునుగల ప్రజాపతులును సనకాదులగు తాపసులును ఆ క్షేత్రమునందు నిరంతరమును ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడిన తాత్త్విక విషయములను అవగాహనము చేసికొని పరమాత్మ నుపాసించుచుందురు.

85. ఇంకను తెలిసికొనుము; అనేకులగు సిద్ధులును సాధ్యులును మృగాజినధారులగు మునీశ్వరులును దండధారులును నిర్గుణ తత్త్వోపాసకులు విరక్తులునగు సంన్యాసులును బ్రహ్మచారులును ఆ క్షేత్రమునందు నివసింతురు.

86. ఇంకను వినుము; ఆ మహాబలేశ్వర క్షేత్రమునందు మహాతాపసు లందరును ఆహారముకూడ మాని చర్మమును అస్థులును మాత్రము మిగిలిన శరీరములతో ఉండుచు మహాతపస్సులను అనుష్ఠించుచు భక్తితో చంద్రమౌళిని పూజించుచుందురు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

87. గంధర్వులు మొదలగు దేవజాతి విశేషములవారును అందరును పితృదేవతలును సిద్ధులును అష్టవసువులును విద్యాధరులును కింపురుషులు మొదలగు వా రందరును నిరంతరమును ఆ మహాబలేశ్వర మహాదేవుని సేవకయి ఆ గోకర్ణక్షేత్రమునకు పోవుచుందురు.

88. స్వర్గలోకమునందు నివసించు వారగు గుహ్యకులును కిన్నరులును శేషుడు తక్షకుడు మొదలగు నాగులును పిశాచులును బేతాళులును మొదలగు సకల భూత జాతుల వారును మహాబలేశ్వరుని పూజకయి ఆ తీర్థక్షేత్రస్థానమునకు పోవుచుందురు.

89. దేవగణములవా రందరును తాము నానా విధములగు సింగారములును చేసికొని అనేకములగు భూషణములతో విరాజమానులయి సూర్య సంకాశములగు (సూర్యునివలె ప్రకాశించునవి యగు) విమానముల మీదను ఆ క్షేత్రమునకు వత్తురు

90. ఈ చెప్పిన వీరందరును దేవపూజార్థమయి మహాబలేశ్వర లింగముకడకు వత్తురు; ఆ దేవుని సన్నిధియందు స్తోత్ర పఠనములు గీత గానములు నమస్కారములు నృత్యములు మొదలగు అనేకవిధములగు సేవలు చేయుచుందురు.

91. ఈ గోకర్ణక్షేత్రమునందు శ్రీ మహాబలేశ్వరు నారాధించినవారు తమ మనస్సులయందు ఏ ఏ కామనలను వాంఛింతురో - అవియెల్లను త్వరితముగా నిశ్చితముగా పొందుదురు. అని తెలిసికొనుము. ఇంతయెందులకు? ఈ బ్రహ్మాండ గోళకమునందు ఇంకెచ్చటను గోకర్ణతీర్థక్షేత్రముతో సమానమగు తీర్థక్షేత్రము లేదు.

92. అగస్త్యాది మహామునులును సనత్కుమారాది యోగులును ప్రియవ్రతుడు మొదలగు రాజకుమారులును అగ్ని దేవుడును మన్మథుడును ఇంకను ఇతరులును ఆ గోకర్ణక్షేత్రస్థానమునందు వరములను సిద్ధింపజేసికొనిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

93. శిశుమారి భద్రకాళి మొదలగు దేవతలును ఇందు మహాబలేశ్వరుని త్రికాలముల యందును పూజచేయుదురు. మణినాగులును గరుడాదులును ఈ మహాబలేశ్వరుని దర్శనమునకును సేవకును ఇటకు వచ్చుచుందురు. కాని ఆ మహాదేవుని దర్శనప్రభావమున గరుడాదులును తమ శత్రువులగు మణినాగాదులను తినుటకాని హింసించుట కాని చేయరు.

94. రాక్షసకులమునందలి రావణ కుంభకర్ణాదులును ఇంకను ఇతరులును అందరును ఇట మహాబలేశ్వరు నర్చించి వరములను పొందిరి. కేవలుడు (నిర్మలచిత్తుడు) అగు విభీషణుడును ఈమహాదేవుని అర్చించుచుండును.

95. ఈవిధముగ సమస్తదేవతా జాతీయులును సిద్ధులును దానవులును మొదలగు వారందరును మహోత్తమ మగు గోకర్ణక్షేత్రమునకు పోయి నానా ప్రకారముల ఈ మహాబలేశ్వరుని అర్చింతురు.

96. లెక్కలేనంతమంది మహాప్రసిద్ధ నాములగు పెద్దలు ఎందరో ఇచట తమ నామముతో ప్రసిద్ధమగునట్లు లింగములను ప్రతిష్ఠించిరి. (ప్రతిష్ఠింతురు) చతుర్విధ పురుషార్థములను తమ తమ కోరికలను అనుసరించి వారు పొందిరి. (పొందుదురు) కూడను.

97. వినుము; బ్రహ్మయు విష్ణువును వినాయకుడును కార్తవీర్యుడును ఆ గోకర్ణస్థానమునందు తాము తమపేరులతో లింగములను ప్రతిష్ఠించిరి సుమా !

98. ధర్మదేవుడును క్షేత్రపాలుడును మొదలగు వారును దుర్గ మొదలగు శక్తిదేవతాబృందములును తమ పేరులతో ఆగోకర్ణక్షేత్రము నందు లింగములను ప్రతిష్ఠ చేసిరి.

99. ఇంతఎందులకు ? ఈ గోకర్ణక్షేత్రము చాల మహాత్మ్యము కలది; ఇచట సకల గుణాతీతమగు మహాక్షేత్రము ఇది యొక్కచోట,

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

ఇది నిరుపమానమగునది; ఇచట అడుగడుగునను అసంఖ్యాకములగు లింగములును తీర్థములును ఉన్నవి.

100. ఆ మహాక్షేత్రపు లక్షణములను ఏమని చెప్పుదును. అచటి తీర్థములు అసంఖ్యాకములు; అచటి సమస్తశిలలును ఉత్తమ గుణములు గల లింగములే. అచటి సమస్త జలములును తీర్థములే.

101. ఈ మహాబలేశ్వరలింగము కృతయుగమునందు శ్వేత వర్ణము కలదిగాను త్రేతాయుగమునందు లోహిత (ఎర్రని) వర్ణము కలదిగాను ద్వాపర యుగమునందు పీత (పసిమి) వర్ణముకలదిగాను కలియుగమునందు కృష్ణవర్ణముకలదిగాను దర్శనము ఇచ్చుచుండును.

102. ఈ మహాబలేశ్వర లింగము * సప్తపాతాళ లోకములను కూడ (సప్త పాతాళములలో అన్నిటికంటెను అడుగుననున్న ఏడవ పాతాళపు అడుగు అంచువరకు కూడ) ప్రవేశించి అంతలోతునుండియు పాతుకలిగి తాను నిలిచియున్నది. ఆలింగము కలియుగమునందు మృదువయి సూక్ష్మరూపముకలదయి దర్శనము ఇచ్చుచుండును.

103; రాజా ! వినుము; పశ్చిమ సముద్రతీరము నందు ఉన్న ఈ గోకర్ణ తీర్థక్షేత్రము ఉత్తమమయినది; ఇట్టి మహాక్షేత్రము బ్రహ్మహత్యాది పాపములను నశింపజేయుననుటలో ఆశ్చర్యము ఏమి కలదు.

104. బ్రహ్మహత్య మొదలగు ♦ పంచ మహాపాపములును పరదారగమనము మొదలగు దుష్టపాపములును దుఃశీలము దురాచారము మొదలగు చెడునడవడులచే కలుగు పాపములును గోకర్ణ మహాక్షేత్ర దర్శనమాత్రముననే నశించును.

---

* సప్త పాతాళములు : 1 అతల 2 వితల 3 సుతల 4 తలాతల 5 మహాతల 6 రసాతల 7 పాతాళములు

♦ పంచమహాపాపములు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

105. దీనిని దర్శించినవారు దర్శనమాత్రముచేతనే పవిత్రులగుదురు. సమస్తములగు ఇష్టకామ్యార్థములను సాధించుకొందురు. అంత్యమునందు వారికి ఉత్తమగతియు కలుగును.

106. ఆ మహాక్షేత్ర స్థానమునందు పుణ్యదివసమున ఎవరు ఆ మహాబలేశ్వరుని భక్తిపూర్వకముగా అర్చింతురో - వారు అవశ్యము రుద్ర వంశ్యులు (రుద్రుని గణములలోనివారు) అగుదురు. అని తెలియుము.

107. పుణ్యదివసమునందే కాదు. మానవులు ఏసమయమునందయినను సరియే - ఈ గోకర్ణక్షేత్రమునకు పోయి భక్తితో అచటి సదాశివునకు పూజచేసినచో అట్టివారు బ్రహ్మలోకస్థానమును పొందుదురు. అని తెలియుము.

108. ఆదిత్య సోమ బుధవారము లందు అమావాస్య మొదలగు పర్వదినములందును ఈ గోకర్ణక్షేత్రమందలి సముద్రమున స్నానము చేసి దానములును ధర్మకార్యములును ఆచరించవలయును.

109. ఇట్లు చేసినచో అవి ఏకొంచెము చేసినను ఇందు శివపూజయు వ్రతమును హోమములును హవనములును జపములును బ్రాహ్మణ సంతర్పణములును ఏకొంచెమయినను చేసినను అట్టి వారికి అనంతమగు పుణ్యము లభించును; అట్టి గౌతమఋషి మిత్రసహుని (రాజు) తో పలికెను.

110. వ్యతీపాతము మొదలగు పర్వదినములయందును సూర్య సంక్రాంతి (సూర్యుడు ఒకరాశినుండి మరియొక రాశియందు ప్రవేశించు) దినములయందును మహాప్రదోష దినమునందును (శని) త్రయోదశీ తిథియందును ఈ మహాక్షేత్రమునందు మహాబలేశ్వరుని అర్చించినచో అగమ్యమగు (ఇంత అని ఊహింప నలవికాని) పుణ్యము లభించును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

111. ఆ క్షేత్రపు మహిమమును ఏమని చెప్పెదను ? అఖిల కామ (సంకల్ప) ములను (పూరితములగునట్లు) వరముల నందుకొను. ఈశ్వరుడు భక్తసులభుడును అనంత మహిమముకలవాడును అయి ఉండుట మాత్రమే కాదు; పుణ్యమార్గమున తను పూజించువారి విషయమున (వారెంత అల్పముగ పూజించినను) సంతుష్టు డగును.

112. మాఘమాసమునందు కృష్ణపక్షమున చతుర్దశి తిథినాడు ఈ మహాశివరాత్రి దినమున ఈ మహాబలేశ్వరునకు బిల్వపత్రమును అర్పించి అర్చనము చేయుటచే త్రిభువనములయందును ఎచ్చటను ఏపుణ్యకార్యముచేతను దుర్లభమగునంత పుణ్యము లభించును.

113. ఈ గోకర్ణమహాక్షేత్రము ఇట్టి సాటిలేని ఉత్తమ స్థానము అయి ఉండగా శివరాత్రిదినమున ఈ మహాబలేశ్వరుని దర్శనమును అర్చనమును ఇంతటి దుర్లభ పుణ్యమును అందజేయు దుర్లభవిష యము అయి ఉండగా ఇట్టి ఈ క్షేత్రమునకు ఏమూర్ఖులు పోవరో - ఈక్షేత్రమహిమమును వినకైన వినరో దీనివిషయమును తెలిసికొనరో - అట్టివారు మూఢులును చెవిటివారును అని తెలిసికొనుము

114. ఇంకను వినుము; ఈ గోకర్ణక్షేత్రమున మహాబలేశ్వర లింగ సన్నిధియందు (మహాశివరాత్రియందు) ఉపవాసము అర్చనము మొదలగునవి చేయుటయు రాత్రి జాగరణమొనర్చుటయు స్వర్గము నకు పోవుటకు ఉపయుక్తమగు సోపానపద్ధతి (మెట్లవరుస) అయి ఉన్నది.

115. ఇటువంటి ఈ గోకర్ణక్షేత్రమునకు ఏ జనులు యాత్రకై పోవుదురో అట్టివారు (ధర్మార్థ కామమోక్షములు అనెడు) చతుర్విధ ములగు పొందుదురు అనునది లోకప్రసిద్ధమగు విషయము. అని నిశ్చిత మగు అంశమని ఎరుగుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

116. ఈ క్షేత్రమునందలి సమస్తతీర్థములందును స్నానముచేసి మహాబలేశ్వరలింగసన్నిధియందు భక్తియుక్తులయి పూజచేయవలయును. దానిచే (ప్రాణులు) మానవులు పాప విముక్తులగుదురు. అని ఎరుగుము.

117. అని ఈవిధముగా గౌతమ ఋషి గోకర్ణక్షేత్రమహిమ మును ఆ మిత్రసహుడనురాజునకు ప్రకాశితమొనర్చెను. ఆ రాజును ఆదినుంతయు అతిప్రేమముతో విని అనంతరము మరల ఆఋషిని ఇట్లని ప్రశ్నించెను.

118 - 119. రాజు గౌతమమహర్షితో ఇట్లు పలికెను: మీరు నాకు ఇంతవరకును గోకర్ణక్షేత్రమహిమమును నిరూపించితిరి. (తెలిపి తిరి) పూర్వమునందు ఎవరికి ఎవరికి ఈ క్షేత్రమహిమము సాక్ష్యముగా దృష్టాంతముగా అనుభవమునకు వచ్చెనో అట్టిది ఉన్నచో - స్వామీ! నాకు ఆవిషయమును నాయందలి కృపతో విస్తారపరచి చెప్పవలయునని వేడుచున్నాను; అని రాజు అత్యధికభక్తిభావముతో ఆ ఋషిచరణము లను పట్టుకొని నమస్కరించెను.

120. అంతట గౌతమఋషి ఇట్లు పలికెను : ఈ గోకర్ణక్షేత్ర మహాబలేశ్వరులను మహిమమును నేను బహుకాలమునుండియు ఎరిగి యున్నాను. ఈ విషయమున అపారములు (అనంతములు) అగు సాక్ష్యములను దృష్టాంతములను చూచియున్నాను.

121. వినుము; ఒకమారు నేను శివరాత్రి దినమున ఆక్షేత్ర యాత్రకై పోయిఉంటిని. అపుడు నేనచట విచిత్రమగు దృష్టాంత మొకటి చూచియుంటిని. ఏమిఅనిన - అచ్చటికి యాత్రరూపమున ఎందరెందరో జనులు వచ్చియుండిరి.

122. మధ్యాహ్న కాలమునందు నేను అచ్చట ఒక వృక్ష చ్ఛాయ యందు కూర్చుండి యుంటిని. దూరమునుండి ఒక చండాల

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ః

స్త్రీని చూచితిని. (చండాలస్త్రీ నాకు కనబడెను.) ఆమె వృద్ధురాలును గ్రుడ్డిదియును మహా రోగిణియును.

123. ఆమెకు నోరు ఎండిపోవుచుండెను. ఆహారము ఏమియు లేకుండెను. ఆమె శరీరపు సర్వాంగముల యందును కుష్ఠవ్యాధి వ్యాపించి యుండెను. అందు భయం (అసహ్య) కరములగు కృములు పడియుండెను. చీమును రక్తమును దుర్గంధమును వ్యాపింపజేయుచుండెను.

124. క్షయవ్యాధియు గండమాలలును ఆమెను బాధించుచుండెను. కుత్తుకయందు కఫము వ్యాపించి అడ్డుపడి యుండెను. ఆమెకు దంతములును లేవు. అతివిహ్వలురాలయి లేచి నిలువబడుటకును కూర్చుండుటకును చేతకాక యుండెను. కట్టవస్త్రమును లేకుండెను.

125. ఇట్టి స్థితియందుండిన ఆమె శరీరముపై మధ్యాహ్న సూర్య కిరణములు పడుచుండుటచే ప్రాణములు ఇపుడే పోవునా! యనునట్లు కంఠగతములయ్యెను. శౌచవ్యాధిచే (అధికముగా అనేక పర్యాయములుగా మల మూత్ర విసర్జనమగు వ్యాధితో) విశేషముగా బాధపడుచుండెను. సర్వావయవములయందును నొప్పి కలుగుచు మహాదుఃఖము అనుభవించుచుండెను.

126. ఆ విధవరాలు జుట్టు గొరిగివేయబడిన బోడితలదియై యుండెను. మృత్యుముఖములో ఉన్నదా? (ఏక్షణములోనైన మరణించును.) అనునట్లు కనబడుచుండెను. క్షణక్షణమునను (కూర్చుండుటకును శక్తిలేనందున) నేలపై పడిపోవుచుండెను. ప్రాణములను విడుతును అని ఆమె అందులకు సంసిద్ధురాలుగా ఉండెను సుమా!

127. ఇట్టి స్థితియందుండిన ఆ చండాలి అచట ఒక చెట్టునీడ కొనికి వచ్చెను. తన శరీరమును నేలపై పడవేసెను. తన ప్రాణములను విడుతును అను సంకల్పముతో నుండెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

128. ఆమె అట్లు ప్రాణములను ప్రాణములను విడుచు చుండ గానే సరిగా ఆ సమయముననే మహాబలశాలురగు శివదూతలు విమానములనుండి దిగిరి. వారు తమ హస్తముల యందు త్రిశూలములగు ఖట్వాంగములను (ఆయుధములను) ధరించి యుండిరి.

129. వారు టంకాయుధములనుకూడ ధరించి యుండిరి. వారి ఫాలములపై చంద్రుడుండెను. వారి దేహకాంతి కేవల (నిర్మల) చంద్రునికాంతిని పోలియుండెను.

వారికి శిరములపై కిరీటములును చెక్కిళ్లపై కుండలములును మెరయుచుండెను. ఇట్లు వారు నలువురును చతుర్వర్గముల స్వరూపులై యుండిరి.

130. వారి విమానములు సూర్యసదృశములయి తేజోవంతములయి యుండెను. అతి విచిత్రములయి (అత్యాశ్చర్యకరములయి) విరాజమానములగుచు కనవచ్చుచుండెను. వారును ఆవిమానములును ఆ చాండాలికి చెందిన పనికే వచ్చియుండెను. ఆ సమయమున అపూర్వ విషయము సంఘటిల్లెను.

131. మీరు ఏపనికై వచ్చితిరి? అని నేను శివదూతలను అడిగితిని. ఈ చాండాలిని తీసికొనిపోవుటకయి వచ్చితిమి. అని ఆదూతలు నాతో పలికిరి.

132. ఆదూతలు పలికిన వచనములను విని నా మనస్సు విస్మయముపొందినదాయెను. అందుచే నేను మరల కూడ వారిని ప్రశ్న చేసితిని, రాజా! ఆ విషయము అంతయు ఏక (ఏకాగ్ర) చిత్తుడవైవినుము;

133. ఇటువంటి పాపాత్మురాలగు చాండాలి ఇట్టి శివవిమానమునకు యోగ్యురాలు ఎట్లయ్యెను? శునకమును సింహాసనముమీదకు తీసికొనిపోవుట ఏమయిన యోగ్యమగు పనియా ఏమి?

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

134. ఈ పాపాత్మురాలు తాను జన్మించినది మొదలుకొనియు పాపములనే సంగ్రహించుకొనుచు కూర్చుండినది. ఇటువంటి దుర్వ్యర్తనురాలగు పాపినిని శివలోకమునకు ఏల తీసికొని పోయెదరు.

135. ఈమెకు శివవిషయకమగు జ్ఞానము ఏమియు లేదు. తపము మొదలగు సాధనములు ఏమియు ఈమె చేసియుండలేదు. దయయననేమో సత్యము అన నేమో ఎన్నడును ఈమె ఎరుగదు. ఈమెను మీరు ఎట్లు శివలోకమునకు తీసికొని పోయెదరు.

136. ఈమె అహర్నిశములును పశుమాంసమునే ఆహారముగా తినుచుండెను. ఎల్లప్పుడును జీవహింస చేయుచుండెను. (తాను చేసికొనిన పాపములకు ఫలముగానే) ఈ పాపిని ఇటువంటి కుష్ఠరోగాక్రాంత యయ్యెను. ఇటువంటి ప్రాణిని మీరు స్వర్గలోకమునకు ఏల తీసికొనిపోయెదరు ?

137. అథవా ఈమె ఎప్పుడైన శివపూజనము చేసెనా ? అట్టిది ఏమియు చేయలేదు. పంచాక్షరీ మంత్ర జపమునైన చేయలేదు. శివ స్మరణమునైన చేసియుండలేదు. ఇట్టి ఈమెను మీరు శివలోకమునకు ఎట్లు తీసికొనిపోయెదరు ?

138. ఈమె తాను శివరాత్రి దినమున ఉపోషమును నైన చేయలేదు. దానము ఏమియు ఆశివరాత్రి దినమున కాని మరి ఏదినమునకాని చేయలేదు. తాను యజ్ఞములు ఏవియు చేయలేదు. ఎవరైనను చేయుచుండగా చూడనైనలేదు. ఇట్టి ఈమెను మీరు శివలోకమునకు ఎట్లు తీసికొనిపోవుచున్నారు ?

139. ఈమె ఏసమయమునందును స్నానమేచేసి ఎరుగదు. తీర్థములు అన నేమో ఈమె ఎన్నడును ఎరుగనే ఎరుగదు. అథవా - వ్రతాది సత్కర్మములు ఏవియు ఎన్నడును చేయలేదు. ఈమె ఇటువంటి మహాపాపాత్మురాలు సుమా !

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

140. ఈమెకు సర్వావయవములందును కుష్ఠము నిండినది. చీము నెత్తురులు క్రమ్మి అత్యధికమగు దుర్గంధముతో కంపుకొట్టుచున్నది. ఇట్టి దుర్వర్తనురాలగు చాండాలిని మీరు ఎట్లు దివ్యవిమానమునందు కూర్చుండ బెట్టెదరు.

141. ఈమెకు సర్వావయవములయందును వ్యాపించియున్నదా కుష్ఠము అనెడు లక్షణము. ఈమె తన పూర్వజన్మాంతరములందు చేసి ఆర్జించిన కర్మముల ఫలమే అని పెద్దలనుచున్నారు. చూడుడు; ఈమె నోటినుండియును కృములు బయటికి వచ్చుచున్నవి కదా ! పూర్వ కర్మార్జిత ఫలము ఎట్లుపోవును?

142. ఇటువంటి పాపాత్మురాలును దురాచారులును అగు ఈమె చరాచరమయమగు ఈ ప్రపంచమందు ఎచ్చటను ఎందులకును యోగ్యురాలు కాదు కదా ! ఇట్టి ఈమెను కైలాసపురికి ఏల తీసికొని పోయెదరు ? విమానమునందు ఏల కూర్చుండబెట్టెదరు ?

143. అని ఇంతవరకుచెప్పి గౌతముడు రాజుతో ఇట్లు పలికెను; రాజా ! నేను ఆ దూతలతో ఇట్లు ప్రశ్నించితిని; ఆ చండాలినికి సంబంధించిన ఆద్యంత వృత్తాంతమును తెలుపుచు వారు నాకు ఇట్లు సమాధానము ఇచ్చిరి.

144. గౌతమ ఋషీశ్వరా : వినుము; ఈ చండాలినికి సంబంధించిన పూర్వాపర వృత్తాంతమును నీకు సవిస్తరముగా తెలిపెదము; అది మిగుల ఆశ్చర్యకరమయినది; వినుము.

145. ఈమె జన్మస్థానము తూర్పుదేశము; ఈమె బ్రాహ్మణ కులమునందు జనించెను; కన్యగానుండెను. అపుడీమె నామము 'సౌమిని' ఈమె ముఖము చంద్రబింబముతో సమానమయి ఉండెను.

146. ఈమె రూపము అత్యంత సుందరమయి ఉండెను. తండ్రి ఇంట పెరుగుచు వివాహము చేయదగిన వయస్సునకు వచ్చెను. ఆమెకు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

యోగ్యుడగు వరుడు దొరకక పోయెను తల్లిదండ్రులు చాల చింతించ సాగిరి.

147. ఆమెకు తగిన సుందరుడు అగు వరుడు ఎవడును దొరుకలేదు. ఆమెకు పది సంవత్సరములు వచ్చెను. కాలము మించిపోవు చున్నది. ఆమెయును పెద్దది యయ్యెను. అందుచే ఆమెతండ్రి ఎవరో యొక సాధారణ వరుని చిక్కించుకొని అతనికే ఆమెను గృహ్యోక్త విధానముతో ఆమెను కన్యాదానముచేసి వివాహము జరిపెను.

148. వివాహము అయిన తరువాత ఆమె కొంతకాలము తన పతి ఇంటనే ఉండెను. వినుము; కొంతకాలము ఈ విధముగా గడచెను. ఆమె యువతియు అయ్యెను.

149. ఇట్లు కొంతకాలము గడువగా అంతట ఆమెకు భర్తృ విషయమున దుఃఖము సంప్రాప్తమయ్యెను; ఏలయన ఇట్టి సమయమున విధివశమున ఆమె భర్త మృతినందెను.

150. ఈ విషయమును విని ఆమె తల్లిదండ్రులు తమ కుమార్తెను తమ ఇంటికి తీసికొనివచ్చిరి. ఆ యువతియును తన పతి విషయమున చాల దుఃఖము నందెను; ఎంతయో ఖేదముతో కాలము గడుపుచుండెను.

151. కాని ఆమె మొదలే అతిసౌందర్యవతి, పూర్వవయస్సు (నవయౌవనము) నందు ఉండెను; ప్రతిదినక్రమమున ఆమెకు మదము వ్యాపించసాగెను; పరపురుషులను చూడగా ఆమె చిత్తము చంచలము కాసాగెను.

152. ఆమె కొంతకాలము రహస్యముగా వ్యభిచారము చేయుచు ఉండెను. తరువాత కేవలము ప్రకటముగానే ఆపని చేయసాగెను. పాతక కర్మలకు ఎన్నడును గోప్యత (రహస్యముగా ఉండుట) అనునది లేదుకదా !

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

153. ఆమె తాను ఏ అదుపును ఆజ్ఞయును లేని విధవరాలు ... ; యువతిగా ఉండెను; విశేషించి ఆమె అతిసుందరిగా ... ; ... పూర్వవయస్సున (యౌవనారంభమున) ఉండెను. ... ; ఇన్ని హేతువులును బలముకలవి కాగా ఆమె ... స్త్రీ ... నిదై చాంచల్యముతో ప్రవర్తించసాగెను.

154. ఇట్లు జరుగగా జరుగగా ఆమెచేయు పాతక కృత్యములు ... ప్రకటములై తెలిసిపోయెను. తల్లిదండ్రులును బంధువర్గ ... మొదలగు ఎల్లవారును ఆమెను వెలివేసిరి.

155. తల్లిదండ్రులును బంధుజనులును ఆమెను వదలివేసిరి. ... అట్లు ఆమెను వారు విసర్జించి అంతవరకును ఆమె తమతో ... దోషము పరిహారము చెందుటకుగాను తాము ప్రాయశ్చిత్తము ... చేసికొనిరి.

156. ఆమెకును మొదట మొదట తానుచేయు చెడుపని విష ... కలుగుచుఉండెడిది; తరువాత క్రమక్రమము నిస్సం ... వ్యభిచారము ప్రవర్తించసాగెను. ప్రకటరూపముగానే ... ఆనగరమునందు రమించుచు తిరుగసాగెను.

157. ఆనగరమునందు ఒకవ్యాపారి శూద్రుడు ఉండెను. ... రూపలావణ్యములు కలవాడు; పూర్వవయస్సులో (యౌవ ... ) ఉండెను; అదిచూచి ఆమె అతనికి ఇల్లాలు అయ్యెను.

158. ఆ శూద్రుని ఇంట ఉండుచు ఆయువతి తనజీవితము ... ; ఏమయిననూ ఇటువంటి దురాచారవంతురాలు అగు ... ఇరువదియొక తరములను ఇటు ఇరువదియొక తర ... - మొత్తము నలువది రెండు తరముల వారిని భ్రష్టులను ... నరకమునకే పైంప యగును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

159 - 160. స్త్రీలు కామముతోను బ్రాహ్మణులు హీనులను సేవించుటతోను రాజులు బ్రాహ్మణులను దండించి వారికోపమునకు పాత్రులగుటతోను యతులు భోగసాధనములను సంగ్రహించుకొనుట తోను నశింతురు.

161. ఈమె ఆ శూద్రునితో అహర్నిశములును రమించుచు అతిహర్షము పొందుచుండెను. ఈమె ఇట్లు ఆశూద్రుని ఇంట ఉండగా ఈమెకు ఒక కుమారుడు కలిగెను.

162. ఆకాలమున ఈమెకు అనునిత్యమును మాంసము ఆహారము; ఈమె మద్యము పానముచేయుచు ఉన్నత భావముతో ఉండెడిది; ఇట్లు ఆమె ఆ శూద్రుని ఇల్లాలు అయి పాపినిగా దురాచారవంతు రాలుగా జీవించుచుండెను.

163. ఇట్లు గడచు చుండగా ఒకదినమున జరిగిన విషయము వినుము; పాపాత్మురాలగు ఈమె ఉన్మత్తురాలయి ఒడలు తెలియని తనముతో తన ఆహారమునకయి మేక అనుకొని ఆవుదూడను నరకెను.

164. ఇంకను వినుము; ఆవుదూడనుచంపి ఒద్దికతో పాకము చేసెను. మరుచటి దినమున తినదలచి ఆ దూడతలనుమాత్రము ఒక ఉట్టిలో భద్రపరచెను; మిగిలిన మాంసమును వండి ఆనాడేతినెను.

165. ఇది జరిగిన సమయమున ఈమె మద్యపానముచే ఉన్మత్తు రాలయి యుండెను. సూర్యాస్తమయ సమయమునకు ఆమెకు ఎచ్చరిక కలిగెను. అప్పుడు ఈమె ఆవుపాలు పిదుకుటకయి ఆవుదూడకొరకు చూచెను.

166. ఆవుదూడ ఉండవలసిన ఆ దూడకుమారుగా మేక ఉండెను. తనకు ఈ భ్రాంతి (పొరబాటు) కలిగినందులకు ఈమె చాల క్లేశము (మనోవ్యథ) పొందెను. ఇంటిలోనికిపోయి చూడగా వగటి వెలుతురులో ఆవుదూడతల స్పష్టముగా కనబడెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

167. ఆసమయమున ఆమె తాత్కాలికముగా పశ్చాత్తాపము చెందినది అయ్యెను. 'శివ శివ' అని చంద్రమౌళిని స్మరించెను. అజ్ఞానముచే ఇటువంటి పాపము ఘటిల్లెను కదా యని ఆమె రాత్రింబవలు చింతించెను.

168. వినుము; తన భర్తకు ఈ విషయము తెలిసినచో అతడు కోపించును; అని భయపడెను. అందుచే ఆ దూడతలను నేలలో పాతిపెట్టెను. ఎముకలు చర్మము మొదలగునవి కూడ నేలలో పూడ్చి వేసెను.

169. చూడుము; తరువాత ఆమె ఇరుగు పొరుగు వారి దగ్గరకు పోయి తమదూడను పెద్దపులి తినివేసెను; అని వారందరతో చెప్పెను; వారందర ఎదుటను ఏడ్చెను; తన భర్తఎదుటకూడ ఇదే విధముగ చెప్పెను; ఏడిచెను.

170. ఈ విధముగా ఆమె ఆశూద్రుని ఆనందముగా గడపుచు ఉండి కొన్ని దినములు గడచినమీదట మృతిచెందెను; యముని దూతలు ఆమెను యమపురమునకు తీసికొనిపోయిరి.

171. వారుఆమెను అచట నరకములో పడవేసిరి; ఆమె అచట దుఃఖానుభవములను అనుభవించెను; దానిచే అతిదుఃఖితురాలయ్యెను; వినుము; ఆ స్త్రీయే మరల చాండాలజాతియందు జన్మము నందెను.

172. పూర్వజన్మమున సరిగాచూడక ఆవుదూడను చంపినదోషముచే ఈ జన్మమున ఈమె పుట్టుకతోనే గ్రుడ్డిది అయ్యెను; వ్యభిచార దోషముచే కుష్ఠరోగిణి యయ్యెను; కాటుకవంటి విరూపవర్ణము కలదిగా ఉండెను; ఇట్టి ఈమెను తన తల్లిదండ్రులు మాయామోహవశమున వాత్సల్యముతో పోషించుచుండిరి.

173. వారు ఆమెకు నిరంతరమును ఎంగిలి అన్నమును ఎంగిలి మాంసపు ముద్దలును తినిపించుచుండెడివారు; అవధానముతో వినుము;

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

వారు ఈమెను ఈమె చిన్నతనమున ఇటువంటి దుష్పరిస్థితిలోనే పోషించి పెద్దచేసిరి.

174. ఈవిధముగా కాలము గడచుచుండగా ఈమెకు సర్వావయవములందును కుష్ఠవ్యాధి వ్రణములు వ్యాప్తమయ్యెను. తల్లిదండ్రులును మృతిచెందిరి. ఈమె దరిద్రురాలు అగుటతో పాటు నిరాశ్రయురాలు అయ్యెను.

175. ఈమెకు సర్వావయవములును కుష్ఠవ్రణములతో పీడితములు అయ్యెను. స్వజనులును సోదరులునుకూడ ఈమెను విడిచివేసిరి. యాచించుకొనుచు ఈమె తనపొట్ట నింపుకొనుచు దేహరక్షణము చేసికొనుచు ఉండెను.

176. ఈ విధముగా చాలకాలము గడచిపోయెను. ఈ చాండాలి ఇట్లే జీవించుచుండెను ఈమె సర్వకాలమును ఆకలితో పీడితురాలుగానే ఉండెడిది. మొదలే తాను గుడ్డిదియును కుష్ఠరోగియును కదా !

177. క్రమముగా ఈమెకు అన్నవస్త్రములే దొరుకకుండపోయెను. అందుచే ఆమె మిగుల అధికముగా దుఃఖము పొందుచుండెను. ఇట్లుజరుగుట అంతయు ఆమె తనపూర్వజన్మమునందు చేసికొనిన కర్మముల ఫలమే; ఇట్లు క్రమముగా ఈమె తన క్లేశములు వృద్ధిచెందుటతోపాటు తానును చాల వృద్ధురాలు అయ్యెను.

178. అహర్నిశములును త్రోవలో పడియుండి త్రోవను పోవు మహాజనులను తనకు తినుటకేమయిన ఇమ్మని అడుగుచుండెడిది; ఆమెకు ఎక్కడను ఎంతకును యాచించినను పొట్ట నిండెడిది కాదు; అందుచే ఈమె మిగుల బాధపడుచుండెడిది.

179. వినుము; వినికిడితో మ ఆమె శరీరమునందు కుష్ఠ వ్యాధియున్నది గదా ! ఆ వ్యాధి మహాదోషముచే శరీరమంతయు చెడిన

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

193. నేను నా వెనుకటి వందలకొలది జన్మములందును పుణ్యము ఏమాత్రమును చేసియుండలేదు. ఈ కారణముచేతనే ఈనాడు ఈవిధముగా ఎక్కువగా పీడితురాల నగుచున్నాను. ఎల్లవారును నాకు ధర్మము చేయుడు.

193. ఈ చాండాలి ఈవిధముగ త్రోవలో పండుకొని అడుగుకొనుచుండెను. ఆదినము శివరాత్రి అగుటచే (ఉపవాస) వ్రతదినము అయినందున ఆమెకు ఎవరును భిక్షము వేయలేదు.

194. సకల జనులును పూజకై పోవుచు ఉండిరి. ఈమె ఏడ్చుచు వారిని అడుగుకొనుచుండెను. ఈనాడు ఉపవాస దినము. అన్నము ఎక్కడిది ? అని ఒకడు నవ్వుచు అనుచుండెను.

195. వానిచేతిలో బిల్వమంజరి (మూరేడుదళములగుత్తి) ఉండెను. అతడు అది ఆమెచేతిలో పడవేసెను. ఆమె అది వాసన చూచెను. తినెడు వస్తువు కాదు అని పలికెను.

196. ఆ తక్షణమే ఆమె కోపముచెంది అది విసరివేసెను. అది పోయి లింగముపై పడెను. అది అంధకారముతో నిండిన అర్థరాత్రి సమయము. అటువంటి సమయమున శివరాత్రినాడు శివుని పూజించుట ఎవరికోతప్ప అలభ్యము. అటువంటి పుణ్యకార్యము ఆమెకు లభ్యమయి సంఘటిల్లెను.

197. ఎవరును ఆనాడు ఆమెకు భిక్షము వేయకుండిరి. అందుచే ఆమెకు శివరాత్రినాటి ఉపవాసముకూడ సంభవము అయ్యెను. ఆవిధముగ బిల్వమంజరని శివునితలపై వేయుటచే శివునకు పూజచేయుటయు సంఘటిల్లెను.

198. గౌతమ మహర్షి ! వినుము. ఏ ప్రయత్నమును (సంకల్ప పూర్వకముగా) చేయకనే ఈమెకు ఇంతటి పుణ్యము ఘటిల్లెను. ఇంతకూ ఈశ్వరుడు ఈమె విషయమున సంతుష్టుడయి హర్షము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

చెందెను. అందుకు ఫలముగా ఈమెకు భవార్ణవము (సంసారసముద్రము) నుండి కడతేర్చెను.

199. వినుము. ఈ విధముగా ఈ చాండాలికి (శివరాత్రినాడు) ఉపవాసము (చేసినపుణ్యము) ఘటిల్లెను. (అంటిమిగదా !) రెండవ నాడు ఈమె భిక్షఅడుగుకొనుటకై అక్కడినుండి లేచెను.

200. మొదలే ఆమె కుష్ఠురోగిణి ఐ యుండెను. ఉపవాసముల మూలమున అశక్తురాలయి యుండెను. నడువ లేకుండెను. త్రోవయు కానరాకుండెను. అందుచే మెల్ల మెల్లగా పోవుచుండెను.

201. సూర్యరశ్మి ప్రభావముచే ఆమెకు అంతులేనంత తాప బాధ కలుగుచుండెను; ఆమెకుగల పూర్వజనార్జిత కర్మముల ఫలము అటువంటిది. అని ఇట్లు దూతలు గౌతమునితో పలికిరి.

202. ఈ చాండాలి ఇట్లు శ్రమపడుచు (ఈబిల్వ) వృక్ష సమీపమునకు వచ్చెను. త్వరితముగా ప్రాణములను విడిచెను. ఇందు చేతనే మేము ఈమెను తీసుకొనిపోవుటకు వచ్చితిమి.

203. ఏమయినను ఈమెచేత నేడు పుణ్యము ఆచరించబడినది. శివతిథి (మహాశివరాత్రి) సందర్భమున ఉపవాసము చేసెను. బిల్వ పత్రములతో శివుని పూజించెను; రాత్రియంతయు జాగరణము చేసిన పుణ్యముకూడ ఈమెకు ఘటిల్లెను.

204. ఆ పుణ్యము మూలముననే ఈమెకు తాను గడచిన నూరు జన్మాంతరములందు చేసినపాపములును పోయినవి; ఈమెకు ఈశ్వరునినుండి ప్రేమ లభించినది. ఇందుచేతనే ఈశ్వరుడు మమ్ము పంపెను.

205 ఇట్లు పలుకుచునే శివదూతలు ఆచాండాలిపై అమృత మును చల్లిరి; అట్లు వారు త్వరలో ఆమె దేహమును దివ్య దేహము నుగా చేసిరి. శివలోకమునకు ఆమెను తీసికొనిపోయిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

206. గోకర్ణము అను పుణ్యస్థానము ఇటు వంటిది, అని విస్తార పూర్వకముగా గౌతముడు అమిత్రసహుడను సూర్యవంశీయ రాజుతో పలికెను. ఆరాజుతో ఆముని విశేషించి ఇంకను ఈవిధముగా పలికెను; నీవు త్వరితముగా గోకర్ణ క్షేత్రమునకు పొమ్ము.

207. నీవు అచటకు పోయిన వెంటనే నీపాపములు అన్నియు పోవును. నీకు ఇహసౌఖ్యమును పరలోక సౌఖ్యమును సిద్ధించును. నీవు చిత్తమునందు ఏమాత్రమును సంశయము పెట్టుకొనవలదు.

208. గౌతమమహర్షి పలికిన మాటలు విని ఆరాజును త్వరిత ముగా బయలుదేరి గోకర్ణక్షేత్రమునకుపోయెను. పాపవిముక్తుడు అయ్యెను అని నామధారకా ! తెలిసికొనుము.

209. ఇటువంటి పుణ్య పావన స్థానము కావుననే శ్రీపాదవల్ల భులు తాము అక్కడే కొంతకాలము ఉండిరి; అని పలికి సిద్ధుడు నామధారకా ! ఏక (ఏకాగ్ర) చిత్తుడవై ఈ గురుచరిత్రకథనమును వినుము: అని పలికెను ?

210. అని ఇట్లు సరస్వతీ గంగాధరుడు (గంగాధరుని పుత్రు డగు సరస్వతి) శ్రీ గురుచరిత్ర విస్తారమును చెప్పుచున్నాడు. శ్రోత లారా ! మీరును నిశ్చిత (నిస్సంశయు) హృదయులై ఏక (ఏకాగ్ర) చిత్తులై వినుడు.

ఇది పరమకథా కల్పతరువయి సిద్ధనామధారక సంవాద రూప మున ప్రవచింపబడిన శ్రీ నరసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు శ్రీ గోకర్ణమహిమాను వర్ణనమను సప్తమాధ్యాయము.

సంఖ్య - 210

# శ్రీ గురు చరిత్రామృతము

## అష్టమాధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. నామధారకుడు సిద్ధునితో ఇట్లనెను. స్వామీ! తాము నాకు శ్రీ గోకర్ణక్షేత్రమహిమమును తెలిపితిరి. శ్రీ గురువులు ఎన్ని దినములు ఆ శ్రీ గోకర్ణక్షేత్రమునందు ఉండిరి. తరువాత ఏమి జరిగెను ? నాకు వివరింప ప్రార్థించుచున్నాను.

2. శ్రీ గురుమూర్తీ! తాము దయాసముద్రులు; నా మనస్సునందు శ్రీ గురుచరిత్ర శ్రవణమునందు దృఢమగు ఆసక్తి కలిగియున్నది. వినినకొలదిని మహానందము కలుగుచున్నది; ఇంకను విన వలెనని అత్యధికమగు ఉల్లాసము కలుగుచున్నది.

3. తన శిష్యుడు పలికిన ఈ వచనమును విని సిద్ధయోగి మిగుల గాఢముగా సంతుష్టుడయ్యెను. విస్తారపరచి శ్రీ గురుచరిత్రమును అతనికి ఇంకను చెప్పనారభించెను. శ్రోతలారా ! మీరు అది శ్రద్ధగా వినుడు.

4. శ్రీపాదయతి శ్రీ గోకర్ణక్షేత్రమునందు మూడు సంవత్సరముల పాటు గుప్తరూపమున ఉండిరి. అక్కడినుండి లోకానుగ్రహార్థమయి శ్రీశైల పర్వతమునకు వచ్చిరి.

5. ఇది విని ఆలోచించుము; ఎవరి చరణములను దర్శించుట సమస్త తీర్థములకును యాత్ర చేయుటతో సమానమో ఏమహనీయుని చరణముల విషయమున 'చరణం పవిత్ర వితతం పురాణమ్' 'పవిత్రమగు శ్రీభగవచ్చరణము ప్రాచీనతమమగుచు శాస్త్ర విధానానుసారమున అనుష్ఠింపబడిన యజ్ఞమే, అని శ్రుతి చెప్పుచున్నదో -

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

6. అటువంటి శ్రీగురువుల చరణములు సమస్త తీర్థాత్మకమయి యుండగా వారు మరివేరు తీర్థక్షేత్రములందు ఏల తిరుగవలయును ? లోకానుగ్రహము చేయవలయును; అను సంకల్పముతోనే వారు ఆయా తీర్థక్షేత్రములకు పోవుచుందురు. అని పెద్దలు చెప్పినమాట చెప్పుచున్నాను. వినుము.

7. వారు అచ్చట నాలుగు మాసములు గడపి 'నివృత్తిసంగ మము' అను ప్రదేశమునకు వచ్చిరి. అచ్చట తమ భక్తులకు దర్శ నము ఇచ్చి అచ్చటినుండి అదేప్రయోజనము కొరకే కురవపురమునకు వచ్చిరి.

8. కురవపురము మహాక్షేత్రము దాని అంచునెంబడి కృష్ణా మహానది ప్రవహించు చుండును. ఆ తీర్థక్షేత్రపు మహిమము చెప్ప వలెననిన అలవికానంతగా అపారమయినది. భూమండలమునందే అటు వంటి మహాతీర్థక్షేత్రము దుర్లభము.

9. ఆతీర్థక్షేత్రపు మహిమము అంతయు చెప్పుచుపోయినచో కథ బహువిస్తారము చెందును. శ్రీపాదవల్లభుల శ్రీగురువుల అఖిల చరిత్రమును చెప్పవలసినది ముందు చాల ఉన్నది; కనుక అది చెప్పె దను. ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

10. శ్రీపాదవల్లభులు కురవపురమునందు (చాలకాలము) ఉండిరి. ఆకాలమున వారికి భూమిపై అధికఖ్యాతి వ్యాప్తము అయ్యెను. అపారముగు వారి మహిమము ప్రకట మయ్యెను. అది అంతయు చెప్ప వలెననినచో విస్తారము అగును సుమా !

11. ఏ జనులు భక్తితో శ్రీగురువులను భజిం (సేవిం) తురో- వారు అప్ర (నా) యాసముగా సౌఖ్యము పొందుదురు. ఐశ్వర్యమునో పుత్రీపుత్రులనో - ఏది ఏది చింతింతురో (కావలెనని సంకల్పింతురో) అదెల్ల పొందుదురు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

12. శ్రీ గురువుల మహిమను అంతయును చెప్పవలయును అనిన నో చాల విస్తారము అగును. కనుక నామధారకా! నీకు ఇప్పుడు కొంచెముగా మాత్రమే చెప్పెదను; వినుము.

13. ముందు కాలమున - అనగా శ్రీపాద వల్లభావతారమునకు తరువాత - రాబోవు శ్రీనృసింహ సరస్వత్యవతారము రాబోవుటకు త్రోవతీయు సంఘటనమును చెప్పెదను; ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము; శ్రీపాద వల్లభులు శ్రీ కురవపురమునందు ఉండు సమయమునందే ముందు జరుగనున్న అవతారమునకు కారణమగు కథ జరిగెను.

14. అట్లు శ్రీనృసింహ సరస్వత్యవతారము జరుగుటకు కారణభూతమగు దాని పూర్వవృత్తకథనము చెప్పెదను; ఆ కురవపురగ్రామమునందు వేదశాస్త్రాధ్యయన సంపన్నుడగు బ్రాహ్మణుడు ఒకడు ఉండెను.

15. ఆతనికి ఒక భార్య ఉండెను; ఆమె నామము 'అంబిక'. ఆమె సుశీలవతియును ఆచారవతియును పతిసేవాపరాయణురాలును మహా పుణ్య సతియును సుమా!

16. వారి పూర్వజన్మార్జిత కర్మముల ఫలముగా ఆమెకు కుమారులు కలిగి మరణించుచుండిరి. అందులకై ఆమె అనేక తీర్థయాత్రలును వ్రతములను ఆచరించెను.

17. ఇట్లు జరుగుచుండగా కొంతకాలమునకు వారి విధి (అదృష్ట) ఫలముగా ఆమెగర్భమున మందమతియగు కుమారుడు కలిగెను. అతడు అటువంటి వాడు అయినను ఇదియే నాకు అపూర్వమగు ఫలలాభము అని భావించి ఆ తల్లి వానియందు అత్యధికమగు ప్రీతి చూపుచుండెను.

18. ఆ విప్రకుమారుడును తన తల్లిదండ్రులకు చాల ప్రీతి పాత్రుడై వారియింట వృద్ధిపొందుచుండెను. అతనిని వేదాభ్యాసము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

నందు ప్రవేశింపజేయుటకై వారు తమ కులాచారమును అనుసరించి వ్రతబంధము (ఉపనయనము) చేసిరి.

19 - 20. ఆ కుమారుడు మందమతియును జ్ఞానరహితుడును అవివేకివాడును అగుటచేత అతనికి విద్య ఏమియు రాకుండెను. ఆ బ్రాహ్మణ శ్రేష్ఠునకు ఆ కుమారుని విషయమున చింత వృద్ధిచెందెను. అతడు ఇట్లు చింతించెను; ఈ కుమారుడు మందమతిఆయెనే ! అనేకులగు దేవతలను ఆరాధించి ఎంతయో క్లేశములుపడి ఈ కుమారుని పొందితిమి; కాని ఇంకను మా పూర్వ జన్మకృతకర్మార్జితమగు ఫలము మమ్ము లను విడువలేదు కదా ! అని ఆ బ్రాహ్మణుడు అహోరాత్రములును చింతచేయుచుండెను.

21. ఆ తండ్రి అతనికి అనేకవిధములుగా నేర్పెను; శిక్షణము ఇచ్చెను; ఎంతయో అధికము తాడనము (కొట్టుట) చేసెను; ఇది యంతయు చూచి ఆ తల్లికి దుఃఖము కలుగుచుండెను. వానిని కొట్టుట మానుడు - అని వేడుకొనెను.

22. ఆమె తనభర్తతో ఇట్లు పలికెను : మనఇంటిలో చాల కాలము కుమారులే కలిగియుండలేదు : అనేక విధముల ఎంతయో క్లేశములు అనుభవించి కలిగి బ్రతికిన ఈ ఒకకుమారుని ఎట్లో పోషించు కొనుచున్నాము;

23. వానికి విద్య వచ్చుట లేదు; నిజమే; నిరుపయోగముగా వానిని కొట్టి ఏల శ్రమపడెదరు ? మూర్ఖుడుఅయి ఇట్లు పుట్టి బ్రదుక వలయును అని వాని పూర్వ జన్మకర్మఫలము ఇట్లు ఉన్నది కాబోలును.

24. ఇప్పటికిని మీరు అహోరాత్రములును వానిని ఈ విధ ముగా తాడనము చేయుచు పోయినచో నేను తప్పక ప్రాణములుతీసి కొనెదను; అని ఆ ఇల్లాలు తన భర్తతో పలికెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

25. తన భార్య పలికిన మాటలువిని ఆ విప్రుడును నిశ్చింతుడయి ఊరకుండెను. అతడు ఈవిషయమును మనస్సునకు పట్టించుకొనక తనపనులు తాను చూచుకొనుచుండెను; ఇట్లు కాలము గడచిపోవుచుండెను.

26. అనంతరము ఆ విప్రుడు అట్లుఉండగా కొంతకాలమునకు తరువాత ఆతడు జబ్బుపడెను; వినుము; దైవవశముచే ఆ బ్రాహ్మణుడు మరణమును కూడ పొందెను.

27. ఆవిప్రుని భార్యయును అక్కడనే ఆ కరవపురమునందే ఉండిపోయెను; యాచన చేసికొనుచు తన ఉదరమును నింపుకొనుచుండెను; (కుమారుని కూడ అట్లే బ్రదికించుచుండెను.) ఈ విధముగా ఆమె తనజీవనము గడపుచుండెను.

28. నామధారకా ! చూడుము; ఆవిప్రస్త్రీ కుమారుడు ఉన్నాడే ! వివాహము చేయదగిన యోగ్య వయస్సు కలవాడును అయ్యెను. వీడు మతిహీనుడు (మందమతి) అని సకల జనులు వానిని నింద చేయుచుండిరి.

29. వానికి ఎవరును కన్యను ఈయకుండిరి. అందరును వానిని దూషణమే చేయుచుండిరి. వారు అతనిని ఇట్లు అనుచుండిరి. నీవు ఊరక ఉండకపోయినవో ఇంటింటికిని నీరయిన కడవలతో మోయుచుండరాదా ! ఈవిధముగ నీపొట్టనైన నింపుకొనవచ్చును కదా !

30. అచ్చట సమస్త బ్రాహ్మణులును వానిని ఇంకను ఇట్లనుచుండిరి: రాయివలె నీవు వ్యర్థముగా జన్మము నందియున్నావు ! నీ మూలమున నీవంశమునకే మచ్చవచ్చినది; ఓరీ ! మూర్ఖుడా ! నీవు నీవంశమునకే నాశము కలిగించితివిరా !

31. నీనాయనగారి ఆచార వ్యవహారాదికమును విద్యావిశేషములును నాలుగు రాష్ట్రములందు ఖ్యాతిచెందినవి; ఆయన వేదము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

లను ధర్మశాస్త్రములను ఎరిగియుండెను; అటువంటివాని కడుపున నీవు పుట్టితివి.

32. ఇటువంటి నీవు నీతండ్రికి మాట (నింద) తెచ్చితివి; నీ పితరులను అధోగతిలో పడవేసితివి; భిక్షాయాచనముచేసి తల్లి భిక్షాయాచనముచేసి తెచ్చిపెట్టగా పొట్ట నింపుకొనుచున్నావే! నీకు సిగ్గు ఏల లేకున్నది.

33. నీవు ఈ సంసార (ప్రపంచ) మునందు జన్మించి పశువువలె ఉండి ఏమిచేయు (టకు పనికివచ్చు) చున్నావు? వ్యర్థముగా జన్మించి ఇట్లుండి ప్రయోజనము ఏమి? గంగా (కృష్ణానదీ) ప్రవేశమునైన చేయుమురా; అని జనులు వానిని అనుచుండిరి.

34. ఆ బ్రహ్మచారి జనులు పలికెడు ఇటువంటి నిందావచనములనువిని అనేక విధములుగా దుఃఖపడుచుండెను. ఒకానొక సమయమునందు తనతల్లితో వాడు ఇట్లు అనెను; అమ్మా! నేను ప్రాణములు విడిచెదను.

35. సకల జనులును నన్ను నింద చేయుచున్నారు. ఈ దేహము ఉండియు దీనిచే ఉపయోగము ఏమి? నీవును పోషించలేకున్నావు; అరణ్యవాసమునకయినను పోయెదను.

36. పుత్త్రుడు పలుకుచుండెడు ఈ మాటలు విని వాని తల్లి మిగుల చింతచేసెను; మిగుల గాఢముగా శోకించెను; ఆమె మిక్కిలి ఏడ్చెను.

37. ఇట్లు మాతా పుత్త్రులు దుఃఖము పొంగి పొంగి గంగా (కృష్ణా) నదీ ప్రవాహ సమీపమునకు పోయిరి. అచ్చట వారికి విశ్వవ్యాపి పరమాత్మమూర్తి యగు శ్రీపాద వల్లభయతి స్నానము చేయుచు కనబడెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

38. ఈ తల్లి కొడుకులు ఇరువురును పోయి వారిపాదములపై పడిరి. వారు ఇరువురును తమ తమ చేతులు జోడించి ఇట్లు మనవి చేసిరి. అయ్యా! గంగ (కృష్ణ) లో పడి ప్రాణములు విడుతుము అని మా మనస్సులలో సంకల్పము కలిగినది.

39. ఆత్మహత్య మహాదోషము కదా ! కనుక ఇది మాకు అట్టి మహాదోష ఫలమును ఈయక సద్గతినే ఇచ్చునట్లు తాము అనుగ్రహించుము. మాకు అనుమతిని ఇండు - అని వేడుచున్నాము.

40. బ్రాహ్మణస్త్రీ పలికిన ఈ వచనమును విని శ్రీపాదవల్లభుల దయకలిగి ఇట్లు అడిగిరి. మీ మనస్సు (ల) లో ఏమి సంకటము కలిగినది ? ఏ హేతువుచే మీరు ప్రాణములు వదలవలసి వచ్చినది.

41. అంతట ఆ విప్రస్త్రీ తనమనస్సునందలి సకల దుఃఖమును ఈవిధముగా చెప్పికొన నారంభించెను : ఆమె ఇట్లు పలికెను. భక్తవత్సలుడగు ఓస్వామీ ? బాలకులము - మీ దయకు యోగ్యులము - అమాయికులము - అజ్ఞానులము - ఏమియు చేయజాలనివారము - అగు మమ్ములను మీరే తరింప జేయవలయును.

42. నేను సంతానమేలేక అందులకై ఎంతయో శ్రమపడితిని; పాదచారిణినై అనేక తీర్థక్షేత్రయాత్రలు చేసితిని. ఎన్నియో వ్రతములును పూజలును చేసితిని. సకల దేవతలను ఆరాధించితిని.

43. వ్రతములును ఉపవాసములును నేను చేసినవి ఎన్నియని చెప్పుదును ? అవి అపరిమితమయినవి చేసితిని. చివరకు ఈ మందమతి యగు కుమారుడు కలిగినాడు. వీనిని అందరును నిందించుచున్నారు.

44. నా భర్తయో ! వేద శాస్త్రాధ్యయన సంపన్నుడగు బ్రాహ్మణుడుగా ప్రసిద్ధుడయి యుండెను. ఆయన కడుపున ఈ హీనుడు మందమతి దురాత్ముడు అగువాడు జన్మించినాడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

45. కనుక శ్రీపాదయతీ! తాము దయ చూపి నన్ననుగ్రహించుము; జన్మజన్మాంతరములకును నాకు ఇటువంటి దుర్గతి లేకుండునట్లు చేయుము; ఇటువంటి మందమతియగు కుమారుడు ఎన్నడును కలుగకుండునట్లు అనుగ్రహింప వేడుచున్నాను. ఇటువంటి స్థితిని సాధనమగు ఉపాయమును నాకు తెలుపుడు.

46. తాము దయాసముద్రులు - దైన్యమును పోగొట్టువారు - అందుచేతనే నేను తమ చరణములు పట్టుకొనినాను. స్వామీ! కృపా సాగరా! తాము శరణాగతులను రక్షణచేయుటకే ఈలోకమునకు వచ్చినారు (నాకు తమ దర్శనము ఇచ్చినారు.)

47. నేను ఈ సంసారమునందు జన్మించినది మొదలుకొనియు అనేక విధములగు కష్టములనే అనుభవించితిని. కాని సుఖములు కొంచెమును చూడ (అనుభవించ) లేదు. ఇంతవరకు నేను కనినకుమారులును ఎవరును మిగులలేదు.

48. మిగిలిన ఈ ఒక కుమారుడును మేకమెడ చన్నువలె వ్యర్థుడై నాకు బరువయి వ్రేలాడుచున్నాడు నీచజన్మము ఇట్లు వ్యర్థమయినది. అనుచు ఆమె శ్రీగురువులకు మనవి చేసికొనెను.

49. ఇకమీదటనైన దేవతలు నన్ను ఈ విధముగా అనుగ్రహింతురుగాక! ఇక ముందుజన్మములో నాకు మనుష్యత్వము వచ్చినను నేను పూజ్యమానుడు (అందరచేతను పూజింపబడువాడు) నీవు ఎట్లు జగత్త్రయమునకు పూజ్యుడవో అటువంటి పూజ్యుడును అగు కుమారుని నేను పొందవలయును.

50. సకలలోక జనులును వానికి వందనము చేయుచుండవలయును. ఇటువంటి కుమారుడు నాకు కలుగు. ఉత్తమగతికి హేతువగు ఉపాయమును శ్రీగురూ! యతీంద్రా! తాము నాకు తెలుపుడు. అనుచు ఆ విప్రస్త్రీ శ్రీపాదవల్లభుల చరణములను అంటెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

51. వానితోనే (ఆ కలుగు కుమారునితోనే) నాకు ఉద్ధారమును ఉత్తమగతియును కలుగవలయును. నాకు మరల ఈ సంసారము నందు పునరావృత్తి కలుగకుండ వలయును. నాపితరులు అందరును స్వర్గాదికములు అగు ఉత్తమ లోకములను పొందవలయును. తాము నాకు అటువంటి ఉపాయము తెలుప వేడుచున్నాను.

52. నామనస్సునందు ఇటువంటి కోరిక యున్నది. నాకు బ్రహ్మజ్ఞానియగు కుమారుడు కలుగవలయును. ఆతడు తన బాల్యమునందే అందరచేతను పూజ్యమానుడు అగుట నేను నాకన్నులతో చూడవలయును.

53. ఆమె పలికిన వచనములు విని శ్రీపాదవల్లభయతి ఆమె తనయందుచూపిన భక్తికి సరిగా ఆమెయందు దయకలిగి ఇట్లు పలికెను. ఓయమ్మా ! నీవు ఈశ్వరుని ఆరాధించుము. నీకు శ్రీహరితో సమానుడగు కుమారుడు కలుగును.

54. చూచితివికదా! గొల్లదాని ఇంటిలోనే సకల జగత్కారణ స్వరూపుడగు శ్రీకృష్ణుడే జన్మించెను కదా ! ఆ గోపికయును తన పూర్వజన్మమునందు ఈశ్వరారాధన రూపమగు వ్రతమును ఆచరించి యుండెను.

55. ఆ విధముగనే నీవును ఈశ్వరుని ఆరాధించుము. అటువంటి కుమారుని పొందుదువు, ఇది నిశ్చయము. నీమనస్సు నందలి కోరికయు చాల బరువయినదే (గొప్పదే). ఆ కామనాపూర్తిని (కోరిక నెరవేరుటను) నీవు పొందెదవు. అని ఇట్లు శ్రీపాదవల్లభులు ఆమెతో పలికెను.

56. అపుడు అంతట శ్రీపాదయతి ఆమెతో ఇట్లు పలికెను: ఆగోపిక ఎట్లు ఈశ్వరారాధన వ్రతము ఆచరించెను? ఆమె చంద్ర

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

మాళిని ఎట్లు పూజించెను? నాకు ఆవిషయమును విస్తారపూర్వకముగా తెలుపవేడుచున్నాను.

57. తాము చెప్పినదో నేనును అదేవిధముగా వ్రతమును ఆచరింతును. అని ఆవిప్రస్త్రీ శ్రీపాదవల్లభుల చరణములను అంటెను. అంతట కృపామూర్తియగు శ్రీగురుమూర్తియును ఆమెతో ఇట్లు పలికెను.

58. శ్రీపాదవల్లభులు ఆవిప్రస్త్రీతో ఈవిధముగా పలికెను: అమ్మా! నీవు ప్రదోషసమయమున ఈశ్వరుని పూజచేయుము. శనివారపు ప్రదోషమున మరియు విశేషించి భక్తితో పూజచేయుము.

59. గోపిక తాను ఈశ్వరుని ఈ పూజను చూచెను ఈకథా విస్తారము స్కాందపురాణమునందు ఉన్నది. ఉత్తమమగు ఆకథను చెప్పెదను శ్రద్ధతో వినుము. అని శ్రీగురువులు ఆమెతో పలికిరి.

60. శ్రీగురువులు పలికిన మాటవిని ఆ బ్రాహ్మణస్త్రీ సంతోషము చెందెను. వారి సమీపమునకు పోయి వారి చరణములు స్పృశించెను; తరువాత మరియు ఆమె శ్రీగురువులతో ఈ విధముగా మనవి చేసెను.

61. అపుడు ఆవిప్రస్త్రీ స్వామితో మనవిచేసిన విధము ఇది! నాకు తాము చాల అపూర్వవిషయమును తెలిపితిరే! ప్రదోష సమయమున శివుని ఉద్దేశించి చేసినపూజను చూచినంతమాత్రముననే శ్రీకృష్ణుని అంతటి కుమారుడు కలిగెను అంటిరి.

62. నేను స్వయముగనే ఆపూజను చేసినయెడల కుమారుని పొందుదును అనుట నిశ్చయమే. ఇతఃపూర్వము ఈపూజ ఏవిధముగా జరిగెనో కృపాళువగు వరదాతా! నాకు విస్తారపరచి తెలుపుము. అని మిమ్ము వేడుచున్నాను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

63. అనగా శ్రీగురువులగు శ్రీపాదవల్లభులు ఆ విప్రస్త్రీతో ఇట్లు చెప్పసాగిరి: నీవు అడిగిన విషయము చెప్పెదను; ఏక (ఏకాగ్ర) చిత్తురాలవయి వినుము. ఉజ్జయినీ అను నగరమునందు ఈ అద్భుతము జరిగెను. అది వినుము.

64. ఆ ఉజ్జయినీ నగరమునందు చంద్రసేనుడు అను ధర్మజ్ఞుడగు రాజు ఉండెను. అతనికి ప్రాణసమానుడగు మణిభద్రుడు అను నామముగల మిత్రుడు ఉండెను. వింటివా!

65. ఆ మణిభద్రుడు సదా ఈశ్వర భక్తుడై ఈశ్వరసేవ చేయుచుండెడివాడును, నానావిధములుగా శివుని పూజించుచుండెడివాడును, సులభప్రసన్నుడు అగు శివుడు ప్రసన్నుడు అయి ఆ మణిభద్రునకు ఒకానొక 'చింతామణి' రత్నమును ఇచ్చెను.

66. మహోత్తమమగు ఆరత్నము కోటిసూర్య సమానమయి ప్రకాశముతో నుండెను. రాజసఖుడగు ఆ మణిభద్రుడు ఎల్లప్పుడును తన కంఠమునందు దానిని ధరించుచుండెను.

67. ఆమణికికల లక్షణములు ఏమి అనిన - దానిని స్పృశించిన లోహముకాని పాషాణముకాని సువర్ణముగా మారుచుండెను. అాకుటయే కాదు; ఆరత్నము దేనిమీద తన తేజమును ప్రసరింప జేయునో అదియెల్ల బంగారముగా అగుచుండెను, వింటివా ఈ ఆశ్చర్యమును.

68. అతడు ఏది ఏది తన మనస్సునందు చింతించెనో అది యెల్ల స్మరణమాత్రముననె పొందుచుండెను. ఇటువంటి మహిమ ఖ్యాతికలిగిన ఆ మాణిక్యము తమకు తమకు కావలెనని రాజులును కాంక్ష చేయుచుండిరి.

69. వారిలో కొందరు తాము ఈ మణిభద్రునకు ఇష్టమిత్రులు అగుటచే ఆ చనవుతో ఆరత్నమును తమకు ఇమ్మని యడుగుచుండిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

మరి కొందరు అది ఇప్పించుకొనిరండు అని తమ వారిని అతనికడకు పంపుచుండిరి. మరికొందరు రాజులు ఆరత్నమును బలాత్కారమున నైనను తాము తీసికొనవలయును అని వాంఛించుచుండిరి. ఇట్టి దౌష్ట్యము వింటివా.

70. వారు ఇట్లనుచుండిరి. మాకు నీవు ఈరత్నమును తగిన వెల చెప్పి క్రయమునకు ఇమ్ము. వినుము; నీవు ఇట్లు స్వాభావికరీతిలో ఈయని-చో యుద్ధము చేయుటకయినను వత్తుము; అని వారు అను చుండిరి.

71. రాజులు అందరును కలిసి ఆ ఉజ్జయినీ నగరమును చేరిరి. భూమండలమునం (ఆయా దేశములం) దు కల అపార సైన్యము అంతయు ఒక-చోట చేర్చికొని ఆ ఉజ్జయినీ నగరమును చేసుకొనిరి.

72. ఇంతలో త్రయోదశితో కూడిన శనివారము వచ్చెను. అట్టిదినమున రాజు (శివుని) పూజకయి కూర్చుండెను. (శత్రురాజులు తనమీదకు ముట్టడికై వచ్చిరే అని) ఏమాత్రమును మనస్సునందు శంక (సందేహమును - భయమును) పెట్టుకొనలేదు. ఏక (ఏకాగ్ర) చిత్తుడయి అతడు పరమేశ్వరుని పూజ చేయుచుండెను.

73. రాజు హర్షముతో (ఉజ్జయినీ నగరమునందలి) మహా కాళేశ్వర లింగమునకు పూజ చేయుచుండెను. కొందరు గోపికా (గొల్ల స్త్రీల) పుత్రులు (బాలకులు) కుతూహలముచే చూచుటకై శివా లయమునకు వచ్చిరి.

74. ఆగోపికా కుమారులును పూజనుచూచి తమలోతాము ఇట్లు అనుకొనిరి. మనముకూడ పోయి ఈవిధముగానే ఆడుకొందము. మనము ఇపుడు లింగముచేసి పూజచేయుదము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

75. ఇట్లు పలికి వారు వినోదమునకై తమ ఇండ్లదగ్గరకు వెళ్లిరి. చాల రాలు ప్రోగుచేసిరి. ఆరాలతో అక్కడవారు శివాలయము నిర్మించిరి.

76. ఒక పాషాణమును లింగముగా చేసిరి. ఆ బాలకులు అంతట చక్కగా శివుని పూజచేసిరి. సాంగములగు (చినుగని - తునుగని) నానావిధములగు పత్రములను అక్కడ వారు పూజా పుష్పాది సామగ్రిగా కల్పించుకొనిరి.

77. షోడశోపచార పూజను కల్పన (ఏర్పాటుగా) చేసిరి. ఉదకమును నైవేద్యముగా సమర్పించిరి. ఆ గోపకుమారకులు ఈవిధముగా కుతూహలముతో ఆడుకొనిరి.

78. అంతలో గోపికలు వచ్చి 'భోజనము చేయించెదము; రండు' అని తమ కుమారులను పిలుచుకొనిపోయిరి. ఆ బాలురను అందరును తమ తమ తల్లులవెంట పోయిరి.

79. వారిలోని ఒక గోపికా కుమారుడు మాత్రము లింగమును విడిచి ఇంటికి పోకుండెను. ఆతని తల్లి వచ్చి తాను తనకుమారుని కొట్టెను.

80. ఆమె తన కుమారునితో కుమారా! భోజనమునకై ఇంటికిపోవుదము; రమ్ము; రాత్రి అయినది; కాని ఇది వినుము; ఏమి చేసినను ఆ గోపీకుమారుడు మాటవిని ఇంటికి పోలేదు.

81. ఆగోపిక అంతట కోపముచేసి ఆపూజ ఆట అంతయు పాడు చేసెను. అది అంతయు అంగణము నందు చెదరగొట్టెను. ఆ రాలు అన్నియును దూరముగా పారవేసెను. అపుడు తన ఇంటికిపోయెను.

82. అట్లు ఆమె తన పూజను పాడుచేయగా ఆ బాలకుడు అనేక విధములుగ ఏడిచెను. జరిగినది శ్రద్ధగా వినుము; అతడు మూర్ఛపొంది క్షణకాలము భూమిమీద పడిపోయెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

83. తరువాత అతడు ఆ శివలింగమునందే తన చిత్తమును ఏకాగ్రతతో నిలిపెను; అట్లే తన ప్రాణములు విడువవలయును అని సంకల్పించుకొనెను. అంతట శూలపాణి యగు పరమేశ్వరుడు అతని ఆ గోపికాకుమారుని యందు ప్రసన్నుడు అయ్యెను.

84. ఆశివాలయము అచట రత్నఖచితముఅయి సూర్య తేజము వంటి తేజముతో శోభితము అయ్యెను. ఆ లింగముకూడ రత్నశోభితము అయి కనబడెను. ఆ బాలకుడు మేలుకాంచెను. లేచెను.

85. గౌరీరమణుడు (గౌరికి ఆనందము కలిగించువాడు) అగు పరమేశ్వరుడును నిజరూపము ధరించి ఆబాలకుని చేయిపట్టుకొని లేవనెత్తెను. అతడు ఆబాలకునితో ఇట్లు పలికెను : నేను నీయందు ప్రసన్నుడ నయితిని; వరము కోరుకొనుము. ఏదికోరుకొందువో అది ఇత్తును.

86. బాలకుడు ఈశ్వరునితో ఇట్లు మనవి చేసెను. దేవా! నీవు నా తల్లివిషయమున కోపము పూనకుము; ఆమె నేను ప్రదోష కాలమునందు చేయుచుండిన పూజను పాడుచేసినది. ఆ అపరాధమును తాము క్షమించవలయును. అనెను.

87. నిర్మలహృదయులలో ఉత్తముడగు ఈశ్వరుడు అత్యంత ప్రీతితో ఆబాలకునకు వరము ఇచ్చెను. "ప్రదోషసమయమునందు చేసిన ఈశ్వరపూజను" చూచినందున నీ తల్లియగు ఈగోపిక దేవజనని (భగవానునకు తల్లి) అగును.

88. ఆమె కడుపున కుమారుడు కలుగును; ఆ కలుగు కుమారుడె విఖ్యాతుడు అగు శ్రీమహావిష్ణుని అవతారమును అగు శ్రీకృష్ణుడు అగును; కాని ఈ నీతల్లి తాను స్వయముగా నన్ను పూజచేయలేదు. అందుచే ఆమె ఆ కుమారుని తన కుమారునివలె పోషించుకొనదు; ఇది నిశ్చయము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

89. నీవు నీమనస్సునందు ఏమి ఏమి కోరుకొనెదవో అదియెల్ల నీవు వేగముగా పొందెదవు; ఇది నీమనస్సునందు ఈ నిశ్చయమును నిలుపుకొనుము; నీవంశమునందు సకలసౌఖ్యములును ఉండును. నీవును పుత్త్రపౌత్త్రాదులతో ఆనందింతువు.

90. ఇట్లు ప్రసన్నుడయి పలికిన ఆ గిరిజా (పార్వతీ) పతి ఆ లింగ రూపమగు తన నివాసస్థానమునందు అదృశ్యుడై లయమందియుండెను. ఆ రత్నఖచిత శివాలయమును ఆ గోపికాగృహ సమీపమునందు అదే విధముగా ఉండిపోయెను.

91. ఆ శివాలయము కోటిసూర్యుల ప్రకాశమంతటి ప్రకాశ ముతో మహా మనోహరమయి కనబడుచుండెను. ఇది ఎంతటి మహా ప్రకాశము: సూర్యుడు ఉదయించెనా ఏమి? జనులందరును అది చూచి ఆశ్చర్యముతో అనసాగిరి.

92. ఈ రాజుతో యుద్ధముచేయదలచి వచ్చియుండిన పరరాష్ట్ర ముల రాజులు అందరును ఈమహాచోద్య (అద్భుతవృత్తాంత) మును చూచి ఆశ్చర్యపడిరి; వారు తమ మనస్సులయందలి ద్వేషభావమును విడిచి 'మనము ఈరాజును దర్శింతము' అని సద్భావముతో పలికిరి.

93. చూడుడయ్యా! ఈ పవిత్రమగు నగరమునందు ఈఅర్ధ రాత్రమునందే సూర్యుడు ఉదితుడు (ఉదయించినవాడు) అయి ఉన్నాడు. ఈ రాజు చాల పుణ్యవంతుడుగా ఉన్నాడు. ఇటువంటి వానితో మనకు విరోధము ఎందులకు?

94. అని వారు తమలో తాము అనుకొని మేము మీతో సమావేశమగుదుము. (మేము మీదర్శనము చేయుదుము.) అని ప్రీతిపూర్వకముగా ఆ రాజుకడకు తమ దూతలను పంపిరి. ఈ రాజును వారిని నగరమునందలి తన గృహమునకు పిలువనంపి ప్రీతితో వారిని రప్పించుకొనెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

95. ఇది ఇట్లు జరుగుచుండగా అదేసమయమున ఆరాజులును ప్రీతిపూర్వకముగా ఈరాజును "అయ్యా! ఇది రాత్రి సమయము కదా ! అంధకారము ఉండవలయునుకదా ! సూర్యుడు ఎట్లు ఉదయము నందెను ?" అని అడిగిరి.

96. తరువాత వారు కుతూహలముతో ఈ చంద్రసేనరాజుతో కూడి ఈప్రకాశము వచ్చుచున్న చోటికి చూడవచ్చిరి. వారికి అచట విచిత్రమును రత్నఖచితమును నిరుపమానమును అగు శివాలయము కనబడెను.

97. ఆ గోపాలికా (గోపాలక) గృహమును అదేవిధముగా మహాఘనముగా విరాజమానము (ప్రకాశించుచున్నది) అయి కనబడుచుండెను. ఈరాజు ఆ గోపాలకుమారకుని, దీనికి హేతువు ఏమని యడిగెను.

98. ఆబాలుడు వారికి జరిగిన సమస్త వృత్తాంతమును చెప్పెను. అదివిని రాజులు అందరును సంతోషము చెందిరి. నీవు గోపాలకులకు అందరకును రాజవు అగుము. అని వారు పలికి ఆ బాలకునకు నానా దేశములయందు లభ్యమగు తమ తమ సంపదలు కానుకగా ఇచ్చిరి.

99. అనంతరము సకలరాజులును బయలుదేరి తమ తమ స్థానములకు వెడలిపోయిరి. ఈ చంద్రసేనరాజులు నిర్మలు (నిర్భయు) డై ఉండిపోయెను. ఇదియంతయు శనిప్రదోష పూజాఫలము ఆయెను. అది లభించిన నరునకు భయము ఏలయుండును ?

100. ఆగోపాలకుమారుడును తనఇంటికి పోయెను; జరిగినదంతయు తన తల్లికి సవిస్తరముగా చెప్పెను. "ముందు కాలమున నీ కడుపున శ్రీమన్నారాయణుడు స్వయముగా కుమారుడుగా అవతరించి వచ్చును."

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

101. అని ఇట్లు స్వయముగా ఈశ్వరుడే వరము ఇచ్చెను. ఇది నిశ్చయము, సంశయము ఏమియు పెట్టుకొనకుము. కర్పూరగౌరుడు (కర్పూరమువలె తెల్లనివాడు) అగు పరమేశ్వరుడు నీవిషయమునందు ప్రసన్నుడు అయినాడు. నీవు ప్రదోష (కాలమున నేనుచేసియున్న) పూజను చూచితివి కదా ! దానిఫలితమే ఇది !

102. కాని - నీవు ప్రదోషపూజను పాడుచేసితివి, అందువలన నేను నిన్ను (నీవుచేసిన అపరాధమును) క్షమించుము. (అమె) అని శూలపాణిని వేడితిని. అది అంగీకరించి ఆమహాదేవుడు నిన్ను దగ్గరకు తీసికొనెను. (అనుగ్రహించెను.) అనుచు ఆగోపాలక బాలకుడు సమస్తవృత్తాంతమును తనతల్లికి చెప్పెను.

103. ఈశ్వరుడు వారికి ఇట్లు ప్రసన్నుడై వరములను ఇచ్చెను. ప్రదోషపూజాఫలము ఇటువంటిది; అని శ్రీపాదవల్లభులు ఆసమయము మున ఆ విప్రస్త్రీతో పలికిరి.

104. నావంటి కుమారుడు నీకు కలుగవలయునని నీమనస్సునందు ఉండినదో నీమనస్సునందు సంశయమువిడిచి నిశ్చయబుద్ధికలిగి శనిప్రదోషసమయమందు శంభుని పూజచేయుము.

105. మరియు శ్రీపాదవల్లభులు ఆవిప్రకుమారకుని తనదగ్గరకు రమ్మనిపిలిచి అతని మస్తకము (శిరస్సు) పై తమ హస్తము నుంచిరి. తత్ క్షణమునసే వానికి జ్ఞానము కలిగెను. వాడు మూడు వేదములను శాస్త్రములను ఎరిగినవాడయ్యెను.

106. ఇట్లు పలికి సరళస్వభావుల చక్రవర్తియగు శ్రీపాదవల్లభులు ఆ సమయమున ఆవిప్రస్త్రీ హృదయమందలి భావము ఇది యని చూచి తత్ క్షణమునసే వారియందు ప్రసన్నులయిరి.

107. వేదములును తర్కము మొదలగు శాస్త్రములును సకల భాషలును అతిప్రకాశముగా ఆబాలుడు పలుకసాగెను. చూచువారికి

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

అందరకును ఈ సంఘటనము సాటిలేని మహాశ్చర్యకరమగు విషయము అయ్యెను. అచటి విప్రులును ఇది చాల ఆశ్చర్యకరము అనిచెప్పుకొన సాగిరి.

108. ఆ విప్రస్త్రీ కూడ మిగుల ఆశ్చర్యపడి ఈమహనీయుడు నిశ్చితముగా ఆ ఈశ్వరుడే అయి ఉండును; మహాకార్యములను నిర్వహించు (చనలసిన) కారణమునకై అవతారము అయి నరదేహము ధరించి వచ్చియుండును. అని తలచెను.

109. నేను శ్రీగురునాధుని దర్శించగలిగితిని అను ఏ మహాఫలము కలిగెనో - అది నేను పూర్వజన్మములందు చేసి ఆర్జించుకొనిన పుణ్యకర్మముల ఫలమే; నిశ్చితముగా తత్ఫలముగనే ఇది ఇట్లు ఘటిల్లినది. అని ఆమె క్షణ క్షణమునను ఆమె శ్రీగురువులను నమస్కరించెను.

110. ఆమె ఇంకను ఇట్లు పలికెను. స్వామీ ! ఈశ్వరుడవు నీవే; నేను ప్రదోషసమయమునందు నిన్నే పూజింతును.; నీవాక్యము మిథ్య (మరియొక విధముగా జరుగునది) కాదు. నాకు నీవంటి కుమారుడు కలుగవలయును.

111. ఇట్లు నిశ్చయముచేసికొని ఆవిప్రస్త్రీ ప్రతిదినమునను ప్రదోషకాలమందు శ్రీపాదవల్లభులకడకు వచ్చి మహా మహిమకల ప్రదోషపూజ వారికే చేసెను.

112. స్వామివలన అనుగ్రహము పొందియున్న ఆమె కుమారుడును వేదశాస్త్ర పాండిత్య సంపన్నుడగు మహాజ్ఞాని అయ్యెను; అతడు పాండితిలో అందరకంటెను అధికుడయి అత్యంతముగా పూజ్యుడయ్యెను.

113. మరల తరువాత ఆవిప్రకుమారునకు వివాహము అయ్యెను. అతడు పుత్త్రపౌత్త్రాదులు కలవాడయి హర్షమును, ఆనందమును

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

అనుభవించెను. ఎవరియందు శ్రీగురువులకృప ప్రసరించునో - వారికి ఇటువంటి అదృష్టము కలుగును. ఇది నిశ్చితము అని తెలిసికొనుము.

114. శ్రీగురువులు ఇటువంటి కృపావంతులు; వారిచే భక్త జనులు ఎల్లప్పుడును రక్షితులు (రక్షించబడువారు) అయి ఉందురు. శ్రీమంతుడవగు శిష్యా! నామధారకా! ఏక (ఏకాగ్ర) చిత్తుడవై శ్రీగురుమహిమను వినుము.

115. ఇట్లు సిద్ధుడు నామధారకుడు అను శ్రీగురుభక్తునకు విస్తారపూర్వకము శ్రీగురువులచరిత్రమును చెప్పెను. సమభక్తులును హర్షముతో వినుడు; అని గంగాధరుని కుమారుడగు సరస్వతి నామధారకుడు పలుకుచున్నాడు.

ఇది పరమకథా కల్పతరువయి సిద్ధనామధారక సంవాదరూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురు చరిత్రామృతమునందు శనిప్రదోషవ్రత మాహాత్మ్యకథనమను ఎనిమిదవ అధ్యాయము.

సంఖ్య - 115

# శ్రీ గురు చరిత్రామృతము

## తొమ్మిదవ అధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. సిద్ధుడు పలికిన శనిప్రదోషవ్రత మాహాత్మ్య నిరూపణమును విని నామధారకుడు ఆ యోగికి వినయాన్వితుడయి భక్తిభావపూర్వకముగా చేతులుజోడించి నమస్కారము చేసెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

2. శ్రీపాదవల్లభులు కురవపురమునందు ఉన్న కాలమున తాముచెప్పిన ఈ సంఘటననునకు తరువాత ఎటువంటికథ జరిగెను? దయామూర్తీ జ్ఞానదాతా! విస్తారపరచి నాకు తెలుప వేడుచున్నాను.”

3. అని నామధారకుడు అడుగగా భక్తవత్సలుడును గురు రాజును అగు ఆసిద్ధయోగి తన శిష్యునకు గల భావమును (శ్రీగురు వులయందు అతనికి గల భక్తిని - శ్రీగురుచరిత్రము వినుటయందు అతనికి గల గాఢాసక్తిని) ఎరిగి శ్రీగురుచరిత్రమును గురుభక్తి పూర్వకముగా విస్తారపూర్వకముగా తెలుప నారంభించెను.

4. సిద్ధుడు నామధారకునితో (గంగాధరపుత్రుడగు సరస్వతితో) ఈ విధముగా చెప్పెను : నాయనా! నేను ఇంతవరకును చెప్పిన వృత్తాంతమునకు తరువాత మిగుల కుతూహలము కలిగించు సంఘటనమే జరిగెను. ఆ కురవపురగ్రామమునందు ఒకరజకుడు శ్రీగురువు లగు శ్రీపాదవల్లభులకు సేవకుడు అయ్యెను.

5. ఆ కాలమున అనునిత్యమును శ్రీపాదవల్లభులు గంగకు (కృష్ణానదికి) నియతముగా వెళ్లుచుండెడివారు. (వచ్చెడువారు) విధి పూర్వకముగా స్నానము చేసెడివారు; తాము త్రిమూర్తిస్వరూపులు అయి ఉండియును సాధారణ మానవునివలెనే లౌకికవ్యవహారములు (సంధ్యాద్యనుష్ఠానములు మొదలగునవి) దివ్యమగు విధానక్రమము లతో చేయుచుండెడు వారు.

6. నాయనా! వినుము; ఏమహనీయుని దర్శనము సాక్షాత్ శ్రీగంగాస్నానముతో సమానముగా పుణ్యఫలప్రదమో - ఆమహాను భావునకు ఈ లౌకికవ్యవహార రూపమగు కర్మానుష్ఠానాదికము అంత యును ఎందులకు? ఐనను లోకానుగ్రహార్థము మాత్రమే వారు ఇటు వంటి ఆచరణముల ఆచరించుచుండిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

7. ఈవిధముగా జరుగుచుండగా ఒకనాడు శ్రీపాదవల్లభులు స్నానమునకయి కృష్ణానదికి వచ్చిరి. దశదిశలకును (అన్నివైపులకును) ప్రవహించుచుండు ఆకృష్ణానదీ ప్రవాహములో వారు తాము స్నానము చేయుచు నిలువబడి ఉండిరి.

8 ఆ గంగా (కృష్ణా) నదీతీరమునందు ఆదినములలో రజకుడు ఒకడు ప్రతిదినమందును వస్త్రములు ఉదుకుకొనుచుండెడివాడు. అతడు ప్రతినిత్యమును శ్రీపాదవల్లభ గురుమూర్తిని నమస్కరించు చుండెడివాడు.

9. అతడు ప్రతిదినమునందును ప్రాతర్మధ్యాహ్న సాయం సంధ్యలు అనెడు త్రిసంధ్యలయందును వారి కడకు వచ్చి మనోవాక్కాయకర్మలతో అతివినయముతో దండవత్ ప్రణామము చేయుచుండెడివాడు.

10. ఇట్లు జరుగుచుండగా - ఒకనాడు ఆ రజకుడు స్వామిని నమస్కరించుటకై వచ్చెను. శ్రీపాదవల్లభులు వానితో ఈవిధముగా పలికెను. ఆవిషయమును ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

11. శ్రీపాదవల్లభులు రజకునితో ఈవిధముగా పలికిరి. నీవు ప్రతిదినమును ఎందులకురా ఈవిధముగా (నమస్కరించుచు) శ్రమ పడుచున్నావు ? నీకు నాయందుగల భక్తికి సంతుష్టుడనయితిని. సుఖముగా రాజ్యము ఏలుము అని పలికిరి.

12. శ్రీగురువులు పలికిన మాటను వినుచునే కలుగబోవు శుభమునకు గుర్తుగా వస్త్రపుకొంగు ముడివేసికొనెను. చేతులుజోడించి వాడు శ్రీగురువులతో ఇట్లు మనవి చేసెను. శ్రీగురుమూర్తీ ! తాము సత్యసంకల్పులు.

13. ఆరజకుడు క్రమముగా సంసారవిషయమునందలి భ్రాంతిని (మోహమును) విడిచెను. శ్రీగురువులకు ఏకాంతభక్తుడై వారికి సేవ

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

కుడు అయ్యెను. తనకు వారు కనబడినపుడు ఎంత దూరమునుండి యైనను దండవత్ నమస్కారము చేయుచుండెను. ఇదే విధముగా (మహాభక్తితో) మఠమునకు వెళ్లెను.

14. మరియును ఇట్లు చాలదినములవరకును ఆ రజకుడు శ్రీగురువులకు సేవచేయుచుండెను. వారి మఠపు ముంగిట కసవు ఊడ్చుచుండెను. నీరు చల్లుచుండెను. ఈవిధానముననే ఇతరములగు పరిచర్యలును చేయుచుండెను. ఇదియే తన నిత్యనియమముగా పెట్టుకొని గడపుచుండెను.

15. నాయనా ! చూడుము ! (శ్రద్ధగా వినుము) ఇట్లు ఆరజకుడు శ్రీగురువులకు సేవచేయుచుండగా వసంత ఋతువునందు వైశాఖమాసమున మ్లేచ్ఛరాజొకడు నదియందు జలక్రీడ చేయుచు అచ్చటకు వచ్చెను.

16. అతడు తాను తన అంతఃపుర స్త్రీజనులతో కూడి నావలయందు కూర్చుండి యుండెను. ఆభరణములతో అలంకరించుకొని యుండెను. తానట్లు స్త్రీలతో కూడి జలవిహారము చేయుచు గంగా (కృష్ణా)నదీ మధ్యమున వచ్చుచుండెను.

17. ఆతని సమస్త సేనయును అతనివెంటనే నదీతీరమువెంబడి వచ్చుచుండెను. ఆసేనలో అమితముగా ఏనుగులును గుర్రములును ఉండెను. ఆతని వక్షఃస్థలము రత్నములతో మెరయుచుండెను. ఆతడును ఆతనివారును అలంకృతులయి యుండిరి. వారివెంట సేవకజనులును ఉండిరి.

18. ఈవిధముగ గంగా (కృష్ణా)నదీ ప్రవాహమునందు ఆరాజు క్రీడించుచు వచ్చుచుండెను. నానావాద్యములును అతనివెంటనే గర్జిల్లుచు (అధికముగా మ్రోగుచు) ఉండెను. ఆతని వారందరను వెంటనంటి వచ్చుచుండిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

19. అదే సమయమున రజకుడు శ్రీపాదవల్లభులకు నమస్కరించు చుండెను. ఈ వాద్యముల ధ్వని వినబడగానే ఆతని ధ్యానము చెదరెను. ఆతడు గంగ (కృష్ణానది) వైపు చూచెను. వానికి అటు మ్లేచ్ఛరాజునకు సంబంధించిన సమారంభము కనబడెను.

20. వాడు అదిచూచి తన మనస్సునందు చాల ఆశ్చర్యపడెను. నేను ఈసంసారమునందు జన్మించియు సౌఖ్యము అనగా ఏమో చూడ లేదు గదా ! నా దేహము (జన్మము) పశుజన్మముతో సమానము ఆయెను కదా !

21 ఈరాజుజీవితము ధన్యము; (రాజుగా జీవించుట ధన్య జీవనము;) ఇటువంటి భోగములను భోగిం(అనుభవిం)చ వలయును సుమా ! ఈతనికి ఎన్ని వస్త్రములు ! ఎన్ని భూషణములు ! ఎందరు స్త్రీలు ! ఈతడు (గతజన్మములందు) ఎటువంటి ఈశ్వరభక్తుడు అయి ఉండును !

22. ఈతని పూర్వజన్మార్జిత ఫలము ఎంత గొప్పది ఐ యుండును ! ఈతడు ఏ దేవుని ఆరాధించెనో ! ఎటువంటి గురుని ఆశ్రయించి ఉపాసించెనో ! మరి - ఆపుణ్యముల ఫలముగా ఈ పదమును ఆతడు పొందగలిగెను.

23. ఆరజకుడు ఈవిధముగా మనస్సునందు ఆలోచించుచు శ్రీపాదవల్లభులు దండవత్ నమస్కారము చేసెను. కృపావంతులు అగు శ్రీపాదవల్లభులు ఆతని మనస్సునందు ఉన్నవాసన (కోరిక)లను గ్రహించిరి.

24. భక్తవత్సలులగు శ్రీగురుమూర్తి వాని ఈ (మనః)స్థితిని తెలుసుకొనిన వెంటనే వానిని తనదగ్గరకు పిలిచిరి; ఏమోయీ ! నీవు నీమనస్సులో ఏమి చింతించు (ఆలోచించు)చున్నావు ? అని వానిని ప్రశ్నించిరి.

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

25. రజకుడు స్వామితో ఇట్లు పలికెను; నేను ఈ మ్లేచ్ఛరాజును కన్నులార చూచితిని; నా మానసమునందు సంతోషము కలిగినది; నేను కేవలము శ్రీగురువుల దాసుడను. (ఈతడును శ్రీగురువుల దాసుడై యుండును.)

26. ఈతడు తపస్సులతో దేవుని ఆరాధించి ఇటువంటి ఉన్నత దశను పొందియుండును. కృపామూర్తీ! సకల సుభదాతా! శ్రీగురూ! నేను ఇట్లని నామానసమునందు ఆలోచించుచుంటిని; ఇంతే.

27. ఈ ప్రాపంచిక సౌఖ్యములందు అభిలాషయు అనెడు ఈ నానావాసనలును ఇంద్రియములకు అవిద్యా (మాయా)సంబంధముచే కలుగును; వాస్తవమున నాకు ఈభోగముల విషయమున (ఆసక్తి) రుచిలేదు. తమ చరణముల (సన్నిధి)యందే నాకు సౌఖ్యము కలదు.

28. శ్రీపాదవల్లభులు రజకునితో ఇట్లు పలికిరి. జన్మించినది మొదలుకొని క్లేశపడుచునే యుంటివి. ఇపుడు నీకు భోగములను అనుభవించవలయును అను వాంఛ కలిగినది; ఇది స్వాభావికమే; కాని ఇటువంటి రాజ్యపదము మొదలగునవి పొందవలయును; అనుభవించవలయును; అనుకోరికలు కలుగుట తమోగుణ ప్రవృత్తిమూలముననే.

29. కలిగిన కోరికలను అనుసరించి సుఖములు అనుభవించినచో ఇంద్రియములు అన్నియు శాంతములు అగును. లేనిచో మనస్సు నిర్మలము కాదు; అంతేకాదు; వినుము; అట్లు తృప్తిపొందని ఇంద్రియములును మనస్సును తరువాత జన్మాంతరమునందు బాధకలిగించును; ముక్తికి సాధనము చేయనీయవు.

30. ఇంద్రియములను తృప్తిపరచుటకై నీవు ముందటిజన్మమునందు మ్లేచ్ఛవంశమునందు జన్మించవలయును; నీ మనస్సునందు కోరిక కలిగినది; త్వరితముగాపోయి భోగములను అనుభవించుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

31. శ్రీపాదవల్లభస్వామి పలికిన వచనములను విని రజకుడు తన రెండుచేతులును జోడించి ఇట్లు మనవి చేసెను: కృపా సముద్రస్వరూపా! శ్రీగురురాజా! నన్ను ఉపేక్షించ(వదలివేయ)వలదు; (నన్ను తమ ఉపాసననుండి దూరముచేయనలదు.)అని వేడుకొనెను.

32. ఇపుడు ఇట్లు తమ చరణములు నాకు దూరమయినప్పటికిని తాము నాకు మరల దర్శనము ఈయవలసినదిగా ప్రార్థించుచున్నాను. తమ అనుగ్రహము కలుగుటకు మూలహేతువు అగు జ్ఞానమును కూడ- ఓ మహాఫలదాతా! నాకు తాము దయచేయ వేడుచున్నాను.

33. ఇది విని శ్రీగురువులు వానితో ఇట్లు పలికిరి : నీవు విదూర (బీదరు)నగరమునందు జన్మమును పొందెదవు; నీ అంతకాలమునందు నీకు నాదర్శనమును ఇత్తును; నేను నీదగ్గరకు వచ్చుటకు తగినకారణము కూడ అపుడు సంఘటిల్లును.

34. అపుడు నీకు నాదర్శనము కలుగుచునే నీకు నీ మానసము నందు జ్ఞానము కలుగును. ఓయీ! నీవు ఏవిషయమునను ఏ మాత్ర మును చింతపొందకుము. తప్పక నేనే నీదగ్గరకు వచ్చుట సంఘటిల్లును.

35. ఇంతేకాదు; వినుము; ఒకానొక కారణవశమున నా అవ తారము (నేను అవతరించుట) జరుగును; అపుడు నేను సంన్యాసివేషము (రూపము) ధరింతును; నా నామము అపుడు 'నృసింహసరస్వతి' అని ఉండును.

36. శ్రీపాదవల్లభస్వామి ఆ రజకునిఇట్లు సమాధానపరచి 'ఇక నీవు వెళ్లవచ్చును' అని ఆజ్ఞఇచ్చిరి. ఆతడును వెంటనే శ్రీస్వామివారి చరణములయందు దృఢభక్తి నిలిపి వారికి నమస్కారము చేసెను.

37. కృపామూర్తి యగు శ్రీగురుమూర్తి ఆ రజకుని మరల తనదగ్గరకు పిలిచి 'రాజ్యభోగములను ఈజన్మమునందే అనుభవింతువా? లేక - ఇటుతరువాతనా? నీసంకల్పము ఏమో నాకు చెప్పుము.' అనిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

38. అదివిని శ్రీపాదవల్లభులతో ఆరజకుడు వినయముతో ఇట్లు పలికెను : స్వామీ ! నేను ఇపుడు అపరవయస్సు (ముదుసలితనమునకు) వచ్చియున్నాను. బాల్యమునుండియు అలవాటుగా రాజ్యభోగములను అనుభవించుటయే నాకు ఇష్టము; రాజ్యభోగములు యౌవనమునందు అనుభవించుటయే రుచికరముగానుండును.

39. రజకుడు పలికిన మాటలు విని శ్రీపాదవల్లభులు తాము ఇట్లు పలికిరి : 'ఓరీ ! అట్లయినచో నీవు ఇపుడు ఇక్కడనుండి త్వరగా వెడలి పొమ్ము :' నీవు నీకోరిక ననుసరించి జన్మాంతరమునందే ఈభోగములను అనుభవింతువు అని వారు అనిరి.

40. అపుడు వారట్లు ఆజ్ఞఇచ్చిన తత్ క్షణమునందే ఆరజకుడు తన ప్రాణములు వదలెను. తరువాత మరికొంతకాలమునకు ప్రఖ్యాత మగు వైదూరనగరమునందు ఈ రజకుడు మ్లేచ్ఛవంశమునందు జన్మము నందెను.

41. ఈ విధముగా శ్రీపాదవల్లభులవలన అనుగ్రహము పొందిన రజకుని కథను ఇటు తరువాత నీకు విస్తారపూర్వకముగా చెప్పెదను. అని సిద్ధుడు నామధారకునితో ఇంకను ఇట్లు పలికెను. ఏలయన అటు తరువాత ఇంకను చాల చరిత్రము జరిగెను.

42. ఇంతవరకును చెప్పిన కథ జరిగినంత కాలములోనే - అనగా శ్రీపాదవల్లభులు కురవపురమునందు నివసించుచుండిన కాలముననే - శ్రీవారి మహిమము అపరిమితమయి లోకమున ప్రఖ్యాతము అయ్యెను. శ్రద్ధతో వినుము.

43. శ్రీగురునృలవారి మహిమము అంతయు చెప్పవలయును. అనినచో కథలు బహుసంఖ్యాకములు అయి గ్రంథము విస్తారము నందును. ఈ శ్రీపాదవల్లభావతారమునకు తరువాత జరిగిన అవతారము

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

నందు జరిగిన మహిమములు చెప్పవలసినవి చాలగలవు. కనుక ఇవి ఇంతటితో ముగింతును. ఇకమీదట అది విస్తార పూర్వకముగా చెప్పెదను; నామధారకా ! వినుము.

44. శ్రీగురువులవారి మహిమమును సమగ్రముగా చెప్పుటకు నావాక్కునకు శక్తి ఎక్కడినుండి వచ్చును? వారు అంతటి మహిమము కలవారు అనుటలో ఆశ్చర్యపడవలసినదియు ఏమియు లేదు. ఏలయన - వారి అమృత దృష్టి ప్రభావముచే ఆ స్థానపు (కురవ పురపు) మహిమమే (నేటికిని) ఇంతగొప్పదిగా నున్నది; (అనినచో మరి వారి స్వయం మహిమము ఎంత గొప్పది ఐ యుండును !)

45. శ్రీగురువులు ఏస్థానమునందు వాసము చేయుదురో ఆప్రదేశపు మహిమము ఈ లోకమునందే అపారమయి ప్రవర్తిల్లును. ఆ క్షేత్రపు మహిమములే వినుటకు ఆశ్చర్యము కలిగించు ఆఖ్యానములు (విస్తృతకథలు) గా నుండును. ఇది యథార్థము అనుటకు దృష్టాంతము చెప్పెదను; వినుము.

46. శ్రీగురువులు నివసించిన స్థానపు మహిమ విస్తారమును చెప్పెదను ఏకాగ్ర మనస్కుడవయి వినుము; వారు చాలకాలము నివసించియుండిన కురవపురము ప్రసిద్ధమయి యున్నదికదా ! అక్కడ భక్తుల మనఃకామన పూర్ణమగును; అనుట ప్రసిద్ధమగు విషయమే.

47. శ్రీపాదవల్లభులు కురవపురమునందు నివసించుచు కొన్ని దినములు గడచిన తరువాత తాము మరల అవతారము అందవలసిన కారణము ఒకటి ఉన్నందున వారు తామచ్చట అదృశ్యరూపులు అయిరి.

48. ఒకానొక సంవత్సరపు ఆశ్వయుజ కృష్ణ ద్వాదశీ తిథి యందు మఘానక్షత్రమున - సింహరాశి కాలమున - శ్రీపాదవల్లభులు నిజానంద మహాసనమునందు ఉపవిష్టులయి గంగ (కృష్ణానది)యందు అదృశ్యు లయిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

49. మూర్తిత్రయ రూపులు అగు శ్రీపాదవల్లభులు లౌకిక దృష్టికి తాము అదృశ్యులుగా తోచుచున్నారే కాని వారు నిర్ధారితముగ ఎప్పటికిని కురవపురమునందే యున్నారు. సుమా ! అని ఎరుగుము.

50. శ్రీపాదవల్లభులు ఆ కురవపుర స్థానమునందు అదృశ్యులయి యుండియు నిర్గుణ (అమూర్త) స్వభావులయి అదేస్థానమునందు ఎప్పుడును ఉన్నారు. మరల అవతారము అందు సంకల్పముతో మాత్రమే వారు అదృశ్యు లయిరి, అను ఈవిషయము జ్ఞానులకు ఎవరికి తెలియదు ?

51. ఏజనులు కేవల భక్తులో వారికి వారు నిర్మల (స్వయం జ్యోతిః) స్వరూపులయి సాక్షాత్కరించుచునే యుందురు. వారి నిత్య నివాసమగు కురవపురక్షేత్రము భూమండలమంతటిలోను సర్వాతిశాయి (అన్నిటిని మించినది.) అగు క్షేత్రముగా ప్రఖ్యాతము.

52. శ్రీపాదవల్లభులు ఆ కురవపురక్షేత్రమునందు ఎప్పుడును ఉందురు. అనుటకు దృష్టాంతముగా విస్తారపూర్వకమగు కథ చెప్పెదను; శ్రోతలగు సకల జనులారా ! వినుడు అని సరస్వతీ గంగాధరుడు (గంగాధరుని పుత్త్రుడగు సరస్వతి) చెప్పుచున్నాడు.

53. ఇది యంతయు సిద్ధుడు నామధారకునితో (సరస్వతితో) చెప్పియుండెను. ఆకథయే విస్తార పూర్వకముగా గంగాధర పుత్త్రుడగు ఈ సరస్వతి సకల జనులకు చెప్పుచున్నాడు.

ఇది పరమకథా కల్పతరువు అయి సిద్ధనామధారక సంవాదరూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు శ్రీపాదవల్లభులు రజకునకు వరములు ఇచ్చుటయు వారు నిజానంద మహాసనమునందు ఉపవిష్టులు అగుటయు అను నవమాధ్యాయము. (సంఖ్య - 53)

# శ్రీ గురు చరిత్రామృతము

## పదియవ అధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. సిద్ధుడు అంతవరకును ఈ విధముగా పలికిన వచనములను విని నామధారకుడు (సరస్వతి) ఆసిద్ధయోగితో ఈవిధముగా మనవి చేసెను. శ్రోతలారా! అది చెప్పెదను తెలిసికొనుడు: "అయ్యా! కురవపురపు మహిమము" ఎటువంటిదిగా (ప్రఖ్యాతము) అయ్యెనో తెలుపుడు.

2. "శ్రీపాదవల్లభులు లౌకిక దృష్టితో తాము తమ దేహమును త్యజించినను వారు అచ్చటనే ఉన్నారేకాని అచ్చటినుండి పోలేదు; అనియు తాము అనుచున్నారు. వారు ఈ తదనంతరము మరియొక అవతారము ధరించిరి. అనుచు మరియొకమాటను చెప్పుచున్నారు. ఇది అంతయు ఎట్లు; ఈ సకల వృత్తాంతమును విస్తారపరచి తాము నాకు ప్రతిపాదించవలయునని వేడుచున్నాను." అని నామధారకుడు అనెను.

3: అదివిని సిద్ధయోగి నామధారకునితో ఈవిధముగా పలికెను: నాయనా! శ్రీగురుమహిమము ఎట్టిది? అని నీవు అడుగవలసిన పని ఏమున్నది? వినుము; వారు అనంతరూపులు అయి ఉందురు; వారు విశ్వవ్యాపకములు అగు పరమాత్మస్వరూపులు.

4. ముందటికాలమున లోకానుగ్రహము చేయవలసిన కారణమున వారు మరియొక అవతారమును ధరించిరి; ఇదియు నిజమే; వినుము; తాము అట్టి లోకానుగ్రహార్థమే గుప్తవేషు (రూపు) లయి అదే కురవపుర క్షేత్రమునందును ఉన్నారు. ఇదియు యథార్థమే.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

5. నాయనా! చూడుము; భృగువంశ సంజాతుడు అగు పరశురాముడు; ఈ నాటికిని స్థిర (చిరం) జీవులు అయి ఉన్నారు కదా ! కాని భగవంతుని రూపాంతరమే అగు తాము ఆ అవతారము నకు తరువాత అనేకములగు అవతారములను ధరించినారు కదా ? అదే విధముగా శ్రీపాదవల్లభులును తాము నేటికిని గుప్తరూపులయి కురవపుర క్షేత్రమునందు ఉన్నారు. అవతారములను కూడ ధరించి నారు. అని నీవు విచారణచేసి నిశ్చయించుకొనవలసి యుండును.

6. నారాయణుని తాత్త్వికమగు మూర్తి ఒక్కటియే. ఆమూర్తి తాను అన్ని తావులందును వసించుచునే యుండును. (అతడే మూర్తి త్రయముగా విభాగమునంది యున్నాడు.) ఆ త్రిమూర్తులకును సత్త్వము (ఆనంద పూర్ణత్వము) రజస్సు (ప్రవృత్తి) తమస్సు (నివృత్తి) అనునవి మూడుగుణములు (లక్షణములు); అవియే పరమాత్ముడగు నారాయణుని నుండి ఎన్నడును దూరముకాని మాయాశక్తి యందుండు లక్షణములు. ఈలక్షణములను వేరువేరుగా ఆశ్రయించి (ఆగుణములకు తాము ఆశ్రయము అయి) ఆపరమాత్ముడే తాను ఈశ్వరుడుగా సృష్టి స్థితి లయములు అను మూడు కార్యములను నిర్వహించు చుండును.

7. భక్తజనులను తరింపజేయుటకు గాను హృషీకేశుడు (నారా యణుడు) తాను ఆయా అవతారములను ధరించుచుండును. దూర్వాస మహాముని శ్రీమహావిష్ణునకు శాపము ఇచ్చెను. అనునది ఆదేవుని ఈ అవతార ధారణమునకు హేతువు అయిఉన్నది.

8. ఈ శ్రీపాదవల్లభులు ఆనారాయణుని స్థితి విశేషములు అగు ఆ ముగ్గురు మూర్తుల సమిష్టిరూపులు త్రిమూర్త్యవతారము. వారి తత్త్వమును ఎవరు సంపూర్ణముగా ఎరుగుదురు ? ఇటువంటి శ్రీగురుమూర్తి ఈ కురవపురతీర్థక్షేత్రమునందు సదా వాసముచేయుచు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

ఉన్నారు. కావుననే అది తీర్థక్షేత్రములు అన్నియు ఒకేచోట నిలిచిన నిధి వంటిది.

9. భక్త జనులు ఎవరు ఎవరు తమ మానసములందు చింతింతురో వారు అది ఎల్ల శ్రీగురు దర్శనమాత్రముచేతనే పొందుదురు. ఏల యనిన - శ్రీగురువులు ఏస్థానమునందు నివసించుచుందురో ఆప్రదేశము (జనులకు అన్ని కోరికలును పూరించగల) కామధేనువే అని తెలిసికొనుము.

10. అటువంటి శ్రీపాద శ్రీవల్లభుల నిత్యనివాసమగు స్థానపు మహిమము ఇటువంటిది - ఇంతటిది - అని వర్ణించుటకు నేను ఎంతటి వాడను? నీకు చెప్పవలయును అనినను అది అపారము అయినది. ఆవిషయమున ఒకానొక దృష్టాంతమును చెప్పెదను వినుము.

11. నీకు నేను శ్రీగురుమహిమమును ఇట్లు వర్ణించుచు విస్తారపరచుచు చెప్పుచుండుటకు హేతువు ఏమి అనిన - (నీకుగల ఈ) గురుభక్తిని వ్యర్థము కానీయరాదు. గురుభక్తి ఎన్నడును ఎంతమాత్రమును వ్యర్థము కాదు కూడను; శ్రీగురువులు తమభక్తుల (ఉపాసకుల) ను ఎన్నడును ఎంతమాత్రమును వదలివేయరు. (ఉపేక్షించరు) పైగా శ్రీవారు తాము ఎల్లపుడును భక్తుల (ని) వాసమును కనిపెట్టికొని యుందురు. (తన భక్తులకు ఏక్లేశములును కలుగకుండ కాపాడవలయునను భావముతో ఉందురు.)

12. ఎవరికి అయినను తమ మనస్సునందు దృఢమును స్థిరమును అగు భక్తి ఉండవలయును. ఎట్టి స్థితియందును తన మనస్సును సడలనీయక చెదరనీయక గంభీరభావముతో ధీరత్వము (నిబ్బరము) తో ఉండవలయును. ఆ విధముగ ఉండువాడే సంసారమందలి క్లేశముల (నెడు సముద్రము) నుండి దాటుకొనును. ఇహలోకమునందును పరలోకమునందును సౌఖ్యము నందును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ॥**

13. ఈవిషయమును ఋజువు పరచుటకై నీకు ఒక దృష్టాంత మును చెప్పెదను. ఇది సహజ (వాస్తవ) ముగ జరిగిన విషయమే; (కల్పితకథ కాదు.) కాశ్యపగోత్రజుడు అగు బ్రాహ్మణుడు ఒకడు ఉండెను. ఆతని నామధేయము 'వల్లభేశుడు.'

14. ఆవిప్రుడు మంచి శీలముకలవాడు; సదాచారవంతుడు; ధనము వడ్డీకిఇచ్చి వచ్చిన లాభముతో పొట్టనింపుకొను జీవనము చేయు చుండెను. ఆతడు ప్రతి సంవత్సరమునను ఈ శ్రీవల్లభుని క్షేత్రము (అగుకురవపురము) నకు యాత్రకై పోవుచుండెను.

15. ఇట్లు జరుగుచుండగా కొంతకాలమునకు తరువాత వడ్డీ వ్యాపారియగు ఆ బ్రాహ్మణుడు ఎప్పటివలెనే యాత్రకై బయలు దేరెను. ఆపర్యాయము అతడు 'నేను ఈసారి బ్రాహ్మణులకు సంత ర్పణము చేయవలయును' అని అతి దృఢమగు మొక్కుబడి సంక ల్పము చేసికొనెను.

16. వడ్డీవ్యాపారముపై నాకు వచ్చు ఫలము (లాభము) తో వేయిమంది బ్రాహ్మణులకు ఇచ్ఛా భోజనము పెట్టించెదను. ఈవిధముగ ఈసంవత్సరము నేను విశేషముగా శ్రీపాదవల్లభ క్షేత్రయాత్ర చేయు దును; అని అతడు నిశ్చయించు కొనెను.

17. ఈవిధముగ తన మానసమునందు దృఢనిశ్చయము చేసి కొని ఆతడు వడ్డీవ్యాపారమునకై బయలుదేరెను. ఆవల్లభేశుడును నిరంతరముగా తన మనస్సునందు శ్రీపాదశ్రీవల్లభులను ధ్యానించు చుండెను.

18. చూడుము; ఆ సంవత్సరమున ఆవల్లభేశుడు తాను ఏ ఏ చోటికి పోయెనో అచటనెల్ల అతడు అనంతము అగు మంచి సంతోష మును పొందెను. ఏలయన - అతనికి ఎప్పటికంటె నూరురెట్లు అధిక లాభము కలిగెను. అందుచే ఆతడు పరమానందము పొందెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

19. ఆతడు తన మానసమును శ్రీపాదశ్రీవల్లభుల ధ్యానము నందే నిలిపి తత్ క్షణమే యాత్రకై బయలుదేరెను. తాను మొదట సంకల్పించిన విధముగా సంతర్పణము చేయుటకై కావలసిన ధనము నతడు తనవెంట తీసికొనెను.

20. ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు ద్రవ్యమును తనవెంట తీసికొని బయలు దేరెను. అనునది దొంగలు చూచిరి. ఆతస్కరులే కపట రూపము ధరించి తాము ఆవిప్రునితో పాటే పోవు తోడిబాటసారు లుగా అయి (నటించుచు) ఆతనితో బయలుదేరి పోవుచుండిరి.

21. తస్కరులు అట్లు ఆతనికి సహయాత్రికులయి పోవుచుండిరి. రెండు మూడు దినములు అయినతరువాత ఒకనాటి రాత్రి వారు మార్గస్థులు అయి పోవుచుండిరి.

22. అంతవరకునువారు ఆవల్లభేశునితో "మేమును శ్రీపాదశ్రీవల్ల భుల దర్శనమునకై కురవపురమునకే పోవుచున్నాము. ప్రతిసంవత్స రమునను ఇట్లు పోవుచుండుట మాకు నియమముగా ఉన్నది." అని చెప్పి (ఆతని నమ్మించి) యుండిరి.

23. ఇట్లు చెప్పియున్న ఆదొంగలు ఆతనితో పోవుచు పోవుచు మార్గమధ్యమున ఆ బ్రాహ్మణుని చంపిరి. వారు ఆతని శిరము ఛేదించి ఆతనియొద్దనున్న సకల ధనమును తీసికొనిరి.

24. భక్తజన రక్షకుడు అగుచు కురవపురమునందు ఉండెడి శ్రీపాదశ్రీవల్లభులు జటలతో అలంకృతమును శరీరమందంతటను భస్మముతో పూయబడినదియు అగు వేషమును ధరించి త్వరితముగా అచ్చటికి వచ్చి చేరిరి.

25. ఒకచేతియందు త్రిశూలమును మరియొక చేతియందు ఖడ్గమును ధరించి శ్రీపాదశ్రీవల్లభులు దొంగల వెనుకకు వచ్చి నిలువ

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

బడిరి. ఏమాత్రమును తడవుచేయక త్వరితముగా త్రిశూలములతో తస్కరులను వధించివేసిరి.

26. వారు ఆవిధముగా తస్కరులను అందరను చంపుచుండగా వారిలో ఒకడు వచ్చి శ్రీగురువులతో ఇట్లు మనవిచేసికొనెను : దయాశాలీ ! జగన్నాథా ! నేను నిరపరాధుడను అయి ఉన్నాను.

27. ఈ దొంగలు ఈ బ్రాహ్మణుని చంపివేయుదురు అని నేనుఎరుగను. నేను అది తెలియక వీరికి తోడుఅయి వీరివెంట వచ్చితిని. ఇది యథార్థము. సర్వోత్తములు అగు తాము సకలప్రాణుల చిత్తముల యందలి భావములును స్పష్టముగా ఎరుగుదురు.

28. తస్కరుడు చేసిన మనవి విని శ్రీపాద శ్రీవల్లభులు వానిని తమదగ్గరకు పిలిచిరి. వానిచేతికి విభూతి ఇచ్చిరి. అది ఆవిప్రుని మీాద చల్లుము అని చెప్పిరి.

29. నాయనా ! నామధారకా ! ఏక (ఏకాగ్ర) చిత్తుడవు అయి వినుము. ఆ తస్కరుడును శ్రీపాద శ్రీవల్లభులు చెప్పినట్లే ఆ మృతవిప్రుని కంఠమును మొండెముతో చేర్చెను. గురు స్మరణముతో ఆ విభూతిని అభిమంత్రించెను; దానిని విప్రునికంఠముపై చల్లెను. తత్‌క్షణము విప్రుడు సజీవుడు అయ్యెను.

30. వినుము; ఇది ఇట్లు జరుగునంతలోనే దినకరుని (సూర్యుని) ఉదయము అయ్యెను. శ్రీపాద శ్రీవల్లభులు అదృశ్యులు అయిరి. సజీవుడై లేచిన ఆవిప్రుని ప్రక్కనే (సమీాపమందే) ఈ తస్కరుడు నిలువబడి యుండెను.

31. ఆ విప్రుడు తన ప్రక్కనే నిలువబడి ఉండిన తస్కరుని ప్రశ్నించెను, అతడు దొంగతో ఇట్లు పలికెను. నీవు నన్ను ఏల పట్టుకొనియున్నావు ? ఈ చచ్చిపడియున్న మనుష్యులను ఎవరు చంపిరి ? అని ఇట్లు ఆతడాసమయమున ఆదొంగను ప్రశ్నించెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

32. తస్కరుడు ఆ ద్విజునకు సమాధానముగా ఇట్లు పలికెను : అయ్యా! వినుము; అద్భుతమగు సంఘటనము ఒకటి జరిగినది; ఒక తపస్వి ఇక్కడకు వచ్చియుండెను. అతడు వీరిని (ఈ చచ్చిపడి నీకు కన బడుచున్న ఈ దొంగలను) తన త్రిశూలముతో చంపెను.

33. నన్నుమాత్రము ఆతడు నీ నిమిత్తమయి కాపాడెను. ఆ తాపసి ఇచ్చిన ఆజ్ఞను పాటించి నేను అతిప్రీతితో నిన్ను పట్టుకొని కూర్చుండబెట్టుకొని కూర్చుంటిని. ఆతడు ఇచ్చిన విభూతిని మంత్రించి నీకు అంటించితిని. నీదేహమును సజీవమునుగా చేసితిని. (నీదేహము నందు జీవము వచ్చునట్లు చేసితిని.)

34. ఆ తాపసియును ఇప్పుడుకూడ నీదగ్గర నిలువబడియుండెను. ఒకక్షణముక్రిందటనే అదృశ్యుడయ్యెను. మహాశక్తి సంపన్నుడగు ఆ మహాముని ఎవ్వరో నాకు తెలియదు; కాని ఆయనమాత్రము నిన్ను రక్షించెను అనునది సత్యమగు విషయము.

35. ఆయన త్రిపురారి (త్రిపురాసురులకు శత్రువు) అను ఈశ్వరుడు అయి ఉండును. ఏలయన ఆతడు జటలను దాల్చి శరీర మందు భస్మము పూసికొనియుండెను. నీవు నిశ్చయముగా ఆయనకు భక్తుడవు అయి ఉందువు. అందుచేతనే ఆయన వచ్చి నిన్ను రక్షించు టకై స్థిరుడై నిలువబడెను.

36. తస్కరుడు పలికిన వచనములను విని ఆ బ్రాహ్మణుడు ఆమాటలు అన్నియు యథార్థమే అని విశ్వసించెను. తరువాత ఆ తస్కరుని దగ్గరనుండి తన ధనమును తాను తీసికొని కురవపుర యాత్రకై వెళ్లెను.

37. అతడు అచ్చట అనంతభక్తితో ప్రీతిపూర్వకముగ నానా విధములుగ శ్రీపాద శ్రీవల్లభుల పాదుకలకు పూజచేసెను. నాలుగు

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

వేలమంది బ్రాహ్మణులకును నానావిధములుగ పూజలు జరిపి వారికి భోజనములు పెట్టించెను.

38. ఇట్లు అనేకులగు భక్తజనులు శ్రీపాదవల్లభుల స్థానమగు కురవపురమునందు వారి పాదుకలకు పూజ చేయుచుందురు. వినుము; ఈ కురవపురము చాల ప్రఖ్యాతమయినది. అపారమగు మహిమను కలది అని ఎరుగుము.

39. అని ఇట్లు అంతయు చెప్పిన అనంతరము సిద్ధయోగి నామధారకుని (గంగాధరపుత్రుడగు సరస్వతి) తో ఇట్లు చెప్పెను: నాయనా! నీవు నీ మానసమందు ఏమాత్రమును సంశయము పెట్టుకొనకుము. శ్రీపాదశ్రీవల్లభులు అప్పుడును ఇప్పుడును ఎప్పుడును కురవపురమునందు అదృశ్యరూపులై యున్నారు.

40. అనంతరము మరియొక అవతారము జరుగ (ధరించ) వలసియున్నది. కనుకనే వారు గుప్తరూపులయి యున్నారు. (ఇది సాధారణ దృష్టికి చెప్పుచుండుమాట మాత్రమే.) అనంతరూపుడు అను నారాయణుడు సకల స్థానములందును పరిపూర్ణుడై యున్నాడు. అట్టి పరమాత్ముడు వాస్తవముగ ఉపాసకులగు ఎవరికి కనబడకుండును ?

41. ఇట్లు శ్రీపాద శ్రీవల్లభమూర్తి లౌకిక దృష్టికి అదృశ్య (గుప్త) రూపులయి పరమార్థతత్త్వముతో ఐక్యమునంది యున్నారు. అనంతరము తాము ధరించిన శ్రీనృసింహసరస్వతి అను నామము ధరించిన అవతారమున మరల లోకమున ఖ్యాతినందినారు.

42. ఇట్లు ఇంతవరకును జరిగిన వృత్తాంతమును చెప్పి గంగాధరుని కుమారుడగు 'సరస్వతి' అనంతరము జరిగిన కథావిస్తారమును చెప్పుచున్నాడు. ఇది వినువారికి మనోహరముగానుండును. సకలములగు అభీష్టములను సిద్ధింపజేయును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

ఇది పరమకథా కల్పతరువు అయి సిద్ధ - నామధారక - సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీ నృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు శ్రీపాద శ్రీవల్లభస్థానమగు కురవపురక్షేత్రపు మహిమానువర్ణనము అను పదియవ యధ్యాయము.

సంఖ్య - 42

# శ్రీ గురు చరిత్రామృతము

## పదునొకండవ అధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. నామధారకుడు (గంగాధరుని పుత్త్రుడు అగు సరస్వతి) సిద్ధయోగితో ఇట్లు పలికెను: శ్రీపాద శ్రీవల్లభావతారమునకు తరువాత ప్రవర్తిల్లిన శ్రీనృసింహ సరస్వత్యవతారము జరిగిన విధము ఏది ? స్వామీ ! కృపామూర్తీ, నాకు ఆవిషయమును విస్తారపరచి చెప్పవలయును. అని మిమ్ములను ప్రార్థించుచున్నాను.

2. అనగా సిద్ధయోగి ఇట్లు పలికెను : నాయనా ! వినుము; శ్రీపాద శ్రీవల్లభులు తమ తరువాత హర్షపూర్వకముగా ధరించవలసిన అవతారమునకు భూమికగా పూర్వమందు జరిగిన వృత్తాంతము నీవు నావలన వినియుంటివి. ఏమిఅనిన - నీకు నేను ఒక విప్రస్త్రీ కథ చెప్పిఉంటిని కదా !

3. ఆ విప్రస్త్రీ శ్రీగురువుల ఉపదేశమును అనుసరించి శనివారపు ప్రదోషములయందు సర్వేశ్వరుని పూజించుచు ఉండెను. ఆమెకు దేహావసాన సమయము వచ్చెను. ఆ సమయమున ఆమె పంచత్వమును (మృతిని) పొందెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

4. అటుతరువాత ఆమెకు ఉత్తరదేశమునందు కారంజ నగరమున జన్మము కలిగెను. ఆమె అపుడు ఆనగరమున (శుక్ల యజుర్వేదీయ) వాజసనేయ శాఖకు చెందిన విప్రుని వంశమునందు జన్మించెను.

5. నాయనా ! నామధారకా ! వినుము; ఆబాలికకు తనతల్లిదండ్రులచే జననకాలమును బట్టి జాతకము వ్రాయించబడెను; 'అంబాభవానీ' అని ఆమెకు నామకరణము చేయబడెను; ఆమె తన తల్లిదండ్రులచే స్నేహ (వాత్సల్య) భావమున చాల ఉన్నతస్థానమునందు నిలుపబడెను.

6. తన తల్లిదండ్రుల గృహమున వారికి అతిస్నేహమునకు పాత్రురాలై వృద్ధిపొందుచు పొందుచు ఈ కన్య - అంబాభవాని - వివాహముచేయదగిన వయస్సుకలది అయ్యెను. అంతట ఆమెను ఆమె తల్లిదండ్రులు అదే గ్రామమునందలి ఒక విప్రునకు ఇచ్చి మహోత్సాహముతో మహోత్సవ పూర్వకముగా వివాహము జరిపిరి. ఎట్లు అనిన -

7. తెలిసికొనుము; ఆకాలమున ఆ కారంజ నగరమునందు శివవ్రతి (శివోపాసనమే సంతత వ్రతముగా కలవాడు) అగు బ్రాహ్మణుడు ఒకడు ఉండెను. 'మాధవుడు' అనునది అతని నామధేయము; ఈ అంబాభవానీ మాతాపితరులు అత్యంత ప్రీతిపూర్వకముగా ఈ కన్యను ఆ మాధవునకు కన్యాదాన రూపమున ఇచ్చి (వివాహము చేసి) రి.

8. శివవ్రతుడును తన పతియు అగు ఆ మాధవుడు అను ఆ విప్రుని గృహమునందు ఆ అంబాభవాని గృహిణిగా శుభకరములు అగు ఆచారములతో ఆచరణములతో కాలము గడుపుచుండెను. పూర్వజన్మ సంస్కారవశమున శ్రద్ధాసక్తులతో తానును ఈశ్వర పూజనము చేయుచుండెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

9. ఇంతేకాక ఆ దంపతులు ఉభయులును కూడి శ్రద్ధాసహితమగు మానసముతో అతి హర్షముతో భక్తిపురస్సరముగా ఈశ్వరునకు ప్రదోషపూజ చేయుచుండిరి.

10. మరియు త్రయోదశి తిథితోకూడిన శనివారమునాడు ఆ దంపతులు అతివిశేషముగా శివునకు పూజ చేయుచుండిరి. ఇట్లు కాలముగడువగా ఆ అంబాభవాని పదునారు సంవత్సరముల యువతి అయ్యెను. నాయనా ! వినుము; ఆవయస్సున ఆమె అంతర్వత్ని (గర్భవతి) అయ్యెను.

11. ఆమె గర్భవతిగ ఉండిన తృతీయ - పంచమ మాసములందు ఆ మాధవ బ్రాహ్మణుడు ఆమెకు పుంసవనము - అను మహోత్సవములను అతిహర్షపూర్వకముగా జరిపించెను. ఆమెకు గర్భవతిగానున్న కాలమున దోహదము (దౌహృదము - గర్భిణీస్త్రీలకు కలుగు ఆయా వాంఛా విశేషములు) కలుగగా అవి బ్రాహ్మణుడు తీర్చెను. అది ఏమి అనిన - ఆమెకు బ్రహ్మతత్త్వమును ఎరుగవలెను అను కోరిక కలిగెను; అది ఎరిగి ఆవిప్రుడు పరతత్త్వవివేచనమును బోధించెను.

12. ఏడవ మాసమున ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు ఆమెకు సీమంతోన్నయనము అను సంస్కారోత్సవము జరిపెను. అతడు శుభముకోరి ఆ ఊరియందలి ముత్తైదువలకు వాయనములు ఇప్పించెను. వారును తామందరును కలిసి ఆమెకు ఆరతులు ఇచ్చిరి; ఆశీర్వదించిరి.

13. ఇట్లు నవమాసములును గడచెను. గడచినమీదట ఒక శుభదినమున అంబాభవాని ప్రసవించెను. కుమారుడు కలిగెను. మా అందునలన తాపితరులు ఇరువురును హర్షముతో నిండినవారు. అయిరి.

14. జన్మము అందుచునే (జన్మించిన వెంటనే) ఆబాలకుడు 'ఓం కారమును ఉచ్చరించెను. ఇది అలౌకికము. (లోకాతీతము) అగు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

అపూర్వవిషయము; అందుచే అపుడు అది చూచిన (వారును వినిన వారును అగు) జనులు ఇది కడు క్రొత్తవిషయము అని ఆశ్చర్యమును పొందిరి.

15. ఆ మాధవుడు అను బ్రాహ్మణుడు ఆ శిశువునకు జాత కర్మము జరిపెను; ఆసందర్భమున ఆతడు విప్రులకు దక్షిణలు దాన ములు ఇచ్చెను. సత్వరమే ఆతనికోరికపై జ్యోతిషికులు జననకాలపు లగ్నమును గణనచేసి జాతకుని సులక్షణములు చెప్పిరి.

16. జ్యోతిషికులు ఆమాధవ ద్విజునితో ఈవిధముగా చెప్పిరి. మేము ఈబాలుని జననకాల ముహూర్త (లగ్న) మును గణించి వ్రాసితిమి. అదే చాల విశిష్టమయి ఉన్నది. ఈ కుమారుడు కార ణిక పురుషుడు (లోకమున ఒకానొక ఉత్తమమగు కార్యమును నిర్వ హించవలసిన కారణమున తాను జన్మించెనని నిరూపించు కొనువాడు) అగును. సకల జనులకును గురుడు అగును.

17. ఎవరియందు ఈతనికి అనుగ్రహము కలుగునో అతడు నిశ్చయమున లోకమునకు వంద్యుడు అగును; ఈతని వాక్యములు 'స్పర్శవేధి' అగును; ఈతని పాదములు చింతామణి అగును.

18. ఈతని (పాదములుంచిన) గృహపు ద్వారమునందు నిరం తరమును * అష్టసిద్ధులును నిలిచియుండి కొలువు చేయుచుండును. ద్విజోత్తమా ! వినుము; ఈతని (పాదములుంచిన) గృహమున నవ నిధులును సతతము ఉండును.

19. ఈతనికి భార్యయు పుత్త్రిలును ఉండరు; వినుము; ఈతడు త్రిభువనములయందును పూజ్యుడు అగును. ఈతనిని దర్శించినంత మాత్రమున పతితులును పవిత్రులు అగుదురు.

---

* అష్టసిద్ధులు-అణిమ - మహిమ - గరిమ - లఘిమ - ప్రాప్తి - ప్రాకామ్యము- ఈశత్వము - వశిత్వము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

20. ఈతడు అవతార పురుషుడు అగును. ఇది అవశ్యముగా జరుగును. అని ఇట్లు మాకు దృఢముగా తోచుచున్నది. నీవును ఈ విషయమున ఏమియు సందేహము పెట్టుకొనవలదు; అని పలికి వారు ఆశిశువునకు నమస్కారము చేసిరి.

21. జ్యోతిషికులు అగు ఆ సమస్త బ్రాహ్మణ శ్రేష్ఠులును ఆ శిశుని జనకుడు అగు మాధవ బ్రాహ్మణునితో ఇంకను ఇట్లు పలికిరి : ఈతడు ఎటువంటివారికిని వారికి వారికి గల మహాదైన్యమును పోగొట్టును. ఈతని అనుగ్రహము పొందిన వారికి కలికాలదోషముల వలని భయము ఉండదు.

22. నీమనస్సునందు ఏ ఏ కోరికలు కలవో అవి అన్నియు నీకు అప్రయత్నముగా (అశ్రమముగా) సిద్ధించును. నీవు ఈతనిని యత్న పూర్వకముగా రక్షించుకొనవలయును; ఈతడు తనంతట తానుగా నీయింటికి వచ్చిన నిధి (వంటివాడు) సుమా !

23. జ్యోతిషికులును విద్వజ్జనులును అగు ద్విజవరులు ఇట్లు బాలకుని జాతకమును వ్రాసి కలుగగల ఫలితములను ఈవిధముగా చెప్పిరి. జననీజనకులు అగు అంబాభవానియు మాధవుడును సంతోషమును అంది వారికి వస్త్రములును ఆభరణములును పారితోషికముగా ఇచ్చిరి.

24. ఈ పైవిధముగా చెప్పి శిశుని ఆశీర్వదించి బ్రాహ్మణ సమూహము తమ స్థానములకు వెళ్లిరి. తల్లిదండ్రులు (అగు అంబాభవానియు మాధవుడును) దృష్టిదోషమును పోగొట్టుటకు దిగదుడుపు తీయు వేపాకులు ఆవాలు మొదలగువానితోను ఆరతితోను దిగదుడిచి దృష్టిదోష పరిహారము జరిపిరి.

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

25. ఈనగరములో మాధవునిఇంట పుట్టిన బాలుడు పుట్టిన క్షణముననే 'ఓం' కారజపము చేసెను. ఇది అద్భుతమగు విషయము. అను సమాచారము ఆ కారంజ నగరమున వ్యాపించెను.

26. ఈ అద్భుతశిశువును చూచుటకై ఈ దంపతుల ఇష్ట మిత్రులును నగరమునందలి ఇతర జనులును రాసాగిరి. కాని బాలునకు దృష్టిదోషము తగులును అను భయముచేత ఆతని తల్లియగు అంబాభవాని ప్రతిఒక్కరికిని కాదు - ఏఒక్కరికిని - ఆశిశుని చూపలేదు.

27. ఆతని జననీజనకులు ఇరువురును లౌకికమగు మాయా మోహమునకు వశీభూతులయి తమ బాలకునకు దృష్టిదోషము తగులు నేమో యను భయముచే బొగ్గులను తెచ్చి వానిని అభిమంత్రించి అవి నల్లని దారములతో చుట్టి 'రక్ష' గా కట్టిరి.

28. ఆ బాలకుడు పరమాత్ముని అవతారము ఆయెను; ఆత నిపై దృష్టిదోషము ఏల వ్యాపించును ? కాని లౌకికధర్మానుసారము మమకారమునకు వశులయి తల్లిదండ్రులు ఆతనిని ఇట్లు సంరక్షించు చుండిరి.

29. ఇట్లు కాలము గడువగా పదిదినములును అయిన తరువాత బ్రాహ్మణశ్రేష్ఠుడగు తండ్రి ఆమాధవుడు - పుణ్యాహవాచన పురః సర (పూర్వక)ముగా శిశువునకు నామకరణ మహోత్సవము జరిపెను.

30. ఆతనికి జన్మనామము 'సాలగ్రామదేవుడు' అనియు వ్యవ హార నామము 'నరహరి' అనియు ధర్మక్రమానుసారము ఉంచబడి లోకమున ప్రఖ్యాతమయ్యెను.

31. ఆబాలకునిపై తల్లి దండ్రులకు అత్యధికమగు మమకారము ఉండెను. వారు (తల్లి, తండ్రి) ఆతనిని అధిక ప్రీతి పూర్వకముగా

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

పోషించుకొనుచుండిరి. (డెను.) తల్లియగు అంబాభవానియు ఈ బాలకునకు తన స్తనములనుండి లభించు కొంచెము పాలును చాలుటలేదు అని తనలో తాను యాదృచ్ఛికముగా అనుకొనెను.

32. ఒకానొక సమయమున ఆమె తన పతియగు మాధవునితో ఇట్లు పలికెను: నావలన లభించు స్తన్యము కొంచెమే అగు చున్నది; (చాలుటలేదు.) కనుక కుమారునకు పాలు త్రావించుటకై (దాదిగా) స్త్రీ ఎవరయిన దొరకునేమో ప్రయత్నించుము.

33. లేదా: ఒక ఆవుమేకనైన (కొని) తీసికొని రండు; ఏలయన నా స్తన్యముతో పసివాని ఆకలి చల్లారుటలేదు. అనగా తల్లి మాటలు విని ఆబాలకుడు నవ్వెను; తన కుడిచేతితో తన తల్లి స్తనములను స్పృశించెను.

34. ఆ శిశువు అట్లు తన కరముతో మాతృ స్తనములను తాకిన వెంటనే ముప్పదిరెండు ధారలతో వానినుండి క్షీరము స్రవించెను. ఆశ్చర్యకరముగా ఆధారలు ఆమె వస్త్రములను తడిపి వేయుటయే కాక భూమిపై ప్రవహించ నారంభించెను.

35. ఇదిచూచి జననీ జనకులు (అంబాభవానీ మాధవులు) ఆశ్చర్యపడిరి. తమ కుమారుని ఈ ఆశ్చర్యకరములగు లక్షణములను ఎవరికిని ప్రకటముచేయక గోప్యముగా ఉంచిరి. బాలకుని పాదములకు నమస్కారముచేసిరి. తల్లి మరల మాతృభావముతో ఆతనిని ముద్దు చేయుచు ఆడించుకొనసాగెను.

36. తల్లి తన ఆ బాలకుని ఊయెలలో పండుకొనజేసి అతి హర్షముతో జోలపాటలు పాడుచుండెడిది; కాని ఆబాలకుడు ఊయెలలో ఉండెడువాడు కాడు; ఎప్పుడును భూమిమీదకువచ్చి ఆడుకొనుచుండెడివాడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

37. బాలకుడు ఈవిధముగా పెరిగి పెద్దవాడు అగుచుండెను. తల్లిదండ్రులు ఆతనిని చాల మమకారముతో (పెంచు) పోషించుకొనుచుండిరి. ఆతడు పెరిగి పెద్దవాడగుచు ఒక సంవత్సరము నిండినవాడు అయ్యెను. కాని ఆతడు ఎవరితోను మాటలాడకుండెను.

38. తల్లి ప్రయత్నించి తన కుమారునిచే మాటలాడింప జూచెడిది; అపుడు ఆ పసివాడు ప్రణవశబ్దమునే పలికెడివాడు; అదిచూచి తల్లియును ఈతడు మూగవాడు అగునో ఏమో అనుకొనుచు తన మానసమునందు చింత చేయుచుండెడిది.

39. నాయనా! నామధారకా! వినుము; ఆమె అపుడపుడు జ్యోతిషికులను పిలిపించి "అయ్యా! మా బాలకునకు మాటలాడుటకు మాటలు వచ్చుచుండుటలేదు. ఇందులకు నివారణముగా విశేషమగు (విశిష్టమగు) ఉపాయము ఏమయినను ఉన్నదా? అని ఆమె వారిని ప్రశ్నించుచుండెను.

40. నాయనా! వినుము; జ్యోతిషికులు కొందరు ఇట్లు చెప్పిరి: మీరు మీ కులదేవత (ఇలువేలుపు) లను ఆరాధించవలసియుండును. ఆదివారమునాడు మూడువేళలయందు రావియాకులలో వడ్డించిన అన్నమును ఈతనిచే భుజింపజేయవలయును.

41. ఒక (జ్యోతిషికు)డు ఇట్లు చెప్పెను: (ఏ ప్రయత్నమును చేయనిచో) ఈ బాలుడు మూగవాడు అగును; ఈతనికి మీరు వ్రాయుటతో చదువుట నేరుపవలసి యుండును. ఆవిధముగ చేసినచో ఆతడు మాటలు పలుకుట నేర్చుకొనును. అని ఇట్లు ఆతడు చెప్పెను. ఇది అంతయు ఆ పసివానికి వినోదముగా తోచెను. (తోచును.)

42. అపుడు (అట్టి సమయములందు) ఆతడు నవ్వి 'ఓం' కారమును ఉచ్చరించుచుండెను. కేవలము ఇదితప్ప ఆతడు మరి ఏమా

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

టయు పలుకకుండెను. ఆతని నోటినుండి వెలువడు ఈ 'ఓం' కారశబ్ద మునువిని సకలజనులును విస్మయము చెందుచుండిరి.

43. కొందరు ఇట్లు అనుచుండిరి. అదియేమియో ఒక అద్భుతముగానే ఉన్నది; ఈ బాలునకు సర్వవిషయముల జ్ఞానమును చాల బాగుగానేఉన్నది. (ఈతనికి అన్నివిషయములును బాగుగానే తెలియుచున్నవి.) అన్నిమాటలును ఈతడు చెవులతో బాగుగానే వినుచున్నాడు. ఇన్ని ఎరిగి ఉండియు ఈతడు ఏల మాటలాడుటలేదో తెలియకున్నది.

44. ఏమిచేసినను తమకుమారుడగు ఆబాలుడు మాటలాడుచుండుట లేదే యని తల్లిదండ్రులు చింతచేయుచుండిరి. కుమారునకు ఏడు సంవత్సరములు వచ్చినవి. దైవయోగమున ఈతడు మూగవాడు అయ్యెనే ! అని వారు నొచ్చుకొనుచుండిరి.

45 కుమారునకు ఏడవసంవత్సరము వచ్చెను. కనుక ఆతడు మౌంజీబంధము (ఉపనయనము) నకు యోగ్యుడు ఆయెను. అందుచే ఆబాలుని తండ్రియగు మాధవుడు సమస్తబ్రాహ్మణులను "ఇపుడు ఏమిచేయవలయును ?" అని అడుగుచుండెను.

46. అపుడు ఆవిప్రులు మాధవునితో ఇట్లు చెప్పిరి : బ్రాహ్మణ కులాచారమును అనుసరించి ఇపుడు ఈతనికి ఉపనయనము జరిపి ఈతనిని గాయిత్రితో సంస్కరించవలయును. ఎనిమిది ఏండ్లు నిండకుండగనే మీరు అది జరుపవలయును. అని వారు పలికిరి.

47. ఇదివిని తల్లిదండ్రులు ఇంకను చింతపడసాగిరి. ఈ బాలునకు ఏవిధముగా గాయత్రీ మంత్రమును ఉపదేశింతుము ! ఈతడు మూగవాడు అనుట నిశ్చితము కదా ! మన అదృష్టము ఎంత దుష్టము ఆయెను ?

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!**

48. మనకు ఎటువంటి అదృష్టము పట్టినది! మనము గౌరిని ఈశ్వరుని ఆరాధించితిమే! త్రయోదశీదినమున శివుని (విశేషముగా) ఆరాధించితిమే! అంతయును వ్యర్థము ఆయెనుకదా! అని వారు చింతిల్లిరి.

49. ఆనాడు మనకు ఈశ్వరుడు వరము ఇచ్చెను. సులక్షణములుగల కుమారుడే జన్మించెను. కాని వానికి మాటలే రావాయెను! ఇపుడు ఏమిచేయుదము? అని ఆదంపతులు శివుని స్మరించిరి! (శివా! అనిరి.)

50. దేవా! మా కడుపున జన్మించిన కుమారుడు ఈతడు ఒక్కడే గదా! కలలోనైన మరొకకుమారుని మేము పొందకుంటిమి గదా! ఈతడు మమ్ములను రక్షించును. అని ఆశలు ఎన్నియో మా మనస్సులచుట్టును చుట్టుకొని యుంటిమే!

51. మా మనస్సులయందలి కోరిక సరిగా నెరవెరనే లేదు; ఏలయన ఏ(మేలి) గుణములును లేని ఇటువంటి కుమారుడు జన్మించెను కదా! మేము శనిప్రదోష పూజ చేసియుండినను ఆమహేశుడు ఎటువంటి విచిత్రమగు వరమును మాకు ప్రసాదించెను!

52. నాయనా! నామధారకా! వినుము; తల్లియగు అంబా భవాని ఈవిధముగా పలువిధముల దుఃఖపడెను. మహాదుఃఖము అనుభవించెను. ఇటువంటి సమయమున ఆబాలకుడు తన తల్లిదగ్గరకు వచ్చి ఆమెను ఓదార్చెను.

53. ఎట్లు అనిన - ఆసమయమున ఆబాలుడు ఇంటిలోనికి పోయెను. అచ్చటినుండి బరువుకల ఇనుపకడ్డీని ఒకదానిని తీసికొని వచ్చెను. ఆతడు దానిని తాకిన వెంటనే ఆ లోహఖండము ఏబది రెండు మారులు పుటమువేసిన (మిగుల శుద్ధమగు) బంగారముగా ఆయెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

54. ఆతడు అది తెచ్చి తన తల్లిచేతికి ఇచ్చెను. ఆమె అది చూచి చాల ఆశ్చర్యపడెను. అటుతరువాత ఆమె తనపతిని దగ్గరకు పిలిచి అతనికి అదిచూపి ఇచ్చెను.

55. అంతట వారు ఆవిషయమును గోప్యముగానే ఉంచిరి. ఆబాలుని వారు తమ ఇంటిలోనికి తీసికొనిపోయిరి. ఆతని ఇటువంటి బాలలీలలను ఇంకను చూడదలచిరి. ఇంకను మరికొన్ని లోహాఖండము లను వారు ఆతని చేతికి ఇచ్చిరి.

56. ఆస్వామి వానిని తన అమృతదృష్టితో చూచినంతనే అంతయును అన్నియును సమృద్ధముగా బంగారు ఆయెను. ఈతడు వాస్తవముగ కారణికపురుషుడే అయిఉండును. అని వారు (ఆదంపతులు) అపుడు తమ తమ మనస్సులయందు విశ్వాసము కలవారు అయిరి.

57. మరియు వారు (ఆదంపతులు) తల్లిదండ్రులు తమ కుమారుని ఆలింగనము చేసికొనిరి. వారు అతనితో ఈవిధముగా మనవి చేసిరి. నాయనా! నీవు తారక (తరింపజేయు మహాపురుషు లకును) శిరోమణివి. నీవు కారణిక పురుషుడవు; మాకు కులదీపకుడవు.

58. నాయనా! మేము నీనుండి సర్వస్వమును పొందిన వారము అయితిమి. కాని నీవు నీ నోటితో పలికిన పలుకులను ఇంత వరకును వినకుంటిమి; అజ్ఞాన - మాయా - పాశవేష్టితులము కదా మేము! అందుచేత మేము ఇంతవరకును నిన్ను మూగవాడవు అని తలచుచున్నాము.

59. నందనా! (కుమారా!) మా మనస్సునందలి కోరిక నీవు పూరింపవలయును. అని బ్రతిమాలు చున్నాము; నాయనా! మేము నీనోటినుండి వెలువడు ముద్దుమాటలను వినవలయును అని మాకు కోరికగా నున్నది కుమారశ్రేష్ఠా!

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

60. అని ఇట్లు తల్లి అనగానే బాలుడు నవ్వు తన మొగము నందు కనబరచెను. నా కంఠమునందు యజ్ఞోపవీతము వేయుడు; కటియందు మౌంజీబంధనము చేయుడు; అను అర్థము వచ్చునట్లు అతడు తనతల్లికి సైగలు చేసి చూపెను.

61. ఇట్లు అతడు సంజ్ఞలు చేసి తల్లికిచూపి ఆమె మనస్సునకు సంతోషము కలిగించెను. నాకు మౌంజీబంధనము చేసినవెంటనే అన్ని మాటలును వచ్చును; అనియు అతడు ఆమెకు తెలియజేసెను.

62. ఇదిచూచి తల్లిదండ్రులు చాల సంతోషించిరి; విద్వాంసులను జ్యోతిషికులను పిలిపించిరి; వ్రతబంధ ముహూర్తము చూపించిరి. ఉపనయనమునకై సర్వ సన్నాహములను చేసినవారు అయిరి.

63. ఆతల్లిదండ్రులు అనేకవిధములగు సన్నాహములను చేసిరి. ఎట్లు అనిన - రత్నఖచితములగు అలంకారములను చేయించిరి. లౌకికమగు మాయామోహమునకు వశులయి వారు ప్రీతి పూర్వకముగా నమగు వేడుకలకు కావలసిన సమారంభములు (వేడుకల ఏర్పాటులు) చేయించిరి.

64. చతుర్వేదములను అధ్యయనముచేసిన బ్రాహ్మణులును వచ్చిరి; తమ తమ శాఖలకు చెందిన వేదములను వారు వారు పఠించుచుండిరి. ఇష్టులు సంబంధులు దాయాదులు సగోత్రులు ఇట్లే అందరును వారిఇంటికి వచ్చిరి.

65. అనేక విధములగు శృంగారములతో కూడ పందిరులు ఎత్తించిరి. వచ్చిన ద్విజవరులు అందరును ఆనందించుచుండిరి. ద్విజవరుడు అగు ఈ మాధవుడును అపారమగు ద్రవ్యమును వెచ్చించుచు ఆ ఉపనయన సందర్భమున ఆనందోత్సవము జరుపుచుండెను.

66. ఇదియంతయుచూచి కారంజ నగరమునందలి జనులు అందరును ఆశ్చర్యపడుచుండిరి. మూగవాడగు పుత్త్రుని ఉపనయన

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

మునకయి ఇంత సన్నాహమా ! ఈ బ్రాహ్మణునకు (మాధవునకు) ఏదియో భ్రాంతి పట్టుకొనినది; ఈతడు తన ధనమంతయు వ్యర్థము చేయుచున్నాడు.

67. ఈతడు ఇంతవ్యయముచేసి తన కుమారునకు వ్రతబంధము చేయును గదా ! వినుడు. మరి ఈతడు ఆబాలునకు గాయత్రీ మంత్రమును ఎట్లు ఉపదేశించును ? ఆ వటువు తాను చేయవలసిన ఆచరణములు ఎట్లు ఆచరించును?

68. కొందరు ఇట్లు అనుచుండిరి. ఈ అసంబద్ధములగు మాటలతో మనకు ఏమి పని ? మనకు మృష్టాన్నము దొరకును; బంగారును- వస్త్రములును దానముగా ఇత్తురు; తీసికొందము; మంత్రమును గురించిన ఆసక్తి మనకు ఏల ? (ఆబాలునికి మంత్రము పలుకుటకు రానీండు రాకపోనీండు.)

69. ఇట్లు లోకపు జనులు నానా విధములుగ అనేకములగు ఆలోచనలు చేయుచు మాటలాడుకొనుచుండిరి. ఆ మాతా పితరులు మాత్రము ఇది ఏమియు పట్టించుకొనక ఉపనయనమునకు పూర్వ దినమున చాల ఆనందముతో దేవతారాధనము మొదలగునవి జరిపిరి.

70. తరువాత రెండవనాడు చౌలకర్మము జరిపించిరి. చౌలమణే (నాందీముఖ) భోజనము చేయించిరి. హర్షపూర్వకముగా పునః అభ్యంగము జరిపించిరి. తరువాత యజ్ఞోపవీతధారణము చేసిరి.

71. అచ్చటి సమస్త ద్విజులును మంత్రపూర్వకముగా బాలునకు యజ్ఞోపవీతధారణము చేయించిరి. తనతో కూడ బాలునిచే సహభోజనము చేయించుటకై తల్లి ఆ బాలుని గృహాంతర్భాగమునకు తీసికొనిపోయెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

దుఃఖబాష్పములు వెలువడుచుండెను; ఆ సమయమునందు ఆమెకు మూర్ఛయును వచ్చెను.

86. ఒక క్షణకాలము ఆమె నిర్జీవురాలుగా ఆయెను. మహాశోకమును పొందెను. ఆమె ఇట్లు పలికెను: కుమారా! నీవు మాకు రక్షకుడవుగా ఉందువు అని ఎంతయో ఆశపడి ఉంటిని.

87. నన్ను నీవు రక్షింతువు అని నామనస్సునందు ఎంతగానో ఆశ ఉండెడిది. ఈ కారణముతోనే ఇంతకాలమును మాతో మాటలాడకుంటివి కాబోలును. ఇందుచేతనే అందరచేతను మూగవాడవు అనిపించుకొంటివి కాబోలును.

88. ఇంతవరకు ఎన్నడును నీమాటనే వినకుంటిని; ఇపుడు నీ నోటినుండి మాటవినగానే సంతోషము కలిగినది. ఇంతకాలమును నేను ఈశ్వరపూజ చేసినందువలన కలుగవలసిన ఫలము కలిగినది. అని నేను విశ్వసించితిని.

89. నామధారకా! వినుము; ఇట్లు ఇంకను అనేకవిధములుగా ఆమె కుమారునితో పలికెను. ఆసమయమునందే ఆమె తనకుమారుని మరి మరి కౌగిలించుకొని జాలికలుగునట్లు వేడుకొనెను.

90. తనతల్లి పలికిన మాటలు విని కుమారుడు ఆమెకు బ్రహ్మజ్ఞానమును ఉపదేశించెను. తల్లీ! నీవు నీ అంతఃకరణమునందు ఖేదము పొందవలదు; నేను చేయవలసియున్నది ఇంతే.

91. తల్లీ! నీకు ఇంకను నలుగురు కుమారులు కలిగెదరు; ఇది నిశ్చయము; వారు అందరును తమ మనోభావములతో (భక్తిశ్రద్ధలతో) నీ (మీ) కు సేవ చేయుదురు.

92. నీవు నీ పూర్వజన్మమునందు శంకరుని ఆరాధించి యుంటివి. అని పలికి ఆబాలుడు తన తల్లి తల నిమిరెను. మరి వెంటనే అంబా భవానీ దేవికి జాతి (పూర్వజన్మాంతరవృత్తాంత) స్మరణము కలిగెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

93. శ్రీగురుకృపచే ఆమె తన పూర్వజన్మ వృత్తాంతమును స్మృతికి తెచ్చుకొనుచునే ఆమె విస్మితురాలు అయ్యెను. ఆమెకు అపుడు ఆబాలకుడు శ్రీపాద శ్రీవల్లభ రూపుడుగా కనబడెను.

94. తల్లి ఆసమయమున అట్లు శ్రీగురుని సందర్శించి వారి చరణకమలములకు నమస్కారము చేసెను. శ్రీపాద శ్రీవల్లభులు తన సహజలీలలతో ఆతల్లిని లేవనెత్తి గోప్య (రహస్య) మగు విషయమును ఆమెకు చెప్పెను. నామధారకా ! ఆవిషయమును నీవు శ్రద్ధగా వినుము.

95. మాతా ! నీవు జ్ఞానవంతురాలవు. ఈ చెప్పునది వినుము; ఈ మాటలను నీవు గోప్యముగా ఉంచుకొనుము. నేను సన్యాసియగు యతిని. సంసారముతో (సంసార సంబంధి వాసనలతో) అలిప్తుడను; (వానితో ఏమాత్రమును సంబంధము లేనివాడను.)

96. ఈకారణమున నేను ఇపుడు ఇకమీాదట సమస్త తీర్థక్షేత్రములయందు సంచరింతును. ఇకముందు దీనినిబట్టి జరుగవలసిన కార్యములు చాలఉన్నవి. అని ఇట్లు పలికి ఆవటువు తనతల్లిని అందులకై అనుమతి ఇమ్మని కోరెను.

97. శ్రీగురుమూర్తి తనతల్లితో ఈవిధము వినయపూర్వకముగా పలికెను. అదివినియు మరలను తల్లి పుత్రునితో ఈవిధముగా మనవిచేసెను; శ్రోతలారా ! అది మీారు ఏక (ఏకాగ్ర) చిత్తులయి వినుము.

98. ఆ సమయమున ఆమె ఈవిధముగా తన కుమారునితో మనవిచేసెను : నాయనా ! నీవు ఇపుడు ఇట్లు నన్ను వదలి వెళ్లిన యెడల కుమారా ! నేను నిన్ను మరల ఎప్పుడును చూడనోఏమో శ్రద్ధా ! పుత్రశ్రేష్ఠా ! నేను ఎట్లు జీవింతును ?

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!**

99. చిన్నతనమునందే నీకు ఈ తాపస ధర్మ స్వీకారము ఏల హర్షము కలిగించునదిగా తోచుచున్నది? ఉత్తమములగు ధర్మశాస్త్రములు ప్రసిద్ధముగా చెప్పుచున్న దాని ననుసరించి నాలుగు ఆశ్రమముల ధర్మములను క్రమముగా ఆచరించవలయును.

100. పండ్రెండుసంవత్సరములు బ్రహ్మచర్యాశ్రమమును అటు మీాదట తిన్నగా గృహస్థాశ్రమ ధర్మమును ఆచరించుట ముఖ్యము అయి ఉండును. తదనంతరము వానప్రస్థాశ్రమము ఆచరించవలయును. దానిచే అనంతమగు పుణ్యము లభించును.

101. వీని అన్నిటియందును గృహస్థాశ్రమము ముఖ్యమయినది; దానిని ఆచరించునపుడు గృహస్థుడు అతి సమర్థుడయి ఉండవలయును. దానిని ఆవిధముగా అతి సమర్థతతో అనుష్ఠించిన తరువాత మరి అప్పుడు అన్ని ఆశ్రమములలో ముఖ్యార్థమగు సంన్యాసాశ్రమమును గ్రహించవలయును. ధర్మశాస్త్రములు ఈవిధముగా చెప్పుచున్నవి.

102. నాయనా! వినుము; బ్రహ్మచర్యాశ్రమ కాలమున సంప్రదాయానుగతమగు మార్గమున వేదములు మొదలగు విద్యలను పఠించవలయును. తరువాత వివాహము అయినమీాదట ఉత్తమ గృహస్థుడు అయి పుత్త్రిలను ఆ ఆశ్రమమున సాధించవలసిన ఇతరములగు ప్రయోజనములను పొందవలయును.

103. యజ్ఞములు మొదలగు శ్రౌత కర్మములను ఇతరములగు స్మార్తాది కర్మములను సాధిం (అనుష్ఠిం) చవలయును. అట్లు సాధించి తదనంతరము సంన్యాసాశ్రమ స్వీకరణము న్యాయ్యము; ఈవిధముగా గ్రహించు సంన్యాసమే ముఖ్యమయినది; బాల్యవయస్సునందు సంన్యాసము గ్రాహ్యము (గ్రహించదగినది.) కాదు.

104. (మానవుడు గృహస్థాశ్రమమున) సమస్తములగు ఇంద్రియములను సంతోషపరచుకొనవలయును. తన మనస్సునందలి వాసన

లను పూరించకొనవలయును. తదనంతరమే తపస్సునకై పోవలయును. ఈ విధమగు క్రమమున సంన్యాసమును గ్రహించుటయే ముఖ్యమార్గము.

105. ఈవిధముగా తల్లి పలికిన మాటలను విని శ్రీగురువులు ఆమెకు తత్త్వజ్ఞానమును ఉపదేశించెను. అది చెప్పెదను. నామధారకా! శ్రద్ధాసహితమగు మంచిమనస్సుకలవాడవు అయి వినుము. అని సిద్ధ ముని నామధారకునితో పలికెను.

106. గంగాధరుని కుమారుడు అగు 'సరస్వతి' (శ్రీగురువు లను) నమస్కరించి శ్రోతలకు ఇది మనవి చేయుచున్నాడు. ఆ శ్రీగురు చరిత్ర విస్తారమును శ్రోతృజనులు వినవలయును అని వేడుచున్నాను.

107. శ్రోతలారా! వినుడు, తరువాత అపూర్వమగు విష యము జరిగెను. అదియంతయు సిద్ధయోగి నామధారకునకు చెప్పెను. గంగాధరపుత్త్రుడగు సరస్వతి దానిని మహారాష్ట్రభాషయందు వివ రించి చెప్పుచున్నాడు.

ఇది పరమకథా కల్పతరువయి సిద్ధ నామధారక సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహ సరస్వత్యుపాఖ్యాన రూప మగు శ్రీగురు చరిత్రామృతమునందు శ్రీగురు నరహరి బాలచరిత లీలావర్ణనము అను పదునొకండవ అధ్యాయము.

సంఖ్య - 107

# శ్రీ గురు చరిత్రామృతము
## పండ్రెండవ అధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. శ్రీ గురువులు తన తల్లితో ఇట్లు వచించిరి: తల్లీ! నీవు నన్ను ఇట్లు ఆజ్ఞాపించుచున్నావే! శరీరము అనిత్యము అని నీవును

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ఎరుగుదువు కదా ! భౌతికమగు జీవితము శాశ్వతము అని ఎట్లు విశ్వసింప వీలు అగును ?

2. శాస్త్రము ఈవిధముగా చెప్పుచున్నది : "అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః । నిత్యం సన్నిహితో మృత్యుః । కర్తవ్యో ధర్మసంగ్రహః".

3. లోకమునందు ఎవ్వరయినను స్థిరముగ చిరకాలము జీవించువారు ఉందురో అటువంటివారి విషయమున నీవు చెప్పినట్లు శాస్త్ర క్రమానుసారముగా ఆయా ఆశ్రమములను అనుష్ఠించవలయును అను మాట యోగ్యమయినదే; కాని ఈదేహములు కాని ఈవిభవములు కాని అనిత్యములు కదా ! ఇవి ఇప్పుడు ఉన్నట్లే ఇకముందు కూడ ఉండును. అని ఎట్లు నమ్మవచ్చును ?

4. దేహము అనునది. 'క్షణభంగురము' 'ఏక్షణమునందయినను నశించునది' అని ఆమాటకు అర్థము కదా ! ఇంతవరకు ఎవరును స్థిరులయి ఉండలేదు కదా ! కనుక నే ఈశరీరము ఎంతవరకు ఉండునో అంతకులోపల నే మానవులు ధర్మమార్గమున ప్రవర్తించవలయును.

5. ఎవరు మృత్యువును జయింతురో - వారికి మాత్రము శరీరము నిత్యము; వారి విషయమున నీవు చేసిన ఉపదేశము సత్యమయి వర్తిల్లును; అటువంటివారు నేను ధర్మమును తరువాత ఆచరింతును అని చెప్పవచ్చును.

6. అహోరాత్రములు గడచుచుండగా క్షణక్షణమునను ఆయుష్యము తగ్గిపోవుచుండును: తల్లీ ! వినుము; ఈకారణముచేత నే పూర్వవయస్సునందే మానవులు ధర్మమును ఆచరించవలయును.

7. తల్లీ ! వినుము; అల్పజలములో ఉండు చేపవలెనే మానవులును అల్పాయుష్కులు. కావున నే మానవులు తాము ఎంతవరకు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ఆరోగ్యవంతులుగా ఉందురో అంతకు లోపలనే ధర్మమును ఆచరించవలయును.

8. సూర్యనిరథము ఏవిధముగా నిమిషము (రెప్పపాటు) జరుగునంతటి శీఘ్రకాలములో ఇరువదిరెండువేల * గ్రామముల అంతటి దూరము పరుగెత్తునో - అటులే (అతిశీఘ్రముగా ఆయుష్యము పరుగెత్తుచుపోవుచు క్షీణము అగుచుండును.

9. పర్జన్యుడు (పర్జన్యుని అనుగ్రహమున కలుగు వర్షము ఒకానొక వృక్షముపై పడెను. అనుకొనుము; అది అట్లు పడుచున్నపుడు ఆవృక్షపు ఆకుకొనపై పడినచో అది అచ్చట ఉండునా? సావధానులై ఆలోచించుము; అది అచటస్థిరముగా నుండదుకదా! అది తత్ క్షణమే భూమిపై పడును గదా?

10. అట్లే ఈశరీరమును (ఈశరీరపు జీవనదశయును) స్థిరమయినది కాదు. జీవనముతో పాటుగనే జీవునకు మరణమును నిశ్చితమయినదే. యౌవనమునందు కాని అథవా వార్ధకమునకలిగినప్పుడు కాని ఈ కళేబరము నశించునదే అని ఎరుగుము.

11. తల్లీ వినుము; ఈకారణమున ఈదేహమును నమ్ముకొని యుండరాదు; ఏలయన మృత్యువు ఈశరీరమునకు సహవాసిగా నుండును. కావున తనకు అవకాశము ఉన్నప్పుడే తత్ క్షణమే ధర్మమును ఆచరించవలయును.

12. పండిపోయిన ఆకులు వృక్షమునకు బలహీనముగా అంటుకొని యుండి ఏక్షణమున అవి క్రిందరాలిపోవునో అనునది ఎట్లు తెలియకుండునో అట్లే ఈశరీరముకూడ ఎప్పుడు పడిపోవునో నిశ్చయముగా తెలియరాదు; అని ఎరుగుము.

---

* గ్రామము అనగా నాలుగు యోజనములు; 22000 × 4 = 88000

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

13. తల్లీ ! వినుము; తరువాత ఎప్పుడో తిరిగి ఇచ్చునట్లు అప్పుగా వడ్డీపై ఒకనికి ధనమును ఇచ్చినవాడు ఎవడు అయినను ఏవిధముగా దినములు లెక్కపెట్టుచుండునో అదేవిధముగా యముడును ప్రాణుల ప్రాణములు తీయవలసిన కాలమును లెక్కించుచు గమనించి చూచుచుండును.

14. చూడుము; ఎట్లు నదులు అన్నియు తమ తమ ఉదకములను తీసికొని సముద్రమునకు పోవునేకాని మరలి తమ తమ జన్మభూమికి రావో అట్లే ఆయుష్యమును మరలి రాదు.

15. తల్లీ ! అహోరాత్రములు తమ వేగమున తాము పరుగెత్తుకొనిపోవుచునే యుండును. అని నిశ్చయముగా ఎరిగి ఏమానవుడు (స్త్రీ కాని - పురుషుడు కాని) పుణ్యముచేయకుండునో - ఆమానవుడు పశువుతో సమానుడు.

16. చూడుము; ఏదినమున తనచే పుణ్యము ఘటిల్ల (సంపాదింపబడ) లేదో - ఆదినము వ్యర్థముగా పోయినదే సుమా ? కాని వానిపై యమునకు కరుణ ఉండదు. (ఆతడు పుణ్యము చేయునంత వరకు యముడు వానిని ఉంచడు.) కావున తన జీవితము ఉన్నంతలో తత్ క్షణమే పుణ్యమును ఆచరించవలయును.

17. తల్లీ ! యథార్థమగు వచనమును వినుము; పుత్త్రులు దారలు ధనము గోధనము ఆయుష్యము దేహము - ఇటువంటివి అన్నియును నిశ్చితములు (స్థిరములు) అని ఏమానవుడు అనుకొనునో ఆ మానవుడు పశు సమానుడు అని తెలిసికొనుము.

18. అమ్మా ! వినుము; మొసలి ఏవిధముగా మానవుని తినివేయునో అదేవిధముగా ఆతనిని వృద్ధాప్యము తినివేయును. అని నిశ్చయము ఎరుగుము.

19. ఈకారణముచే విద్వజ్జనులు (వివేకవంతులు) అగు మానవులు తమ తమ యౌవనములయందే పుణ్యము చేయవలయును. తల్లీ! ఇట్టిస్థితిలో నన్ను నీవు నేనుచేయు ధర్మకృత్యమును వలదు అని ఏల వారించెదవమ్మా! నీకు ఇది ఎటువంటి మంచిబుద్ధి - అమ్మా!

20. ఎవడు యమునకు ఇష్టుడో ఆతడు హర్ష పూర్వకముగా పుణ్యమును ఆచరించు విషయము అలసత్వమును వీడవలయును. ఎవరు అమరత్వమును పొందవలయును అని సంకల్పముకలిగి అది సంపాదించుటలో యోగ్యతయు సామర్థ్యమును కలిగిఉందురో - వారు మాత్రము అన్నిపనులను వదలియైనను మొదట ధర్మమును ఆచరించవలయును.

21. అమ్మా! సంసారము అనునది స్వప్నమువంటిది. అంతలోనే ఉన్నట్లు కనబడి అంతలోనే లేనిదయి కనబడకుండ పోవును. మాలతీకుసుమము వికసించినను అప్పటికి అప్పుడే వెంటనే వాడి ఎండి పోవును. ఈదేహముకూడ ఆ మాలతీ కుసుమముతో సమానమయినదే సుమా!

22. తల్లీ! వినుము; ఏవిధముగా మెరపు అంతలో తళ తళ మెరయుచు కదలియాడునో తత్ క్షణమే అదృశ్యము అయిపోవునో - అదేవిధముగా ఈదేహముకూడ చాలవరకు అన్ని అంశములలో మెరపును పోలియుండును. ఇది స్థిరమయినది కాదు.

23. నామధారకా! వినుము; ఇట్లు (శ్రీ)గురువులు తన జననీ జనకులకు నానావిధములుగా తత్త్వమును బోధించుచు పోయిరి. బాలకుడు ఎట్లు తత్త్వమును చెప్పుచున్నాడు! అని సభాజనులు అందరును ఆశ్చర్యపడుచుండిరి.

24. తనకుమారుడు పలికిన వచనమును విని తల్లి ఆతనికి నమస్కరించెను. భగవాన్! నీవు నాకు తత్త్వజ్ఞానమును ప్రసాదించితివి. ఐనను నామనవి వినుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

25. మాకుల దేవతవు (ఇలు వేలుపవు) అగు పుత్త్రరాజా! మాకు ఇంకను నలుగురు కుమారులు కలిగెదరు. అని ఇట్లు నీవు పలికితివి. కాని మా మనస్సులకు విశ్వాసము కలుగుట లేదు.

26. ఎంతవరకు మాకు ఇంకను ఒక కుమారుడు కలుగునో - అంతవరకు నీవు మాదగ్గర ఉండుము. అంతవరకు నేను నీకు అనుమతి ఈయను; ఇది సత్యము. అని అంబాభవాని తన కుమారునితో మనవి చేసెను.

27. నీవు నావచనమును అనాదరముచేసి వెళ్లెదవో - నేను తత్ క్షణమే ప్రాణములను వదలెదను. ఇది నిశ్చయము అని దృఢముగా తెలిసికొనుము.

28. నాయనా! నీవు మాకుమారుడవు (మాత్రము) కావు; నీవు మా కులదైవతమవు (ఇలువేలుపవు); అయి ఉన్నావు. సర్వ శ్రేయోదాతా! నీవు నీవచనమును యథార్థముచేసికొనుమని ప్రార్థించుచున్నాను.

29. తనతల్లి పలికిన వచనములను విని నవ్వి శ్రీగురువులు ఇట్లు పలికిరి: నామాట సత్యమే అగును అని ఎరుగుము; అంతేకాదు; నేను నీమాట తప్పక వినెదను. అనియు విశ్వసించుము.

30. నీకు ఇంకను ఇద్దరు కుమారులు కలుగగానే నీవు సంతోష పూర్వకముగా నాకు అనుమతి ఇమ్ము; తల్లీ! వినుము; మరి అటు తరువాత నేను మీదగ్గర ఉండను కనుక - అపుడు నీవును నీమాట యథార్థము చేసికొనుము.

31. తల్లీ! ఒకసంవత్సరం నేను నిశ్చయముగా నీఇంటియందు ఉండును; అంతకులోగా నీమనఃకామన పూర్తినందిన వో నాకు నీవు అనుమతి ఈయవలయును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!**

32. ఈవిధముగా నిశ్చయము (ఒడంబడిక) చేసికొని శ్రీగురువులు మహాప్రీతితో తమ మాతాపితరుల ఇంటియందు ఉండిరి. ఆకాలములోవారు అనేకులగు శిష్యులకు వేదాధ్యయనాభ్యాసము చేయించుచు ఆ విద్యలయందు వారికి శిక్షణము ఇచ్చుచుండిరి.

33. ఇదిచూచియు వినియు ఆ కారంజ నగరమునందలి జనులు ఆశ్చర్య పడుచుండిరి. చూడుడయ్యా! ఎంతటి ఆశ్చర్యకరమగు విషయము జరుగుచున్నదో! చూచుటకు ఏడు సంవత్సరముల బాలుడు; నాలుగు వేదములను బోధించుచున్నాడు అని ఇట్లు చెప్పుకొనుచుండిరి.

34. విద్వాంసులకంటెను విద్వాంసులగువారును ఆబాలుడగు శ్రీగురువుల కడకు విద్యార్థులయి వచ్చి వారియొద్ద మూడు వేదములను (అప్పటికే తాము తమ స్వశాఖా వేదమును అభ్యసించియుండినందున మిగిలిన మూడు వేదములను) అభ్యసించుచుండిరి. షట్ఛాస్త్రములను (వేదషడంగములను అథవా న్యాయ వైశేషిక - పూర్వోత్తర మీమాంసా - వ్యాకరణ సాహిత్యములను బాగుగ అభ్యసించియుండి 'షట్ఛాస్త్రి' అని కీర్తిపొంది యున్నవారు కూడ వారికడ శాస్త్రములయందు శిక్షణపొందుటకై వచ్చుచుండిరి.

35. ఈవిధముగా శ్రీగురువులు ఆ అంబాభవానీ మాధవుల గృహమునందు మహాప్రీతితో నివసించుచుండిరి. కొలదికాలములో వారి తల్లి మరల గర్భవతి అయ్యెను; ఆమె మహానందము నందెను.

36. ఆమె తాను ఏదియో యొక మహానిధానమును (నిధిని) సంపాదించికొనినయంతగా ఆనందము కలదగుచు ఆబాలుడు తన కులదైవతము అను భావమును శ్రీగురువులయందు నిలిపి అనునిత్యము పుత్రుని పూజించుచుండెను.

37. ఆమె అట్లు నవమాసములును అంతర్వత్ని (గర్భవతి) గా ఉండెను. అనంతరము ఆతల్లి ప్రసవించినది. అయ్యెను; నామధారకా!

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

వినుము; ఆమెకు ఆ కానుపున ఇద్దరు కవలు కుమారులు - ఖ్యాతి మంతులు - సుందరులు అగువారు - కలిగిరి.

38. తల్లిదండ్రులకు తమకు కుమారులు కలిగిరికదా ! అని మహాసంతోషము కలిగెను. వారు మహోత్సవము జరిపిరి. వారికి శ్రీగురువుల ఆశీర్వచనము లభించెను కదా ! వారి వచనము అసత్యము ఎట్లగును.

39. నామధారకా ! వినుము, ఈకారణముచేతనే విద్వజ్జనులు (వివేకవంతులు అగు వారు) తమగురువుల వచనములను సత్యములనుగానే భావించవలయును. ఎవరికిగాని తమ అంతఃకరణము ఎట్లుండునో అట్లే జరుగును.

40. ఇట్లు శ్రీగురువుల ఉపనయనము అయినది మొదలు ఒక సంవత్సరము గడచెను. కలిగిన కవలు బాలకులు మూడుమాసముల వారు అయిరి. నాయనా ! వినుము, ఒకనాడు తల్లి ఆశిశువులతో ఆడుకొనుచుండెను. ఆ సమయమున శ్రీగురువులు తమ తల్లికడకు వచ్చిరి.

41. వచ్చిన శ్రీగురువులు తమ తల్లితో ఈవిధముగా పలికిరి: తల్లీ ! నామాట వినుము. నీమనఃకామన పూర్తినందినది. నీకు నిధులు అనదగిన ఇరువురు కుమారులు కలిగిరి కదా ! వారు పూర్ణాయుష్యము కలవారు అగుదురు. ఇది నిశ్చయము.

42. ఇటుతరువాత నీకు ఇంకను ఇరువురు కుమారులు కలుగుదురు. అటుతరువాత ఒక కన్యయు కలుగును. నీవు సదా ఆనందముతో సుఖముగా ఉందువు. నీకోరికలు సంపూర్ణము అగును. ఇది నిశ్చితము అని ఎరుగుము.

43. ఇపుడు నీవు నన్ను అనుమతించుము. నేను నాస్వాభావిక చిత్తవృత్తి ననుసరించి పోయెదను. నీవును సంతోషవంతురాలవు అయి

ఉండువు. అని ఇట్లుపలికి శ్రీగురువులు అపుడు తమ తల్లియొద్ద అనుమతి పొందిరి.

44. తల్లిదండ్రులు సంతోషించిరి. తమ శిరస్సులను శ్రీగురువుల పాదములపై ఉంచిరి. వారు వారితో ఇట్లు పలికిరి: స్వామీ! మా కులదేవతా! మాకు ఏమిపలుకుటకును శక్యము కాకున్నది.

45. మాకు మాస్వరూప తత్త్వజ్ఞానమును తెలియదు. తాము ఎవరు? అను భవదీయ (తమ) తత్త్వమును మేము ఎరుగకున్నాము. మాయా మోహములతో వేష్టితులము (చుట్టుకొనబడినవారము) అయి ఉన్నందున మేము ప్రాపంచికములు అగు కామనలకు వశీభూతులము అయి ఉన్నామేకాని తమ మహిమలను ఎరుగజాలకున్నాము.

46. ఏమయినప్పటికిని మేము అట్లు మాయా ప్రపంచము (విస్తరణముచే) వేష్టితులము అయి నిన్ను మాకుమారునిగా మాత్రము తలచి ఒక్కొక్క సమయమున మిమ్ములను నిష్ఠురవచనములు పలికియుందుము. స్వామీ! తాము మమ్ములను అందులకై క్షమించ ప్రార్థించుచున్నాము.

47. మాతో కలిసి తాము భుజించునపుడును పండుకొనునపుడును కూర్చుండునపుడును మీరు ఆకలిగొనునప్పుడును మిమ్ములను చాల నొప్పించితిమి. ఆయా సమయములలో మీవిషయమున చికాకు పడితిమేకాని ప్రీతితో ఒడిలోనికి తీసికొనినవారము కాము. దేవశ్రేష్ఠా: మేము మీవిషయమున చేసిన ఆ అపరాధములు అన్నియును తాము క్షమించుడు.

48. తండ్రీ! తాము మావంశమునకు తారకులు (తరింపజేయువారు) గా అయి అవతరించితిరి. స్వామీ! మేము ఆచరించిన ప్రదోష పూజలకు ఫలరూపులయి తామే మాదగ్గరకు వచ్చితిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

49. కృపామూర్తీ ! స్వామీ ! మాకు ఇక ఏమిగతి! తామే తామే చెప్పవలయును. సకలఫలదాతా! ఈ జననమరణ చక్రక్రమములో రాకపోకలు (వచ్చుచు పోవుచుండుటలు) లేకుండ మమ్ములను ఒకదరికి చేర్చవలయును అని వేడుచున్నాము.

50. ఉత్తములు పవిత్రులు అగు సగరపుత్రులమీదకు గంగ వచ్చిన విధమున తాము మామీదకు మా(దగ్గరకు) వచ్చితిరి. మా అవయవములను పవిత్రములనుగా చేసితిరి. మమ్ములనే కాదు మా ఉభయవంశములందలి నలువదిరెండు తరముల వారిని కూడ పవిత్రులనుగా చేసితిరి.

51. భారభూతమగు ఈ సంసారములో మమ్ములను ఎట్లు (ఏల) ఉంచుచున్నావు నాయనా ! ప్రాణసమానుడవు అగు కుమారా! మాకు నీదర్శనము లేనియెడల మేము మా ప్రాణములను ఎట్లురక్షించుకొనగలము?

52. తమ తల్లిదండ్రుల వచనములను విని శ్రీగురువులు తాము ఇట్లు పలికిరి : ఏ ఏ సమయమున మీరు మీ మనస్సులో నన్ను స్మరణము చేయుదురో -

53. స్మరణముచేసిన తత్‌క్షణముననే, తల్లీ ! నేను నీ సమీపమున ఉందును; అట్లని నీవు క్షణ క్షణ (నీవు ఎప్పుడును ఏమాత్రమును చింతచేయకుము.) మునను నీవు నన్ను చింతించకుము; నీకు నేను వాగ్దానము చేయుచున్నాను.

54. తల్లీ ! భవానీ ! నామాట వినుము; నీకు ఇంకను ఇరువురు కుమారులును ఒక కూతురును మొత్తము ముగ్గురు పిల్లలు కలిగెదరు; నీ ఇంటియందు ఏసమయమునందును దైన్యము ఉండదు; సదా శ్రీమంతురాలవు అయి ఆనందింతువు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

55. పూర్వ జన్మాంతరమునందు నీవు ప్రదోషమునందు పరమేశ్వరుని పూజ చేసితివి; ఆ పూజామహిమము ఇటువంటిదియే. అటువంటివారు జన్మజన్మమునందును సంపద్యుక్తులు అగుదురు.

56. తల్లీ! వినుము; నీకు ఇహసౌఖ్యమును కలుగును; దేహావసానమునందు పరమ (ముక్తి) లోకమును లభించును. నీవు (ఇట్లు ప్రదోషమునందు) పినాకపాణిని పూజించియున్నందున నీకు ఇక పునర్జన్మము కలుగదు.

57. నీవు శంకరుని ఆరాధించితివి; (ఆ మహిమముచేతనే నేను అవతరించితిని.) ఆ మహిమముతోనే నన్ను అవతరింపజేసికొంటివి.) నీకు గల ఎంత గొప్ప కోరికలును పూర్తినందును. నాకు ఇపుడు ఇక అనుమతినిమ్ము.

58. తల్లీ! వినుము ఇప్పటినుండి ముప్పదియవఏట నీకు నా పునర్దర్శనము అగును. ఇపుడు నేను బదరీవనమునకు పోయెదను. అనుచు తత్ క్షణమే శ్రీగురువులు బయలుదేరిరి.

59. శ్రీగురువుల వారు అపుడు అట్లు అనుమతిపొంది తమ స్వాభావిక చిత్తవృత్తి ననుసరించి ఇల్లువెడలి బయలుదేరిరి. సకల నగర జనులును అపుడు అచటికి వచ్చిరి; వారును శ్రీగురువుల తల్లిదండ్రులును వారికి వీడ్కోలు చెప్పి సాగనంపిరి.

60. అపుడు నగరమందలి నరులు నారులును అందరును ఇట్లు అనుచుండిరి. (ఇంత చిన్నవయసుననే) ఈ బ్రహ్మచారి తపమునకై బయలుదేరిపోయెనే! ఈతడు మనుష్యదేహధారిగా కనబడుచున్నాడే కాని నిజమగు అవతారపురుషుడు అయి ఉండును.

61. వారిలో కొందరు ఇట్లు అనుచుండిరి; ఎంత వింత విషయమో ఇదిచూడుడయ్యా! ఇంత చిన్నబాలుడు తపస్సునకై బయలు దేరుట ఏమి? తల్లి దండ్రులు సుఖముగా (ఏమియు అభ్యంతరము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

చెప్పక) కేవలము కుతూహలముతో (వేడుకతో - ఇది ఏదియో యొక్క సంతోష హేతువు అగు విషయముగా భావించి) ఆతనికి అనుమతి ఇచ్చుచున్నారే !

62. ఈ తల్లిదండ్రుల అంతఃకరణము ఎటువంటి విలక్షణము అయినది! శిల ఎటువంటిదియో - అటువంటిదియే వీరి అంతఃకరణము కూడ; మనస్సు చాల గట్టి (నిశ్చయముకల) దిగా చేసికొని తమ కన్న కుమారునికి వీడ్కోలు చెప్పి ఇంటినుండి పోనిచ్చిరే !

63. మరికొందరు ఇట్లు అనుచుండిరి : ఈ బాలుడు వాస్తవమున బాలుడు కాడయ్యా ! ఈతడు కేవలము (తప్పక) త్రిమూర్త్యవతారము అయి ఉండును. ఇందు సంశయము ఏమియు లేదు; అంతియ కానిచో ఇంత చిన్న బాలుడు వేదములు (అన్నియును అన్ని) శాస్త్రములును ఎట్లు చెప్పును.

64. చూడుడు! ఏడుసంవత్సరముల బాలుడే అయి ఉండియు ఈతడు సకల శాఖల వేదములును చెప్పెను కదా ! వినుడు; ఈతడు మనుష్యమాత్రుడు (లోకసాధారణ మానవుడు) అయి ఉండడు సుమా ! అని ఇట్లు సాధుజనులు అనుచుండిరి.

65. నాయనా ! నామధారకా ! శ్రద్ధగా వినుము; సాధుజనులు అగువారు ఈవిధముగా పలుకుచు శ్రీగురువులకు సాష్టాంగ నమస్కారము చేయుచుండిరి. నానావిధములగు స్తోత్రవచనములతో వారిని స్తుతి చేయుచుండిరి.

66. సకల జనులును శ్రీగురువులకు నమస్కారము చేసి తమ తమ గృహములకు వచ్చిరి. జననీజనకులుమాత్రము వారికి వీడ్కోలు చెప్పుచు వారిని సాగనంపుచు అట్లే మరికొంతదూరము వారివెనుకనే పోవుచుండిరి.

31] దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

67. నాయనా! వినుము; అపుడు శ్రీగురువులు తమ జననికి (జననీజనకులకు) తమ నిజస్వరూపము చూపిరి. జననీ జనకులు అపుడు తమ కుమారుని శ్రీపాద శ్రీవల్లభులనుగా శ్రీదత్తాత్రేయులనుగా దర్శించిరి.

68. త్రిమూర్తుల అవతారము ఈ బాలుడుగా నరుడుగా 'నరహరి' అను నామమున అయ్యెను. అని వారు (శ్రీగురువుల జననీ జనకులు) గుర్తెరిగిరి. కర్పూరగౌరుడుఅగు పరమశివుడు శ్రీగురువుల యందు వారికి దర్శనము ఇచ్చెను. అది దర్శించుచునే ఆదంపతులు శ్రీగురువుల చరణములకు నమస్కారము చేసిరి.

69. జయ - జయ జగద్గురూ! త్రిమూర్త్యవతారరూపా! మా (మేము ఆచరించిన) పుణ్యము ఎంతయో పెద్దది; అందుచేతనే తమ చరణముల దర్శనము పొందితిమి.

70. తాము నిశ్చయముగా తారకరూపులు; విశేషించి మమ్ము లను ఉద్ధరించితిరి. తాము మాకు పునర్దర్శనము ఇప్పించవలసినదిగా ప్రార్థించు చున్నాము. అని జననీజనకులు శ్రీగురువులకు మనవి చేసిరి.

71. శ్రీగురువుల జననీజనకులు తమ పుత్రునితో ఈవిధ ముగా పలికి మొదట భక్తిభావముతో తమ శిరస్సును వారి చరణ ములపై మోపి (నమస్కరించి) రి. తరువాత లోకస్వభావసిద్ధమగు స్నేహ (వాత్సల్య) భావమునకు వశులయి వారు వారిని కౌగిలించు కొనిరి.

72. శ్రీగురుమూర్తియును సంతోషించి అతిప్రీతిపూర్వక ముగా తమ జననీజనకులను ఆశ్వాసించిరి. (ఓదార్చిరి;) వారిమనస్సు నెమ్మదిపరచుచు మాటలాడిరి. మీకు మా పునర్దర్శనము అగును; మీకు నేను నాపునర్దర్శనము ఇత్తును; అని వారితో అపుడు శ్రీగురు వులు పలికిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

73. శ్రీగురువులు వారితో ఇట్లు సంభాషించి తత్ క్షణమే వారి అనుమతి తీసికొని (బయలుదేరి) రి; వారి జననీజనకులును అట నుండి మరలి వచ్చిరి; సంతోషముతో తమ ఇల్లు చేరిరి.

74. వరదమూర్తి అగు శ్రీగురుశ్రేష్ఠులు తాము బదరీవనము చేరుటకయి బయలుదేరిరి. వారు మొదట ఆనందకాననము అను ప్రసిద్ధనామాంతరముకల వారాణసికి చేరిరి.

75. ఈవారాణసీపురినే 'అవిముక్తము' 'ఏసమయమునను పార్వతీపరమేశ్వరులచే విడువబడునది కాదు.' అని ఈనగరమునకు మరియొక నామము కలదు; చరాచర భూతములతో నిండిన ఈ ప్రపంచమునందే ఈవారాణసి సాటిలేనిది; త్రిభువనములయందును నిరుపమానమగు ఈ వారాణసియందే స్థిరమును సమాహితమును అను చిత్తముతో విశ్వేశ్వరుడు ఉండును.

76. గురుశిరోమణి (శ్రీ నరసింహులవారు) కొంతకాలము ఆ స్థానమునందు (వారాణసియందు) నిలిచియుండి అనుష్ఠానమును జరుపుకొనుచుండిరి. ఆత్మారాముడు అగు శ్రీవిశ్వేశ్వరుని దర్శించుచు ఆదేవుని పూజించుచు ఉండిరి.

77. నామధారకా వినుము; మునియగు శ్రీగురువులు ఆవారాణసీస్థానమునందు కొంతకాలము ఈవిధముగా అష్టాంగయోగ విధానమున తపము ఆచరించుచు గడపిరి.

78. ఆకాశీనగరమునందు ఇంకను అనేకులు తాపసులును యతులును అవధూతలును ఉండిరి. వారందరును కఠోరముఅగు తపస్సు ఆచరించుచుండిరి.

79. వారి అందరలోను బ్రహ్మచారిగా ఉండిన శ్రీగురువులు యోగాభ్యాస ధురంధరులు అయి సాధనము చేయుచుండిరి. ఇది

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

చూచి ఇతరులగు తపస్వులు తమతమ మనస్సులందు ఇది ఎంతయు అచ్చెరువుగొలుపు విషయముగదా! అని భావించుచుండిరి.

80. నాయనా! వినుము. వారు పరస్పరము ఇట్లు అనుకొనుచుండిరి. చూడుడయ్యా! ఈ బ్రహ్మచారి నానా ప్రకారములగు తపస్సు ఆచరించుచున్నాడే! ఈతని హృదయమునందు ఎంతటి వైరాగ్యముకలదో కదా! ఈతడు ప్రాపంచిక విషయముల విషయమున ఎంత నిర్లిప్తుడుగా నున్నాడు.

81. ఈతనికి తన శరీరవిషయమున మమకారము ఏమాత్రమును లేదు; ఈతడు సంన్యాసాశ్రమము స్వీకరించుటకు యోగ్యుడుగా ఉన్నాడు. ఈతడు త్రిషవణములయందును మణికర్ణికా తీర్థమునందు స్నానము చేయుచున్నాడు.

82. ఈవిధముగా అచ్చటి ఇతర యతులు శ్రీగురువులను అనునిత్యమును స్తుతి చేయు (పొగడు) చుండిరి; నిరంతరమును వీరిదగ్గరకు అచ్చటి సకల సంన్యాసులును వచ్చుచుండిరి. వారిలో వృద్ధుడు అగు ఒకయతి ఉండెను. అతని నామము 'కృష్ణసరస్వతి'

83. ఆయన కేవలము బ్రహ్మజ్ఞానియు తపస్వియు మహాముని యును; ఆయన శ్రీగురువులను సదాచూచుచు స్నేహభావముతో భావన చేయుచుండెను.

84. ఆ కృష్ణసరస్వతియతి ఇతరులగు యతీశ్వరులందరతో ఇట్లు పలికెను: ఈ బ్రహ్మచారిని నరమాత్రుడగు బ్రహ్మచారిమాత్రునిగా అనవలదు. ఈ మహాతాపసి అవతారపురుషుడు అనియు విశ్వవంద్యుడు అగు భగవానుడే అనియు నాకు కనబడుచున్నాడు (తోచుచున్నది) సుమా!

85. వయస్సుచే తక్కువ (చిన్న) వాడుకదా! అని మీరు ఈమునిని నమస్కరించకున్నారు; ఈతడు త్రిభువన ప్రఖ్యాతమూర్తి; అందుచేతనే మనకును ఈతడు వంద్యుడు సుమా!

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

86. మనము అందరమును వార్ధక్యముతో ఉన్న వారము అగుటచేతను విశేషించి (అంతమాత్రమే కాక) మనము సంన్యాసులము అగుటచేతను మనము ఈతనిని నమస్కారము చేసినచో చూచువారికి అందరకును ఇది తప్పుగా తోచి దుఃఖము కలుగును; అంతేకాదు ఈమూర్ఖలోకము మనలను నిందించును.

87. ఈకారణముచే మనము ఈతనికి మనవి చేయుదము; పరోపకారము జరుగుటకై ఈతనికి సంన్యాసాశ్రమము ఇచ్చెదము; దానిచే ఎల్లవారికిని తమ మనస్సులయందు ఈ యతివిషయమున స్థిరము అగు భక్తి కలుగును.

88. వినుము; ఈతడు లోకానుగ్రహ నిమిత్తమయి ప్రవర్తిల్లు సమర్థుడగు యతి అగును. ఈతని దర్శనమాత్రముచేతనే మనము అందరమును పవిత్రులము అగుదుము.

89. ఈకారణమున మనము అందరమును ఈతనికి వినయముతో మనవి చేయుదము; ఈతడు సంన్యాసాశ్రమము గ్రహించి సంన్యాసి అయిన మీదట ఏకభావముతో నేను ఈతనికి పూజ చేయుదును.

90. ఇట్లు అని (శ్రీకృష్ణసరస్వతి చెప్పినది అంగీకరించి వారితో కూడ) సకల యతులును వారి (శ్రీగురువుల) దగ్గరకు వచ్చిరి. వారెల్లరును వారితో ఈవిధముగా మనవి చేసిరి. తపస్వి సమూహము నందు శ్రేష్ఠుడవు అగు బ్రహ్మచారీ! మా మాట వినుము. మా మనవి యొకటి కలదు.

91. నాయనా! లోకానుగ్రహార్థమయి తాము ఇపుడు సంన్యాసాశ్రమమును స్వీకరించవలసి యుండును. మమ్ములను అందరను ఉద్ధరించవలయును. మేము అందరమును చేయు పూజలను అందుకొనవలయును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

92. ఈ కలియుగమునందు 'సంన్యాసాశ్రమము' అను పేరు చెప్పగానే సకలజనులును ఛీ! ఛీ! ఈ యుగములో సంన్యాసాశ్రమము ఏమి? ఇది ఈయుగమున నిషిద్ధము కదా! అని నిందచేయుచున్నారు.

ఇది యుక్తమును ఉత్తమమును అని నిర్ధారించి స్థాపనచేయుటకు ఈలోకమునందు (భూమిపై) ప్రస్తుతము ఎవరును కానరాకున్నారు.

93. ఏలయన ఈవిషయమున ధర్మశాస్త్ర వచనము ఈవిధముగా ఉన్నది.

శ్లో॥ యజ్ఞదానం గవాలంభమ్ ।
సంన్యాసం పలపైతృకమ్ ।
దేవరాచ్చ సుతోత్పత్తిం ।
కలౌ పంచ వివర్జయేత్.

94. (పశుహింసాపూర్వక) యజ్ఞాచరణమును గవాలంభమును (ప్రత్యక్షపశువుతో కాకున్నను పిష్టాది ప్రత్యామ్నాత పశువుతోనైనను 'గోమేధ యజ్ఞమును - లేదా మాంసాహారులును మాంసార్థ గోవధమును) సంన్యాసాశ్రమ స్వీకరణమును మాంసముతో పితృకర్మాచరణమును స్త్రీలు ఆపత్యమయములందయినను తన భర్తకు సహోదరుడగు వానినుండి సుతుని కనుటయును అను ఈ ఐదింటిని - ఇతర యుగము లందు ఆచరించబడుచుండిన వాటిని కూడ - కలియుగమున విషువవలయునేకాని ఆచరించరాదు.

95. కావున సంన్యాసాశ్రమము స్వీకరించుట నిషిద్ధము అని సమస్తజనులు అనుచున్నారు. ఇది దుర్బలమగు ఏకదేశి (కొందరు మాత్రము చెప్పిన) వచనమేకాని పూర్వ ఋషులలో కూడ ఎల్లరును అంగీకరించిన సార్వత్రిక సిద్ధాంతముకాదు; వేదసిద్ధమగు సిద్ధాంతము ఈ సంన్యాసాశ్రమస్వీకరణము; లోక విశ్రుత మయినది కూడను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

96. పూర్వము కలియుగారంభమునుండియు మొన్న మొన్నటి వరకును సకలజనులును ఈపైజెప్పిన హేతువులతో సంన్యాసాశ్రమ స్వీకరణమును నిషేధించుచు వచ్చిరి. కాని-నాయనా! వినుము; శ్రీశంకర భగవత్పాదులు అవతరించి సంన్యాసాశ్రమ గ్రహణ సంప్రదాయమును ప్రతిష్ఠనంద జేసిరి.

97. అది మొదలుకొని ఇంతకాలము (ఇన్ని దినముల) వరకును ఆ సంప్రదాయము ప్రవర్తిల్లుచు వచ్చుచున్నది; కలియుగ దోషములు ప్రబలములు అగుచు రాగా రాగా ఈ సంప్రదాయమునకు మరల నాశము కలుగునట్లున్నది; మరల జనులు దీనిని నిందించుచున్నారు.

98. కృపాసాగరా! తాము మరల ఈ ఆశ్రమమునకు ఉద్ధారమును సకలజనులకును ఉపకారమును చేయవలయును. అని వేడుచున్నాము. అని శ్రీకృష్ణ సరస్వతి మొదలగు మునులు అగు యతులు అందరును శ్రీ గురువులతో పలికిరి.

99. నామధారకా! వినుము; వారి అందర మనవిని విని శ్రీగురుముని వారిలో వృద్ధుడు అగు శ్రీకృష్ణ సరస్వతీయతినుండి తాను సంన్యాసాశ్రమస్వీకారము చేసెను.

100. అని ఇట్లు ఇంతవరకు సిద్ధయోగీంద్రుడు చెప్పినది విని నామధారకుడు సిద్ధుని ఇట్లు ప్రశ్నించెను. కృపానిధియగు మునిరాజా! నామనస్సునందు ఒక సందేహము కలుగుచున్నది.

101. శ్రీగురువులవారు (శ్రీనృసింహసరస్వతి) ఉన్నారే! వారే సకలజగద్గురువు అని తాము చెప్పుచున్నారు. వారికిని మరియొకరు గురువు అయిరి. అనియు తాము చెప్పుచున్నారు. శ్రీగురువులవారు త్రిమూర్త్యవతారరూపులు కదా! వారికి ఇంకొకరు గురువు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

లనుట ఏమి ? (ఆలోచించగా) ఇది ఎట్లు (ఎంత అనుచితముగా) కనబడు చున్నది !

102. ఇది విని సిద్ధయోగి శిష్యు (నామధారకు) నితో ఇట్లు పలికెను : నాయనా ! దేని వాస్తవస్థితి ఎటువంటిదియో చెప్పెదను వినుము; పూర్వము శ్రీరఘునాథునకు వసిష్ఠులవారు ఎట్లు గురువులు అయిరి ?

103. ఎనిమిదవ అవతారము అగు శ్రీకృష్ణదేవునకు సాందీపని ఎట్లు గురువు అయ్యెను. భగవానుడే అయినను భూలోకమునందు మానుషరూపమున అవతారము అందినప్పుడు దానిననుసరించి ప్రవర్తించవలయును.

104. ఈ కారణముచేతనే శ్రీగురుమూర్తియును శ్రీకృష్ణ సరస్వతీయతిని తనగురునిగాచేసికొని వారినుండి సంన్యాసాశ్రమము స్వీకరించిరి. (లోకదృష్ట్యా) బహుకాలమునుండియు యతిగానుండిన జ్ఞానవృద్ధుడును వయోవృద్ధులును విద్యావృద్ధులును కావున ఆయతి నుండి శ్రీగురువులు తామును వారిని తమ గురునిగా గ్రహించిరి.

105. ఈ సమాధానమువిని నామ ధారకుడు (సరస్వతి) సిద్ధయోగితో ఇట్లనెను: స్వామీ ! తాము ఈ కథయంతయు చెప్పచున్నారుకదా ! మన విద్యా జ్ఞాన వయోవృద్ధులు అగుటచే శ్రీగురువులు శ్రీకృష్ణసరస్వతీయతిని తమ గురునిగా చేసికొనిరి అని పలికితిరి.

106. అనగా అక్కడ ఉన్న అందర యతులయందు కంటెను ఆ శ్రీకృష్ణసరస్వతీయతి యందు శ్రీగురువులకు బహుమాన(ఆదర) భావము కనబడి వారికి గొప్పదనము ఇచ్చిరి అనికదా దీని అర్థము; ఇంత గొప్పదనమునకు హేతువుగా ఆ శ్రీకృష్ణసరస్వతీయతి మొదట ఎవరు ? ఆగురుని మూలపీఠమువది ?

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

107. స్వామీ! ఇదియంతయు తాము కృపతో విస్తారపరచి నాకు తెలియజేయ ప్రార్థించుచున్నాను. దానిచే నా మనస్సునందు సంతోషము కలుగును.

108. శ్రోతలారా! వినుడు; ఇట్లు శిష్యుడు (నామధారకుడు) పరస్తుతి మనవి చేయగా అప్పుడు సిద్ధయోగి శ్రీగురుమూలపీఠమును క్రమప్రాప్తమగు గురుసంతతి(పరంపరా) క్రమము ఆద్యంతమును విస్తార పూర్వకముగా చెప్పెను.

109. ఆది గురుపీఠాధిపతి శ్రీశంకరగురువు; తదనంతరము శ్రీమహావిష్ణువు గురువయ్యెను: తదనంతర గురువు చతుర్ముఖబ్రహ్మ; ఇది మూలపీఠ గురుపరంపరా క్రమము అని నిశ్చయముగా ఎరుగుము;

110. తదనంతర గురువు వసిష్ఠుడు; అనంతరము వసిష్ఠునినుండి శక్తియును ఆతని తరువాత పరాశరుడును గురువులు, పరాశరుని శిష్యులు మహానుభావుడగు వ్యాసులు; ఆయనయే శ్రీమహావిష్ణు నవతారము.

111. ఆతనినుండి అనంతరము శుకుడు గురువు అని ఎరుగుము; మహాశక్తిసంపన్నుడగు గౌడపాదాచార్యులు అనంతరగురువు; ఆతని నుండి శ్రీగోవిందభగవత్పాదులు; అనంతరము శ్రీ శంకర భగవత్పా దులు గురువులు అయిరి.

112. తదనంతర గురువులు విశ్వరూపాచార్యులు (ఇది పీఠ పరంపర); తరువాత వచ్చిన గురువులు జ్ఞానబోధగిరి; వారి శిష్యులు సింహగిరి; అనంతరము వారి శిష్యులు ఈశ్వరతీర్థులు గురువులు అయిరి;

113. తదనంతరము నృసింహతీర్థులు తరువాత వారిశిష్యులు విద్యాతీర్థులు; తరువాత శివతీర్థులు - భారతీ తీర్థులు - క్రమముగా పరంపరాఽఽగత గురువులు అని నిశ్చయముగా ఎరుగుము.

32] దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

114. వినుము; మరి తరువాత వారి శ్రీనృసింహతీర్థుల నుండి విద్యారణ్య భగవత్పాదముని; వారి శిష్యులు విద్యాతీర్థులు అనువారు అనంతరము పరంపరలో గురువులు అయిరి.

115. వారి శిష్యులు మలయానందులు వారి శిష్యులు పూజ్యులగు దేవతీర్థ సరస్వతీ; వారినుండి వారి శిష్యులు యాదవేంద్ర సరస్వతీ ఈవిధముగా జగద్గురు పీఠపరంపర ప్రవర్తిల్లుచు వచ్చినది.

116. యాదవేంద్రముని శిష్యులు అనగా - వారే ఈ 'శ్రీకృష్ణ సరస్వతీ' అను విశిష్టపురుషులు; వీరు బాల్యముననే సంన్యాసము స్వీకరించి శ్రీగురువులతో వారికి పరిచయము అగు నాటికి వారికి చాలవయస్సులయి ఉంటుటచే వారిని బహుకాలపు సంన్యాసి అని అందరును విశేషముగా సంమానించుచుండిరి.

117. ఈ చెప్పిన విధముగా శ్రీగురునాథులు సంన్యాసమార్గస్థాపనార్థము చతుర్థా (సంన్యాసా) శ్రమమును స్వీకరించి శ్రీనృసింహ సరస్వతీ అను నామముతో ప్రసిద్ధినందిరి.

118. అచ్చట శ్రీగురునాథులు సమస్తవేదముల అర్థమును చెప్పుచుండిరి. ఆకారణమున ఆ కాశీనగరమునందు సమస్తజనులు వారిని నమస్కరించుచుండిరి.

119. వారు ఆ వారాణసీ నగరమునందు చాల గాఢము (విశిష్టము) అగు ఖ్యాతిని సంపాదించికొనిరి. ఇంతేకాదు; సమస్త యతులును వచ్చి శ్రీగురువులకు సేవ చేయుచుండిరి.

120. మరి (కొంతకాలము తరువాత) శ్రీగురుముని అనేకులగు బదరీవనము అను ఉత్తరభారతమునందలి తీర్థమును ఇంకను అనేకములగు ఇతర తీర్థములను దర్శించి సేవించుటకై శిష్యులతోకూడి అక్కడి (వారాణసి) నుండి బయలుదేరిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

121. మహామేరువునకు సవ్యప్రదక్షిణము చేయుచు నవఖండాత్మక భారతవర్ష క్షితియందలి తీర్థములను దర్శించుచు వారు ముందుకు సాగిరి; అవి అన్నియు విస్తారముతో చెప్పుచు పోయినచో బహు విస్తరము అగును. (కావున అది అంతయు ఇప్పుడు నేను చెప్పుట లేదు. సంక్షేపముగా చెప్పెదను) శిష్యా ! నామధారకా ! అది వినుము.

122. శ్రీగురువులు సమస్త తీర్థములను అవలోకించుచు సకల శిష్యులతోను యతులతోను కూడి భూమిప్రదక్షిణము చేయుచు గంగాసాగర సంగమ ప్రదేశమునకు చేరుకొనిరి.

123. (అని ఇంతవరకును చెప్పి) సిద్ధయోగి నామధారకుని (సరస్వతి) తో ఈవిధముగా పలికెను. ఈవిషయమున సమస్త చరిత్రమును (వివరముగ) చెప్పినచో బహుకథావశమున విస్తారము అధికము అగును; అందుచేత (ఎంతమాత్రము) ప్రకృతమునకు ఆవశ్యకమో తావన్ (అంత) మాత్రము చెప్పెదను; వినుము.

124. శ్రీగురువుల సమస్త మహిమమును చెప్పుటకు నాకు శక్తి ఎక్కడిది ? త్రిమూర్తి రూపులు అగు శ్రీగురువుల మహిమను అనంతము; అదియే శ్రీగురుచరిత్రము; చెప్పెదను వినుము నాయనా !

125. శ్రీగురువుల యాత్రాక్రమము తెలిపెదను. వినుము. గంగా సాగర సంగమ ప్రదేశమునుండి దేవుడు (భగవానుడు) అగు శ్రీగురురాజులు తటయాత్ర (గంగా తటము వెంబడి నడచుచు ఆవెంట గల తీర్థములను క్షేత్రములను సేవించుచు పోవుట) చేయుచు ప్రయాగ స్థానము (క్షేత్రము) నకు వచ్చి చేరుకొనిరి.

126. శ్రీగురువుల వారు ఆ స్థానమునందు ఉన్న సమయమున (వారిదగ్గరకు) ఒక బ్రాహ్మణ శ్రేష్ఠుడు వచ్చెను. ఆ విప్రుడు 'మాధ

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

వృషు' అను నామముకలవాడు. అతడు వచ్చి శ్రీగురువులను సందర్శించెను.

127. నాయనా ! నామధారకా ! వినుము. ఆతనికి శ్రీగురువులవారు ప్రీతితో బ్రహ్మజ్ఞానమును ఉపదేశించిరి. ఆతనికి చతుర్థా (సంన్యాసా) శ్రమమును ఇచ్చిరి.

128. ఆశిష్యునకు శ్రీగురువులు 'మాధవ సరస్వతి' అని నామము ఉంచిరి. ఇంతేకాదు. వినుము. తమకు గల అందర శిష్యులనడుమను శ్రీగురువులకు ఆతనిపై ప్రీతి అధికము.

129. (అనిపలికి) సిద్ధయోగి నామధారకునితో ఈవిధముగా పలికెను. ఇదే విధముగా అనేకులు శ్రీగురువులకు శిష్యులు అయిరి. ఆ యతుల అందర నామక్రమమును చెప్పెదను. ఏక (ఏకాగ్ర) చిత్తుడవు అయి వినుము.

130. అని ఇట్లు సిద్ధనామధారక సంవాద రూపమగుచు సకల పురుషార్థ ప్రదమగుటచే కామధేనువు అనదగు శ్రీగురుచరితమును గంగాధరుని కుమారుడు సరస్వతి వచించుచున్నాడు. ఇది వినినవా మహాజ్ఞానము కలుగును. నాలుగు పురుషార్థములును లభించును.

ఇది పరమకథా కల్పతరువు అయి సిద్ధ నామధారక సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరితామృతమునందు శ్రీగురు తురీయాశ్రమ గ్రహణ శ్రీగురు పరంపరాకథనములు అను పండ్రెండవ అధ్యాయము.

సంఖ్య = 130

# శ్రీ గురు చరిత్రామృతము

## త్రయోదశాధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. శ్రోతలారా! వినుడు. ఇట్లు ద్వాదశాధ్యాయ కథా శ్రవణానంతరము శిష్యోత్తముడగు నామధారకుడు (సరస్వతి) సిద్ధయోగి పాదములపై వ్రాలి అవి అంటెను. ఎరుగుడు. తన కరపుటములను జోడించి ఆతడు తనగురువు అగు సిద్ధయోగితో ఇట్లు మనవి చేసెను.

2. సిద్ధమునీ! జయ, జయ. తాము ఎల్లరకంటెను. ఉత్కృష్టులయి జగత్కల్యాణ కారులయి వర్ధిల్లుచున్నారు. తాము నన్ను సంసార సాగరమునుండి తరింపజేయు 'తారక' రూపులు, తాము నాకు శ్రీగురు తత్త్వ విషయకమగు జ్ఞానమును ప్రకాశపరచి చెప్పితిరి. నా మనస్సు తద్విషయమున స్థిరము దృఢసమాధియందు నిలిచినది ఐనది.

3. శ్రీగురుచరిత్ర కథామృతమును సేవించినకొలదిని ఇంకను సేవించవలయును అను తృష్ణ (కోరికయు దప్పికయు) అధికము అగుచున్నది. ఆ తృష్ణను శమింపజేయగల సమర్థులు కృపానిధులు అగు తాము ఒక్కరే.

4. కామధేనువు (అగు) శ్రీ గురుచరిత్రమును విస్తారపరచి తాము నాకు తెలిపితిరి. కాని నా మనస్సు అంతటితో తృప్తము (తృప్తిచెందినది) అగుటలేదు. ఇంకను వినవలయును అను అపేక్ష కలుగుచునే యున్నది.

5. క్షుద్బాధచే పీడితము అగుచున్న పశువు. ఆ పశువునకు తృణరాశి (గడ్డివాము) దొరకినచో దానికి అది ఎట్లు మనోహరముగా నుండునో - అది దానినుండి మరలి ఈవలకు ఎట్లు రాకుండునో - నా స్థితి ఇపుడు ఆవిధముగా నున్నది.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

6. ఎన్నడును స్వప్నమునందు అయినను మజ్జిగనుకూడ చూచి యుండని వాడు ఎవడైనను ఉన్నచో వానికి పాలతో నిండిన కడవ లభించినచో దానిని త్రావుటతో వాని మనస్సు తృప్తినందనిదే వాడు ఆక్షీరపాత్ర ఉన్నస్థానమును విడిచి ఈవలకు ఎట్లు వచ్చును ?

7. స్వామీ ! అల్పజ్ఞానిని అగు నేనును అట్లే యున్నాను. అవిద్యారూపయగు మాయ నన్ను వేష్టించి (చుట్టుకొని) యుండగా శ్రీగురువుల విషయమును తాత్త్విక నిశ్చయజ్ఞానము ఇదియని తెలియ చాల శ్రమపడుచున్నాను.

8. అజ్ఞానము అను తిమిరము (చీకటి) తో నిండిన రాత్రి యందు (కొట్టుమిట్టాడుచున్న నాకు) జ్యోతిఃస్వరూపులుగా తాము ఉన్నారు. తాము శ్రీగురువుల వాస్తవ స్వరూపము ఇదియని నాకు ప్రకాశపరచితిరి.

9. తాము నాకు ఉపకారము చేసితిరి. ఈ ఉపకారమునకు ప్రతిగా నేను ఏ ఉత్తమపదార్థమును ఇచ్చి తమ ఋణమునుండి ఉత్తీర్ణుడను అగుదును ? కల్పవృక్షమునే ఇచ్చినవానికి ప్రత్యుపకారముగా ఏమి ఈయవలయును ?

10. కృపామూర్తి యగు సిద్ధశ్రేష్ఠా ! ఎవరు అయినచో చింతామణినే ఇచ్చెనో అతని ఉపకారమునకు ప్రతిగా ఆ ఋణమును తీర్చుకొనదగినదిగా ఆ ఉపకారికి ఈయదగినది ఈ భూమియందు ఏమికలదు ? అట్టిది ఎవరును ఇచ్చియుండలేదు. ఇచ్చినట్లు నేను చెవులతో వినియుండలేదు.

11. తాము నాకు చేసిన ఇటువంటి ఉపకారమునుండి నేను జన్మజన్మలకును (ఇకముందు ఎన్నియో జన్మములెత్తియు అనృణుడను అయి ఉత్తీర్ణుడను కాజాలను. అని ఇట్లుపలికి నామధారకుడు సిద్ధయోగి చరణములపయి వ్రాలెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

ఆచరించిరి. నలుగురు (పూర్వాశ్రమపు) సోదరులును సోదరియును స్వామిని దర్శించిరి.

24. శ్రీగురుమూర్తినిచూచి నగరమునందలి జనులు అందరును అందరును అత్యంత హర్షమును పొందిరి. అందరును శ్రీగురువుల దర్శనమునకయి వచ్చిరి. పలువిధములుగా వారికి పూజలుచేసిరి.

25. ప్రతియొక ఇంటివారును శ్రీగురువులను తమ ఇంటికి భిక్షకై ఆహ్వానించిరి. స్వామివారును అనేక (సమాన) రూపములు కలవారు అయి ప్రతియొక ఇంటియందును పూజలను గ్రహించుచుండిరి.

26. సమస్త జనులు ఆశ్చర్యము పొందుచుండిరి; వారు ఇట్లు అనుచుండిరి. వీరు నిశ్చితముగా శ్రీ మహావిష్ణుని అవతార రూపులు సుమా! ఆ మహావిష్ణువే యతివేషమును ధరించియున్నాడు. వాస్తవమును ఎరుగుడు; వీరు పరమపురుషుడు అగు శ్రీమహావిష్ణువే సుమా!

27. ఎవరు ఈ యతిని 'మానవుడు' అని అనెదరో - వారు నరకలోకమునకు పోయెదరు; బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అను మూర్తిత్రయమునకును లోకానుగ్రహమునకై అవతారములు అనునవి జరుగుచుండును గదా!

28. శ్రీగురువుల (పూర్వాశ్రమ) జననీజనకులు ఈ విధముగా భావభక్తితో వారిని పూజించిరి. ఆ సమయమున జననికి తన పూర్వజన్మపు స్మరణముకలిగి ఆనాటి శ్రీపాద శ్రీవల్లభ యతియే ఇపుడు ఈ నృసింహసరస్వతి యని ఎరుకయయ్యెను.

29. శ్రీగురువుల జనని యగు అంబాభవాని ఆ సమయమున అట్లు తన పూర్వజన్మ వృత్తాంతమును శ్రీపాద శ్రీవల్లభులను చూచి శ్రీగురువుల చరణకమలములందు తన శిరస్సును మోపి నమస్కరించెను. చంద్రచూళి సత్యసంకల్పుడు కదా! కావుననే తాను చేసిన ప్రదోషపూజాఫలము ఇట్లు లభించెను అని ఆమె తలచెను.

30. ఆమె ఆ సమయమున ఆ పూర్వజన్మ వృత్తాంతము అంతయును తన పతికి చెప్పెను. విశ్వవంద్యుడు (సమస్త జగత్తుచే నమస్కరింపబడువాడు) అగు ఉత్తమ పుత్త్రుడు నాకు కలుగవలయును, అని నేను శ్రీశంకరుని ఆరాధించితిని.

31. నేను మనసా వాచా ఈ శ్రీపాదవల్లభరూపుడు అగు ఈశ్వరుని పూజనమునే చేసియుంటిని; వినుడు; తత్ఫలముగానే మన జన్మము మిగుల సిద్ధిపొందినది ఐనది. పరమేశ్వరుడిట్లు మానజన్మమును సఫలముగా చేసెను.

32. ఇట్లు అని ఆ జననీజనకులు ఇరువురును శ్రీగురువులను నమస్కరించిరి. మరియు వారు చేతులు జోడించి గురువులతో ఇట్లు మనవి చేసిరి. జగన్నాథా! యతిరాజా! ఈ భవార్ణవము (సంసార సాగరము) నుండి తాము మమ్ములను ఉద్ధారము పొందించవలయును (తాము మాకు తారకులు కావలయును.)

33. అది విని శ్రీగురువులు ఆదంపతులతో ఇట్లు పలికిరి: చెప్పెదను వినుడు; ఏసమయమునందైనను సరియే; తమ కుమారుడు సంన్యాసి అగునో అతడు ఆతల్లిదండ్రుల నరువదిరెండు తరములవారిని ఉద్ధరించును. (తరింపజేయును.)

34. వారికి శాశ్వతబ్రహ్మలోకము కలుగును; అచలమగు పదము (ముక్తిస్థానము) లభించును; అని ఎరుగుడు; వినుడు; వారి వంశమునందు ఇంకను ఇతరులు ఎవరు ఎవరు జన్మింతురో - వారికి ఎల్ల వారికిని బ్రహ్మపదము లభించును.

35. వారి పితృసంతతి (వారిపెద్దలు - పరలోకమునందు ఉన్నవారు) యమునివలన కలుగు దుఃఖములచే భయభీతులు కారు; అప్పటికి వారిపూర్వజులు ఎవరయినను నరకమునందు ఉండి యున్నచో వారికిని శాశ్వత బ్రహ్మపదము లభించును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

36. చూడుము (తెలిసికొనుము); ఈ కారణముచేతనే నేను విశిష్టము అగు ఈ ఆశ్రమమును స్వీకరించితిని; మీకు యమునివలన ఏమియు భయములేదు; మీకు బ్రహ్మపదము కలుగును; ఇది సత్యము అగు విషయము.

37. జననీజనకులతో శ్రీగురువులు ఈవిధముగా పలికి వారిని అనేక విధములుగా ఆశ్వాసించిరి; (మనస్సు సమాధాన పరచిరి); వారు ఇంకను ఇట్లు పలికిరి. మీపుత్త్రిలు శతాయువులు అగుదురు; అష్టవిధైశ్వర్యములతో ఆనందింతురు.

38. వారి పుత్త్రపౌత్త్రసంతతి కూడ సుఖముగానుండును. మీరు మీకన్నులతో సుఖముగా చూచెదరు; సకలక్షేమములను పొందెదరు; వినుడు. అంతకాలమున మీరు కాశీనగరమున దేహత్యాగము చేయుదురు.

39. కాశీపురము ముక్తిస్థానము అని వేదశాస్త్రములయందు చెప్పబడి ప్రఖ్యాతమయి యున్నది; కావున మీరు మీ మానసము లందు ఏమాత్రమును చింతచేయవలదు. అని ఇట్లు శ్రీగురువులు ఆసమయమున తమ తల్లిదండ్రులతో పలికిరి.

40. ఆ జననీజనకులకు ఒక కుమార్తె ఉండెను కదా ! ఆమె విశిష్టనామము 'రత్నాఈ' నాయనా ! నామధారకా! వినుము; ఆమె శ్రీగురువులను నమస్కరించి వారితో ఇట్లు మనవి చేసికొనెను.

41. ఆమె పరిపరివిధముల మరి మరి ఇట్లు మనవిచేసెను : స్వామీ ! తాము నన్ను తరింపజేయుడు, తరింపజేయుడు; నేను ఈభవ సాగరమునందు మునిగిపోవుచున్నాను. సంసార సంబంధిమాయ నన్ను చుట్టివేయుచున్నది.

42. స్వామీ ! వినుడు; సంసారప్రభావమున కలుగు (ఆధ్యాత్మి కాధిభౌతి కాధిదైవికము లనెడు) తాపత్రయములనుండి నేను భయ

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

భీతురాలను అగుచున్నాను. తాము నన్ను ఆవిషయములందు నిర్లిప్తురాలనుగా చేయుడు. నేను తపస్సు ఆచరించబోయెదను.

43. ఆమె (తన పూర్వాశ్రమ సోదరి) పలికినమాటలు విని శ్రీగురువులు తాము ఇట్లు పలికిరి: అమ్మా! వినుము; స్త్రీలకు పతిసేవాచరణము అనునదియే తపస్సు.

44. ఇంకను వినుము; దీనిసహాయముతోనే వారు (స్త్రీలు) భవార్ణవము (సంసారసముద్రము) తరించి దాని ఆవలిఒడ్డును చేరెదరు. మరియొకమాట వినుము; ఎవరికి ఎటువంటిభావము ఉండునో – వారికి ఆవిధముగనే జరుగును.

45. స్త్రీలు ఈసంసారసముద్రపు ఆవలిఒడ్డు చేరుటకు భర్తయే ఉత్తమ సాధనముగా ఉన్నాడు. కనుక నీవు నీ మనస్సును నిర్ధారితముగాచేసికొని నీపురుషుని శివసమానునిగా భావించి సేవించుము.

46. దానిచేతనే నీకు ఉద్ధారము జరిగి ఉత్తమగతి కలుగును. అని వేదములును శాస్త్రములును వక్కాణించుచున్నవి. అంతఃకరణమునందు ఏమాత్రమును తహతహపాటు పెట్టుకొనకుము; ఇట్లు (నేనుచెప్పినవిధమున) చేయుటచే నీకు ఉత్తమగతి కలుగును. అని ఎరుగుము.

47. శ్రీగురువులు పలికిన వచనములు విని 'రత్నాఈ' చేతులు జోడించి ఇట్లువారితో మనవిచేసెను. శ్రీగురుమూర్తీ! బ్రహ్మజ్ఞానులు అగు తాము అవధానముతో వినుడు; నేను తమకు ఒక విషయము మనవిచేసికొందును.

48. తాము భూతభవిష్యములను ఎరుగుదురు. అది నావిషయమున ఎట్లుఉన్నదో ఉపదేశించుడు (తెలియజేయుడు.) నాప్రారబ్ధము ఎటువంటిది? అనువిషయము నాకు విస్తారపరచి చెప్పుడు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

49. అనగా విని శ్రీగురువులు ఆమెతో ఇట్లుపలికెం: వినుము. తపస్సుచేయవలయును. అని నీకు కోరిక యున్నది. కాని నీకు ఇంకను సంచితము అగు (పూర్వజన్మములందు చేసినందున రాశీభూతమయి యున్న) పాపము ఇంకను ఉన్నది. అది నీవు అనుభవించవలసి యున్నది.

50. వినుము. పూర్వజన్మమునందు నీవు ధేనువును (పాడి యావును) కాలితో తన్నితివి. ఇరుగు పొరుగు స్త్రీ పురుషుల నడుమ (దంపతులనడుమ) విరోధము కలిగించి కలహములు కలుగ జేసితివి.

51. తెలిసికొనుము. ఆ రెండుదోషముల మూలమునను నీకు అనేకములగు బాధలు కలుగును. వినుము; గోవును తన్నిన పాపము నకు ఫలముగా నీవు సర్వాంగములయందును కుష్ఠరోగిణివి అయ్యెదవు.

52. స్త్రీ పురుషుల (దంపతుల) నడుమ కలహము కలిగించి తివి కదా! దాని ఫలముగా నీపతి యతి యగును. నిన్ను అతడు వదలివేయును. ఇది నిశ్చితము: నీ పూర్వజన్మ సంచిత కర్మముల ఫలము ఇట్టిదిగా నున్నది అని ఎరుగుము.

53. శ్రీగురువులు పలికిన మాటలువిని 'రత్నాఈ' చాలదుఃఖము పొందెను. ఆమె శ్రీగురువుల చరణములపైపడి పొరలియాడెను. గురు నాథా! త్వరితముగా తాము నన్ను ఉద్ధరించవలయును. అని ప్రార్థించు చున్నాను. అనుచు ఆమె వారిచరణములపై వ్రాలెను.

54. శ్రీగురువులు ఆమెతో ఇట్లు పలికిరి: అమ్మాయీ! వినుము. కొంతకాలము శుభముగానే యుండును. నీకు అపరవయస్సు (యౌవనానంతర వయస్సు) అగునప్పుడు నీభర్త యతి యగును.

55. తదనంతరము నీదేహము ప్రత్యవయవమునను కుష్ఠము అగును. ఈ నీస్వదేహమున ఉండవలసినంత వయఃకాలమువరకును

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ఆపాపము అనుభవించి (న తరువాతనే) మరి అప్పుడు నీకు ఉత్తమగతి లభించును.

56. తెలిసికొనుము. నీదేహము చెడిపోవు సమయమున నీకు నాచరణముల దర్శనము లభించును. అప్పుడు నీపాపములు దగ్ధము అగును. అమ్మాయీ! ఇది జరుగు క్షేత్రమును తెలిపెదను వినుము.

57. దక్షిణ దేశమున భీమానదీ తీరమున పాపవినాశనము అను తీర్థము కలదు. నీకు ఈచెప్పిన అవస్థ కలిగినమీదట నీవు తప్పక అక్కడకు పొమ్ము.

58. ఈ భూమండలమునందు విఖ్యాతమును (పాపములను నశింపజేయుటలో) అతిసమర్థమును అగు గంధర్వపురము (గాణగాపురము) అను కీర్తిశాలియగు పురము కలదు. అచట ప్రసిద్ధము అగు అమరజా (భీమా) నదీసంగమము కలదు. అని ఎరుగుము.

59. ఈవిధముగా ఆమెకు చెప్పి శ్రీగురువులు దక్షిణ దేశమునకై బయలుదేరిరి. ఎచ్చట గౌతమీ (గోదావరీ) నది ఉద్భవము అందెనో అటువంటి త్ర్యంబక క్షేత్రమునకు వారు వచ్చిరి.

60. శ్రీ గురుమూర్తి తమ శిష్యులతో కూడి నాసికా త్ర్యంబకక్షేత్రమునకు వచ్చిరి. నాయనా! నామధారకా! వినుము; పురాణాంతరము (బ్రహ్మపురాణాంతర్గత గౌతమీ ఖండాదికము) నందు ఈతీర్థపు మహిమము ప్రఖ్యాతము అయియున్నది.

61. ఈతీర్థపు మహిమము అంతయు చెప్పవలయును అనినచో ఘాబాహుల్యముచే గ్రంథవిస్తారము అగును. కావున నేను నీకు ప్పుడు అది సంక్షేపమార్గమున చెప్పెదను; వినుము.

62. ఆ గౌతమీ (గోదావరీనదీ) మాహాత్మ్యమును నేను చెప్ప లయును. అనిన శక్యముకానంత అపారము అయినది. ఈ నది జలపు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

ఉద్గమస్థానము ఈ బ్రహ్మాండమును దాటి దానికి వెలుపలి ఆవరణము నకు ఆవలగా ఉన్నది. (ఇది వస్తుతః గంగానదియే. ఈ నదీ జన్మ వృత్తాంతప్రకారము త్రివిక్రమావతారకథతో సంబద్ధము అయి పురాణములయందు ఉన్నది కదా !

63. ఇటువంటి దివ్య జన్మ ప్రకారము కల గంగాతీర్థమును ఈశ్వరుడు మహాప్రీతిపూర్వకముగా తన జటామకుటమునందు ధరించి యుండెను. ఆ గంగానదిని భూలోకమునకు తీసికొనివచ్చుటకై సమస్త ఋషీశ్వరులును కలిసి ఒక ఉపాయముచేసిరి. అది చెప్పెదను వినుము.

64. నాయనా ! తెలిసికొనుము; బ్రహ్మర్షి యగు గౌతముడు - విశిష్టుడుఅగు తపస్వి కదా ! వినుము. ఆఋషి తాను అనుష్ఠానము ఆచరించుకొను ఆశ్రమస్థానమునకు సమీపమునందు తనవృత్తి (జీవనో పాయముకై ప్రతిదినమునను వడ్లు విత్తుచు ఉండెను.

65. ఏలయన పూర్వకాలమున మునులు ఎల్లరును తమ తమ ఆశ్రమ సమీపములందు ఇట్లే అనునిత్యమును ఉదయమున ధాన్యపు గింజలను విత్తి మధ్యాహ్నకాలమున ఆపైరునుండి లభించు పంట వరి గింజలను ఏరుకొనుచుండిరి. వానినుండి లభించు బియ్యముతో అన్నము చేసికొని జీవించుచుండిరి. ఇటువంటి సామర్థ్యము వారికి తమ మంత్ర బలముచే లభించుచుండెను. ఏలయన వారు ఇటువంటి మహాపుణ్య పురుషులుగా ఉండిరి. ఈ గౌతమమహర్షియు అట్లే చేయుచుండెను.

66. ఇట్లు జరుగుచుండ ఒకప్పుడు అచ్చటి మహామునులు అందరును కలిసి తమ తమ మనస్సులందు ఇట్లు ఆలోచించి ఆవిషయ మును చర్చచేసిరి. అది ఏమనిన - మహామునియగు గౌతమమహర్షి పరమేశ్వరుని ముఖ్యదాసుడు కదా !

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

67. అతనికి సంకటములు కలుగజేసినచో అతడు తనయందు ఈశ్వరునకుగల ప్రీతిని ఆధారముగా చేసికొని గంగానదిని తీసుకొని వచ్చును. మనము భూమండలమునందు గంగయందు స్నానముచేయు వారము అగుదుము; మనకు పుణ్యము ఘటిల్లును ఏలయన శాస్త్ర మునందు ఇట్లు చెప్పబడి యున్నది

68. యాంగతిర్యోగయుక్తానాం ।
మునీనా మూర్ధ్వ రేతసామ్ ।
సాగతిః సర్వజంతూనాం
గౌతమీ తీర వాసినామ్..

69. (దీనిఅర్థము) వినుము; ఊర్ధ్వరేతస్కులు అగు మునులు కోట్లకొలది సంవత్సరములపాటు యోగయుక్తులయి అనుష్ఠానము చేసి నవో ఏ ఉత్తమగతి లభించునో - గౌతమీతీరవాసి సకలజంతు (ప్రాణు) లకును (ఆవాసమాత్రముననే) లభించును; స్నానమాత్ర మున ఆ గతి లభించును అనుటలో ఆశ్చర్యమేలేదు.

70. ఈకారణముచే మనము అందరమును ఈ గౌతమమునికి సంకటము కలిగింతము; ఇట్లు యత్నపూర్వకముగా గౌతమీనదిని భూమండలమునకు తీసికొనివత్తుము; మనమూలమున సంకటములలో చిక్కుకొనిన గౌతముడు గౌతమీనదిని భూమికి తీసికొనివచ్చుటతో మనకు లాభము అగును. ("గౌతమి" వాస్తవమున గంగానదియే; గౌతమునిచే కొనిరాబడుటచే అట్లు కొనిరాబడిన ఆగంగానదికే 'గౌతమీ' అని నామము.)

71. నాయనా! వినుము; ఇట్లు అని ఆమునులు ఒకమాయ రచించిరి. దూర్వలతో ఒక పాడిఆవును దాని దూడను నిర్మించి (అవి ప్రాణములుపొంది వాస్తవములగు ధేనువత్సములుగా అయి రాగా) వారు వానిని గౌతముని వరిపైగు పంటలు మేయుటకై పంపిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

72. ఆసమయమునందు గౌతమఋషి అనుష్ఠానమునందు ఉండెను. అతడు తన పొలమునందలి పైరు పంటలు మేయుచుండిన ధేనువు (పాడియావు)ను (దూడనుకూడ) తనకన్నులతో చూచెను. తత్ క్షణమే దాని నివారించు (పొలమునుండి తోలు) టకై తనచేతి దర్భపవిత్రమును విసరివేసెను.

73. ఆదర్భయే శస్త్రముగా అయ్యెను; అదియే వజ్రాస్త్రమో అనునట్లు ఆ ధేనువునకు (ను వత్సమునకును) తగిలెను. అది (అవి) త్వరితముగా మృతిని అందెను. గౌతమునకు గోహత్యాదోషము ఘటిల్లెను.

74. ఎరుగుము; అంతట అచ్చటి సమస్త ఋషిజనులును కలిసి గౌతమునకు ప్రాయశ్చిత్తమును ఇట్లు ఇచ్చిరి; (నిర్ణయించిరి.) నీవు గంగానదిని భూమండలమునకు తీసికొనిరమ్ము. ఇది తప్ప నీకు శుద్ధి కలిగించు ఉపాయము వేరొకటి లేదు.

75. ఈకారణమున గౌతమఋషి సహస్రవర్షములు తపస్సు ఆచరించెను. వ్యోమకేశుడు (ఆకాశమే తన కేశములుగా గలవాడు - పరమశివుడు) ప్రసన్నుడయ్యెను. గౌతమునకు సాక్షాత్కరించెను. వరము అడుగుము అని గౌతమునితో అనెను.

76. గౌతముడు సర్వేశ్వరునితో ఇట్లు అనెను: స్వామీ ! నీవు నాకు వరము ఇత్తువేని - సచరాచర భూలోకమును ఉద్ధరించుటకై ఈభూమండలమునకు గంగానదిని ఇమ్ము.

77. గౌతముని వినతిచే పరమేశ్వరుడు గంగానదికి (భూలోకమునకు పోవుటకు) అనుమతి ఇచ్చెను. మనుష్యుల పాపక్షాళనమునకై గౌతముడు ఆమెను తీసికొని భూమండలమునకు కొనివచ్చెను.

78. ఇటువంటి గంగా భాగీరథీ నదీ మాహాత్మ్యమును వర్ణించుటకు ఎవడు సమర్థుడు అగును ? ఈకారణముననే (ఇంతటి మహామహి

మము కలది కావుననే) నామధారకా! వినుము; శ్రీగురునాథుడు ఈ గౌతమీ గంగానది ఉద్గమించిన స్థానము అగు నాసికాత్ర్యంబకమునకు వచ్చెను.

79. నాయనా! వినుము; ఇటువంటి గౌతమీతట యాత్రను శ్రీగురువులు తాము ఆచరించిరి. అనగా వారు మొదట నాసికాత్ర్యంబక క్షేత్రమునకు పోయి తరువాత అచ్చటినుండి మరల లోకానుగ్రహార్థమయి ఆ గౌతమీనదీతీరమువెంట తీర్థక్షేత్ర గ్రామ సంచారము చేసిరి.

80. నాయనా! నామధారకా! చూడుము; శ్రీగురువులు గోదావరీ తట యాత్ర చేయుచు 'మంజరికా' అను ప్రదేశమునకు వచ్చిరి. అచ్చట 'మాధవారణ్యులు' అను నామమున ప్రఖ్యాతులగు ఒక ముని యుండిరి.

81. వారికి (ఆ మాధవారణ్య యతికి) అనునిత్యమును శ్రీనృసింహమూర్తి మానసపూజ అభ్యాసముగా అనుష్ఠానమునందు ఉండెను. శ్రీగురువులు అక్కడకువచ్చిననాడు ఆ యతి తన అనుష్ఠాన సమయమున తన మానసమూర్తిని ఎట్లు (ఎపుడు) చూచెనో అట్లు (అపుడు) ఆ ముని శ్రీగురువులమూర్తిని చూచెను. (శ్రీగురువుల రూపమే ఆ యతికి సాక్షాత్కరించెను.)

82. ఈ సాక్షాత్కారముతో ఆమాధవారణ్యయతి తన మానసమున విస్మితుడుఅయి శ్రీగురుమూర్తిని నమస్కరించెను. అతి భక్తి భావపూర్వకముగా పరిపరివిధముల నృసింహసరస్వతీ స్వామిని స్తుతించెను.

83. యద్దివ్య పాదద్వయమేవ సాక్షాత్ ।
అధిష్ఠితం దేవనదీ సమీపే ।

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

య ఉత్తరేతీర నివాసి రామో ।
లక్ష్మీపతి స్త్వం నివసన్య నిత్యమ్.

తా. గౌతమీనదీరూపయగు ఈ దేవనదీ (గంగా) సమీపమున ఏమహాత్ముని దివ్యపాదద్వయము సాక్షాత్‌గా అధిష్ఠించియున్నదో - ఏదేవుడు ఈగౌతమీనదికి ఉత్తరపు ఒడ్డున రాముడుగా నివసించుచున్నాడో ఆనిత్యనివాసియగు లక్ష్మీపతివే నీవు.

84. అని ఈవిధముగా మాధవారణ్యయతి హర్షపూర్వకముగా శ్రీగురువులతో మనవి చేసెను. శ్రీగురువులును సంతుష్టులు అయి ఆ మాధవారణ్యులతో ఈ విధముగా పలికిరి :

85. అత్యంత మార్గస్థితి (త) మార్గరూపం
అత్యంత యోగా దధికార (ర్ధ) తత్త్వమ్ ।
మార్గంచ మార్గంచ విచిన్వతో మే ।
మార్గోదయం మాధవ ! దర్శయే త్.

తా. అన్ని సాధనోపాయముల అవధులను అతిక్రమించిన అతి + అంత) ఉత్తమ సాధన మార్గమునందు ఉండువారికి మాత్రమే మార్గ (అన్వేషించి అన్వేషించి దర్శించదగిన - మృగ - అన్వేషణము రూపముకలదియు) మును అత్యంతము ఉత్తమము అగు యోగ సాధనమునకును అతీతమగు అధికోత్తమ వస్తు తత్త్వాత్మకమును అగు నామార్గోదయమును (ఉత్తమ గమ్యము అగు నారూపమును) మాధవారణ్యయతీ! ప్రతిమార్గమునందును అన్వేషించుచున్న (బహువిధ సాధనములతో అనుష్ఠానము సాగించుచుండిన) నీకు దర్శింపజేయుదును.

86. నాయనా ! నామధారకా ! వినుము; శ్రీగురువులు ఆ మాధవారణ్యయతిని ఆశ్వాసించుచు (మనస్సును నెమ్మదిపరచుచు)

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

ఈవిధముగా ఆయతితో పలికిరి; అంతియకాక తమ నిజస్వరూపమును వారిని దర్శింప జేసిరి.

87. ఆమునియు శ్రీగురువుల నిజస్వరూపమును దర్శించి సంతుష్టుడు అయ్యెను. తన హస్తద్వయమును జోడించి వినయపూర్వకముగా మనవి చేయుచు అనేక విధములుగా శ్రీగురువులను స్తుతిచేసెను.

88. జగద్గురూ ! జయ - జయ; (సర్వోత్కృష్టుడవు అయి వర్ధిల్లుచున్నావు; సర్వోత్కృష్టుడవు అయి వర్ధిల్లుచున్నావు) తాము మూర్తిత్రయావతారస్వరూపులు; తాము లోకమునందలి ప్రాణులకు నరుడుగా కనబడుచున్నారు; కాని వాస్తవమున జగజ్జ్యోతిఃస్వరూపులగు పరమ పురుషులు.

89. తాము ఈవిశ్వమునకు అంతటికిని తారకరూపులు; (తరింప చేయుపరమ కారుణికగురురూపులు;) ఈ కారణముననే (లోకములను తరింపజేయుటకే) తాము భూమియందు అవతరించితిరి; నన్ను కృతార్థునిగా చేసితిరి. తమ చరణములను నన్ను (నాచే) దర్శింపజేసితిరి.

90. ఆ తాపసుడు ఈవిధముగా శ్రీగురువులను స్తుతించిరి. అందులకు గురువులు అతిహర్షము చెంది సంతుష్టులుఅయి ఆసమయమున ఆ మాధవారణ్యుని ఇట్లు మనశ్శాంతికరముగా మాటలాడిరి.

91. శ్రీగురువులు ఆ మాధవారణ్య యతివర్యునితో ఈవిధముగా పలికిరి. నీవు ఇంతవరకును ఆచరించిన మంత్ర(పు అనుష్ఠాన)మునకు సిద్ధికలిగినది. నీకు అవశ్యము సద్గతికలుగును. నీకు బ్రహ్మలోకము ప్రాప్తము అగును.

92. నీవు ఇంతవరకును నీమానసమునందే శ్రీనృసింహమూర్తికి మానసపూజ చేయుచున్నావు. ఇకముందునీకు ఆస్వామి ప్రత్యక్షముగనే తన దర్శనమును ఇచ్చును. వినుము. నీమనస్సునందు సంశయము ఏమియు చేయ (కలిగియుండ) కుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

93. నాయనా! వినుము. ఆయతితో ఈవిధముగా పలికి శ్రీగురు వులు అక్కడినుండి బయలుదేరిరి. వాసరబ్రహ్మేశ్వర (బాసర ?) క్షేత్ర మునకు వచ్చిరి. అది గంగా (గోదావరీ మహానదీ) తీరమునందు ఉండిన మహాక్షేత్రము సుమా !

94. గంగా (గోదావరీ) మహానదీతీరమునందలి ఆ మహా క్షేత్రమునందు శ్రీగురువులు తమ శిష్యులతోకూడి నదియందు స్నానము చేయుచుండగా అచ్చటకు విప్రుడు ఒకడు వచ్చెను.

95. ఆతనికి పొట్టనొప్పి అధికముగా ఉండెను. దానిచే ఆతడు ఆనదీతీరమునందు దొరలుచుండెను. నాకు ఉదరవ్యథ అత్యంతముగా ఉన్నది. ప్రాణములను విడుతును. అని ఆతడు ఏడ్చుచుండెను.

96. విషయమువిమి అనిన - ఆతనికి పొట్టయందు నొప్పి చాల అధికముగా ఉండెను. దానిచేత అతడు ప్రతిదినమునను ఉపవాసమే చేయుచుండును. ఏలయన అతడు భోజనము చేసినయెడల అతనికి ఇట్లు ప్రాణాంతకరము అగు దుఃఖము కలుగుచుండును.

97. ఈకారణమున ఆ ద్విజవరుడు సదా ఫలాహారము (పండ్లు మాత్రమే ఆహారముగా తినుచుండుట) చేయుచుండును. ఆతనికి అన్నముతో వైరము ఏర్పడెను. అన్నముతినినచో ప్రాణములు విడువ వలసినదే సుమా ! (విడువబోవుచున్నాడా అని చూచువారికి తోచు నంతగా బాధపడును.

98. పక్షమునకు ఒకసారియో మాసమునకు ఒకసారియో ఆతడు భోజనము చేయును. అపుడు ఆతనికి ఉదరమున ఇటువంటిబాధ కలుగును. ఈవిధముగా ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు ఎన్నియో దినముల నుండి ఇంతవరకును క్లేశపడుచు వచ్చుచున్నాడు.

99. ఈదినమునకు క్రిందటిదినమున ఆగ్రామమునందు మహా నవమి పండుగ జరుపబడెను. ఆఉత్సవసందర్భమునందు ఆతడు మాసము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

నకు ఒకమారుగా తన మనస్సునకు స్వాభావసిద్ధముగా ఇష్టమయినంత మష్టాన్నమును భుజించెను.

100. ఆతడు అచ్చట చాల అన్నమును భుజించెను. దానిచే ఆతడు చాల బాధపడ నారంభించెను. దానితో ఆతడు తట్టుకొనలేక గంగా (గోదావరీనదీ) తీరమున దొరలియాడుచుండెను. ఆతడు ఊరక బాధపడుట కాదు. ప్రాణములు విడుచుచున్నాడా! అనునంతగా దుఃఖపడుచుండెను. త్వరలో అతని ప్రాణములు పోబోవుచుండెను.

101. ఆద్విజుడు అపారమగు దుఃఖము పొందుచుండెను. అతడా దుఃఖములో ఈవిధముగా అనుచుండెను: ఈ గంగ (గోదావరీ నది)లో శరీరము విడుతును. ఈ సంసారము పాప (ఫల) రూపమయి కనబడు చున్నది. ఈవిధమగు ఈసంసారము నాకు ఇపుడు ఇక వలదు.

102. అన్నమే ప్రాణము; అన్నమే జీవనము; అన్నములేనిదే ఏమానవులు ఉండగలరు ? ఇటువంటి అన్నమే నాకు శత్రువు అయినది సుమా (గదా !); ఇట్టిస్థితిలో నాకు ఇపుడు మరణమే మంచిదిగా కన బడుచున్నది.

103. అని ఇట్లు పలుకుచు ఆ బ్రాహ్మణుడు మనస్సునందు ఒక నిర్ధారణము చేసికొని గంగ (గోదావరి)లో ప్రవేశింతును. అని నిశ్చయించుకొని తన పొట్టయందు ఒకరాయి కట్టుకొని గంగా (గోదావరీ) నదీ మధ్యమున (ప్రవేశించుట)కై బయలుదేరెను.

104. ఆతడు ఆసమయమున తన మనస్సులో కర్పూరగౌరుడు అగు పరమశివుని ధ్యానించుచుండెను. అతడు తన మనస్సులో ఇట్లు అనుకొనుచుండెను. నేను భూమికి భారభూతుడనయి జన్మించితిని; నేను పూర్వజన్మములందుకూడ ఎన్నడును అన్నదానాదికము అగు దాన మునుకాని మరి ఏవిధమగు పరోపకారమునుగాని చేసియుండలేదు సుమా !

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

105. నేను ఈ జన్మమునందును పుణ్యము ఏమియు చేసియుండ లేదు; దీనికి ముందు గడచిన నూరుజన్మములయందు ఎప్పుడును కూడ జన్మాంతరములందును పుణ్యము చేసియుండలేదు. నేనుచేసిన పుణ్య (అపుణ్య కర్మముల) ఫలము ఈవిధమయినదిగానే యున్నదని కనబడు చున్నది. మరి అందుచేతనే నేను ఈకష్టములను అనుభవించుచున్నాను.

106. బ్రాహ్మణుని నోటియందలి అన్నమును తీసివేసితినేమో ! లేదా కపిలగోవు నోటియందలి మేతను లాగివేసితినేమో ! విశ్వాస ఘాతము చేసితినేమో ! అందుచేతనే ఆపాపకృత్యములకు ఫలముగ ఈక్లేశములను అనుభవించుచున్నానో ఏమో !

107. ఈశ్వరునిపూజ అపూర్ణముగా చేసితినో ఏమో ! (ఇతరులు చేయుచున్న పూజను సగములో చెడగొట్టుటకాని - తానే చేయు పూజను అలక్ష్యముతో సగములో నిలిపివేయుటకాని చేసితినో ఏమో!) గురువుల నిందచేసితినో ఏమో ! మాతా పితరులను అవజ్ఞ చేసితినో ఏమో ! మరి అందుచేతనే ఈ కర్మఫలము అనుభవించు చున్నాను.

108. అథవా - పూర్వజన్మమునందు నేను ద్విజధిక్కారము చేసి యుందునేమో ! వైశ్వదేవసమయమున అతిథులు రాగా వారికి అన్నముపెట్టి యుండలేదో ఏమో !

109. అథవా - దంపతులను చంపితినో ఏమో ! అడవియందు ఒక్కరిని పెట్టితినో ఏమో ! తల్లిదండ్రులను వేరుపెట్టి వారిని విడిచివేసి నేను ఒక్కడను నా భార్యతో ఉంటినో ఏమో !

110. మాతాపితరులను విడిచివేసి నేనుమాత్రము సుఖముగా వేరై ఉంటినో ఏమో ! పూర్వజన్మార్జితములు అగు ఇటువంటి పాప ములకు ఫలముగానే మరినేను ఈక్లేశములను అనుభవించుచున్నాను.

111. ఈవిధముగా తాను పూర్వజన్మములందు చేసియుందునని ఊహించుచున్న పాపములను జ్ఞాపకము చేసికొనుచు ఆ విప్రుడు గంగ

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

(గోదావరీనది) లోనికి పోవుచుండెను; అపుడు అట్టి స్థితియందున్న ఆతనిని శ్రీగురునాథులు చూచిరి; ఆ బ్రాహ్మణుని సంబోధించి పిలువుడని వారు తమ శిష్యులతో పలికిరి :

112. ఆ బ్రాహ్మణుని ఇటు రమ్మనుడు; రమ్మనుడు; (ఇటకు తీసికొనిరండు. తీసికొనిరండు) ఆతడు సుఖముగా (అనాయాసముగా - ఇచ్ఛాపూర్వకముగా) ప్రాణములను విడుచుచున్నాడు - ఏల ? ఆత్మహత్య మహాదోషకరమయినది; అతడు ఎవరో - ఎవరివాడో అడిగి తెలిసికొనుడు.

113. శ్రీగురువుల వచనమును విని శిష్యులు పరిగెత్తుకొని పోయిరి; వారు ఆద్విజవరుని నదినుండి వెలుపలకు తీసికొని శ్రీగురువుల సమ్ముఖమునకు తీసికొని వచ్చిరి.

114. అనాథులగు వారికి కల్పవృక్షరూపులును సుఖప్రదాయిస్థులగు వారి విషయమున కృపాసముద్రులును అగు శ్రీగురువులు ఆ దుఃఖాక్రాంతుడగు విప్రుని ఇట్లు ప్రశ్నించిరి :

115. శ్రీగురువులు ఆతనితో ఇట్లు పలికిరి: నీవు ఏల ప్రాణములు విడువ బోవుచున్నావయ్యా ! ఆత్మహత్యమహాదోషకరము; నీవృత్తాంతము ఏమియో నాకు చెప్పుము.

116. విప్రుడు శ్రీగురువులతో ఈవిధముగా పలికెను: ఓయతిరాజా ! నావిషయము అడిగి తెలిసికొని మీరు ఏమి చేయుదురు ? జన్మించిన ఈ నా జన్మము వ్యర్థము అయినది; నేను భూమికి భారభూతుడను అయి ఉన్నాను.

117. స్వామీ ! ఏమి చెప్పుదును ? నేను మాసమునకు ఒకసారిగా పక్షమునకు ఒకమారుగా భోజనము చేయుదును; అట్లు అయినను ఉదరవ్యథతో (పొట్టనొప్పితో) బాధపడుచుందును. అది సహించుటకు శక్యముకాక పోవుటచే ప్రాణములను విడుచుచున్నాను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

118. నాకు అన్నమే శత్రువు అయిఉన్నది; అట్లయిఉండగా గురునాథా! ఎట్లు జీవింతును ? సర్వప్రాణుల ప్రాణములును శరీరములును అన్నగతములు; ఇట్టినేను - జగద్గురూ! ఎట్లు జీవింతును ?

119. అది విని శ్రీగురువులు బ్రాహ్మణునితో ఇట్లు పలికిరి: విప్రుడా ! వినుము; నీఉదరవ్యథ పోయినది; అని నమ్ముము. నాదగ్గర ఔషధము ఉన్నది ఒక్కక్షణములోనే నేను నీకు అది చెప్పెదను.

120. ఇపుడు ఇక మనస్సులో ఏమియు సంశయము పెట్టుకొనకుము నీవు నీ అంతఃకరణమునందు ఏమియు భయపడకుము; నీవ్యాధి; పలాయనమయి (పరుగెత్తి)పోవును; కోరికతీరి తృప్తియగునంతవరకు రుచిగల అన్నము తినుము.

121. శ్రీగురువుల వచనము వినినంతనే ఆ విప్రునకు అంతఃకరణమునందు స్థిరనిశ్చయము అయ్యెను; అతడు ఆసమయమున తన శిరస్సును శ్రీగురువుల చరణములపై నిలిపి నమస్కారము చేసెను.

122. నామధారకా! శ్రద్ధగా వినుము; ఇదే సమయమునందు ఆగ్రామమునకు అధికారియగు విప్రుడు ఒకడు గంగా (గోదావరీనదీ) స్నానమునకయి అక్కడకు వచ్చెను.

123. అపుడు ఆ గ్రామాధికారి యగు విప్రుడు శ్రీగురువులను అట చూచెను; (అతనికి అచ్చట శ్రీగురువుల దర్శనము అయ్యెను.) అతడు వచ్చి శ్రీగురువుల చరణములపై పడి వారికి మనోవాక్కాయకర్మములతో భక్తితో నమస్కరించెను.

124. ఆసమయమున శ్రీగురువులు ఆ వచ్చిన అధికారి విప్రుని ఆశ్వాసించి (అతని మనస్సునందు ఆర్తియుండుట ఎరిగి అది ఉపశమించునట్లు మాటలాడి) చంద్రమౌళి రూపులును యతిసమూహమునకు కిరీటమువంటివారును అగు శ్రీగురువులు అతనిని నీనామము ఏమి? ఏస్థలమునందు నీ నివాసము ? నాకు చెప్పుము. అని వారు అతనితో పలికిరి.

125. శ్రీగురువుల వచనము విని ఆ బ్రాహ్మణుడు వారితో ఇట్లు పలికెను: నాది కౌండిన్యగోత్రము; నేను ఆపస్తంబ శాఖకు చెందిన వాడను.

126. నా నామము 'సాయందేవుడు' అయియున్నది. నా నివాస స్థానము 'కడగంచి' అను గ్రామము. ఉదరపూరణమునకై ఇక్కడకు వచ్చి యున్నాను. (అందులకై) యవనులసేవ చేయుచున్నాను.

127. స్వామీ! వినుడు; ఈ గ్రామమునకు అధికార పదము నందు ఒక సంవత్సరకాలమునుండి ఇక్కడ నివసించుచున్నాను. తమ దర్శనమాత్రముచేతనే నేను ధన్యుడ నయితిని. ధన్యుడ నయితిని.

128. తాము విశ్వసించినవారలకు (విశ్వమునకు అంతటికిని) తారకరూపులు (తరింపజేయువారు); నాకు తాము తమదర్శనము ఇచ్చితిరి. నేను నిశ్చితముగా ధన్యుడను అయితిని. నాజన్మాంతరీయ దోషములు అన్నియు పోయినవి.

129. ఎవరివిషయమున తమ అనుగ్రహము కలుగునో అతడు ఈసంసార సాగరమును తరించును. స్వామీ! అప్రయత్నముగా తాము నాకు తమ దర్శనము ఇచ్చి(అనుగ్రహించి)తిరి.

130. గంగా పాపం శశీ తాపం దైన్యం కల్పతరు స్తథా।
పాపం తాపంచ దైన్యంచ। హరే చ్ఛ్రీగురు దర్శనమ్.

131. గంగనుదర్శించినంతనే పాపములు (నశించి) పోవును. చంద్రుని దర్శించుటచే (శారీరక) తాపములు నశించును. కల్ప వృక్షమును దర్శించుటచే కలుగు ప్రయోజనవిధము విలక్షణమయినది. అది కల్పవృక్షదర్శనము దైన్యమును పోగొట్టును. అని ఎరుగుము.

132. తమ దర్శనముచే కలుగుఫలము అటువంటిది కాదు. తమ చరణములను దర్శించితిని కదా! అవి పాపమును తాపమును

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

దైన్యమును కూడ పోగొట్టుమహిమ కలవి. అందుచే నేను చతుర్వర్గ (ధర్మార్థకామమోక్ష) ఫలములను పొందితిని.

133. ఈ విధముగా స్తోత్రముచేసి ఆ సాయందేవుడు మరలను శ్రీగురుచరణములపై వ్రాలి నమస్కరించెను. శ్రీజగద్గురువులు అతనిని ఆశ్వాసించి (మనస్సును సమాధానపరచి) ఆ సమయమున అతనితో ఇట్లు సెలవిచ్చిరి. (అనుగ్రహముతో పలికిరి.)

134. శ్రీగురువులు అతనితో ఇట్లు పలికిరి. సాయందేవా! నా వాక్యమును వినుము. ఈ బ్రాహ్మణునకు ఉదరవ్యథ (కడుపునొప్పి) ఉన్నది. దానిచే అతడు ప్రాణములను వదలుచున్నాడు.

135. ఈతనివ్యాధికి ఉపశమనము కలుగుటకై తగిన ఔషధము నీకు చెప్పుచున్నాను. ఈ బ్రాహ్మణుని మీ గృహమునకు తీసికొని పోయి ఈతనికి మృష్టాన్నములతో భోజనము చేయించుము.

136. ఆ అన్నమును తినినచో ఈతనికి ఈ ఉదరవ్యథ కాని వ్యాధికాని సర్వథా (ఎంతమాత్రమును) ఉండవు. ఈతనిని నీవెంట నీగృహమునకు త్వరితముగా తీసికొనిపొమ్ము. ఈ విప్రుడు క్షుధాక్రాంతుడై (ఆకలితో వ్యాప్తుడై) ఉన్నాడు.

137. శ్రీగురువులు పలికిన వచనము విని సాయందేవుడు తన చేతులు రెండును జోడించి వారితో ఈ విధముగా మనవి చేసెను. భోజనము చేసినంతనే ఈ బ్రాహ్మణునకు ప్రాణత్యాగము అగును.

138. ఈతడు మాసకాలమునకు ఒకసారి భోజనము చేయును. అయ్యా! వినుడు; దానిచే ఈతని ప్రాణములుపోవును. చూడుడు; ఈ బ్రాహ్మణునకు అన్నముపెట్టినచో త్వరితమే బ్రహ్మహత్యాదోషము ఘటిల్లును.

139. అనగా విని శ్రీగురువులు సాయందేవునితో ఇట్లు పలికిరి: నేను ఈతనికి (ఈతని బాధలు ఉపశమించునట్లు) ఔషధము ఇత్తును

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

నీవు మాత్రము ఇతనికి మినుప గారెలును క్షీరమిశ్రిత పరమాన్నమును చేయించి వానితో కూడ మృష్టాన్నము పెట్టించి తినిపించుము.

140. సాయందేవా ! వినుము; ఈతడు ఆ అన్నమును తిని నంతనే త్వరితముగా వ్యాధి తగ్గిపోవును. మానసమునందు సంశయము పెట్టుకొనకుము. ఈతనిని త్వరితముగా మీ ఇంటికి తీసికొనిపొమ్ము.

141. ఆ సమయమున సాయందేవుడు శ్రీగురువుల వచనమును అంగీకరించి వారి చరణకమలములందు తన మస్తకమును నిలిపెను. (నమస్కరించెను) అంతియకాక జాలిగొలుపు కంఠస్వరముతో ఆతడు శ్రీగురువులతో "స్వామీ ! తాము మా గృహమునకు భిక్షకు దయచేయవలయును." అని మనవి చేసెను. (ప్రార్థించెను.)

142. నామధారకా ! శిష్యోత్తమా ! నామాట వినుము; శ్రీగురునాథులు సాయందేవుని ప్రార్థనమును అంగీకరించిరి. వారు అతనితో "మేము ఇప్పుడే రావలసిన త్వరితము ఏమయ్యా !" అని అతనితో పలికిరి. అని సిద్ధుడు పలికెను.

143. ఆ సమయమున నేను కూడ అక్కడ ఉంటిని. శ్రీగురువులు సకల శిష్యులతో కూడినవారయి - జఠర (ఉదర) వ్యథ (బాధ) కల ఆ వ్యాధిగ్రస్త విప్రుడును తమదగ్గరనే యుండగా భిక్షకై సాయందేవుని గృహమునకు పోయిరి.

144. నాయనా ! వినుము; అపుడు ఆతని ఇంట చాల విచిత్రమగు సంఘటనము జరిగెను, ఆ సాయందేవుని ధర్మపత్ని పతివ్రతయు నగు 'జాఖా ఈ' (జాఖమ్మ) అనునామె పరి పరి విధములుగా శ్రీగురునాథుని పూజించెను.

145. నాయనా ! వినుము; ఆమె శ్రీగురువులను షోడశోపచారములతో పూజచేయుచునే అదే విధముగా వారి శిష్యులమగు మమ్ములను కూడ పూజించి అందరకు నమస్కరించెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

146. ఆతను (ఆ సాయందేవుడు) శ్రీగురువులకు అతి విచిత్రమును షోడశోపచారములు, అతిగహనమును (గంభీరము - లోతయిన దది - ఎంతయో భక్తితాత్పర్యాది భావములతో నిండినదియు) అగు పూజా విధానమును ఆచరించెను. ఒక్కొక్కరికి వేరువేరుగా రక్త వర్ణములు అగు కుండలములను ఏర్పరచెను.

147. నాయనా ! వినుము; సాయందేవుని పత్ని అష్టదళ పద్మములను ముగ్గులతో వేసెను. అవికాక ఇంకను నానావిధములగు రంగవల్లులను వేసెను. ఐదు వన్నెల చిత్రావళులను (బొమ్మల ముగ్గులను) వేసెను.

148. శ్రీగురువులకును అదేవిధముగ మిగిలిన అందరకును చిత్రాసనములను పరచెను. యథావిధి విధానమున పుష్పగంధాక్షతములతో మండల (ప్రదేశ) ములనుకూడ అర్చించెను.

149. సాయందేవుడును ఆతని పత్నియు విధివిధానానుసారము సంకల్పముచేసి శ్రీగురువులకును ఇతరులకును కూడ అష్టాంగపూర్వక నమస్కారము చేసిరి. వారి వారి చరణములపై తమ తలలు మోపి తరువాత అష్టాంగములతోను వారి చరణములను స్పృశించిరి.

150. వారు విధివిధానమున షోడశోపచారములతో శ్రీగురువులను అర్చించు క్రమమున ఆ సమయమున శ్రీగురువుల చరణములను రుద్రసూక్త మంత్రము పఠనపూర్వకముగా పంచామృతములతో స్నానము చేయించిరి.

151. ఆ సాయందేవుడు అను ఆ విప్రుని జ్ఞానము ఎంతగొప్పదియో చూడుము; ఆతను అతిహర్షముతో శ్రీగురువులను షోడశోపచారములతో అర్చనచేయుచునే శ్రీగురుచరణతీర్థమును (ఒకపాత్రలోనికి తీసికొని ఉంచెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

152. గీతవాద్యధ్వనులతోను ఆనందపూర్వకముగాను పరమ భక్తితోను ఆ శ్రీగురుచరణ తీర్థమునకును షోడశోపచార పూజలను జరిపి ఆరతి ఇచ్చి నీరాంజనము జరిపించెను.

153. ఇట్లు విధివిధానమును అనుసరించి అతిజాగ్రతతోను భక్తితోను అనుక్రమమున గురువుల నర్చించిన తదుపరి మరల శ్రీగురువులకు షోడశోపచారపూజలను జరిపెను.

154. ఆ దంపతులు శ్రీగురువులకు అనేకవర్ణముల జ్యోతులతో కూడిన ఆరతులతో నీరాంజనము చేసిరి. అతిభక్తిపూర్వకముగా వేద మంత్రధ్వనులతో కూడ శ్రీగురువులకు పుష్పాంజలి (మంత్రపుష్పము) సమర్పించిరి.

155. సాయందేవుడు శ్రీగురువుల సంనిధిలో అనేక విధములుగ గానము జరిపెను. ప్రీతిపూర్వకముగా నమస్కారము చేసెను. ఆతని భార్యయు మహాపతివ్రత; ఆమెతో కూడి సాయందేవుడు ఇట్లు అంతయు జరిపెను. (ఆ ఉభయులును ఇట్లు శ్రీగురుపూజా విధానమును జరిపిరి.)

156. నాయనా ! వినుము; అతడు ఈ విధముగా అతిభక్తితో శ్రీగురువులకు పూజ చేసెను. అదియే విధముగా శ్రీవారి శిష్యులము అగు మాకు అందరకును నమస్కారము చేసెను.

157. ఈ పూజలు అందుకొని శ్రీగురుమూర్తి సంతోషించి అతిప్రీతితో ఆ దంపతులకు వరములను ఇచ్చిరి. "సాయందేవా ! నీ సంతతి లోకమున విఖ్యాతినందును. నీ వంశమున పరంపరాక్రమమున (తరతరములుగా) శ్రీగురుభక్తి నిలిచియుండును.

158. "శ్రీగురువుల తత్త్వమును నీవు ఎరుగుదువు; నీ వంశము గోత్రము తర తరముల క్రమమున అభివృద్ధి యుండును. మీకు పుత్త్రపౌత్త్రులు జనింతురు. వారు సంతోషముతో నుందురు. వారితో నీవు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

(మీారును) ను సంతోషముతోనుందువు. (నుందురు.) ఈ విధముగనే మీా వంశమున గురుభక్తియు నిలిచియుండును.

159. శ్రీగురువులు అత్యంత హర్షముతో ఆ (సాయందేవుడను) బ్రాహ్మణునితో పలికి ఆ దంపతులను ఆశీర్వదించిరి. అటు తరువాత సాయందేవుడు శ్రీగురువులకు నమస్కారముచేసి విస్తళ్లు వేసెను.

160. నానావిధములగు పక్వాన్నములను (పిండివంటలను) మినుప గారెలు మొదలగు అపూపములను అష్టవిధములగు శర్కరా సహితములగు పరమాన్నములను నివేదించెను.

161. నాయనా! వినుము; నానావిధములగు శాకపాకములను సవిస్తారముగా సాయందేవ ఆ దంపతులు వడ్డించుచుండిరి. శ్రీగురుమూర్తి ప్రీతిపూర్వకముగ భుజించుచుండిరి.

162. జఠరవ్యథ (కడుపునొప్పి) తో బాధపడుచుండిన ఆ బ్రాహ్మణుడు పరిపూర్ణముగా భోజనము చేసెను. శ్రీగురువుల కృపా దృష్టి ప్రసారముచే తక్షణమే ఆతనివ్యాధి ఉపశమించిపోయెను.

163. నాయనా! వినుము; లోహ (ఇనుము - రాగి - ధాతువు) మునకు స్పర్శవేది తగులగనే తత్‌క్షణమే అది సువర్ణము అగును. శ్రీగురువుల దర్శనము అయినప్పుడు వ్యాధి ఎట్లుండును? నాకు చెప్పుము.

164 దినకరు (సూర్యు)ని ఉదయము అగుచునే అంధకార సంహారము అగును కదా! ఎవనికి (ఎవనిపై) శ్రీగురుకృప ప్రసరించునో ఆతని ఇంటిలో దైన్యము ఎక్కడిది?

165. శ్రీగురునాథులు ఈవిధముగా తమ శిష్యులతోకూడి భోజనము చేసిరి. అపుడు అచ్చట (ఆ సాయందేవుని గృహమునందు) మిగుల ఆనందానుభవము జరిగెను. సకలజనులును ఆనాటి సంఘటనము చూచి చాల ఆశ్చర్యపడుచుండిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

166. ఇంతవరకును ఈ బ్రాహ్మణునకు అన్నము శత్రువుగా ఉండెను కదా ! అతనికే ఆ అన్నమే ఇపుడు ఔషధము అయినది. శ్రీగురువుల కృపచే ఆతనివ్యాధి తొలగిపోయినది చూడుడు; అని సకల జనులును ఇది అపూర్వము కదా ! యని ఆశ్చర్యపడుచుండిరి.

167. ఇంతయు చెప్పి సిద్ధుడు నామధారకునితో ఇట్లు పలికెను: ఎవనికి శ్రీగురుకృప లభించునో - అట్టివానికి జన్మాంతరమునందలి దోషములును తొలగిపోవును; దేహామునందలి వ్యాధులు ఎక్కడివి ? (జన్మాంతరీయము లగు అమూర్తమగు సూక్ష్మ (లింగ) దోషము దేహాము నాశ్రయించి అనుభవించువరకు తీరక జీవునివెంట నుండునవి. అవియే తొలగినపుడు మూర్తమగు ఈస్థూలదేహాము నాశ్రయించి యుండు మలినములవంటి వ్యాధులు తొలగుటలో వింతలేదు.)

168. తనగురువు సిద్ధునివలన వినిన శ్రీగురుచరిత్రమును గంగాధరుని కుమారుడగు సరస్వతి (నామధారకుడు) విస్తారపరచి చెప్పుచున్నాడు. ఈ చరిత్రము సాక్షాత్ కామధేనువే; శ్రోతలారా ! ఇది ఏక (ఏకాగ్ర)చిత్తులయి వినుడు.

169. ఎవరు దీనిని భక్తితో వినెదరో - వారికి ఈలోకమునందు (ప్రసిద్ధముగా) వ్యాధులు నశించును; వారు అఖిల సౌఖ్యములను పొందెదరు; అని తెలిసికొనుడు. ఈమాట సత్యము - సత్యము - మరల (మూడవమారుకూడ) సత్యము.

ఇది పరమకథా కల్పతరువు అయి సిద్ధనామధారక సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు శ్రీగురువులు కారంజనగరమునకు వచ్చుట, విప్రుని ఉదరవ్యాధిని పోగొట్టుట అను త్రయోదశాధ్యాయము.

సంఖ్య - 169

# శ్రీ గురు చరిత్రామృతము

## పదునాలుగవ అధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః

1. శ్రోతలారా ! చూడుడు; (అవధానముతో వినుడు); శిష్యుడగు నామధారకుడు (సరస్వతి) కుతూహలముతో సిద్ధయోగితో మరల మనవి చేసెను : ఏమియనిన - అతడు తన గురుని అతిశిష్టమగు ప్రశ్నము అడిగెను; దానిని ఏకచిత్తులు (ఏకాగ్రచిత్తులు) అయి వినుడు.

2. జయ జయ యోగీశ్వరా ! సిద్ధమూర్తీ ! జ్ఞానసాగరా ! మీరాదటికథను నాకు విస్తారపరచి తెలుప ప్రార్థించుచున్నాను. దాని(ని వినుట)చే నాకు జ్ఞానము ఉదయమందును.

3. శ్రీగురువులు ఉదరవ్యథతో బాధపడుచుండిన బ్రాహ్మణుని విషయమున దయతో ప్రసన్నులయిరి అని తెలిపితిరి గదా ! తరువాతి కథ ఏవిధముగా ప్రవర్తిల్లెనో నాకు విస్తారపరచి తెలుపవేడుచున్నాను.

4. శిష్యుని వచనమును విని సిద్ధుడు సంతోషము పొందెను; శ్రోతలారా ! తెలిసికొనుడు; కామధేనువు అగు శ్రీగురుచరిత్రమును అతడు తన శిష్యుడగు నామధారకునకు విస్తారపూర్వకముగా ఇట్లు చెప్ప నారంభించెను.

5. శిష్య శిఖామణీ ! వినుము; శ్రీగురువులు తాము ఏ బ్రాహ్మణుని ఇంటియందు భిక్షాస్వీకారము చేసిరో - అతని విషయమున సంతుష్టులు అయి ప్రసన్నులుఅయిరి; వారు అతనియందు అనుగ్రహము చూపిన విధము వినుము.

6. వారికి అతనియందు అనుగ్రహము ఏల కలిగెనో వినుము; గురుభక్తికి గల విధానమురీతి ఎటువంటిదియో ఆవిషయమును ఆ ద్విజ

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

12. నా వంశ పరంపరయందు నిశ్చయముగ తమయందు భక్తిని వరముగా ఈయ ప్రార్థించుచున్నాను. ఇహలోకమున పుత్త్రపౌత్త్రు లను, సుఖములను, ఊర్ధ్వలోకములందు సద్గతిని ఈయ ప్రార్థింతును.

13. ఇట్లు మనవిచేసి సాయందేవుడు మరల కూడ జాలిగొలుపు మాటలతో ఇట్లు వినయముగ పలికెను: స్వామీ! నేను యవనుని వాకిట కొలువు చేయుచున్నాను. ఆతడు మహాశూరుడును, క్రూరుడును.

14. వాడు ప్రతి సంవత్సరమునను బ్రాహ్మణులను సజీవముగా హింసించి వారి ప్రాణములు తీయుచుండును. ఈ కారణముచేత నే ఈనాడు వాడు నన్ను పిలువనంపినాడు.

15. నేను ఇపుడు వానిదగ్గరకు పోయినచో వాడు నా ప్రాణ ములు తీయును. కాని ఇపుడు నాకు మీ చరణముల దర్శనము లభించి నది. నాకు ఇక మరణము ఎక్కడిది?

16. ఆ మాటలు విని శ్రీగురుమూర్తి సంతోషించి అభయ ప్రదములగు తన హస్తములను ఆ సాయందేవవిప్రుని మస్తకముపై ఉంచుచు "నీవు ఏమియు చింతచేయవలదు" అనిరి.

17. నీవు ఏమాత్రమును చింతించక భయమును విడిచి నీవు యవనుని కడకు వెళ్లవచ్చును. క్రూరుడగు ఆ యవనుని దర్శించ వచ్చును. ఆతడు సంతోషించి ప్రీతిభావముతో నిన్ను మరల నాదగ్గ రకు పంపును.

18. ఎప్పటివరకు నీవు మా దగ్గరకు తిరిగి మరలి వత్తువో - అంతవరకును నేను తప్పక ఇక్కడనే ఉందును. నీవు మరలి ఇక్కడికి వచ్చిన మీదటనే నేను సంతోషముతో ఇక్కడినుండి పోయెదను.

19. నీవు నాకు నిజభక్తుడవు అయిఉన్నావు. నీవంశ పారంపర్య మున నీ వంశీయులందరును ఇట్లే నాకు భక్తులుగా ఉందురు. నీవు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

వంశపారంపర్యమున సకలాభీష్టములను పొందెదవు. నీ సంతతియు మిగుల వర్ధిల్లును.

20. నీ వంశపరంపరలో అందరును పుత్త్రపౌత్త్రులతో కూడి సుఖవంతులయి ఆనందింతురు. వారి ఇండ్లయందు అఖండమగు లక్ష్మి నిలుచును. వారు అందరును నీరోగులు (రోగరహితులు)ను శతసంవత్సరములు ఆయుష్య కలవారునగుదురు.

21. శ్రీగురువుల వలన ఇటువంటి వరములను పొంది సాయందేవుడు అను ఆ బ్రాహ్మణుడు బయలుదేరెను. ఆ యవనుడు ఎక్కడ ఉండెనో అక్కడకు త్వరితముగా పోయి వానిదగ్గరకు చేరెను.

22. నాయనా! వినుము; కాలాంతకుడు (ప్రళయకాలమున ప్రాణులను అంతమొందించువాడు) అగు యముడు ఎట్టివాడో - ఆ యవనుడును అట్టివాడు; చాల దుష్టుడు; వాడు ఈ బ్రాహ్మణుని ఎట్లు చూచెనో తెలియునా? ఈతనిచూచుచునే వాడు జ్వాలారూపుడు అయి మండిపడెను.

23. ఆ యవనుడు సాయందేవునిచూచి కోపము పూనుచు విముఖుడు (పెడమొగము పెట్టినవాడు - మొగము ప్రక్కకు త్రిప్పుకొనినవాడు) అయి ఇంటిలోనికి పోయెను. విప్రుడు - ఈసాయందేవుడు అదిచూచి భయచకితుడు అయ్యెను. ఆతడు తన అంతఃకరణములో శ్రీగురువులను ధ్యానించసాగెను.

24. ఉసులు పురుగు (రెక్కలు వచ్చిన చెదపురుగు) నకు కోపమువచ్చును గాక! అయినను అది అగ్నిని ఎట్లు తాకును? ఎవరియందు శ్రీగురుకృప ఉండునో - వారిని క్రూరులును దుష్టులును ఏమిచేయగలరు?

25. గరుత్మంతుని పిల్లలను (చిన్నవానినే) అయినను - సర్పము ఎట్లు తినును? ఆ విధముగనే ఈ సాయందేవ బ్రాహ్మణుని యందును శ్రీగురువులకృప యున్నది.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

26. ఐరావత గజము ఇంద్రుని వాహనమే అగుగాక ! అది ఏ సింహమును ఐనను ఎట్లు తినును ? ఎవనియందు శ్రీగురుకృప యుండునో - వానికి కలికాలమువలని భయము లేదు.

27. ఎవని హృదయమునందు శ్రీగురుస్మరణము నిలిచియుండునో - వానికి దారుణములగు భయములు మాత్రము ఎక్కడివి ? అట్టి వానిని కాలమృత్యువు (రాదగు సరియగు సమయమునవచ్చు మృత్యువు)కూడ అతనిని బాధించజాలదు; అపమృత్యువు (కాలముగాని కాలమున వచ్చు ఆకస్మిక మృత్యువు) ఏమిచేయును ?

28. ఎవనికి ఈ చెప్పిన విధమున ఏ మృత్యువు వలనకాని భయములేదో - అట్టివానికి యవనుడు అనినను భయము ఎందులకు ? ఎవని విషయమున శ్రీగురుకృపయుండునో - అట్టివానికి యమునివలన గాని అట్టివారివలన మరి ఎవరివలనగాని భయము కలుగవలసినపనిలేదు.

29. ఈ చెప్పిన విధమున ఆ యవనుడు తన అంతఃపురములోనికి పోయి భ్రాంతుడై (తాను ఏమి చేయవలసినదియు - చేయుచున్నదియు - తెలియక) గాఢనిద్ర పోయెను. వానికి ఆ సమయమున తన శరీరపు స్మృతియే లేకుండెను.

30. అంతలో వానికి హృదయజ్వాల (గుండెలోమంట) కలిగెను; నాయనా ! నామధారకా ! వినుము; వాడు ఆ మంటతో మెలకువ వచ్చి ఆ సమయమున ప్రాణాంతకమగు ఆ హృదయజ్వాలా వ్యథతో చాల బాధ పడనాగెను.

31. వాడు ఇట్లు బాధ పడుచు బాహ్యస్మరణము ఏమియు లేక ఇట్లు కలవరించ నారంభించెను : "చూడుడు; ఒకానొక బ్రాహ్మణుడు శస్త్రములతో నా అవయవములుకోసి నన్ను చంపుచున్నాడు సుమా !"

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

32. అంతలో అదే సమయమున వానికి కొంతస్మృతి (జ్ఞానము) వచ్చెను. వాడు వెంటనే సాయందేవ బ్రాహ్మణుని దగ్గరకు పోయెను. ఆతని చరణకమలములపై పడి దొరలి యాడెను. స్వామీ ! నీవే నాకు (శరణము) అనెను.

33. నిన్ను ఇక్కడకు ఎవరు రప్పించిరి? త్వరితముగా నీవు మరలిపొమ్ము; అని పలుకుచు ఆ యవనుడు సాయందేవునకు వస్త్రము లును భూషణములును ఇచ్చి అపుడు అతనిని ఇంటికి తిరిగి పోవుటకు అనుమతించెను.

34. ద్విజవరుడు (బ్రాహ్మణ శ్రేష్ఠుడు) అగు ఆసాయందేవుడు సంతోషించి చాల శీఘ్రముగా తన గ్రామమునకు మరలి వచ్చెను. సాయందేవుని అప్పటి నివాసమగు 'వాసరము' అను ఆ గ్రామము (గంగా) (గోదావరి) యొడ్డున నున్నది; అచ్చట అతడు మరల శ్రీగురుచరణ ములను దర్శించెను.

35. అతడు అచట అల్లు శ్రీగురువులను దర్శించి భావ భక్తి పూర్వకముగా వారిని నమస్కరించెను. అనేక విధములుగా స్తుతించెను. జరిగిన వృత్తాంతము ఆద్యంతమును అతడు శ్రీగురువులకు చెప్పెను.

36. శ్రీగురుమూర్తియును సాయందేవుడు చెప్పిన వృత్తాంత మంతయును విని సంతోషించి ఆ బ్రాహ్మణుని ఆశ్వాసించిరి. (ఓదార్చిరి; నీకు ఇకముందు ఏమియు క్లేశములు కలుగవు. అని సమా ధానపరచిరి.) అంతేకాక నానా స్థానములయందు ఉన్న తీర్థక్షేత్రము లకు యాత్రచేయుటకు తాము దక్షిణదేశమునకు పోవుచున్నారు అనియు చెప్పిరి.

37. శ్రీగురువులు పలికిన వచనమును విని సాయందేవుడు చేతులు జోడించి ఇట్లు మనవి చేసెను: ఇపుడు ఇక తమచరణముల

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

(సేవ) ను మరువ (విడువ) జాలను; తమవెంట నేనును వత్తును; (తమ పాదములను సేవించుచుందును.)

38. అయ్యా ! అవధరించుము; తమ చరణములను విడిచి ఒక క్షణకాలము కూడ నేను ఉండజాలను. సంసార సాగర తారకా ! కృపాసింధూ ! నాచిత్తవృత్తిని తామే చూచుచున్నారు కదా !

39. సగర పుత్రులను ఉద్ధరించుటకు గాను గంగానది భూమికి దిగివచ్చినది. అదే విధముగా మమ్ములను తరింపజేయుటకై స్వామీ ! మాకు తాము తమ దర్శనమును ప్రసాదించితిరి.

40. భక్త వత్సలులు అని తమకు ఖ్యాతి కలదు కదా ! అటువంటితాము నన్ను విడుచుట ఏమి న్యాయము ? నేనును నిశ్చితముగా తమవెంట వత్తును. అని పలుకుచు సాయందేవుడు శ్రీగురువుల చరణములను అంటి నమస్కరించెను.

41. ఆ సాయందేవ విప్రుడు పవిత్ర తత్పరభావముతో శ్రీగురువులకు ఈ విధముగా మనవిచేసెను. అతని వినయమునకు సంతోషించి శ్రీగురుమూర్తి ఆసమయమున ఆ బ్రాహ్మణునితో ఇట్లు పలికిరి.

42. నేను కార్యార్థమై (లోకోద్ధరణ ప్రయోజనసిద్ధికై) వెళ్లవలసియే ఉన్నది. దక్షిణదిశయందు అనేక పుణ్యతీర్థములు ఉన్నవి. ఇప్పటినుండి పదునైదు సంవత్సరముల తరువాత మరల నీకు నాదర్శనము ఇచ్చుట జరుగవలసియున్నది.

43. అపుడు నేను మీ గ్రామమునకు సమీపమునందే వాసము చేయుచుందును. ఇది నిశ్చితము. అపుడు నీవు కలత్ర పుత్ర భ్రాతృజనముతోను ఇష్టజనులతోను కూడి నా దర్శనము చేసికొందువుగాని.

44. చింతచేయకుము; సుఖముగా ఉండుము; నీకుగల సకలారిష్టములును సకల దుఃఖములును తొలగిపోయినవి. అని శ్రీగురువులు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ఆతని మస్తకమున తనహస్తమును ఉంచిరి. ఆ సమయమున అతనికి మాట ఇచ్చిరి.

45. శ్రీగురువులు (సాయందేవు) ఆతనితో ఇట్లు పలికి ఆతనిని సంతోషపరచి ఎందు ఆరోగ్యభవానీదేవి కలదో - ఆ వైద్యనాథ మహాక్షేత్రమునకు పోవుటకై అక్కడినుండి బయలుదేరిరి.

46. శ్రీగురువులు సమస్త శిష్యులతో కూడి అక్కడినుండి బయలుదేరి పోవుచు త్రోవలో వచ్చు సకల తీర్థములను దర్శించుచు వైద్యనాథక్షేత్రము చేరిరి. ఆ క్షేత్రము చాల ప్రసిద్ధమయినది. అచ్చట శ్రీగురువుల నామము చాల ప్రసిద్ధముకాసాగెను. అచ్చట గుప్తరూపమున (అదృశ్యరూపులయి) ఉండిరి.

47. ఇంతవరకును సిద్ధయోగి చెప్పినది విని నామధారకుడు ఆ సిద్ధయోగితో ఇట్లు మనవి చేసెను; శ్రీగురువులు అచ్చట గుప్తరూపులు అయి ఉండుటకు హేతువు ఏమి ? వారికి అనేకులు శిష్యులు ఉండిరి కదా ! వారు వారిని అందరను ఆ సమయములో ఎక్కడ ఉంచిరి ?

48. గంగాధరుని నందనుడు (కుమారుడు) అగు సాక్షాత్ కామధేనువే అగు శ్రీగురుచరిత్రమును చెప్పెను. ఇది యంతయు సిద్ధయోగి నామధారకునకు (గంగాధరపుత్రుడగు సరస్వతికి) విస్తార పరచి చెప్పినట్టిదియే.

49. ఇకమీదట చెప్పబోవు శ్రీగురు కథావిస్తారము అపారముగా విచిత్రము అయినది. ఓ సకలశ్రోతలారా ! తమ మనస్సులను ఏకాగ్రములుగ చేసికొని వినవలసినదిగా ప్రార్థించుచున్నాను.

ఇది పరమకథా కల్పతరువు అయి సిద్ధనామధారక సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహ సరస్వత్యుపాఖ్యాన రూపమగు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

శ్రీగురుచరిత్రామృతమునందు శ్రీగురువులు క్రూర యవనుని శాసించుట-సాయందేవునకు వరములు ఇచ్చుట-అను చతుర్దశాధ్యాయము.

విశేషము : ఈ అధ్యాయమున పదమూడవ ఊర్మి (ఓవీ) యందు చెప్పబడిన యవనుడు (ముస్లిము పాలకుడు ఎవరు అనునది చారిత్రకముగ తెలియవలసిన విషయము. ఈతడు విజయపురము ప్రధానస్థానముగానుండిన బీజపూరు బహమనీ సుల్తానులలోనివాడో ఆతని క్రింద దేశభాగమును పాలించుచుండిన మరియొకడో తెలియదగి యున్నది.

మరియు సాయందేవుడు శ్రీగురువులను దర్శించినది గోదావరీ తీరస్థమగు వాసరబ్రహ్మేశ్వరక్షేత్రము అనబడు 'బాసరి'లో; అప్పటికి సాయందేవుడు తన సేవాధర్మమున తాత్కాలికముగా అచ్చటికి వచ్చుటకాక ఆ గ్రామమునందే సకుటుంబముగా నివసించుచున్నట్లు ఈ శ్రీగురుచరిత్ర కథాంశమువలన తెలియుచున్నది. కాని ఆతని అనువంశిక నివాసస్థానము గాణగాపుర సమీపమునందలి కడగంచి యను గ్రామము. శ్రీగురువులు ఈ అధ్యాయాంతమున నాటినుండి పదునైదు సంవత్సరముల తరువాత నీ గ్రామ సమీపముననే నివసింతును అని చెప్పినదాని అర్థము ఇదియే.

సంఖ్య 49

# శ్రీ గురు చరిత్రామృతము

## పదునైదవ అధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః

1. సిద్ధయోగి నామధారకునితో ఇట్లు పలికెను: శిష్యా! నామధారకా! వినుము; నీ వాక్కు ధన్యము అయినది; ధన్యము అయినది. అవధరించుము; నీకుగల భక్తి శ్రీగురుచరణములయందు లయమును పొందినది.

2. నీవు నన్ను ఒక విషయము అడిగితివి; దానితో నా మనస్సు సంతోషము కలది అయినది. శ్రీగురువులు వైద్యనాథ మహాక్షేత్రమున శ్రీగురువులు గుప్తరూపులు అగుటకు కారణము ఏమి? అంటివి; చెప్పెదను. ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

3. గురువులు అచ్చట ఉండిన కాలమున వారి మహిమము చాల అధికముగా ప్రకటితము అయ్యెను. అందుచే అమిత సంఖ్యగల లోకులు (జనులు) అమితముగా వారిని సేవించ (ఆశ్రయించ-భజించ) సాగిరి. తమ కామితార్థములు నెరవేరును అని సమస్తజనులును శ్రీగురువుల దర్శనమునకై వచ్చుచుండిరి.

4. సాధువులు అసాధువులు (సజ్జనులు - అసజ్జనులు) ధూర్తులు సకలజనులును సమస్తజనులును శ్రీగురువుల యొద్దకు వచ్చుచుండిరి. దుష్టములగు కలియుగ ప్రభావము నశించుచున్నది ఆయెను. తత్ప్రభావమున (కాబోలును) ప్రతియొక్కరును తాను శ్రీగురువులకు శిష్యుడను అగును; అని చెప్పుచుండెను.

5. నాయనా! చూడుమోయీ! పూర్వము భార్గవ (పరశు) రాముడు అవతరించి భూమిని క్షత్రియరహితముగా చేసెను. వా

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

నుండి తాను తీసికొనిన భూరాజ్యము అంతయు విప్రులకు ఇచ్చిఅతడు తాను పశ్చిమ సముద్రమునకు పోయెను. (అచట తపస్సాచరించసాగెను.)

6. ఐనను వారు మరల అతనియొద్దకుపోయి నీవు మాకు ఇచ్చిన భూమియందే ఇంకను ఎందులకు ఉన్నావు? అని అడుగుటయేకాక ఇంకను తమకు భూమిఇమ్మని అతనిని యాచించసాగిరి. వినుము; ఈ కారణముచే విప్రులకు (కొందరికి) కాంక్ష ఎంతకును తీరదు, అని తెలియుచున్నది కదా !

7. వారితో విసుగుచెంది భార్గవరాముడు ఏమిచేసెనో చూడుము; సముద్రమధ్యమున జలమధ్యము (నందలి ద్వీపము) నకు పోయెను. లేనిచో మరల ఈ బ్రాహ్మణులు తనకడకువచ్చి భూమి యాచింతురు అని శంకించి (ఊహించి - సందేహించి - భయపడి) వారి నుండి తనుదాను తప్పించుకొనుటకై అతడు అచ్చట గుప్తరూపుడై ఉండిపోయెను.

8. నాయనా ! వినుము; అదే విధమున కారణజన్మధారి యగు శ్రీగురుమూర్తియును (తాను ప్రకటరూపమున ఉన్నచో సకల జనులును - నానా జాతులవారును - వచ్చి వరములు అడిగెదరు అను శంకతో ఆ వైద్యనాధక్షేత్రమున గుప్తరూపులయి ఉండిరి.

9. నాయనా ! వినుము; శ్రీగురువులు విశ్వవ్యాపకులు అగు జగదీశ్వరులు గదా ! వారు ఏ వరములను ఈయజాలరు? ఐనను - వారు ఆయా జనుల భక్తి చూచి పాత్రానుసారముగా వారు వారి యందు ప్రసన్నులు అగుదురు. (వారికి ఆయా వరములు ఇత్తురు.)

10. ఈ కారణముచే శ్రీగురువులు ఆ ప్రదేశమున (వైద్యనాధ మహాక్షేత్రమునందు గుప్తరూపులు అయి ఉండిరి. అట్లు ఉండి తమ సకల శిష్యులను పిలిపించి తీర్థయాత్రచేసి రావలసినదిగా ఆజ్ఞాపించిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

11. గురువులు అగు శ్రీనృసింహముని తన సమస్త శిష్యులను తమకడకు పిలిపించి "మీరందరును సమస్త తీర్థయాత్రలను ఆచరించి శ్రీశైలమునందు నాదర్శనమునకు రావలయును" అని వారికి ఆజ్ఞఇచ్చిరి.

12. శ్రీగురువులు పలికిన ఈ వచనమును విని వారి సమస్త శిష్యులును శ్రీగురువుల చరణములను పట్టుకొనిరి. వారు వారితో ఇట్లు పలికిరి. "కృపామూర్తి యగు శ్రీగురురాజా! మమ్ములను తాము ఏల ఉపేక్షించుచున్నారు?"

13. "తమ దర్శన మాత్రముచేతనే మాకు సమస్త తీర్థయాత్రల ఫలమును లభించుచున్నదే" అట్టి మేము శ్రీగురువుల చరణములను వదలి మరి ఏ ఇతర ప్రదేశమునకు పోవలసియుండును?

14. "శ్రీ గురుచరణములయందే సమస్త తీర్థములును ఉన్నవి" అని ఇట్లు వేదవాణి పలుకుచున్నది. స్వామీ! ఈ వాక్యమునకు వివరణము శాస్త్రములయందు కూడ ప్రఖ్యాతమయి యున్నది.

15. "విధానము (ధనమహానిధి) తన సమీపమునందేయుండగా దానిని వదలి ఆ నానారణ్యములలో దానిని వెదకుచు తిరుగవలసిన పని ఏమి? దేవరాజా! కల్పవృక్షమును విడిచి (మరి ఎచ్చటికో ఎవరి దగ్గరకో ఆయా కోరికలను తీర్చుకొనుటకై) పోవలసిన పని ఏమి?"

16. ఈ వచనములను విని శ్రీగురువులు తమ శిష్యులతో ఇట్లు పలికిరి. నాయనలారా! మీరు సంన్యాసాశ్రమస్థులు; అందుచే ఒకే తావునందు వరుసగా ఐదుదినములపాటు వాసముచేయుచు ఉండరాదు.

17. చతుర్థా (సంన్యాసా) శ్రమమును స్వీకరించి (న తరువాత) ఆ యతి లోకమునందుగల సమస్త తీర్థక్షేత్రములయందును యాత్ర ఆచరించవలయును. దానిచే మనస్సు స్థిరత్వము పొందినమీదట మరల అప్పుడు ఒకే స్థానమునందు (ఎక్కువకాలము ఉండినను) ఉండవచ్చును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!**

18. ఇదికాక మాది ఒక విశేష వాక్యముకలదు. (మేము ఒక విశేషవాక్యము పలుకుచున్నాము) దానిని అంగీకరించుటచే మీకు అధికమగు ధర్మఫలము లభించును. మీరు ఎల్లరును అన్నితీర్థక్షేత్రము లందును సంచరించి మరల నా దగ్గరకు రావలయును.

19. బహుధాన్య నామక సంవత్సరమునాటికి మేము శ్రీశైలము నకు వత్తుము; నాయనలారా! మీరు అందరును అక్కడకు మా దర్శనమునకై రావలసి యుండును.

20. శిష్యా! నామధారకా! వినుము; శ్రీగురువులు ఈవిధముగా తన శిష్యులకు ఉపదేశవచనములు పలికిరి. అంతట వారందరును శ్రీగురువులవారి చరణములపై వ్రాలి నమస్కరించిరి.

21. అనంతరము శిష్యులు శ్రీగురువులతో ఇట్లు పలికిరి: తాము పలుకు వాక్యములే మాకు పరుసవేది (తో సమానము); మేము తప్పక (తీర్థయాత్రలకయి) పోయెదము; భూమిపయిగల తీర్థక్షేత్రములు అన్నియు సేవించెదము.

22. శ్రీగురువుల వాక్యములను (అనుసరించి) ఎవరు ఆచరించరో - వారే ఘోర రౌరవనరకమునందు పడెదరు; వారికి గృహము యమ పురమునందే ఉండును. అట్టివారు అఖండనరకమును అనుభవింతురు. అని ఎరుగవలయును.

23. శ్రీగురునాథా! మేము ఏఏ తీర్థక్షేత్రములకు పోవలయునో తాము ఆజ్ఞ ఈయవలయును; స్వామీ! తమ ఆజ్ఞను దృఢముగా మా మనసుల చిత్తముల యందు నిలుపుకొని మేము యాత్రలకై వెళ్లెదము.

24. ఏ ఏ స్థానములకు వెళ్లవలయును అని తాము ఆజ్ఞ ఇత్తురో-అక్కడకు అక్కడకు మేము అవశ్యము వెళ్ళెదము; స్వామీ! తమ వాక్యముతోనే మాకు యాత్రాఫలసిద్ధియు పరమార్థసిద్ధియు కలుగును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

25. తమ శిష్యులు పలికిన వచనములు విని శ్రీగురుమూర్తి ప్రసన్నవదనులు అయి తమ శిష్యులకు సకల సాధారణములు అగు తీర్థయాత్రలను సెలవు ఈయ నారంభించిరి.

26. నాయనలారా! ఈ బ్రహ్మాండగోళమునందు కాశీక్షేత్రమును, తీర్థరాజము అని ప్రసిద్ధినందిన ప్రయాగమును, పవిత్రతీర్థక్షేత్రములలో విఖ్యాతములు అయి ఉన్నవి. మీరు త్వరితముగా మొదట అక్కడకు వెళ్లుడు; భాగీరథీ గంగను సేవించుడు.

27. గంగానదీ తీరమువెంట అరువది యోజనముల దూరము తటయాత్ర చేయుటచేత అరువది కృచ్ఛ్రవ్రతములను ఆచరించినంత ఫలము లభించును. ఈ తీర్థయాత్ర ప్రయాగవరకును; గంగాద్వారము వరకును చేసినవో ద్విగుణఫలము లభించును.

28. నాయనలారా! వినుడు; యమునానదీతటయాత్ర ఇరువది గ్రామముల దూరము చేయదగినది. ఏకమనస్కులై నా వచనమును శ్రద్ధగా వినుడు; అంత ప్రమాణముననే కృచ్ఛ్రఫలమును ఈ యమునా తీరయాత్రచేత లభించును. (అనగా ఎనుబది యోజనములయాత్ర కావున ఎనుబది కృచ్ఛ్రవ్రతములను ఆచరించుటచే కలుగునంత ఫలము లభించును.

29. సరస్వతీ అనునదియు గంగానదీరూపయే; ఆ నది ఉత్తమ మయినది; కాని ఆమె భూమ్యన్తర్భాగగతయై ఉన్నది. ఆ నదీతీరము వెంట ఇరువదినాలుగు * గ్రామములంత దూరము తీర్థయాత్రచేసి అచ్చటచ్చట స్నానము చేయవలెను.

---

* గ్రామము అనగా నాలుగు యోజనములు అని లోగడ వ్రాయబడినవి. కాని - టిప్పణిలో ఆమాటవదలి గ్రామమనగా యోజనము (4 క్రోసులు) అని వ్రాయబడినది; శ్రీ వాసుదేవానంద సరస్వతీస్వామివారు కూడ గ్రామమనగా యోజనము అని గ్రహించినట్లు తోచుచున్నది.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

30. అందువలన ఆ నది ఇచ్చు కృచ్ఛ్రసంఖ్యాఫలము అంతే చే యుండును. నాయనలారా! వినుడు; యజ్ఞము చేయుటచే కలుగునంత ఫలము కలుగును. ఈవిధమగు తీరయాత్ర చేసినవానికి తన పితరులతో కూడ శాశ్వతమగు బ్రహ్మలోకము లభించును. (ఇరువదినాలుగు కృచ్ఛ్రవ్రతములు చేయుటచే కలుగునంత ఫలము కలుగును.)

31. వరుణా నదియు కుశావర్తా నదియు విఖ్యాతములగు శతద్రూ విపాశానదులును శరావతీనదియు మనోహరమగు ఇటువంటి నదులు అనేకములు కలవు.

32. చాల గొప్పదియగు మరుద్వృధానది ఇంకను అసిక్నీ మధుమతీ నదులును పయస్వినీ (పయోష్ణీ) ఘృతవతీ నదులును కలవు. ఈ చెప్పిన అన్నినదులయు తీరయాత్రలు చేయుడు.

33. దేవనదియని ఏ గంగానదీ విషయము మీకు చెప్పితినో అది భూమండలమునందే మిగుల విఖ్యాతమయినది; దాని తీరము వెంట పదునైదుగ్రామముల దూరము (అరువదియోజనములదూరము) తీరయాత్ర మీరు చేయుడు.

34. ఎన్ని గ్రామముల దూరము తీరయాత్రచేసినవో అన్ని కృచ్ఛ్రవ్రతముల ఫలము లభించును. మీరు ఆ నదియందు మనోభావ పూర్వకముగా స్నానము ఆచరించినచో స్నానమాత్రముచేతనే వారు పవిత్రులగుదురు. స్నానమాచరించినవారి బ్రహ్మహత్యాది పాతకము లును అక్కడకు అక్కడనే నాశమందును.

35. చంద్రభాగా - రేవతీ - సరయూ - గోమతీ - వేదికా - కౌశికీ నదులు కలవు.

36. గొప్పదియగు సహస్రవక్త్రా నదియు ఇంకను పుణ్యప్రద యగు పూర్ణానదియు అటులే గొప్పదియగు అరుణా, బాహుదా నదు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

లును - కలవు. ఈ చెప్పిన నదులలో ఒక్కొక్కదాని తీరముల వెంట పదునారేసి గ్రామముల దూరము తీరయాత్ర చేయవలయును.

37. ఎచ్చటెచ్చట నదీసంగమము (రెండుకాని అంతకుమించిన సంఖ్యలో నదులుకాని ఒకేచోట పరస్పరము సంగమించుటయు నది సముద్రముతో సంగమించుటయు నదీసంగమము అనబడును.) ఉండునో అచ్చట స్నానమాచరించుటచే అమితమగు పుణ్యఫలము లభించును. త్రివేణీ సంగమమందు స్నానమాడుటచే కలుగునంతఫలము నదీసంగమ స్నానముచే కలుగును. కావున మీరు అట్టిచోట్లనెల్ల స్నానము చేయుడు.

38. పుష్కర తీర్థము - వైరోచనీ తీర్థము - సన్నిహిత తీర్థము ఫల్గునతీర్థము గయాక్షేత్రతీర్థము - ఇవిచాల పవిత్రములు; మీరు అచ్చట స్నానము చేయుడు.

39. రామేశ్వరమున సేతుబంధమునందును, శ్రీరంగక్షేత్రమున కావేరియందును, అనంతశయనమున పద్మనాభ సరస్సునందును, జగన్నాథ పురియందు పురుషోత్తముని సన్నిధియందలి మనోహర సాగర తీర్థమునందును, నైమిశారణ్య తీర్థమునందును మీరు స్నానమాడుడు.

40. నారాయణ మహాముని సన్నిధియందలి బదరీక్షేత్రము నందును కురుక్షేత్రమునందును అనేకనదులును తీర్థములును కలవు. అందు మీరు స్నానము చేయుడు. ఇవి అన్నియు ఐనతరువాత మీరు శ్రీశైలయాత్రకు తరలుడు.

41. చూడుడు; మహాలయతీర్థము అను తీర్థము ఒకటి కలదు. వినుడు; అందు స్నానమాడి అందలి జలముతో పితృతర్పణము చేయుట పితృదేవతాప్రీతి కలిగించును. తత్ఫలప్రభావముచేత నలువది రెండు తరములవారు (పితృపక్షమున ఇరువదియొకటి - మాతృపక్షమున ఇరువదియొకటి) తప్పక స్వర్గప్రాప్తు లగుదురు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

42. కేదారతీర్థము పుష్కరతీర్థము నర్మదానదీతీరమునందలి తీర్థములు. అందును ముఖ్యమగు కోటిరుద్రతీర్థము - మాతృకేశ్వర - కుబ్జ - కోకాముఖి తీర్థములు- ఇవి అన్నియు అత్యంతము పవిత్రములు. మీరు వీనియందు స్నానముచేయుడు.

43. ప్రభాసతీర్థ - విజయతీర్థ - చంద్రనదీ తీర్థ - గోకర్ణతీర్థ - శంఖకర్ణ తీర్థములు - మిగుల ప్రసిద్ధములయినవి. వీనియందు స్నానము చేయుట మనోహరమును (మనస్సునకు హాయిని కలిగించునదియు) ఉత్తమమును.

44. అయోధ్యా - మధురా - కాంచీ - ద్వారావతీ - గయా క్షేత్రములును సాలగ్రామతీర్థమును శబల గ్రామమును - ఇవి ముక్తి క్షేత్రములు.

45. శిష్యులారా ! వినుడు; గోదావరీనదీతీరము వెంట ఆరు యోజనముల దూరము తీరయాత్ర చేసినను చాలును; దానివలన కలుగు పుణ్యమహిమము అటువంటిది. దానిచే వాజపేయ యాగము చేయుటచే కలుగునంత పుణ్యఫలము కలుగును.

46. సవ్యాపసవ్యములుగా ఎగువనుండి దిగువకును దిగువనుండి ఎగువకును మూడుమారులు ఈగోదావరీనదీతీరము వెంట తీరయాత్ర మనోనియమ పూర్వకముగా చేయుచు స్నానముచేయుచు ఉండినచో ఇట్టి యాత్రికుడు జ్ఞాని యగును; మహాపాతకియును శుద్ధుడగును.

47. ఇంతమాత్రమేకాదు; ఈ గోదావరీనదీతీరముననే రెండు మహాతీర్థములు చాల ప్రఖ్యాతమయినవి కలవు; అవి భీమేశ్వరతీర్థమును, వంజరా సంగమమును అను పేరులుకల తీర్థములు.

48. ఇందే కుశతర్పణతీర్థము అను తీర్థము ఇంకొకటియు కలదు; గోదావరీనదీ సాగరసంగమమువరకు గల గోదావరీనదీ తీరము వెంట పండ్రెండు గ్రామముల (నలువది ఎనిమిది యోజనముల) దూరము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

నదీతీర యాత్ర చేసినచో ముప్పదియారు కృచ్ఛ్రవ్రతములు ఆచరించుటచే కలుగునంత పుణ్యఫలము లభించును.

49. పూర్ణానదీ తీరమువెంట నాలుగు గ్రామముల (పదునారు యోజనముల) దూరమును కృష్ణవేణీనదీ తీరమువెంట పదునైదు గ్రామముల (అరువది యోజనముల) దూరమును మీరు నదీతీరయాత్ర చేయుడు.

50. ఉత్తము (పవిత్ర) మగు తుంగభద్రానదీ తీరము వెంట ఇరువది గ్రామముల (ఎనుబది యోజనముల) దూరము తీర్థయాత్ర చేయుడు. ఇంకను వినుడు. పంపా సరోవరము స్వభావసిద్ధముగానే అనంతమహిమము కలది.

51. ఈ (కర్ణాట) ప్రాంతమునందే విఖ్యాతమగు హరిహర క్షేత్రము కలదు. ఈక్షేత్రము సమస్త దోషములను పరిహరించును. ఇటువంటి పవిత్రతయును మహిమయును కల భీమరథీనది యున్నది; దీనితీర్థయాత్ర దశగ్రామ (40 యోజనముల) పరిమితము.

52. పాండురంగక్షేత్రమును మాతులింగక్షేత్రమును అనునవి మరి రెండు క్షేత్రములు కలవు. గాణగపురియును ఇట్టి ఉత్తమ క్షేత్రమే. ఈగాణగపురీక్షేత్రమునందు ఉత్తములగు తీర్థములు కలవు. ఇచటి అష్టతీర్థములు మనోహరములు; (మనుష్యులకు శాంతిని పవిత్రతను కలిగించునటువంటివి.)

53. ఈ గాణగపుర సమీపమునందలి అమరజా (భీమానదుల) సంగమమునందు కోటితీర్థములు కలవు అని ప్రసిద్ధము. అచట అశ్వత్థ వృక్షము ఒకటి యున్నది. అది సాక్షాత్ కల్పవృక్షమే అని తెలియుడు.

54. శిష్యులారా ! వినుడు; ఆ అశ్వత్థవృక్షమునకు ముందరి ప్రదేశముననే విఖ్యాతము అగు నృసింహతీర్థము ఉన్నది. దీనికి ఉత్తర భాగమునందే వారాణసీతీర్థము ఉన్నది.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

55. దానికి తూర్పుభాగమునందు పాపవినాశతీర్థము కలదు; దానికి తరువాత విశిష్టమగు కోటితీర్థము కలదు; దానికి తరువాత (ఆవలగా) రుద్రపాదతీర్థము ఉన్నది.

56. ఇచటనే చక్రతీర్థము అనునది ఒకతీర్థము; కలదు; ఇందు దేవనాయకుడగు కేశవుడు సదా సన్నిహితుడై యుండును. అందుచే ఇది ప్రత్యక్ష (సాక్షాత్ ద్వారకాక్షేత్రమే అని తెలిసికొనుము; ఇచట దీనితరువాత మన్మథతీర్థము ఉన్నది.

57. ఈ గంధర్వభువ (గాణగాపుర) సమీపమునందే కల్లేశ్వర దేవస్థానము (అను దివ్యక్షేత్రము) కలదు; ఈస్థానము నిరుపమాన మయినది; గాణగాపురము సిద్ధభూమి (సిద్ధక్షేత్రము.)

58. ఈ క్షేత్రమునందు ఎవరు అనుష్ఠానము చేసికొందురో - వారికి త్వరితముగా ఇష్టార్థ సిద్ధి కోరినకోరికలు నెరవేరుట) కలుగును; ఎవరు సాక్షాత్ - కల్పవృక్షము ఆశ్రయింతురో - అట్టివారికి మనః కామనలు ఎట్లు నెరవేరకుండును ? (కల్పవృక్షము - సంకల్పమునందు ఉన్నకోరికలను తీర్చు వృక్షము; మనః కామనలు = సంకల్పించిన కోరికలు.)

59. ఈ గాణగాపుర సమీపమునందే ఉత్తమమగు కాకిణీ సంగమము అను నదీసంగమ ప్రదేశము కలదు; ఇదియు 'భీమా' నదీతీరము నందలి ప్రసిద్ధనామముకల క్షేత్రమే; అనంత పుణ్యమును ఇచ్చు స్వభావముకలది. ఈ కాకిణీ సంగమ ప్రదేశము; ఇది ప్రయాగక్షేత్రములో సమానమయినది అని ఎరుగుము.

60. తుంగభద్రా - వరదా - ఈ నదుల సంగమస్థానములును మహాతపోనిధులు (తపఃసిద్ధి ప్రదాయకములు) మలాపహారిణీనదియు దాని సంగమ ప్రదేశమును మొదలే పవిత్రతమము. దానిని సేవించుటచే శతజన్మకృత పాపములు నశించును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

61. నివృత్తి సంగమము అను విఖ్యాతస్థానము కలదు; ఇందు స్నానములు అనుష్ఠానములు ఆచరించుటచే బ్రహ్మహత్యాదోషము కూడ నశించును. మీరు త్వరితముగా (అవశ్యము) అక్కడకు వెళ్ల వలయును అని శ్రీగురువులు తమ శిష్యులతో పలికిరి.

62. బృహస్పతి సింహారాశియందు ప్రవేశించియున్న సమయమున సమస్త తీర్థములును సంతోషమునందును. అపుడు అవి అన్నియును వచ్చి భాగీరథి (గంగ) యందు ఐక్యము పొందును.

63. బృహస్పతి కన్యారాశిగతుడై యుండగా భాగీరథీనది త్వరితముగా వచ్చి కృష్ణానదియందు ప్రవేశించును. నాయనలారా! వినుడు; బృహస్పతి తులారాశిగతుడు అయిన సమయమున సురనది తుంగభద్రానదియందు ప్రవేశించును.

64. సూర్యుడు (బృహస్పతి) కర్కటకరాశియందు ప్రవేశించి యుండగా మలప్రహారా (మలాపహారిణీ) నదితో కృష్ణానది సంగమించు తీర్థమునందు సర్వజనులును స్నానమాడవలయును. దానిచేత బ్రహ్మహత్యాది పాపములును నశించును.

65. శిష్యులారా! వినుడు; భీమాకృష్ణానదులు సంగమించు చోట స్నానమాడుటచే కలిగిన పుణ్యఫలమున అరువది జన్మముల యందు బ్రాహ్మణత్వము లభించును.

66. తుంగభద్రా (కృష్ణా) సంగమమునందు స్నానమాడుటచే అంతకంటెను త్రిగుణ పుణ్యము లభించును; అని తెలిసికొనుడు. వినుడు; కృష్ణానదీ - నివృత్తినదీ సంగమమునందు స్నానమాచరించుటచే అంతకంటె నాలుగింతలు పుణ్యము లభించును.

67. శ్రీశైల క్షేత్రమునందలి పాతాళగంగయందు స్నానమాచరించు శ్రీమల్లికార్జునుని దర్శించినందుచే ఇంతకంటెను ఆరు

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

రెట్లు పుణ్యఫలము లభించుట మాత్రమేకాదు; అట్టివారికి ఈ సంసారమునందు పునరావృత్తి యే ఉండదు అని ఎరుగుము.

68. లింగాలయము ( ? ) నందు స్నానముచేయుటచే ఇంతకు ద్విగుణమగు పుణ్యము లభించును; కృష్ణాసాగర సంగమమునందు స్నానమాడుటచే అగణ్యము (ఇంత అని లెక్కించుటకు శక్యము కానంత) పుణ్యము లభించును. కావేరినదీ సాగర సంగమమునందు స్నానము మనోభావములతో చేసిన-చో ఇంతకు పదునైదురెట్లు పుణ్యము లభించును.

69. ఇదేవిధముగా తామ్రపర్ణినదియందు స్నానమాత్రముననే అసంఖ్యేయమగు పుణ్యము లభించును. కృతమాలా నదీతీర (ర్థ) ముల యందు స్నానముచేసినచో సర్వపాపములును పరిహృతములు అగును.

70. ఇవికాక పయస్వినీ (పయోష్ణి) అనునది యింకొకటి కలదు కదా! అతి విశేషముకల భవనాశిన నదికలదు; ఇవి సముద్రముతో కలిసిన సంగమప్రదేశమును సముద్రస్కంధ (ప్రదేశ) మును దర్శించినంతమాత్రముననే సకలపాపములును పరిహృతములు అగును.

71. శేషాద్రి - శేషాచలము - తిరుమల - యందలి శ్రీవేంకటేశ్వరుని శ్రీరంగక్షేత్రమునందలి శ్రీరంగనాథుని శ్రీమదనంతశయనమునందలి అనంతశయన పద్మనాభుని దర్శించి పూజించి అటనుండి త్వరితముగా తిరువణ్ణామలై క్షేత్రమునకు పొందుము.

72. ఇవి అన్నియును కాక సమస్త తీర్థక్షేత్ర సమష్టితో సమానమగు తీర్థక్షేత్ర స్థానము మరియొకటికలదు. అదియే 'కుంభఘోణ' క్షేత్రము. తరువాత కన్యాకుమారీ తీర్థ క్షేత్రమును దర్శించి మత్స్యతీర్థమునందు స్నానము చేయుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

73. ఉత్తమ మగు పక్షితీర్థము అనునది యొకటి కలదు రామేశ్వర సమీపమునందు ధనుష్కోటియను ప్రఖ్యాతనామముగల ప్రదేశము కలదు; శ్రీరంగక్షేత్రమున శ్రీరంగనాథుని సన్నిధియందు కావేరీతీర్థము గలదు.

74 పురుషోత్తమ దేవుని చంద్రకుండమును సేవించుము; కొల్హాపురమునందలి మహాలక్ష్మిని ఆరాధించుము; ఇంకను వినుము; కోటితీర్థము అనునది యొకటికలదు. దానిని సేవించుము. దక్షిణకాశియని ప్రసిద్ధినందిన కరవీరస్థానము అను మహాక్షేత్రము కలదు. వీనిని సేవించుము.

75. ఉత్తమము అగు మహాబలేశ్వర తీర్థక్షేత్రము కలదు. కృష్ణానది ఉద్గమించిన మూలస్థానము అది. అచ్చటనే సమీపమందు రామేశ్వరముతో సమానమగు క్షేత్రము అనదగిన 'బహేం' అను గ్రామము గలదు.

76. దానికి సమీపమునందే 'కొల్హా' (కోళేనరసింగపూర్) గ్రామము గలదు. అది ఉత్తమస్థానము. అందు నృసింహదేవుడు ఉన్నాడు. పరమాత్ముడగు సదాశివుడును అందు ప్రత్యక్షమూర్తియై ఉన్నాడు.

77. ఇట కృష్ణాతీరమునందే 'భిల్లవాడి' అను క్షేత్రము కలదు. ఇచట భువనేశ్వరదేవి అవతరించియున్నది. ఇచట తపమాచరించినచో ఆచరించినవారు తత్తపఃఫలముగా ఈశ్వరునితో ఏకత్వము (సాయుజ్యము అను మోక్షము) పొందుదురు.

78. అటు తరువాత వరుణా కృష్ణా సంగమమునకు పొందుము. అచ్చట మీరు మనోభావ పూర్వకముగా స్నానము ఆచరించుము. మార్కండేయుని నామముతో (మార్కండేయునివలె మృత్యుంజయులును దీర్ఘాయువులును కావలయును అని) అచ్చటి సంగమేశ్వరుని పూజించుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

79. ఇట కృష్ణాతీరమునందు ఉత్తమములు అగు ఋషుల ఆశ్రమములు ఉన్నవి. కృష్ణాతీరము వెంట ఉండిన ఆ ఆశ్రమ సంవిధానములందు స్నానము (తపము, అనుష్ఠానము) మొదలగునవి చేసినచో జ్ఞానసిద్ధి యగును.

80. వీనితరువాత కృష్ణాప్రవాహమునందే అమరపురము అను క్షేత్రము ఉన్నది. ఇది మిగుల ప్రఖ్యాతము అగు తీర్థక్షేత్రము. ఇచట కృష్ణానది యందు ఇతరనదులు కలియుచుండుటచే ఏర్పడిన పంచగంగా సంగమము అను పవిత్ర తీర్థక్షేత్రము ఏర్పడియున్నది. ఇందు స్నానాదికము చేయుటచే ప్రయాగమునందు కంటెను అధికమగు పుణ్యము లభించును.

81. నాయనలారా ! వినుము. ఈ పంచగంగా సంగమము సాటిలేని ఉత్తమ క్షేత్రము. ఈ స్థానమునందు సకలతీర్థములును ఉన్నవి. సకల మునులును ఈ తీర్థక్షేత్రమునందు సకల మునులును తపమాచరించిరి, ఆచరించుచున్నారు. ఇకముందును ఆచరింతురు. ఇచ్చట అట్టివారికి అందరకును శీఘ్రముగా తపస్సిద్ధి కలిగి జ్ఞానులు. అగుదురు.

82. ఇటువంటి ప్రఖ్యాతమగు ఆ తీర్థక్షేత్రమునందు మూడు దినముల కాలము అనుష్ఠానము ఏదేని చేసినవో అట్టి అనుష్ఠాతది తన అఖిలాభీష్టములను పొంది త్వరితముగా పరమార్థమును (ముక్తికి సాధనమగు జ్ఞానసిద్ధిని కూడ) పొందును.

83. ఉత్తమమగు 'యుగాలయ' తీర్థ స్థానము కలదు. (ఇది నరసోబావాడీ నుండి ఆరుమైళ్ళలో నున్నది. జుగుళగాంవ్ అని దీనిపేరు) దీనిపై తనచూపు ప్రసరించినంతనే యాత్రికులు సిద్ధినందుదురు తరువాత 'శూర్పాలయము' అను తీర్థక్షేత్రము కలదు. ఇదియు కృష్ణా తీరమునందే యున్నది.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

84. అతి ప్రసిద్ధుడు అగు విశ్వామిత్ర మహర్షి ఈ కృష్ణావేణీ ప్రభానదుల సంగమప్రదేశమునందు ఉన్న 'ఛాయాభగవతీ' అను మహానొక తీర్థమునందు తపస్సు ఆచరించి సిద్ధినందెను. ఇచ్చటి కృష్ణావేణీ ప్రహరా (మలప్రభా - మలాపహరా) సంగమస్థానమునందు స్నానాద్యనుష్ఠానములు చేయుటచే సమస్తదోషములును తొలగిపోవును.

85. విష్ణుమూర్తి రూపాంతరమే యగు కపిలఋషి ఇచ్చట తపమాచరించగా అతనికి గాయత్రీ (సరస్వతీ-సావిత్రీ) దేవి సాక్షాత్కరించెను. ఆమహర్ష్యాశ్రమము ఇందే కలదు. 'శ్వేతశృంగి' అను ప్రసిద్ధ నామము కల ఈప్రదేశమున కృష్ణానది ఉత్తరవాహిని యయ్యెను.

86. ఈ స్థానమునందు స్నానముచేయుటచేత కాశీయందు గంగాస్నానము చేయుటచే లభించు పుణ్యమునకు నూరురెట్లు పుణ్యము లభించును. ఇచట ఏదేని మంత్రమును ఒకమారు జపించుటచే కోటి మారులు జపించుటచేత కలుగునంత ఫలము కలుగును.

87. తరువాత కేదారేశ్వర తీర్థమునకు పోవలయును. అందు దానిని దర్శించి సేవించుడు. ఇందే పీఠాపురము కలదు. ఇందు శ్రీదత్తాత్రేయులు అను సనాతన భగవానుడు సదా సన్నిహితుడై యుండును.

88. తరువాత మీరు పోవలసిన మహాతీర్థము ఇంకొక 'మణిగిరి' అనునది కలదు. అది మిగుల ప్రఖ్యాతమగునది. ఇందు సప్త ఋషులు ప్రీతిపూర్వకముగా బహుదినములు తపమాచరించిరి.

89. అపరిమిత పుణ్యప్రదములు అగు వృషభాద్రి - కల్యాణ నగరి - అను మహాతీర్థక్షేత్రములు కలవు. ఆక్షేత్రములను సేవించిన వారికి మరల ఈ సంసారములోనికి రాకపోకలు ఉండవు. మీరు ఈతీర్థక్షేత్రములను కూడ సేవించుడు.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

90. అహోబల క్షేత్రమును దర్శించినవారో అరువది యజ్ఞములు చేయుటచే కలుగునంత పుణ్యము లభించును. అని తెలియుము. శ్రీగిరిని దర్శించినవారో మరలజన్మమే ఉండదు.

91. మీరు ఇట్లు భూమండలమునందలి సమస్తతీర్థములను బద్ధపరికరులై (యత్నపూర్వకముగా) సేవించుము; నదులు మొదలగు తీర్థములు రజస్వలఅయి యుండగా వానియందు స్నానమాచరించుటచే దోషము ప్రాప్తించును. కనుక మీరు అట్టి సమయములందు ఆయా తీర్థములందు స్నానమాడవలదు.

92. కర్కాటక సంక్రమణము (సూర్యుడు కర్కాటక రాశి యందు ప్రవేశించుట) మొదలుగా చేసికొని రెండుమాసముల కాలము నదులకు రజస్వలాసమయము అని గ్రహించి మీరు ఆసమయమున నదీతీర్థములందు స్నానముచేయక ఉండుము. నదీతీరములందు ఎవరు వాసముచేయుచుందురో వారికి ఇట్టి నదీరజస్వలాత్వదోషము అను వర్తించదు.

93. ఈ చెప్పిన రెండుమాసముల నడుమను మీరు నదుల యందు వర్షముచే క్రొత్తనీరువచ్చిన మొదటి మూడుదినములును విడువవలయును. నదులు అన్నియును - మహానదులుకూడ - రజస్వల యగుట నిశ్చయించు విధానము ఇది.

94. వినుడు. భాగీరథీ - గౌతమీ - చంద్రభాగా - సింధునది - నర్మదా - సరయూ - ఈ నదుల విషయమున వానిరజస్వలాత్వమును గురుతించి అందు మొదటి మూడు దినములును వదలినచాలును.

95. గ్రీష్మకాలపు ముగింపునందు సకలనదులకును పది అహోరాత్రములు రజస్వలాత్వము; వాపీకూప తటాకాదులకు క్రొత్త నీరు వచ్చినప్పుడు ఒక అహోరాత్రము మాత్రము రజస్వలాత్వము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

ఈ సమయమున మాత్రము వీనియందు స్నానాదికము చేయక విడువవలయును.

96. ఈ జలాశయములందు క్రొత్తనీరు ఏనాడు వచ్చునో గురుతించవలయును. అవి అందుచే అపుడు రజస్వలలయి ఉన్నవని ఎరుగవలయును. అపుడు అట్టివానియందు స్నానము చేయుట మహాదోషము. కావున అపుడు వానియందు స్నానముచేయుట మానవలయును.

97. ఇపుడు ఇది మీకు ఇట్లు తీర్థాదుల రజస్వలాత్వవిషయమున సాధారణపక్షము చెప్పితిని; మీరు స్వయముగ ఎపుడు ఏది చూచి ఏమని గుర్తింతురో దాని ననుసరించి అచ్చట అది అట్లు విధిపూర్వకముగా ఆచరించవలయును.

98. శ్రీగురువులు పలికిన ఈవచనములను విని సకల శిష్యులును వినయముతో నమ్రులయి వారిని నమస్కరించిరి. శ్రీగురువుల అనుమతియు, ఆజ్ఞయు మా ప్రవృత్తులకు అన్నిటికిని మూలహేతువు; అని పలికి వారు ఎల్లరును అటనుండి బయలుదేరి వెడలిరి.

99. ఇంతయు చెప్పి సిద్ధయోగి నామధారకునితో (గ్రంథకర్తయగు సరస్వతితో) ఇట్లు పలికెను. శ్రీగురువుల ఆజ్ఞను గ్రహించి శిష్యులు అందరును తీర్థయాత్రాసేవనమునకై వెడలిపోయిరి. శ్రీగురువులు గుప్తరూపులై అచ్చటనే ఉండిరి.

100. సరస్వతీ గంగాధరుడు తరువాతి కథావిస్తారమును ఇక మీదట చెప్పుచున్నాడు. అది అంతయు వినుటకు మనోహరముగా నుండును. దానిచేత కలుగు ఫలము శ్రోతలయు పఠితలయు సకలాభీష్టములను సిద్ధింపజేయును.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

101. ఈ శ్రీగురుచరిత్రము సాక్షాత్ కామధేనువే; కావున భక్తజనులు అగు శ్రోతలు ఎవరు సావధానులు అయి ఇది వినెదరో - అట్టివారు సకల పురుషార్థములను పొందెదరు.

102. నేను ఈ బ్రహ్మరసామృతమును కడవలకొలదిగా త్రావి దాని ఆస్వాదమును (అనుభ) (సే) వించుచున్నాను. ఎవరికి ఆశక్తి కలదో-వారును దీనినుండి పరమార్థమును సాధించుకొందురుగాక !

ఇది (శ్రీ) పరమకథా కల్పతరువు అయి సిద్ధనామధారక సంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీ నృసింహసరస్వత్యు పాఖ్యానరూపమగు శ్రీగురు చరిత్రామృతము నందు శ్రీగురు ప్రపంచిత తీర్థయాత్రా నిరూపణము అను పంచదశాధ్యాయము.

సంఖ్య 102

# శ్రీ గురు చరిత్రామృతము

## షోడశాధ్యాయము

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః.

1. శిష్యుడు అగు నామధారకుడు శ్రీగురు నృసింహసరస్వతీ నామమునందలి అంశము తనపేరుగాగల వాడును ఈ శ్రీగురు చరిత్రామృత గ్రంథకర్తయు గంగాధర పుత్త్రుడును అగు సరస్వతి తన గురుడు అగు సిద్ధయోగిని వినయ పూర్వకముగా ఈ విధమున ప్రశ్నించెను : స్వామీ ! శ్రీ గురుచరిత్ర సంబంధి యగు వృత్తాంతమును విస్తారపరచి నాకు చెప్పవలసినదిగా ప్రార్థించుచున్నాను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

2. జ్ఞాన ప్రదాతా! శ్రీగురువుల ఆజ్ఞను శిరసావహించి సమస్త శిష్యులును తీర్థయాత్రలకయి వెళ్లిరికదా! మరి శ్రీగురువుల యొద్ద ఎవరు ఉండిరి? తదనంతరకథ ఎట్లు జరిగెను? నాకు అది యంతయు విస్తారపరచి నిరూపింపుడు.

3. శిష్యుడు పలికిన ఈ వచనమును విని సిద్ధయోగి మిగుల సంతోషమును చెందినవాడు అయ్యెను. శిష్యశిరోమణీ! గురుభక్తా! నామధారకా! నీవు ధన్యుడవు; ధన్యుడవు.

4. నా చిత్తము అవిద్యాపరిణామమగు మాయాఽఽవరణము అనెడు సుషుప్తి (గాఢనిద్ర) యందు కునుకుపాటులు పడుచు ఉన్నది. నీ (వు అడిగిన ఈ ప్రశ్నము) మూలమున ఇపుడు అది (నా చిత్తము) జాగరితము అయినది. నాకు జ్ఞానజ్యోతి ఉదయమందినది.

5. శిష్యా! నామధారకా! వినుము; నీవే నాకు ప్రాణసఖుడవు; నీమూలమున నేను శ్రీగురుచరిత్రమును స్మరణమునకు తెచ్చుకొనగలిగితిని; సుఖ (ఆనందానుభవ) మును లభింపజేసికొంటిని.

6. నేను ఇంతవరకును అజ్ఞానరూపమగు అంధకారమువలన ఏర్పడిన సంసారముచే కలిగిన సంతాపముచే పీడితుడను అగుచు క్లేశపడుచు వచ్చితిని. అటువంటి నన్ను నీవు శ్రీగురుచరిత్రామృతము అను సుధాసాగరమునందు మునుగునట్లు చేసితివి.

7. నీవు నాకు చేసిన ఈ ఉపకారమునకు నా మానసము సంతుష్టము అయినది; నీవు నీ పుత్త్రపౌత్త్రులతో ఆనందింతువు. నీ ఇంటియందు దైన్యము ఉండనే ఉండదు.

8. శ్రీ గుర్వనుగ్రహమునకు పాత్రుడవు అగు శాలుడవు నీవు; సకలలోకమును నిన్ను సమ్మానించును; ఈ విషయమున సందేహము అందకుము; నా ఈ మాటను వాగ్దానముగా గ్రహించుము; అష్టైశ్వర్యములతో నీవు నీ పుత్త్రపౌత్త్రాదులతో కూడ ఆనందింతువు.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!**

9. శ్రీగురుచరిత్రము అనునది సాక్షాత్ కామధేనువు; అట్టి శ్రీగురుచరిత్రమును నేను నీకు విస్తారపరచి చెప్పెదను; తమ శిష్యులు అందరును తమ ఆజ్ఞచే తీర్థాటనమునకై పోయిన తరువాత కూడ శ్రీగురువులు గుప్తరూపులుఅయి శ్రీవైద్యనాథ సంనిధియందు ఉండిరి.

10. నాయనా! నామధారకా! చెప్పెదను; వినుము. శ్రీగురువులు ఇచ్చిన ఆజ్ఞను అనుసరించి సమస్త శిష్యులును తీర్థయాత్రలు సేవించుటకై వెళ్లిరి; నేను యథాఽనుక్రమమున వారిని సేవించుచు శ్రీగురువుల సన్నిధియందు ఉంటిని.

11. శ్రీగురుముని ఒక సంవత్సరకాలముపాటు ఆ స్థానము నందు ఉండిరి; అది పవిత్రమును ఉత్తమమును, మనోహరమును అగు ఆరోగ్యభవాన్యంబా స్థానముకదా!

12. అచ్చట శ్రీవారును (వారితోపాటు నేనును) వాసము చేయుచుండగా అక్కడకు ఒక బ్రాహ్మణముని వచ్చెను. ఆతడు వచ్చి శ్రీగురువులను దర్శించి భక్తిభావముతో నమస్కరించెను.

13. ఆతడు తనశిరస్సును శ్రీగురువుల చరణములపై నిలిపి పరిపరి విధములుగా వారిని స్తుతించెను; స్వామీ నేను అజ్ఞానసాగరము నందు మునిగి యున్నాను; నన్ను తాము తరింపజేయవేడుచున్నాను; తరింపజేయవేడుచున్నాను. అనెను.

14. నేను బహుదివసములు తపము ఆచరించితిని; కాని నా మానసము స్థిరము కాలేదు. ఈ కారణమున నాకు పరతత్త్వజ్ఞానమును పొందు మార్గము కానరాలేదు.

15. జ్ఞానము కలుగనిదే తపస్సుచేయుటకై పడిన ఆయాసము అంతయు వృథా అగుచున్నది. నేడు ఇపుడు తమ్ము దర్శించగానే నా మానసము హర్షమును చెందినదయినది.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।**

16. నేను బహుదినములు శ్రమపడి శ్రీగురుసేవ చేసియుండలేదు. స్వామీ! ఈ హేతువుచేతనే నా మానసము స్థిరముకాలేదు.

17. తాము మిమ్ములను విశ్వసించినవారికి తారకులు; తాము విశ్వమునకు అంతటికిని తారకులు; తాము జగద్గురువులు అయి ఉన్నారు. త్వరితముగా నాకు జ్ఞానము ఉదయించుటకు ఉపాయమును ఉపదేశించ ప్రార్థించుచున్నాను.

18. ఆ మునిపలికిన వచనమునువిని నవ్వి శ్రీగురువులు అతనిని ఇట్లు ప్రశ్నించిరి. గురువు లేకయే నీవు ఎట్లు మునివి అయితివో నాకు చెప్పుము.

19. శ్రీగురుమూర్తి ఇట్లు పలుకగానే మునికి తన కన్నుల యందుండి అశ్రుధార ప్రవహించసాగెను. అపరిమితమగు దుఃఖము వ్యాపించి డగ్గుత్తిక పడెను. అతడు శ్రీగురువులతో ఇట్లు పలికెను. స్వామీ! గురురాజా! వినుడు.

20. నాకు గురువు ఒకడు ఉండెను. అతని వాక్యములు మిగుల నిష్ఠురముగా ఉండెను. అతడు నన్ను అనేక పర్యాయములు గర్జించుచుండెడివాడు. నాకు అకృత్యములు (చేయరానివి) అగు సేవలు (చేయవలసినదిగా) చెప్పుచుండెడివాడు.

21. అతడు నాకు వేదములు శాస్త్రములు బోధించలేదు. తర్క, శాస్త్ర, భాష్యములు కాని వ్యాకరణముగాని అభ్యసింపజేయలేదు. 'నీ (అంతఃకరణము) మనస్సు ఇప్పటికిని స్థిరము కాలేదు.' అని అతడు అనుచుండెడివాడు.

22. ఇట్లు అని ఇంకను ఇట్టివే వేరువేరు మాటలను కూడ అతడు నన్ను అనుచుండెడివాడు. దీనిచే నా మనస్సు స్థిరమును కాలేదు. నేను ఆతనిమాటలను ఆజ్ఞలను పాలించను లేదు. అందుచే అతడు నన్ను ఇంకను కోపముచేయ సాగెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

23. ఈ విధముగా నాకు ఆ గురునొద్ద చాల దినములు జరిగెను. నన్ను అతడు ఇంకను అట్లే నిష్ఠురవచనములు పలుకుచునే యుండెను. అందుచే నేను అతనిమీద కోపించి వచ్చినాను.

24. ఆ ముని పలికిన వచనములు విని శ్రీగురుమూర్తి హాస్య వదనుడు (చిరునగవుతోకూడిన మొగము కలవాడు) అయి ఇట్లు పలికెను: బ్రాహ్మణా ! వినుము; నీవు ఆత్మఘాతుకుడవు అగుచున్నావు.

25. ఒకానొక మూర్ఖుడు తన ఇంటి ముంగిటముపైతానే మల విసర్జనము చేసికొని అందరతోను 'నా అదృష్టము ఇట్లున్నది.' అనెనట నీవు అట్టివాడవు.

26. అదే విధముగా నీవు నీ మనఃపూర్వకముగా నీ ముక్కు-కోసివేసికొని నీకు ఎదురుగా వచ్చువారికి అపశకునముగా ప్రవర్తించు చున్నావు, ఇట్టివాడవు నీవు ఒక్కడవే కాని ఇంకెవరును లేరేమో !

27. చెప్పుచున్నాను. వినుము. నీ గుణములు ఎటువంటివి ? అని నీవు ఆలోచించుటలేదు. ఇట్టి నీకు జ్ఞానము ఎట్లు కలుగును ? నీవు గురుద్రోహివి అనియు అల్పబుద్ధివి అనియు తెలిసికొనుము.

28. నీవు తన (నీ) గురుని గుణదోషములను (గుణములనుకూడ దోషములనుగా) హర్షపూర్వకముగా ఉచ్చరించుచున్నావే ! ఇటు వంటి నీకు జ్ఞానము ఎట్లుకలుగును ? ఇపుడు ఇక నీకు అంతఃకరణము ఎట్లు స్థిరము అగును ?

29. తన (నీ) దగ్గరనే నిధియుండగా ధనమునకై అడవులు అడవులుపట్టి ఏల తిరుగుచున్నావు ? కామధేనువులయిన నీగురువు ఉండగా ఆతనిని తప్పించుకొని (విడిచి) నా దగ్గరకు వచ్చితివే !

30. ఏ నరుడు గురుద్రోహియో - అట్టివానికి ఇహాపరములు రెండును లేవు. అట్టి దివాంధమున (గుడ్లగూబ) కు జ్ఞానము మాత్రము ఎట్లుకలుగును ?

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :**

31. ఎవడు గురుని సేవాలాభవిశిష్టతను ఎరుగునో వానికి సర్వవిధములు అగు జ్ఞానమును కలుగును; గురుడు సంతుష్టుడు అయిన వెంటనే వేదశాస్త్రములు అన్నియు వానికి లభించును.

32. వినుము, శ్రీగురువులను సంతోషింపజేసినచో అష్టసిద్ధులను తన (అతని) వశమగును. అతనికి వేదశాస్త్రములును సాధ్యము లగును; అందులకై ఒక్కక్షణముకూడ పట్టదు.

33. శ్రీగురువులు పలికిన ఈ వచనమును విని ఆ బ్రాహ్మణుడు తన శిరస్సును శ్రీగురుచరణములయందు నిలిపి తనచేతులు జోడించి జాలిగొలుపు పదములతో కూర్చబడినవాక్యముతో ఇట్లు మనవి చేసెను.

34. శ్రీజగద్గురూ ! జయ జయ. తాము నిర్గుణులు - నిర్వికారులు, అపారము అనంతము అగు జ్ఞాన సాగరులు, తాము నన్ను ఉద్ధరించ ప్రార్థించుచున్నాను.

35. అజ్ఞానకృతమగు మాయ నన్ను చుట్టివేసినందున - గురువు అనగా ఎవరు ? ఎట్టివారు ? అని ఎరుగకున్నాను. కావున స్వామీ ! నాకు ఆ విషయము ప్రకాశపరచి నాకు జ్ఞానము ఉదయించునట్లు అంతయు చెప్పవలసినదిగా వేడుచున్నాను.

36. విశ్వవంద్యుడవగు శ్రీగురుమూర్తీ ! శ్రీగురుని ఎట్లు గురుతించవలయును. శ్రీగురుసేవ ఎటువంటిదిగా ఉండును ? ఇది అంతయు తాము నాకు ప్రకాశపరచి చెప్ప వేడుచున్నాను.

37. ఎట్లు ఏమిచేసినచో నామనస్సుస్థిరము ఐ శ్రీగురుసేవా ప్రకారమును తెలిసికొనగలనో ఆ విధమును తెలిపి నాకు ఉపకారముచేయుడు. అని ఆతడు శ్రీగురువుల పాదములపై వ్రాలెను.

38. ఆతడు పలికిన జాలిగొలుపు పలుకులను విని సంతోషించి

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

శ్రీగురునాథులు గురుసేవా విధానమును విస్తారపరచి చెప్ప నారంభించిరి.

39. శ్రీగురువులు ఆతనితో ఇట్లు పలికిరి: మునీ ! వినుము; గురువు అనగా తల్లియును తండ్రియును; ఉపదేశ (తత్త్వోపదేశ) కర్త ఎవరో-ఆతడే పరమగురువు; అని ఎరుగుము.

40. గురుడే బ్రహ్మయు రుద్రుడును శ్రీమహావిష్ణువును అని తన మనమున నిశ్చయముచేసికొని భక్తిపూర్వకముగా శ్రీగురుసేవ చేయవలయును.

41. ఈ విషయమునందు; నిరూపకముగా ఉండు కథ ఒకటి కలదు; అది నేను నీకు చెప్పెదను. అది శ్రీమన్మహాభారతమున ఆది పర్వమునందు కల ఉత్తమ కథ; ఇది గురుసేవా భక్తి భావమును ప్రతిపాదించునది. అది తత్పరుడవై వినుము.

42. వినుము; ద్వాపర యుగాంతమున ధౌమ్యుడు అను విప్రఋషి ఒకడుండెను; అతనికడ వేదాభ్యాసముచేయుటకై (వచ్చి యుండిన) ముగ్గురు శిష్యులు అతనికి ఉండిరి.

43. వారిలో ఒకడు పాంచాలుడు (పంచాల జనపద వాసి) అగు ఆరుణి; రెండవవాడు శుద్ధచిత్తుడగు 'బైదుడు' మూడవవాడు 'ఉపమన్యుడు' అను బాలుడు. వీరు మువ్వురును విద్యానిమిత్తమయి ధౌమ్యుని సేవచేయుచుండిరి.

44. పూర్వము గురువులరీతి ఇట్లు ఉండెడిది. ఏమి అనిన - వారు శిష్యులు తమకు చేయు సేవలను గ్రహించెడు వారు. వారి అంతఃకరణములను పరీక్షించి చూచెడువారు. శిష్యుల మనోనిశ్చయము ఎట్టిదియో తెలిసికొనెడువారు.

45. గురువులు తమ శిష్యుల అంతఃకరణమును పరీక్షించి చూచి నిశ్చయపూర్వకమగు భక్తి తమయందు వారికి కలదు అని ఎరిగి

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

తత్‌క్షణము పీరు వారియందు దయచూపెడివారు; వారి మనోరథములను పూరించెడువారు.

46. ద్విజుడా ! ఏకాగ్ర చిత్తముతో వినుము. ఇటువంటి ఉత్తముడగు ధౌమ్యముని ఒక దినమున ఆ పాంచాలుడగు ఆరుణిని ఇట్లు ఆజ్ఞాపించెను.

47. శిష్యునితో ధౌమ్యముని ఇట్లు పలికెను: నీవు ఈనాడు అరణ్యమునకుపోయి మా పొలములోనికి ఆ భూమి తృప్తిచెందునట్లు నీరు పెట్టుము.

48. పొలము పల్లపునేలలో ఉన్నది. దానిలో నరక్కైన విత్తి యున్నది. నీవు శీఘ్రముగా దానిలోనికి నీరు వచ్చునట్లు చేసి పెట్టుము. అని ధౌమ్యుడు శిష్యునితో పలికెను.

49. ఇట్లు తనగురుని ఆజ్ఞ కాగానే శిష్యుడు పరుగెత్తుకొనుచు పోయెను. అచ్చట చెరువు కానవచ్చుచుండెను. కాలువ పెద్దగా ప్రవహించుచుండెను.

50. ఎక్కడ నీరు చాలబత్తిడితో మహాధ్వనితో గర్జించుచు ప్రవహించుచుండెనో అచ్చట చూడ పంటపొలపుభూమి కాలువ నీటిమట్టముకంటె ఎత్తులో నుండెను. బ్రాహ్మణా ! అచ్చటికి నీరు ఎట్లు ఎక్కునో ఆలోచించి చూడుము.

51. అది చూచి ఆరుణి ఇట్లనుకొనెను: ఇప్పుడు నేను ఏం చేయుదును ? ఉదకము మహాగాఢముగా ధ్వనితో ప్రవహించి పోవుచున్నది. దీనిని నేను ఎట్లు అడ్డుకొనగలను ? నన్ను ఈ విషయమున శ్రీగురుడు కోపించును. అనుకొనసాగెను.

52. అంతట అతడు పెద్ద చట్టురాళ్లు తెచ్చి నీటికి అడ్డుకట్ట కట్టనారంభించెను. ఐనను నీరు తీవ్రముగా పోవుచునే యుండెను. ఆతడు వేసినరాలును కొట్టుకొనిపోవుచుండెను.

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

53. ఆతడు అనేకవిధముల ప్రయత్నములు చేసెను. ఎట్లు చేసినను నీరు ఎక్కకుండెను. దేవా శ్రీహరీ ! అని ఆతడు హరి నామము స్మరించుచుండెను. నేను ఏమిచేయుదును ? అనుకొనసాగెను.

54. మరల ఆతడు మనస్సులో ఆలోచించెను. తన గురుని పొలములోనికి నీరు ఎక్కకుండినచో గురునిపొలము నిమిత్తమున నాప్రాణములనైన విడుతును అని ఆతడు నిశ్చయించుకొనెను.

55. ఇట్లాతడు మానసమున నిశ్చయము చేసికొని తనమనస్సులో శ్రీగురులను ధ్యానించెను. ఇపుడు దీనికి ఉపాయమును యోజించి యత్నముచేయవలయును. అని ఆతడు అనుకొనెను.

56. ఈ జలప్రవాహామునందు ఎన్నిపాషాణములు వేసినను కొట్టుకొనిపోవుచున్నవి. కనుక స్వయముగా దీనికి అడ్డుపడెదను. అని ఆ సమయమున ఆతడు నిర్ధారించుకొనెను.

57. ఆతడు తన రెండుచేతులతో ఒక ఒడ్డును ఒత్తి పట్టెను. రెండవవైపున తన పాదములను గట్టిగా ఉంచెను. ఇట్లు ఆతడు ఆనీటికి అడ్డుగా అయి ఉండెను. మనస్సునందు శ్రీగురులను ధ్యానించు చుండెను.

59. 59. చూడుము. శిష్యశిరోమణి ఇట్లు నిశ్చయించుకొని ఇట్లు చేసికొన్న క్షణమునందే ప్రవాహాపు సగము నీరు పొలములోనికి పోవుచుండెను. మిగిలిన సగమునీరును ఎప్పటివలె పారలి వెడలిపోవు చుండెను. నిశ్చయముగా ఎరుగుము. ఆ జలప్రవాహ మధ్యమున ఆ శిష్యుడు సంతోషమున మునిగియుండెను.

60. బ్రాహ్మణా ! వినుము; ఇట్లు ఆ శిష్యుడు ఆ ప్రదేశము నందే ప్రవాహజలమునందే మునిగియుండెను. గురుని పంటపొలము ఉదకముతో నిండినదై ధనవంతము (సమృద్ధికలది) అయ్యెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ॥

61. ఆతని గురుడగు ధౌమ్యముని తనమనస్సులో ఇట్లు విచారణ చేసెను. పగలు అంతయు గడచినది. అస్తమయము ఐనది: ఇప్పటికిని శిష్యుడు రాలేదే! అని ఆలోచించెను.

62. ఆముని తాను ఇట్లు విచారించుచు తానే పొలమునకు పోయెను. అచ్చట ఉదకము అధికముగానే యుండెను. కాని ఆతనికి అచ్చట శిష్యుడు కనబడ డాయెను.

63. గురు డిట్లనుకొనెను. శిష్యుడు ఏమి ఆయెనో! ఒకవేళ ఆతనిని వ్యాఘ్రములు మొదలగు క్రూరమృగములు తినెనేమో! ఉదకనిమిత్తమయి ఈతనికి నేను క్లేశము కలిగించితినే! ఆత డెక్కడ నున్నాడో కదా! అని మాత డనుకొనెను.

64. ఇట్లు మనస్సులో అనుకొనుచు ఉచ్చస్వరముతో ధౌమ్యుడు ఆరుణిని పిలువసాగెను. ఓయీ శిష్యా! సఖా! అనుచు ప్రేమభావముతో పలుకసాగెను.

65. ధౌమ్యముని ఇట్లు దయాపూర్ణములగు వచనములతో పిలువసాగెను. ఆ శబ్దములు శిష్యుని చెవులలో పడెను. మరి వెంటనే ఆతడు అక్కడినుండి లేచి వెలుపలికివచ్చి వేసెను.

66. ఆతడు లేచి వచ్చి ఏకాంత భావపూర్ణమగు భక్తితో శ్రీగురునకు నమస్కరించెను. ధౌమ్యముని మహాహర్షముతో ఆరుణిని ఆలింగనము చేసికొని ఆశ్వాసించెను. (ఓదార్చెను.)

67. ఆసమయమున ఆముని ఆరుణికి ఇట్లు వరములను ఇచ్చెను: శిష్యసమూహములోనే శ్రేష్ఠుడవగు ఆరుణీ! నీకు సకలవేదములును వ్యాకరణాది శాస్త్రములును సకలవిద్యలును వచ్చినవి. అని పలికెను

68. ఇట్లు పలికిన తత్క్షణమునందే ఆ ఆరుణి విద్యావంతుడును జ్ఞానియును అయ్యెను. ఆతడు భక్తిభావవశమున తనగురుని చరణముల పయిబ్రవాలెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

69. కృపానిధియగు ధౌమ్యముని ఆతనిని తన ఆశ్రమమునకు తీసికొనివచ్చి సంతుష్టుడు అగుచు ఇపుడిక నీవు వివాహాదికము చేసికొనుము. అని ఆతనికి అనుమతి ఇచ్చెను.

70. శిష్యోత్తముడు ఆ ఆరుణియు ఇట్లు తన గురుని అనుమతి పొంది తనస్వస్థానమునకు పోయెను. నాయనా! తెలిసికొనుము. ఇంకను మిగిలిన ఇరువురు శిష్యులు గురుసికడనే ఉండిరి.

71. ఎరుగుము; రెండవశిష్యుడగు బైదుడు గురుశుశ్రూషణము చేయుచుండెను. ఆతని అంతఃకరణమును పరీక్షించి చూచుటకై ధౌమ్యగురుడు ఒకనాడు ఇట్లు పలికెను:

72. ధౌమ్యుడు శిష్యునితో ఇట్లు పలికెను: నాయనా! నీతో ఒకమాట చెప్పుచున్నాను వినుము; నీవు పోయి రేయింబవళ్ళును మా పొలము కాపాడు చుండుము.

73. నీవు పొలమును కాపాడుచు (అందు పండు) ధాన్యమును ఇంటికి తీసికొనిరావలయును. గురుడు ఇట్లు పలుకుచునే శిష్యుడగు బైదుడు మహోనార్షముతో ఆపొలముకడకు పోయెను.

74. పొలము పంట పండు వరకును శ్రమపడి అహోరాత్రములును పొలమును కాపాడుచు ధాన్యము సిద్ధమగు సమయమున ఆతడు తన గురునిదగ్గరకు వచ్చెను.

75. ఆతడు శ్రీగురునితో ఇట్లు చెప్పెను: ఏమి అనిన - వరి పండి ధాన్యరాశి సిద్ధము అయి ఉన్నది. ఇపుడు అది యింటికితీసికొని రావలసియున్నది. తమ ఆజ్ఞ ఏమి? అనెను.

76. మరి అపుడు ధౌమ్యముని ఇట్లు పలికెను: ఓయీ! శిష్య శిరోమణీ! నీవు అరణ్యమున మిగుల శ్రమ పడితివి. నీవు ఇపుడు ధాన్యమును ఇంటికి తీసికొని రావలయును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

77. ఇట్లు పలికి ఆత డాశిష్యునకు ఒకశకటమును ఇచ్చెను. దానియందు ఒకదున్నను పూంచి గురుడు ఇట్లు పలికెను : నీవు దీనివెంటనే పోయి శీఘ్రమే ధాన్యమును తీసికొనిరావలయును అనెను.

78. వెంటనే శిష్యుడగు ఆ బైదుడు ఆ బండియందు ఒకవైపున ఆ ఒకదున్నను పూంచెను. రెండవవైపున (కాడిని)తానే మోయుచుండెను. ఈవిధముగా బండిని తీసికొని ఆ పొలముకడకు వచ్చెను.

79. ఆ శిష్యుడు ఆబండిని రెండుబారువుల (నలువది మణుగుల) ధాన్యముతో నింపెను. దానియందు ఒకవైపున ఆదున్నను పూనిచి రెండవవైపున తానే మోయసాగెను.

80. ఆ దున్న శీఘ్రముగా నడుచుచుండెను. బైదుడు తాను దానితో పాటు నడువజాలకుండెను. ఐనను మరి ఆతడు కాడిని తన కంఠమునందు బంధించుకొనెను.

81. ఆతడు తనబలము అంతయు ఉపయోగించుచు దానితో పాటుగా మార్గమువెంట నడుచుచువచ్చెను. ఆదున్న అట్లు తనకంఠమున (బండిని)వహించుచు బురదలో చిక్కుకొనెను.

82. దున్నపోతు బురదలో చిక్కుకొనెనే ! అని అతడు తన మనస్సులో చాల చింతపడెను. తన కుత్తుకకు ఉచ్చుపడునట్లు ఆతడు తానే ఆ బండిని లాగ (మోయ) నారంభించెను.

83. ఇట్లు ఆశిష్యుడు దున్నపోతును ఊడదీసి దానిని బయటకు తప్పించి - తానే ఆ బండిని లాగుచుండగా తన కంఠమునందు ఉచ్చుపడి ప్రాణములు పోవునట్లు (పోవునంతపని)అయ్యెను.

84. ఇట్లు ఇంత జరుగగా కట్టకడపటకు ధౌమ్యమహాముని ఆతని ఎదుటకు వచ్చి చేరెను. ఆతడు ఆ శిష్యుని తనకన్నులార చూచెను. ఆతనికి అధికమగు కృప జనించెను.

**దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

85. ఆ ముని ఆశిష్యుని (ఆ ఉచ్చునుండియు బండినుండియు విడి) పించి కరుణాభరితుడై ఆలింగనము చేసికొనెను. నీవు వేద శాస్త్ర జ్ఞాన సంపన్నుడవు అయ్యెదవు. అనుచు ఇంకను అభిమతములగు వరములను (కూడ) ఇచ్చెను.

86. వరములను ఇచ్చిన తత్క్షణముననే ఆతనికి సకలవిద్యలును వచ్చెను. విప్రా ! వినుము. శిష్యుడు అంతట తన గురునినుండి అనుమతి తీసికొని తన గృహమునకు పోయెను.

87. వినుము; మూడవ శిష్యుడగు ఉపమన్యుడును సేవవిషయమున మహానిష్ఠుడు. ఆతడును గురునిసేవయు శుశ్రూషణమును ఐకముగా చేయుచుండెను.

88. ఆతనికి ఆహారము ఎక్కువ అయ్యెను; అందువలన ఆతని హృదయమున విద్యలు స్థిరములుఅయి నిలువకుండెను. గురుడగు ఆ ధౌమ్యుడు ఈ విషయమును ఆలోచించి ఇందులకయి ఒకఉపాయము చేసెను.

89. ఆతనికి ధౌమ్యముని ఇట్లు చెప్పెను : నాయనా ! నీకు ఒక మాట చెప్పుచున్నాను. దాని ననుసరించి అనుదినమును మాగోవులను అరణ్యములోనికి తీసికొనిపోయి వానికి గడ్డిమేపుచు వానిని కాపాడుచు ఉండుము.

90. గురువగుముని ఇట్లు చెప్పగానే శిష్యుడు అగు ఉపమన్యుడు ఆతని చరణములకు నమస్కారము చేసెను. గురుని గోవులను అరణ్యము నకు తీసికొని పోవుచు తన శక్తినంతయు వినియోగించి వానిని మేపుచుండెను.

91. ఆ ఉపమన్యుడు తనకు ఆకలివేయగానే శీఘ్రముగా ఇంటికి వచ్చుచుండెను. అదిచూచి గురుడు ఆతనిపై కోపించుచుండెను. ఆతనిని ఇట్లు అనుచుండెను. "శీఘ్రముగావచ్చితివి ఏమిరా !

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

92. "సూర్యుడు అస్తమయము పొందవలయును. అంతవరకును నీవు గోవులను అరణ్యమున కాపాడుచునే ఉండవలయును. నీవు ఇక మీదట ప్రతిదినమునను ఇట్లే చేయుచుండవలయును. నీకు ఇదే చెప్పు చున్నాను." అనెను.

93. ఆ శిష్యోత్తముడు అట్లే యని అంగీకరించి గోవులను తీసి కొని అరణ్యములోనికి పోయెను. తెలిసికొనుము; ఆతడు క్షుధా క్రాంతుడు అయ్యెను; కాని అతనికి తన గురుని ఆజ్ఞ జ్ఞప్తికి వచ్చెను.

94. గోవులు నదీతీరమున మేయుచుండెను. ఆ ఉపమన్యుడు తానును అందు స్నానముచేసెను. ఆసమీపమునందు నాలుగు ఇండ్లు ఉండెను. అక్కడఉన్న అవి విప్రుల ఆశ్రమములే.

95. ఉపమన్యుడు ఆప్రదేశములకుపోయి తనకు చాలునంతగా భిక్షము అడిగి కొనుచుండెను. సావధానుడు అయి భోజనముచేయు చుండెను. ఆతడు ఈ విధముగా తన గురుని గోధనమును రక్షించు చుండెను.

96. ఈవిధముగా ప్రతిదివసమునందును గోవులను ఆతడు రక్షించుచుండెను. వానితో కూడ రాత్రి సమయమునకు ఇంటికి వచ్చు చుండెను. ఇది ఇట్లు జరుగుచుండగా ఒక దినమున ధౌమ్యముని ఆశిష్యుని ఇట్లు అడిగెను.

97. గురుడు శిష్యునితో ఇట్లనెను : నీవు నిత్యోపవాసిగా ఉందువు కదా ! నీ దేహము ఇట్లు పుష్టితోకూడినదిగా ఎట్లు అగు చున్నది ?

98. తన శ్రీగురుని వచనములను విని శిష్యుడు అగు ఉపమన్యుడు ఇట్లు పలికెను : అయ్యా ! తాము చూచితిరికదా ! అక్కడ విప్ర గృహములు ఉన్నవి. ప్రతిదినమునను అక్కడ(కుపోయి) భిక్షాగ్రహణ ము చేయుచున్నాను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

99. ఇట్లు ప్రతిదినమునను భోజనము చేసి రాత్రి సమయమున నను గోవులను తీసికొని ఇంటికి వచ్చుచున్నాను. అదివిని శ్రీగురుడు అతనితో ఇట్లు పలికెను: నన్ను విడిచి నీవు భుజించుట ఎట్లు ?

100. నీవు ప్రతిదినమునను ఆ భిక్షాన్నము తీసికొనిఇంటికివచ్చి నాకు ఇవ్వవలయును. తరువాత మరల గోవుల దగ్గరకు పోవలయును. రాత్రి సమయమునకు గోవులను తీసికొని ఇంటికి రావలెను.

101 ఉపమన్యుడు తన గురుని ఆజ్ఞానుసారముగా ప్రతిదినము తన గోవులను అరణ్యములోనికి తీసికొనిపోయి అదివరకు నిత్యమును చేయుచుండిన భిక్షము అడుగుచుండెను. అది తెచ్చి గురునిఇంటిలో ఇచ్చుచుండెను.

102. (కాసిలోనుండి) గురుని ఇంటిలో అతనికి ఈయబడు భోజనము ఎన్నడును (కడుపునిండునంతగా) చాలకుండెను. అందుచే అతడు మరల ఆ (విప్రుల ఆశ్రమ) స్థానమునకు పోయి భిక్షాటనము చేసి దాని తినుచుండెను.

103. ఇట్లు ఉపమన్యుడు ప్రతిదినమునను రెండుపూటలందును భిక్షాటనము చేయుచుండెను. మొదటి భిక్షాన్నము తను గురునిఇంటి యందు ఇచ్చుచుండెను. రెండవ భిక్షాన్నమును తాను తినుచుండెను. ఇట్లు అనేక కాలము గడపుచుండెను.

104. ఇట్లు కొంతకాలము గడచునప్పటికే ఉపమన్యుడు చాల బలవంతుడు అయ్యెను. కృపాళుడు అగు గురు ధౌమ్యుడు ఒక దినమున శిష్యుని బలమునకు హేతువు అడిగెను.

105. శిష్యుడు ఎట్లు తాను తన ఆకలి చల్లార్చుకొనుచుండెనో వృత్తాంతమును ఇట్లు చెప్పెను. అయ్యా ! చెప్పుచున్నాను; వినుడు; నేను ప్రతినిత్యమును రెండువేళలయందును భిక్షము అడుగుకొనుచున్నాను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

106. ప్రతిదివసమునందును ఒకపూట లభించిన భిక్షాన్నమును తెచ్చి తమఇంట ఇచ్చుచున్నాను. రెండవమారు సంపాదించిన భిక్షాన్నముతో నేను నా భోజనము జరుపుకొనుచున్నాను.

107. ఉపమన్యువు ఇట్లు చెప్పగానే ధౌమ్యముని ఆశిష్యునిపై కోపించి ఇట్లు పలికెను: రెండువేళలందు తెచ్చిన భిక్షాన్నమును నీవు మా ఇంట ఈయవలయును అనెను.

108. తనగురువు ఎట్లు ఆజ్ఞ ఇచ్చెనో అట్లే ఉపమన్యువును తాను రెండువేళలందు సంపాదించిన భిక్షాన్నమును ప్రీతిపూర్వకముగా తెచ్చి తనగురుని ఇంట ఇచ్చుచుండెను. మనస్సునందు ఆతడు ఏ మాత్రమును క్లేశము పొందకుండెను.

109. శిష్యుడు క్షుధాక్రాంతుడై గోవులవెంట అరణ్యమునందు ఉండుచుండెను. తమ తల్లులకడ స్తన్యపానము చేయుచుండిన గోవత్సము (ఆలదూడ) లను ఆతడు చూచెను.

110. స్తన్యపానము చేయుచుండిన దూడల నోటికొనలపుల సందులనుండి ఎంగిలిపాలు వ్యర్థముగా నేలపయికి పోవుచుండెను. అది చూచినందున ఆతడు వానిదగ్గరకు పోయెను.

111. చూడుము; ఆతడు తాను ఆకలిగొనినవాడుగా ఉండెనాయెను. అందువలన ఆ ఉపమన్యువు పరుగెత్తుకొనుచు వానికడకు పోయెను. ఆతడు తన రెండుచేతులను చాచి ఆ ఉచ్ఛిష్టక్షీరమును గ్రహించెను.

112. ఇట్లు ఆతడు ఆపాలు గ్రహించి క్షీరపానముచేసి తనపొట్ట నింపుకొనసాగెను. తాను రెండువేళలందు సంపాదించిన భిక్షాన్నమును భావభక్తిపూర్వకముగా తను గురుని ఇంట ఇచ్చుచుండెను.

113. దానిచే ఆతడు మిగుల పుష్టినందిన (బలిసిన) వాడు ఆయెను. ఆతనిని చూచి గురువగు ధౌమ్యుడు తనలో ఇట్లు అను

దిగంబరా – దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

కొనెను. వీని శరీరలక్షణమును చూడుడయ్యా! ఈతడు ఎంత స్థూలు డగుచున్నాడు !

114. మరల ఒకమారు ధౌమ్యుడు అతనిని నీవు ఎట్లు పుష్టి కలవాడవు అగుచున్నావోయి? అని అడిగెను. శిష్యుడు తన వృత్తాంత మును తెలిపెను. నేను ఉచ్ఛిష్ట క్షీరపానము చేయుచుంటినని నెను.

115. అదివిని గురుడు శిష్యునితో ఇట్లు పలికెను: ఉచ్ఛిష్ట (క్షీరపాన)ముతో మతిహీనుడ (మందమతి) వయ్యెదవు. ఇందు అధిక దోషము కలదు. ఈనాటినుండి అది నీవు భక్షించవలదు. అని ధౌమ్యుడు శిష్యునితో పలికెను.

116. గురుడు ఉచ్ఛిష్టక్షీరమును భక్షించకుము అనెను కదా ! అందుచే అతనికి ఇక ప్రతిదినమునను ఆహారమే ఉండదు. మరునాడు అతడు క్షుధాక్రాంతుడై ఏమిచేయవలయునా ? అనుకొనుచుండెను.

117. ఇట్లు అతడు ఆవులతోకూడ అరణ్యములో పోవు చుండెను. (అచ్చట) ఒకచోట జిల్లేడుచెట్ల పొదనుండి చాల పాలు కారుచుండెను.

118. అదిచూచి అతడు ఇట్లు అనుకొనెను: ఈపాలు మంచి విగా ఉన్నవి. ఇవి ఉచ్ఛిష్టము కావు అనుట నిశ్చితము. తృప్తిగా ఇవి త్రావుదును. అనుకొనుచు అతడు అక్కడ కూర్చుండెను.

119. ఉపాయముతో అతడు ఆకులు త్రుంచి వాటిలోనికి పాలు నింపెను. తృప్తిగా (నిండుగా) అవి అందు నింపుచుండగా కంటిలో పడెను.

130. దానిచే అతని రెండుకన్నులును పోయెను. అతడు ఊరక అడవిలో తిరుగసాగెను. అతని కన్నులకు ఆవులు కనరా కుండెను. అందుచే అతడు చింతించసాగెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

121. ఆతడు కన్నులులేని వాడాయెను! ఆతనిచేతిలో ఒక కర్రకూడ లేకుండెను. అందుచే ఆతడు (తనగురువి) గోధనము విషయముగా చింత చేయసాగెను. అడవిలో అట్లు ఆతడు వానిని వెదకుచు పోవుచు ఒకగోతిలో పడెను.

122. గోతిలో పడి ఆ ఉపమన్యుడు మిగుల చింతపడుచుండెను. సత్యముగా ఇప్పటికే గోవులు (ఎక్కడికో) పోయిఉండును. నాకు నా గురువివలననుండి మాట వచ్చె (చ్చు)ను.

123. ఇట్లు ఆ శిష్యుడు ఆప్రదేశమం (గోతియం) దే పడియుండెను. పగలు గడచెను. సూర్యాస్తమయము అయ్యెను. ఇప్పటికిని తన శిష్యుడు రాలేదే! ఏల రాలేదు. ధౌమ్యముని చింతపడసాగెను.

124. ఇట్లు అనుకొని (కొనుచు) ఆతడు అరణ్యమునకు పోయెను. అక్కడ ఆతడు తన గోధనమును చూచెను. అక్కడ ఆతనికి తన గోధనము కనబడెను. శిష్యుడు కనబడలేదు. అందువలన వేదనతో దీర్ఘస్వరముతో పిలిచెను.

125. ధౌమ్యముని పిలువగానే ఆ పిలుపు ధ్వని శిష్యు (ఉపమన్యు) ని చెవులలో పడెను. (ఆ శిష్యుడును ఆ పిలుపునకు ప్రత్యుత్తరము ఓ - యని - ఇచ్చెను.) ప్రత్యుత్తరము ఇచ్చిన తత్ క్షణముననే దయాశాలియగు ఆ గురుడు ఆతనిదగ్గరకు పోయెను.

126. వృత్తాంతము విని (నమీాదట) గురునకు అత్యంతమగు కృపకలిగెను. అశ్వి దేవతలను స్తుతించుము. అని గురుడు వెంటనే తన శిష్యుని ఆజ్ఞాపించెను.

127. తనగురుడు అట్లు ఆజ్ఞ ఇచ్చిన ఆక్షణముననే శిష్యుడౌ ఉపమన్యుడు తన మనస్సులో అశ్వినీ దేవతలను ధ్యానించెను. ఆతని రెండు కన్నులకును చూపువచ్చెను. ఆతడు వెంటనే శ్రీగురు సమ్ముఖమునకు వచ్చెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

128. శ్రీగురుని కడకు వచ్చి ఆతడు ఆతనికి భక్తితో నమస్కరించెను. ఆసమయమునందే ఆ శిష్యోత్తముడు మిగుల దృఢభక్తితో ఆ గురుని స్తుతిచేసెను.

129. ధౌమ్యముని సంతోషించి ఆ శిష్యుని ఆలింగనము చేసికొని ఇట్లు పలికెను: శిష్య శిరోమణీ! నీభక్తికి నేను సంతుష్టుడనైతిని.

130. ఇట్లు ధౌమ్యుడు శిష్యుని విషయమున ప్రసన్నుడై ఆతని మస్తకమును తన హస్తముతో స్పృశించెను. తత్‌క్షణమునందే ఆ శిష్యునకు వేదశాస్త్రాది సకలవిద్యలును వచ్చెను.

131. అంతట గురుడు శిష్యునితో ఇట్లు పలికెను: నాయనా! నీవు స్వగృహమునకు పొమ్ము. వివాహాదికము చేసికొని సుఖముగను ఆనందముగను వర్ధిల్లుచుండుము. అని ఆతడు పలికెను.

132. నాయనా! నీకు విస్తారమగు కీర్తి కలుగును. నీకును చాల మంది శిష్యులు అగుదురు. అందును 'ఉత్తంకుడు' అని విఖ్యాతికల వాతడు శిష్యుడగును సుమా!

133. నాయనా! ఇంకను వినుము; ఆతడు శేషుని (తక్షక నాగుని) జయించి కుండలములను తెచ్చి నీకు దక్షిణగా ఇచ్చును. ఆతడు ఈ హేతువుచే కీర్తిమంతు డగును.

134. ఆతడే జనమేజయచక్రవర్తికి ఉపదేశమును ఇచ్చును, వినుము తదనుసారము ఆరాజు యాగముచేసి సమస్త సర్పము (నాగు)లను చంపును.

(ఇచ్చటినుండి శ్రీగురువులు విప్రునితో పలికిన వచనములు):

135. (ఇందలి యాథార్థ్యము ఏమియనిన) ముందు ముందు ఆ శిష్యుడే పోయి జనమేజయుని ప్రేరించి ఆతనిచే యాగము జరిపించి సమస్త సర్పములను (నాగులను) చంపించెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

136. ఇట్లు ఆ ఉత్తంకునకు త్రిభువనములందును ఖ్యాతి ఏర్పడెను. ఆతని మంత్రశక్తికి వశుడై తక్షకుడు ఇంద్రసహితుడై వచ్చెను. వినుము; గురుకృపామహిమ ఇటువంటిది.

137. ఏ నరుడు గురుదూషకుడు అగునో వానికి పరలోక (సుఖ)ము ఎక్కడిది ? గురుద్రోహ పాతకునకు అంతమునందు కుంభీపాక నరకము ప్రాప్తించును.

138. గురుని సంతుష్టునిగాచేసినచో వానికి ఏది సిద్ధించకుండును ? వేదశాస్త్రాది విద్యలను సాధించుటకు కూడ ఆతనికి క్షణకాలము కూడ పట్టకుండును.

139. కావున విప్రా ! నీవును ఇట్లు (ఉన్న వాస్తవస్థితిని) నీమానసమునందు ఎరిగి - ఇట్లు అవిద్య (అజ్ఞానము) తో వృథాగా ఏల తిరిగెదవు ? - నీవు నీ గురునికడకే వెళ్లవలయును. ఆతడే నిన్ను తరింపజేయును సుమా ! ఇది సత్యము.

140. నీవు ఆతని మనస్సును సంతోషపరచినచో వాస్తవముగా నీకు మంత్రము సాధ్యము (సిద్ధించునది) అగును. కావున నీవు నీమానసము సునిశ్చితము (సరియగు దృఢనిశ్చయముకలది) గా చేసికొని త్వరితముగా నీవు ఆతనికడకు పొమ్ము. అని శ్రీగురువులు అగు నృసింహసరస్వతి ఆ విప్రునితో అనిరి.

141. శ్రీగురుడు ఇట్లు ఆజ్ఞ ఈయగనే ఆ విప్రుడు విశేషజ్ఞుడు (అనేక విషయములను వివేచనపూర్వకముగా ఎరిగినవాడు) అయ్యెను. ఆ సమయమున ఆతడు తన శిరమున శ్రీగురుని చరణములపై ఉంచి వినయముతో ఈవిధముగా మనవిచేసెను.

142. జయ జయ గురుమూర్తీ! తామే నాకు పరమార్థ సాధకులు. తాము ప్రీతిపూర్వకముగాను కృపతోను నాకు పరమార్థమును ఆజ్ఞ ఇచ్చి (ఉపదేశించి) తిరి.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

143. నేను గురుద్రోహిని. అనుట సత్యము. దానిచే నాకు అధికము అగు అపరాధము ఘటిల్లినది. నా గురుని మనస్సును చాల దుఃఖపరచితిని. ఇప్పుడు ఎట్లు సంతోషపరచవలయును ?

144. సువర్ణము మొదలగు ధాతువులు అన్నియు భిన్నములు (పగిలినవి) ఐనను మరల అతుకుటకు శక్యములు అగును. కాని ముక్తాఫలము (ముత్తెపుపూస) పగిలినచో అది మరల ఏ విధముగా అదికికొని ఒకటి అగును ?

145. అంతఃకరణము భిన్నము (విరిగినది) ఐనచో కూడ దానిని ఐక్యము పొందించుటకు చాల ప్రయాసము అగును. ఈవిధముగా నా మనస్సుకూడ పతితము అయినది. ఇట్టి నేను జీవించి (నచో) ఉపయోగము ఏమి ?

146. ఇటువంటి ఈ శరీరము నా విషయమున ద్రోహి ఐనది. దీనిని రక్షించుటవలని ఉపయోగము ఏమి ? అనునది ఆలోచించ వేరెదను. జీవించవలయునను కోరికయు నాకు లేదు. గురుని విషయమున (గురునకు అర్పణముగా); నేను నా ప్రాణములు విడిచెదను.

147. ఈ విధముగా ఆ బ్రాహ్మణుడు శ్రీగురువులతో హార్ద పూర్వకముగా మనవి చేసి నమస్కరించి వైరాగ్యముతో బయలు దేరెను. ఆతడు తన ప్రాణములను వదలవలయును. అని నిశ్చయము చేసికొనెను.

148. ఇట్లు ఆ బ్రాహ్మణుడు అను (పశ్చాత్) తాపము చెందిన వాడు అయ్యెను - అగ్ని తగులగనే తృణము ఎట్లు తత్ క్షణమునందే భస్మము అగునో అట్లు ఆతని అంతఃకరణము శుద్ధము అయ్యెను.

149. నామధారకా ! వినుము; ఎట్లు కర్పూరరాశికి వహ్ని తగులగానే త్వరితముగా అది జ్వలించునో అట్లే ఆతనికిని (అన్తఃకరణము) దోషరహితము అయ్యెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

150. ఈకారణమున మానసము అనుతప్తము (పశ్చాత్తాపము చెందినది) కాగానే త్వరితముగానే ఆపాపములకు క్షాళనము జరుగును. ఈ విధముగా మూడు జన్మముల (యందుచేసిన) పాపములైనను నశించి పోవును.

151. చివరకు జరిగినది ఏమి అనిన-ఆద్విజవరుడు (బ్రాహ్మణ శ్రేష్ఠుడు 'నేను ఈ కళేబరమును విడిచెదను.' అను సంకల్పముతో బయలుదేరెను. ఆసమయమున అది గమనించి జగద్గురువులు ఆతనిని పిలిచిరి.

152. శ్రీగురువులు ఆ బ్రాహ్మణుని పిలిపించి కృపతో ఇట్లు ఆజ్ఞఇచ్చిరి; నీవు నీ మనస్సున చింత చేయకుము. నీ దురితదోషములు తొలగిపోయినవి.

153. నీ మానసమున వైరాగ్యము ఉత్పన్నమయినది. నీ దుష్కృతములు కాలిపోయినవి. నీవు నీమనస్సును ఏక చిత్తమునుగా (ఏకాగ్రతకల దానినిగా) చేసి నీ గురుచరణములను స్మరించుము.

154. ఆ సమయమున, ఆ విప్రుడు శ్రీగురువుల చరణములను నమస్కరించెను. జగద్గురువులు తామే అయిఉన్నారు. మూర్తిత్రయా వతారరూపులు తామే కదా !

155. తమ కృపకలిగినచో ఈ శరీరికి పాపములు ఎక్కడివి? భాస్కరుడు ఉదయము అందిన తరువాత మరి అంధకారము ఎట్లు ఉండగలదు ?

156. ఇట్లు ఆతడు భక్తితో శ్రీగురువులను స్తుతిచేసెను. హర్షవశమున ఆతనికి రోమాంచము కలిగెను. కంఠము గద్గద యుక్తముఅయ్యెను.

157. ఆసమయమున ఆతడు నిర్మలము అగు మానసముతో. శ్రీ గురువుల చరణకమలములపై తన శిరస్సు మోపెను. దయకలి

గించు మాటలతో వారికి మనవి చేసెను. శ్రీగురుమూర్తీ! నన్ను తరింపజేయుము; తరింపజేయుము అని ఆతడు పలికెను.

158. ఆ బ్రాహ్మణుని అంతఃకరణమునందలి నిశ్చయమును చూచి శ్రీగురువులు తాము ఆతని విషయమున ప్రసన్నులు అయిరి. నాయనా! వినుము; వారు తమదక్షిణహస్తమును ఆ విప్రుని శిరము నందు ఉంచిరి.

159. వినుము; లోహము (ఇనుము) నకు స్పర్శవేదితోడి సంబంధము కలుగగనే ఏబదిరెండు ఒరపిడుల మేలిమిబంగారుగా మారును కదా! అదియే విధముగా ఆద్విజశ్రేష్ఠునకు జ్ఞానము ఉదయించినది అయ్యెను.

160. తత్కాలముననే ఆతనికి వేదశాస్త్రాది విద్యలును మంత్ర శాస్త్రమును సకలమును వచ్చెను. చంద్రమౌళియే (సాక్షాత్ పరమేశ్వరుడే) ఆతని విషయమున ప్రసన్నుడు అయ్యెనుకదా! అట్టి ఆ ద్విజునకు కలిగిన అదృష్టము ఏమి అని చెప్పుదును?

161. బ్రాహ్మణునకు ఆనందము కలిగెను. శ్రీగురువులు ఆ విప్రునితో ఇట్లనిరి: వినుము; మామాటను పాటించి నీవు త్వరితముగా నీ గురునియొద్దకు పొమ్ము.

162. నీవు నీగురునియొద్దకుపోయి భావపూర్వకముగా ఆతనికి నమస్కరించుము. ఆతడును అత్యంతముగా సంతుష్టుడగును. ఆతడు మేమే (శ్రీనృసింహసరస్వతియే) అని నీవు భావన చేయుము.

163. ఈ విధముగా శ్రీగురుమూర్తి ఆ బ్రాహ్మణునకు నచ్చునట్లు తెలియజెప్పిరి. వారి ఆజ్ఞను అందుకొని ఆ విప్రుడును త్వరితముగ తన గురునియొద్దకు పోయెను.

164. నాయనా! నామధారకా! వినుము; ఇట్లు శ్రీగురువులు ఆ బ్రాహ్మణునకు ఆజ్ఞఇచ్చి అచ్చటినుండి (శ్రీవైద్యనాథ క్షేత్రము

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

నుండి) బయలుదేరిరి. వారు భువనేశ్వరీ సన్నిధానముకల 'భిల్లవాడి' గ్రామమునకు వచ్చిరి.

165. నాయనా! ఏకచిత్తుడవై వినుము. అచ్చట కృష్ణానదీ పశ్చిమతీరమున ఔదుంబరవృక్షము కలదు. వినుము; శ్రీగురువులు దానియందు గుప్తరూపులై నివసింపసాగిరి.

166. ఇట్లు ఇంతవరకును చెప్పి సిద్ధయోగి నామధారకునితో (గంగాధర నందనుడగు సరస్వతితో) ఇట్లు పలికెను : శ్రీగురువులు 'భిల్లవాడి' యందు (కొంతకాలము) నివసించిరి. ఆ కాలమున అత్యున్నతములగు మహిమలు ప్రకటములు అయ్యెను. ప్రఖ్యాతములు అగు అవి నీకు చెప్పెదను.

167. అని ఇట్లు సరస్వతీగంగాధరుడు శ్రీగురుచరిత్ర విస్తారమును చెప్పుచున్నాడు. ఇది వినుటకు మనోహరము అయినదియును సకలాభీష్టములను సిద్ధింపజేయునదియును.

ఇది శ్రీపరమకథాకల్పతరువు అయి సిద్ధనామధారక సంవాద
రూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహసరస్వత్యుపాఖ్యాన
రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు
గురుశుశ్రూషణ మాహాత్మ్య వర్ణనము
అను పదునారవ అధ్యాయము.

సంఖ్య 167

# శ్రీ గురు చరిత్రామృతము

## పదునేడవ అధ్యాయము

భిల్లవాడీ స్థాన మహిమము - మందమతియగు
బ్రాహ్మణునకు వరప్రదానము.

కథాస్థానము - భిల్లవాడీ సమీపమునందలి ఔదుంబరము -
ఇందే శ్రీగురువులు చాతుర్మాస్య వ్రతమును జరిపిరి.

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః

1. సిద్ధుడు నామధారకునితో (గంగాధరనందనుడగు సరస్వతితో) ఇట్లు పలికెను: గురుభక్త శిఖామణీ! శ్రీగురుచరణముల యందు నీకుగల భక్తి నిశ్చయముగ అందు లయముపొంది యున్నది.

2. పర్జన్యుడు (వర్షము) వచ్చుటకు ముందు ఆ వానరాకడను సూచించుచు చల్లనిగాలి వీచును. అదేవిధముగా నీకు శ్రీగురువులు నీ దైన్యమును హరింతురు. అనుటకు సూచనముగా శ్రీగురుచరిత్రకథన వేద (ప్రవచనవిశేష) మును ఆసక్తితో వినుచున్నావు.

3. ఇటువంటి కామధేను సమాన శ్రీగురుచరిత్రమును నీకు విస్తారపరచి చెప్పెదను. శిష్యా! నామధారకా! నీవు నీ మనస్సును ఏకచిత్తము (ఏకాగ్రము) నుగాచేసి వినుము.

4. కృష్ణవేణీ నదీతీరమున భువనేశ్వరీ సన్నిధానమునకు పడమట ఔదుంబర వృక్షస్థానమున శ్రీగురువులు నివసించుచుండిరి; వినుము.

5. అందు శ్రీగురువులు గుప్తరూపులయి నివసించుచుండిరి. వారు ఉండుతావు ఎవ్వరికిని గోచరముకాక యుండెను. ఈ విధముగా ఉండుచు అనుష్ఠానధురంధరులుగా శ్రీగురుదేవులు చాతుర్మాస్య వ్రతము జరుపుచుండిరి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

6. ఆ భువనేశ్వరీ సంవిధానము సహజముగానే గహనమగు సిద్ధస్థానము అయి యుండెను. అందునను విశేషముగా శ్రీగురువులే అచ్చట నివసించిరి. అందువలన ఆ క్షేత్రపు మహిమము ఇంకను ఉత్కృష్టము అయ్యెను.

7. ఇట్లు పలికిన సిద్ధుని వచనమును విని నామధారకుడు నమస్కారము చేసెను. పరమాత్మా శ్రీగురురాజా! తాము గుప్తరూపులయి ఎందుకున్నారు ?

8. ఇట్టివారికి (శ్రీగురువులకు) తపస్సు చేయవలసిన పని ఏమి ? భిక్షము అడుగుకొనుటలో వారికి కలుగు హర్షము (సంతోషాధిక్యము) ఏమి ? జ్ఞానదాతా ! సిద్ధయోగీ ! నా మానసమునందలి ఈ సందేహమును నివారింప వేడుచున్నాను.

9. అనగా విని సిద్ధయోగి ఇట్లు పలికెను : వత్సా! (నాయనా!) నామధారకా! వినుము. పినాకపాణియగు పరమేశ్వరుడు భిక్షము ఎత్తుకొనుచుండలేదా ! ఇంకను చెప్పెదను; వినుము; శ్రీదత్తాత్రేయులును అట్టి వారే కదా !

10. త్రిమూర్తి (మూర్తిత్రయ) రూపులగు శ్రీదత్తాత్రేయులు భిక్షుకరూపులు అయిచో కనబడుచుందురు. వారు భక్తజనానుగ్రహార్థులు అయి తీర్థయాత్రలుచేయుచు సంచరించుచుందురు.

11. ఈ భూమిపై అనుపమానములు (సాటిలేనివి) అగు తీర్థములు (గుప్త సామాన్యులకు ఎరుగరాని) రూపముకలవి అయి లెక్కలేనన్ని ఉన్నవి. శ్రీగురుమూర్తి భక్తుల (అనుగ్రహించు) నిమిత్తమయి ప్రీతిపూర్వకముగా అట్టి గుప్తతీర్థస్థానములను ప్రకటితములనుగా చేసిరి.

12. భక్తజనోపకారార్థముగానే (జనులకు ఇవి ఉత్తమ తీర్థములు అని తెలియకయున్న స్థానముల మహిమ విశేషములను తెలుపుటకే)

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

శ్రీగురునాథులు తీర్థయాత్రలు చేయుచు ఆయా స్థానములందు వసించిరి. తాము అచ్చటనున్నట్లు ప్రకటితమయినచో సమస్తజనులును వచ్చి తమ్ము వరములు అడుగుదురు అనియే (దానివలన తమకు తపోభంగము అగును అనియే) వారు ఆ యా తీర్థస్థానములందు గుప్తరూపులుఅయి ఉండిరి.

13. సూర్యుని దాచినను ఆతని తేజోరాశి ఎట్లు దాగును ? కస్తూరిని ఎంతప్రయత్నముతో రహస్యముగా ఉంచినను అది ఏవిధముగా గోప్యము అగును ?

14. నీకు ఇంకను మరికొన్ని దృష్టాంతములు తెలిపెదను: కల్పవృక్షపు గుణములు ఎటువంటివియో చూడుము. అది తాను ఎచ్చటనుండునో ఆ స్థానమునకు (భూభాగమునకు) అచ్చట ఫలములు (కామిత ఫలములు నెరవేరుట) ఏర్పరచబడును.

15. ఈ కారణముచే ఆ స్థానమునందు (గుప్తరూపులు అయి ఉండియు) శ్రీగురుముని తాము ప్రకాశరూపులు అయిరి. నీకు ఆ వృత్తాంతము విస్తారపరచి చెప్పెదను. ఏక (ఏకాగ్ర)చిత్తుడవు అయి వినుము.

16. కరవీరక్షేత్రము అను నగరమున ఒక బ్రాహ్మణుడు ఉండెను. ఆతడు వేదాభ్యాస నిరతుడు. శాస్త్రపురాణ (విజ్ఞానము వందును) విఖ్యాతుడు; ఆతడు అవి (అందలి విషయములు) అన్నియు విద్వజ్జనులకును చెప్పుచుండెను.

17. అతడు తాను ఋగ (ప్రథమ-ఋగ్) వేదాధ్యాయిఅయి ఉండెను. తర్క వ్యాకరణ శాస్త్రములను ఎరిగియుండెను. శాస్త్ర ప్రమాణానుసారముగ ఆహ్నిక కృత్యములను ఆచరించు చుండెను. ఇట్లు ఆ విప్రుడు కర్మమార్గమునందు రతుడు (ఆసక్తుడు - దానియందే ఆనన్దము పొందుచుండు వాడు) అయి ఉండెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

18. ఆ బ్రాహ్మణునకు ఒక కుమారుడు కలిగెను. ఆతడు పుట్టినది మొదలుకొనియు మూర్ఖుడుగా నుండెను. దైవవశమున వాని తల్లియు తండ్రియు రోగగ్రస్తులయి మరణించిరి.

19. ఆ బాలుడు అట్లే తనతల్లిదండ్రుల ఇంటియందే పెరుగుచు కేవలము ఏడు సంవత్సరముల వయస్సువాడు అయ్యెను. అట్టి ఆ ద్విజ కుమారకునకు నిశ్చల (ఉదార) చిత్తులు ఎవరో వ్రతబంధము (ఉపనయనము) జరిపిరి.

20. నామధారకా! వినుము. వానికి స్నానముచేయు అలవాటు రాలేదు. గాయత్రీ మంత్రము రాకుండెను. సంధ్యావందనము రాకుండెను. ఇట్టి మూర్ఖునకు మరి వేదము ఎట్లువచ్చును ? వాడు అట్లు పశు సమానుడు అయిఉండెను.

21. ఎచ్చట వేదాధ్యయనమును బోధింతురో అచ్చటకు వాడు తానును పోయి వేదమును నేర్చుకొందును అనును. అంతలోననే వారు నేర్పగా తాను నేర్చినక్షణమునందే వానికి అది అంతయు మరపు నకు వచ్చుచుండెను.

22. ఆ గ్రామమునందలి విద్వజ్జనులును ఇతరులగు సకల జనులును వానిని నిందచేయుచుండిరి. విప్రకులమునందు జన్మించియు నీవు ఇట్టి మూర్ఖుడవుగా పుట్టితివికదా ! అనుచుండిరి.

23. ఓయీ ! నీతండ్రి జ్ఞానవంతుడును వేదశాస్త్రాదికము నందు అభిజ్ఞాతయు (బాగుగ పాండితికలవాడును) అయి ఉండెను. అటువంటివాని కడుపున నీ విటువంటి కొయ్యముక్కవంటి వాడు రాయివంటి వాడవు పుట్టితివిరా !

24. నీ జీవితము కాలిపోను; నీ జీవితము కాలిపోను; మీ తండ్రి పేరునకు అపకీర్తి తెచ్చుచున్నావు; పొట్టకు పాషాణము కట్టుకొని చెరువులోనో బావిలోనో దుమికి ఏల చావకున్నావు ?

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!**

25. ఈ సంసారము (ప్రపంచము) నందు జన్మించియు ప దినాఌ వృద్ధుడవు అయి ఉన్నావు; నీకు యమపురమే గమ్యము; అట్లు అనాచారుడవుగా వర్తించుచున్నావు.

26. ఓయీ! వినుము; ఎవనికి విద్యకలదో - వాడే మనుష్యుల నడుమ గొప్పవాడు; వినుము; నిక్షేపించి ఉంచుకొనిన ద్రవ్యము ఎటువంటిదియో విద్య అటువంటిది.

27 ఎవని హృదయమునందు విద్య ఉండునో వానికి సదా సకలభోగములును లభ్యములు అగును. వాడే యశోవంతుడగును; సకల సుఖసంపదలను పొందును. ఆతడే అందరనడుమను పూజ్యుడగును.

28. ఆతడే (విద్యావంతుడే) వయస్సునందు చాల పెద్దవాడుగా లెక్కించబడును. విద్యా - హీనుడు అగు నరుడు - వాడు ఎవడైనను సరియే - అశ్రేష్ఠుడు - పనికిమాలినవాడు - అని ఎన్నబడును. విద్య ఉన్నచో అట్టివాడు పూజ్యమానుడగును.

29. ఎవనికి సహోదరులు ఉండరో - అట్టివానికిని - విద్యయే బంధువులును భ్రాతలును అగును. అట్టి నరుడు ఎల్లవారికిని వందనీయుడు అగును. విద్య ఇట్టి ఉత్తమలక్షణములుకలది సుమా!

30. విద్యాభ్యాసి (చక్కగా విద్యలను అభ్యసించినవాడు) అగు నరుడు ఏ సమయమునందైనను విదేశములకు పోయినచో వానిని అచ్చటి సమస్త జనులును పూజ చేయుదురు. వానికి ఆ విదేశము కూడ స్వదేశము అగును.

31. ఎవనికి విస్తారముగా విద్య ఉండునో - వాడే జ్ఞానవంతుడు అగును. వానికి ఎల్లవారును దేవత్వమును - దేవునికి ఇచ్చు పూజ్యభావముతోడి ఆదరమును - ఇత్తురు. ఆతడు ఎల్లవారినుండియు పూజలను అందుకొనును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

32. ఓయీ ! వినుము; ఎక్కడనైనను ఎప్పుడయినను ఎల్ల వారును రాజ్యాధిపతిని నమస్కరిం (పూజిం) తురు కదా ! ఇటువంటి రాజుకూడ హర్షపూర్వకముగా విద్యావంతుని పూజించును.

33. ఎవని చెంతను ధనములేదో - అట్టివానికి కూడ విద్యయే ధనము అని ఎరుగుము. ఈ కారణముచే ప్రతి యొకడును విద్యను నేర్చుకొనవలయును; విద్యను ఎరుగనిచో పశుసమానుడు అగును.

34. ఇట్లు పలికిన బ్రాహ్మణుల వచనము విని బ్రహ్మచారి వారిని నమస్కరించెను. స్వాముల (గురువుల) చే నాకు జ్ఞానము ఉపదేశించబడినది. విద్యాభ్యాసము చేయవలయునని తాము నాకు తెలిపితిరి.

35. కాని నేను పూర్వజన్మాంతరములందు విద్యాదానము చేసియుండలేదు. ఈ కారణముచేతనే నాకు ఈ జన్మమున విద్య రాకున్నది. అందులకై ఏమి చేయవలయును ? అనెను.

36. నేను ఇటువంటి దోషిని (పాపాత్ముడను) దయతో నన్ను ఉద్ధరించ ప్రార్థించుచున్నాను. జ్ఞానదాతలారా ! (పెద్దలారా !) ఇందులకు ఉపాయము ఏదయిన ఉన్నచో ఆజ్ఞ ఇండు.

37. అనగా ఆ బ్రాహ్మణులు పరిహాసపూర్వకముగా నవ్వి ఇట్లు అనిరి: నీకు ఇకముందు మరియొక జన్మము వచ్చును. అందు నీకు విద్య వచ్చును. అని పలికిరి.

38 ఓరీమూర్ఖా ! వంశనాశకా ! నీకు విద్య ఎక్కడిది ? నీవు మనుష్యుడవు కావు; వాస్తవముగా పశువవు; భిక్షము అడుగుకొని పొట్టనింపుకొనుము.

39. ఇట్టి నానావిధములగు ఎక్కువ తక్కువ నీచవచనములతో ఆ బ్రాహ్మణజనులు ఆతనిని నిందించి పలికిరి. అంతట ఆ బాలుడు తన మానసమునందు వైరాగ్యము నిలుపుకొని అరణ్యమునకు పోదలచి బయలుదేరెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ।

40. ఆతడు తన మానసమునందు కలిగిన ఖేదముతో ఖిన్నుడు అయ్యెను. ఎల్లవారును నన్ను దూషించుచున్నారు. ఇట్టి నేను జీవించి ఏమి ఉపయోగము ? నేను నా ప్రాణములను విడిచెదను. అని ఆతడు అనుకొనెను.

41. జీవితము కాలిపోవును! కాలిపోను! నేను విద్యాహీనుడనై పశువనైతిని; ఏకారణమున నన్ను నేను రక్షించుకొనవలయును ? అనుకొనుచు ఆతడు అరణ్యమునకై బయలుదేరెను.

42. నామధారకా ! వినుము; ఆ బ్రహ్మచారి భిల్లవాడి గ్రామమునకు వచ్చెను. అతడు అన్నోదకములు గ్రహించక ఉపవాసియై ఉండి దైవవశమున రాత్రి సమయమునకు అచ్చటకు చేరుకొనెను.

43. లోకవిఖ్యాతయు జగన్మాతయు అగు భువనేశ్వరీదేవి ఎచ్చట ఉండెనో అచ్చటికి ఆతడు త్వరితముగా చేరెను. చేరిన సమయమునందే దేవీదర్శనము చేసెను.

44. చూడుము; ఆ మూర్ఖబ్రహ్మచారి స్నానముకాని సంధ్యా వందనముకాని ఏమియును చేయలేదు. ఆతడు అపారమగు దుఃఖమును అనుభవించుచుండెను. అందుచే ఆతడు తాను అచ్చటికిచేరిన తత్‌క్షణముననే శ్రీదేవీదర్శనము చేసికొని దేవీద్వారసమ్ముఖమునందే 'ధరనా' చేసి (పట్టుదలపూని) కూర్చుండెను.

45. ఆ బ్రాహ్మణకుమారుడు ఈ విధముగా మనోనిశ్చయము చేసికొని అన్నోదకములు విడిచి మూడు దినములు కూర్చుండెను.

46. తాను కూర్చున్నది మొదలుకొని అతనికి ఎక్కడను (ఏ సమయమునందు) స్వప్నముకూడా రాకుండెను. అందువలన ఆతడు తన మనస్సులో చాలకోపము నందుచుండెను. అంబా భవానీ ! నన్ను ఉపేక్షించుచున్నావేల ? అని ఆత డనుచుండెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

47. ఆతడు ఆ సమయమున అట్లు ఆక్రోశించి (అంతమాత్రమే కాక) దృఢమగు శస్త్రమును తీసికొని తత్కాలముననే తన జిహ్వను ఛేదించుకొని శ్రీదేవిచరణముల సన్నిధియందు కానుకగా ఉంచెను.

48. ఆతడు అట్లు తన నాలుకను అంబకు కానుకగా అర్పించి ఇంకను ఇట్లనెను. వినుము; తల్లీ! నీవు ఇప్పుడును నన్ను ఉపేక్షించిన యెడల నా శిరమునే నీ చరణములయందు కానుకగా సమర్పింతును అనెను.

49. ఇట్లు నిశ్చయభావముతో ఆతడు ఉండగా ఆ రాత్రియు గడచిపోయెను. (ఆ నిశావసానమునందు) ఆతనికి స్వప్నము ఆయెను. సమస్త శ్రోతృజనులారా! వినుడు.

50. స్వప్నమున శ్రీభువనేశ్వరీదేవి ఆతనితో ఇట్లు పలికెను. బాలకా! బ్రహ్మచారీ! వినుము; నా విషయమున నీవు ఏమియు ఆక్రోశించకుము; కృష్ణానదీ పశ్చిమతీరమునందు (నిన్ను అనుగ్రహించు వారు ఉన్నారు.) త్వరితముగా వారిదగ్గరకు పొమ్ము.

51. అచ్చట ఉదుంబరవృక్షముక్రింద మహాశక్తి సంపన్నులగు తాపసవర్యు లున్నారు. వారు చంద్రమౌళియగు మహాదేవుని అవతారపురుషులు. వారు నీకోరికను పూరింతురు.

52. నాయనా! వినుము; ఆతనికి కలిగిన స్వప్నమునందు ఇట్లు అపూర్వమగు సంఘటనము జరిగెను. ఆతడు తాను మేల్కాంచిన వెంటనే హర్షముతో త్వరితముగా ఆ ప్రదేశమునకు బయలుదేరెను.

53. విప్రుడు త్వరితముగా బయలుదేరెను. ప్రవాహమున ఈదుకొనుచు పోయెను. త్వరితముగా ఆవలియొడ్డునకు పోయి ఆతడు శ్రీగురువులను దర్శించెను.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

**54.** ఆతడు తన శిరమును శ్రీగురుచరణములపైనుంచి అత్యంత ముగా స్తోత్రముచేసెను. ఆ సమయమున శ్రీగురుమూర్తి సంతోషము పొంది ఆతనిని ఆశ్వాసించెను. (ఓదార్చెను.)

55. శ్రీగురుమూర్తి సంతోషించి ఆతని శిరముపై తనహస్త మును ఉంచెను. దానితో త్వరితముగా ఆతనికి జ్ఞానము ఉదయించెను. తత్కాలమునందే వానికి నాలుకయు వచ్చెను.

56. తత్కాలమునందే వాని అంతఃకరణము వేదములు శాస్త్రములు పురాణములు తర్కశాస్త్రము-భాషలు - వ్యాకరణము- ఇట్టి సమస్త విద్యలతో నిండిపోయెను.

57. నాయనా ! వినుము; వాయసముకూడ మానస సరోవరము చేరిపోగానే అది రాజహంసముగా అగునో - అట్లే ఈ విప్రకుమారుడు (మహాపండితుడుగా) అయ్యెను.

58; 59. చింతామణి సంపర్కముతో లోహము (ఇనుము) ఎట్లు సువర్ణముగా అగునో - జంబూనదియందు పడినవెంటనే మృత్తిక ఎట్లు బంగారముగా అగునో - అట్లే - చూడుము - ఆ బ్రాహ్మణ కుమారునకు గురుచరణస్పర్శము తగులగానే వేదములు శాస్త్రములు తర్కము భాషలు మొదలగు విద్యలు అన్నియు వచ్చెను.

60. ఇంతవరకును చెప్పి సిద్ధుడు నామధారకునితో ఇట్లు పలికెను: నాయనా ! వినుము; శ్రీగురుమహిమము ఇటువంటిది; చూడుము; నాడు ఏఏస్థానమునందు వసింతురో ఆ యాస్థానమునకెల్ల స్థానమహి మము ఇట్టిదిగానే యుండును.

61. అని ఇట్లు సరస్వతీ గంగాధరుడు (గంగాధరపుత్రుడగు సరస్వతి) శ్రీగురుచరిత్ర విస్తారమును ప్రవచించుచున్నాడు. ఇది

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా!

వినువారికి మనోహరముగా నుండును; వారికి సకలాభీష్టములును సిద్ధింపజేయును.

ఇది శ్రీపరమకథా కల్పతరువు అయి సిద్ధ నామధారకసంవాద రూపమున ప్రవచింపబడిన శ్రీనృసింహసరస్వత్యుపాఖ్యాన రూపమగు శ్రీగురుచరిత్రామృతమునందు భిల్లవాడీ మహిమవర్ణనము-మూర్ఖ బ్రాహ్మణ కుమారునకు వరప్రదానము-అను పదునేడవ అధ్యాయము.

సంఖ్య 61

# శ్రీ గురు చరిత్రామృతము

## పదునెనిమిదవ అధ్యాయము

### అమరాపుర మహిమము - ద్విజదైన్యహరణము

అమరాపురమున శ్రీ గురువులు నివసించినకాలము - పన్నెండు సంవత్సరములు.

శ్రీ గణేశాయ నమః; శ్రీ సరస్వత్యై నమః; శ్రీ గురుభ్యో నమః

1. [నామధారకుడు (గంగాధరపుత్రుడగు సరస్వతీ) యోగితో ఇట్లు పలికెను :] సిద్ధమునీ! జయ; జయ. నీవు నా భవార్ణవతారకుడవు; (నన్ను సంసారము అను సముద్రమునుండి తరింపజేయువాడవు.) జ్ఞానదాతా! నీవు నా చెవులయందు సుధారసమును నింపిన వానినిగా చేసితివి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

2. శ్రీగురుచరిత్రము కామధేనువు (తో సమానమైనది) దానిని ఎంత వినినను నా మనస్సు తృప్తినందినది అగుటలేదు. నా అంతః కరణము ఇంకను శ్రీగురుకథామృతమును వినుటకు కాంక్ష చెందినది అగుచున్నది.

3. శ్రీగురుచరణములయందు ధ్యానమగ్నతను పొందుచుండి యును నా అంతఃకరణమునకు తృప్తి కలుగుటలేదు. 'సంజీవని' వంటిది అగు ఈ శ్రీగురుకథామృతమును - ఓ జ్ఞానదాతా ! - ఇంకను నాకు ఆజ్ఞ ఈయ ప్రార్థించుచున్నాను.

4. శిష్యుడు అగు నామధారకుడు సిద్ధునితో భక్తి పూర్వకముగా ఈ విధముగా మనవి చేసెను. అంతియకాక - ఆ సమయమున ఆతడు తన శిరమును సిద్ధుని చరణముల సన్నిధికి తెచ్చి (నమస్కరించి) దయకలుగునట్లు మాటలాడెను.

5. శిష్యుని వచనమును విని సిద్ధముని సంతోషించెను. శ్రీగురు కథామృతమును ఆతడు ఆతనికి విస్తార పూర్వకముగ చెప్పనారం భించెను. శ్రోతలారా ! అది ఏక (ఏకాగ్ర) చిత్తులై విన ప్రార్థించు చున్నాను.

6. (సిద్ధుడు ఇట్లు చెప్పనారంభించెను.) శిష్య శిఖామణీ ! ము; నీవాక్కు ధన్యము; ధన్యము - నాయనా ! వినుము; శ్రీగురు ణములయందు నీకుగల భక్తి తల్లీనమయి యున్నది.

7. నాయనా ! వినుము; నీ మూలమున నాకును ఎచ్చరిక (ప్రేరణ) కలిగినది; నిశ్చయముగా నీమూలమునచే నాకు శ్రీగురు చరిత్రము ఆద్యంతమును స్మరణమునకు వచ్చినది.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

8. అనుపమమగు భిల్లవాడీస్థాన మహిమము నీకు ప్రతిపాదించితిని కదా! ఉత్తమము అగు ముందరికథను చెప్పెదను; (ఏకాగ్రచిత్తుడవై వినుము.)

9. శ్రీగురువులు కొంతకాలము అచ్చట గుప్తరూపులై ఉండిరి. వినుము; తాము అచ్చట ఉన్న విషయము ప్రకటము అయ్యెకదా యని వారు మరల అచ్చటినుండి బయలుదేరిరి.

10. వరుణా సంగమస్థానము' 'అను ప్రసిద్ధినంది 'దక్షిణ వారాణసి' అని చెప్పబడుచు ప్రఖ్యాతమగు స్థానమును దర్శించి శ్రీగురువులు భక్తానుగ్రహార్థమయి ఇంకను ముందునకు వచ్చిరి.

11. తరువాత కృష్ణానదీతీరమునందు ఉండు తీర్థములను పావనముచేయుచు శ్రీగురువులు 'పంచగంగా సంగమము' అని ప్రఖ్యాతమగు తీర్థక్షేత్రము ఉన్నదికదా! - అచ్చట పండ్రెండు సంవత్సరముల పాటు ఉండిరి.

12. వినుము; ఆ తీర్థము అనుపమానమును మనోహరమును, 'అవిముక్తము' (శ్రీ పార్వతీ పరమేశ్వరులచే ఎన్నడును విడువబడనిది) అని ప్రసిద్ధిపొందిన కాశీక్షేత్రము ఎట్టిదియో - అట్టిది; ఆ ఈ తీర్థము ప్రయాగతో సమానమగు మహాక్షేత్రము; అందువలననే వారు అందు అంతకాలముపాటు ఉండిరి.

13. కురవపురగ్రామము మిగుల గహన (గంభీర)ము అయినది; అదియే కురుక్షేత్రము అని ఎరుగుము; నాయనా! అటులే ఈ కృష్ణా పంచగంగా సంగమక్షేత్రమును అత్యుత్తమ మయినది.

14. కురుక్షేత్రమునందు ఎంతపుణ్యము లభించునో - ఇందు అంతకంటెను అధికపుణ్యము లభించును; అని ఎరుగుము. ఇందు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

ఆహేంతి = ఆహత్య = మొత్తము. లెక్కలేనన్ని తీర్థములు ఉన్నవి. అందువలననే శ్రీగురువులు ఈ పంచగంగా సంగమ తీర్థమునందు ఉండిరి.

15. ఈపంచగంగానదీ తీర(ర్థ)ము పురాణాంతరమునందు ప్రసిద్ధమయి ఉన్నది. వీనిమొత్తము ఐదునామములును చాల గొప్పవి అని ప్రసిద్ధములుగా చెప్పబడుచున్నవి. అవి చెప్పెదను; ఏక (ఏకాగ్ర) చిత్తుడవయి వినుము.

16. 1 శివా 2. భద్రా 3. భోగవతీ 4. కుంభీనది 5. సరస్వతి - ఈ ఐదిటికిని పంచగంగలు అని ప్రసిద్ధికలదు; ఇవి మహాపాతకములను సంహరించును.

17. ఈ పేరులతో ఈ విధముగా ప్రఖ్యాతములగు పంచగంగలును కృష్ణానదితో కలియుటకై ఇచ్చటకు వచ్చినవి. వీనితో కృష్ణానది సంగమించు స్థానము మిగుల మనోహరమును ప్రయాగ కంటెను ఉత్తమమును.

18. అమరాపురము (ఔరవాడ) అను గ్రామము - సాటిలేనిది - ఈ స్థానమునందు కలదు; ప్రయాగ (గంగా యమునా) సంగమ స్థానమువలెనే ఇదియు మనోహరము.

19. ఇచటను ఉదుంబరవృక్షము (మేడిచెట్టు) కలదు. ఇది ప్రత్యక్ష (సాక్షాత్) కల్పవృక్షము అని ఎరుగుము. ఈ సంగమ స్థానమునందలి షట్కూల (ఆరు నదీతీరములును కలియు) ప్రదేశమున అమరేశ్వరుడు అను దేవుడు ఉన్నాడు.

20. నాయనా ! నామధారకా ! వినుము; భాగీరథీగంగా నదీతీరమునందలి వారాణసీపురి ఎటువంటిదియో మహోత్తమమగు ఈ పంచనదీసంగమము అను తీర్థక్షేత్రముకూడ దానితో సమానమే.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

21. నాయనా ! వినుము; అమరేశ్వరుని సంవిధానమునందు మొత్తము చతుఃషష్టి (అరువదినలుగురు) యోగినులును ఉందురు; ఈ సకల యోగినీ స్థానము అచ్చట 'శక్తితీర్థము' అనుపేర ప్రఖ్యాతము అయి ఉన్నది. ఇది మహాగుణయుక్తము.

22. ఇచ్చటి అమరేశ్వరలింగము ఉత్తమమయినది; ఉత్తమభావ భక్తితో దీనిని నమస్కరించి పూజించిన నరుడు అమరుడు అగును. ఈ అమరేశ్వరుడు సాక్షాత్ విశ్వనాథుడే అని ఎరుగుము.

23. వినుము; ప్రయాగక్షేత్రమునందు మాఘస్నానము చేసిన వో ఏ పుణ్యము సాధించబడినది అగునో - అంతకు నూరింతలు పుణ్యము ఇందు (ఈ పంచగంగా సంగమతీర్థమునందు) ఒకస్నానము చేసినంత నే లభించును.

24. స్వాభావికముగనే నదీసంగమస్థానములు (ఏవియైనను) ప్రయాగసమానములు అని ప్రసిద్ధములు అయి యున్నవి. అందునను ఈ తీర్థస్థానమునందు సాక్షాత్పరబ్రహ్మ వస్తువు అగు అమరేశ్వరుడే వసించుచుండును గదా !

25. ఈకారణముచే ఈ తీరస్థానమునందు మహాగుణవంతములు అగు కోటితీర్థములు ఉండును; అంతియకాక ఇచట గంగ (కృష్ణానది) 'వేణీ' సహితయై దక్షిణదిశగా ప్రవహించుచుండును.

26. అట్టి ఆ స్థానమునందు అమితములు అగు తీర్థములు కలవు. అవి విస్తారపూర్వకముగా పురాణములయందు చెప్పబడియున్నవి. ఈ ప్రదేశమునందలి కృష్ణాతీరపువెంట అష్టతీర్థములు జాగరితములుగా నున్నవి.

27. చూడుము; (అవధానముతో వినుము;) ఉత్తరదిశగా ప్రవహించుచుపోవుచున్న కృష్ణ ఇచ్చట పశ్చిమ ముఖముయి ప్రవహించు

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

చున్నది; వినుము; ఇచట 'శుక్లతీర్థము' అను తీర్థముకలదు; ఇది బ్రహ్మహత్యా పాపమును దూరమొనర్చును.

28. నాయనా! వినుము; ఇచ్చట ఉదుంబరవృక్ష సమ్ముఖమున ఒకతీర్థమునుండి ధనువంతదూరమున మరియొకతీర్థముగా మనోహర ములు అగు తీర్థములు ఉన్నవి.

29. అని వరుసగా 'పాపవినాశ తీర్థము' 'కామ్యతీర్థ'ము' 'వరద తీర్థము' అనునవి; ఇవి అన్నియు ఇచ్చట అమరేశ్వరసంవిధానము నందే యున్నవి. ఇవి భూమండలమునందే నిరుపమానమయినవి.

30. తరువాత పంచనదీసంగమ ఘట్టాల ప్రదేశమున ప్రఖ్యాతమగు 'ప్రయాగతీర్థము' కలదు; వినుము; అచ్చటనే 'శక్తి తీర్థము' అమరరతీర్థము, 'కోటితీర్థము' అనునవియు కలవు: ఇట్లు ఇవి మొత్తము ఎనిమిది.

31. ఇట్లే ఇంకను అనేకతీర్థములు ఈ సంగమ ప్రదేశమునందు కలవు. వానిని అన్నిటిని వివరించుచు చెప్పిన-చో గ్రంథ విస్తారమగును. ఈ కారణముచేతనే (ఇది ఇంత ఉత్తమతీర్థస్నానము కావుననే అచ్చట శ్రీపాద (రూపులగు శ్రీనృసింహ సరస్వతీ) గురువులు పండ్రెండు సంవత్సరములు ఉండిరి.

32. కృష్ణానదియు వేణీనదియు కలియుచు అవి పంచగంగలతో కలియుటచే ఈ తీర్థస్థానము సప్తనదీసంగమ స్థానము అగుచున్నది. ఇట్లు ఇది మహాగుణయుక్త స్థానము. దానిమహిమను ఏమని వచించగలము ?

33. ఇందు ఒక (మూరు) స్నానము చేసినంత మాత్రముననే బ్రహ్మహత్యాది మహాపాతకములును కాలిపోవును; ఇది ఇట్టి ఉత్తమ

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

సిద్ధస్థానము; అచ్చట (చేయుస్నానాదికముచేతను ఉపాసనము చేతను) సకలాభీష్టములును సిద్ధించును.

34. దాని (ఆ తీర్థపు) మహిమమును ఏమని చెప్పుదును? దీనితో ఉపమానము చెప్పుటకు మరియొక స్థానము ఏదియు లేదు. దాని దర్శన మాత్రముచేతనే కామితములు సిద్ధించును. అనిసచో స్నానఫలమును ఏమని వర్ణింతును ?

35. సాక్షాత్కల్పవృక్షమే అగు ఉదుంబర వృక్షము అచ్చట నున్నది. శ్రీగురువులు ఆ తీర్థస్థానమునందు అగోచరులు అయి గుప్త రూపమున (కొంతకాలము) ఉండిరి. [అట్టి ఉదుంబరవృక్ష మహిమము జనులకు అగోచరముఅయిగుప్త రూపముననుండగా దానిని ప్రకటితము చేయుటకై శ్రీగురువులు అచ్చట నివసించిరి. అని శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వామి వారు వ్రాసియున్నారు.]

36. భక్తజనులను తరింపజేయుటకును ఈ తీర్థస్థానము ప్రఖ్యాతము అగుటకును శ్రీగురునాథులు అందు నివసించిరి. అందు వలననే అవి (ఈ తీర్థమహిమమును ఉదుంబరవృక్ష మహిమమును) ప్రకాశితములు అయ్యెను.

37. నాయనా ! నామధారకా ! వినుము; ఇది ఇట్లు ఉండగా ప్రకృతము చెప్పెదను. అటుతరువాత శ్రీగురువులు ప్రతిదినమునను భిక్షాటనము చేయుటకై శ్రీగురువులు అమరాపుర (ఔరవాడ) గ్రామమునకు పోవుచుండెడివారు.

38. ఆ ఔరవాడ గ్రామమునందు ఒక బ్రాహ్మణుడు ఉండెను. ఆతడు బాగుగా వేదములను అభ్యసించినవాడు; ఆతని భార్య పతిసేవికయగు పతివ్రతాశిరోమణి.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

39. ఆ బ్రాహ్మణుడు మిగుల దరిద్రుడు; అయినను ఆతడు శుక్లభిక్ష (కేవలము బ్రాహ్మణ గృహములనుండి మాత్రము లభించు భిక్ష) మూలమున జీవనము చేయుచుండెను. కర్మమార్గము ననుసరించుచు అనుష్ఠానముల నాచరించు చుండెను. ఇట్లు ఆ బ్రాహ్మణుడు సాత్త్వికవృత్తితో జీవనము చేయుచుండెను.

40. ఆ బ్రాహ్మణుని ఇంటి ఆవరణములో ఒక ఎత్తయిన (చాల బాగుగ పెరిగిన) తీగ ఒకటి ఉండెను. దానినుండి ప్రతిదినమును చాల అధికముగా బొబ్బరలు (?) పండి వచ్చుచుండెను. వానితోనే ఆ బ్రాహ్మణుడు (ఆ బ్రాహ్మణ కుటుంబము) పొట్ట నింపుకొనుచుండెను.

41. వినుము, ఏ దినముననేకాని ఆ బ్రాహ్మణునకు బియ్యము వంటి మంచి ధాన్యము (భిక్షాటనమున) లభించనిచో ఆ బొబ్బరలనే ఉడికించుకొని హర్షముతో (కుటుంబముతో బాటుగ) తిని ఈ విధముగా ఆ దినమును గడుపుకొనెడు వాడు.

42. ఈ విధముగా ఆ బీదబ్రాహ్మణుడు యాచకత్వావృత్తి తోనే పొట్టనింపుకొనుచుండెను. ఉత్తమ విధానమున పంచ మహాయజ్ఞములను (దేవయజ్ఞ పితృయజ్ఞ మనుష్యయజ్ఞ ఋషియజ్ఞ భూతయజ్ఞములను, జరుపుకొనుచుండెను. భక్తితో అతిథిపూజ చేయుచుండెను

43. ఇట్లు కాలము జరుగుచుండగా ఒకానొకదినమున శ్రీగురువులు ఆ బ్రాహ్మణుని మందిరమునకు తామై భిక్షుకుగాను వెడలిరి. ఆ విప్రుడును భక్తితో వారిని తన గృహమునకు తీసికొనిపోయెను.

44. ఆతడు భక్తిపూర్వకముగా శ్రీగురువులకు షోడశోపచార పూజలు జరిపెను. అయినంతవరకును ఆ బొబ్బరధాన్యముతోనే గూరకాయలు వండెను. (వానితోనే శ్రీగురువులకు భిక్షజరిపెను.)

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

45. శ్రీగురువులు తాము భిక్షా గ్రహణము ముగించిన తరువాత సంతోషపూర్వకముగా ఆ బ్రాహ్మణుని ఆశ్వాసించుచు నీకు ఇంతవరకును ఉండిన దారిద్ర్యదోషము తొలగిపోయినది అనిరి. ఇట్లు పలికిన తరువాత అక్కడినుండి బయలుదేరిరి.

46. ఆ విప్రుని గృహపు ఆవరణమునందు గొబ్బరలు అను పేరుతో ప్రసిద్ధమగు ఏ ఎత్తగు తీగకలదో అది అంగణమునందు అంతటను చుట్టుకొని ఉండెను.

47. ఆ తీగకుగల పాదను వేళ్ళను శ్రీగురుమూర్తి తత్క్షణమే ఛేదించి అది మోపనిగా దూరముగా పారవేసిరి. తాము సంగమమునకు వెడలిపోయిరి.

48. ఆసమయమున ఆ విప్రుని పత్నియును పుత్త్రులు అందరును దుఃఖించసాగిరి. ఇట్లు అనసాగిరి. దైవము ఎంతబలముకలదిరో చూడుమయ్యా ! మన అదృష్టము ఎటువంటిది !

49. మనము ఆ యతీశ్వరునకు ఆ మహానుభావునకు ఏమి ఉపద్రవము - అపకారము - చేసితిమో కదా ! మనకు ఆహారముగా నున్నదానిని ఎట్లునరకి భూమిమీద విసరిపారవేసెను !

50. ఈ విధముగా ఆ ఇల్లాలు నానావిధముల దుఃఖపడుచుండెను. ఆమెను ఆమెభర్త కోపపడి వారించెను; మన ప్రారబ్ధము ఇందులకు ప్రమాణము (హేతువు) అయి ఉండును. అని ఆతడామెను ఓదార్చెను.

51. ఆ సమయమున ఆ విప్రుడు తన భార్యతో ఇట్లనెను : ఏ ఏ కాలమున ఏది ఏది కావలయునో అది అది చంద్రమౌళి (పరమేశ్వరుడు) నిర్మాణము చేయుచుండును. విశ్వము అతని అధీనమైయుండును అని ఎరుగుము.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !

52. నారాయణుడు విశ్వవ్యాపకుడు; ఈ విశ్వపు ఉత్పత్తి స్థితి లయములకు ఆతడే కారణరూపుడు. పిపీలిక మొదలుగ స్థూల తమ ప్రాణులవరకునుగల జీవరాసులకు సమస్తములకును ఆతడే ఆహారమును ఇచ్చి పోషించును.

53. 'ఆయురన్నం ప్రయచ్ఛతి' 'ఆయువే అన్నమును ఇచ్చుచున్నది.' అని 'వేదశ్రుతి' వచించుచున్నది. ప్రత్యహాము సింహము గజమును ఆహారముగా ఎట్లు చేసికొనుచున్నదో చూడుము.

54. స్థూలప్రాణులును సూక్ష్మప్రాణులును అన్నియు మొత్తము ఎనుబది నాలుగు లక్షల జీవరాసులు కదా ! ఈ సమస్త ప్రాణులకును భగవానుడు మొదట ఆహారమును నిర్మాణముచేసెను. తదనంతరమే మరివానిని ఉత్పన్నమొనరించెను.

55. ఆ పరమేశ్వరుడు రాజును బీదను ఒకేదృష్టితో చూచుచునే ఈ సర్వసృష్టిని పోషించుచున్నాడు. ప్రతియొక ప్రాణియు తాను ఆచరించు కర్మవిశేషముతో ఆర్జించినది ఏదియో అది మంచిదియో చెడ్డదియో దానికి ఫలము తనకు అట్లే ఉండును.

56. ఇది తెలిసికొనుము; పూర్వజన్మమునందలి కర్మాచరణముచే తాను నిక్షేపించినది (సంచితము చేసికొనినది) సుకృతమో అథవా దుష్కృతమో - తనది తానే అనుభవించును. దానితో ఇతరులకు ఏమి (పని) ? చెప్పుము.

57. నీకు తన (నీ) దైవము (అదృష్టము) తక్కువది అయి ఉండగా మూర్ఖత్వముచే ఇతరులను (నిందించి) అనుచున్నావు కదా ! ఏది విత్తెదమో దానిని తినవలసినదే; ఎవరిమీదనో నింద ఆరోపించి మాటాడుచున్నావు ఏల ? చెప్పుము.

**దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా !**

58. యతీశ్వరునిపై నిందమోపుచున్నావు. నీ స్వార్జిత సంచితము ఇదియని ఆలోచించుకున్నావు. అవిద్యా (అజ్ఞాన) సాగరమున మునిగి (నదానవులయి) (మన) గ్రాసమును హరించెను. అనుచున్నావు.

59. వారు మనకు 'తారక' రూపులు; అందుచేతనే వారు మనఇంటికి భిక్షుకై వచ్చిరి. మన దారిద్ర్యదోషమును తీసివేసిరి. వారే మనలను తరింపజేయుదురు.

60. నాయనా! వినుము. ఆ విప్రుడు తన భార్యను ఉద్దేశించి ఈ విధముగా పలికి ఆ తీగకుగల కొమ్మలను తీసివేసి గంగ (కృష్ణా నది) లో పారవేసెను.

61. ఆ తీగకుగల లావులగు వేరు ఏది తన ద్వార సమీపము నందు కలదో-అదియును తీసివేయుదును, అనుకొనుచు ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు ఆ సమయమున త్రవ్వెను.

62. ఆ తీగవేళ్లను బయటకు తీయగానే నిధానముతో (అందు నిక్షేపించిన బంగరు ముద్రలతో కూడ) కుంభము లభించెను. అతనికి అధికమగు ఆనందము కలిగెను. అతడు అది తీసికొని ఇంటిలోనికి పోయెను.

63. అతడు తనవారితో ఇట్లనెను. ఎంత అద్భుతము అగు విషయము జరిగెనో చూడుడు; ఆ యతీశ్వరులు మన విషయమున ప్రసన్నులు అయిరి. అందువలననే ఈ తీగను త్రెంచిరి. దానిచేతనే మనకు నిధానము లభించినది అనెను.

64. ఆ యోగీశ్వరుడు నరుడు కాడు. ఈశ్వరుని అవతారము అయి ఉందురు. దైన్యహరుడు (దైన్యమును తొలగించువాడు) అగు ఆ మహానుభావుడు మనకు లభించినాడు. వారి దర్శనార్థము పోవుదము పద అని ఆ విప్రుడు తన భార్యతో పలికెను.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా :

65. తరువాత ఆతడు సకుటుంబముగా సంగమస్థానమునకు పోయి బహువిధములుగా శ్రీగురువులకు పూజచేసెను. వినుము. అనంతరము ఆతడు జరిగిన వృత్తాంతమును వారికి చెప్పెను.

66. శ్రీగురువులు ఆ బ్రాహ్మణునితో ఈ విధముగా పలికిరి : నీవు ఈ వృత్తాంతము ఎవరికిని చెప్పవలదు. నాపేరు నీవు ప్రకాశితము చేసినచో మీ ఇంటియందలి లక్ష్మి నశించును.

67. నాయనా ! వినుము. శ్రీగురువులు ఆ విప్రునితో ఈ విధముగా పలికిరి : నీ వంశమునందు అఖండమగులక్ష్మి నిలుచును. నీవును నీ పుత్రపౌత్రులతో ఆనందించెదవు.

68. ఈ విధమగువరమును పొంది ఆ బ్రాహ్మణుడును ఆతని భార్యయు తమ గృహమునకు వెడలిపోయిరి. శ్రీగురుకృప ఇటువంటిది అని ఎరుగుము. వారు దర్శనమాత్రముననే దీనుల దైన్యమును హరింతురు.

69. ఎవరికి శ్రీగురుకృప లభించునో వారికి దైన్యమును పాపమును ఎక్కడిది ? నాయనా ! ఎవరుకాని కల్పవృక్షమును ఆశ్రయించిన యెడల అతని ఇంటియందు దైన్యము ఎక్కడిది ?

70. ఏ నరుడు దైవము (అదృష్టము) కొరతపడినవాడుగా ఉండునో ఆతడు శ్రీగురువులను ఆశ్రయించవలయును. వారే వానిని ఆవలి ఒడ్డునకు చేర్పించును ఆతడు ఎల్లవారికిని పూజ్యుడగును.

71. ఏ ఒకడుగాని శ్రీగురువులను సేవించునో వానికి ఇహమును పరమును లభించును. వాని గృహమునందు అఖండ లక్ష్మి నిలుచును. ఆతడు అష్టైశ్వర్యములతో ఆనందించును.

దిగంబరా - దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబరా ;

72. ఇంతవరకును వచించి సిద్ధయోగి నామధారకునితో ఇంకను ఇట్లు పలికెను : శ్రీగురుమహిమ ఇటువంటిది అయిఉన్నది. నీవు వారిని మనసార భజించవలయును. నీ ఇంటిలో కామధేనువు వుండినట్లే.



73. అని ఇట్లు గంగాధరుని కుమారుడు శ్రీగురుచరిత్ర విస్తారమును చెప్పుచున్నాడు. ముందరి కథామృతసారమును కూడ శ్రోతలారా ! ఏక (ఏకాగ్ర) చిత్తులరై వినవలయునని ప్రార్థించుచున్నాను.

ఇది శ్రీపరమకథాకల్పతరువులయి సిద్ధనామధారక సంవాదరూపమున
ప్రవచింపబడిన శ్రీనృసింహసరస్వత్యుపాఖ్యాన రూపమగు
శ్రీగురుచరిత్రామృతమునందు అమరాపుర (ఔరవాడ)
మహిమమును - ద్విజదైన్యహరణమును అను
పదునెనిమిదవ అధ్యాయము

సంఖ్య 73